# బా-బాపూజీల చల్లని నీడలో


హిందీ మూలం

మనూబెహన్ గాంధీ

తెలుగుసేత

శ్రీ ఎస్. వి. శివరామశర్మ



ప్రకాశకులు

గాంధీసాహిత్య ప్రచురణాలయం

చిక్కడపల్లి, హైదరాబాదు-20

కీ॥ శే॥ బసవరాజు అప్పారావుగారు వ్రాసినట్లు బాపూజీది "వెన్నపూసా మనసు-కన్నతల్లి ప్రేమ." అయితే క్రమశిక్షణ విషయంలో ఆయనది అసిధారావ్రతము. వీటి నన్నిటిని సమన్వయించుకుని ఆయన తనతోడివారియెడ ఏవిధంగా ప్రవర్తించేవారో ఈ పుస్తకం చదివితే కొంతవరకు తెలుస్తుంది. 'బాపూ'తోపాటు 'బా'మనసుకూడా ఎంత మెత్తనిదో ఆమె వాత్సల్యం రుచిచూచినవారికే తెలుస్తుంది. కొద్దికాలంమాత్రమే ఆమె వాత్సల్యాన్ని చవిచూచిన మనూ బెహన్ తన్మయురాలై పోయింది. అంతకన్నా దీర్ఘకాలం అనుభవించినవారి హృదయాలు ఏ విధంగా స్పందించినవో మనము అంచనా వేసుకోవచ్చు.

ఈపుస్తకాన్ని చక్కని శైలిలో, తెలుగు నుడికారంలో భాషాంతరీకరించిన శ్రీ ఎస్. వి. శివరామశర్మగారికి మా హృదయపూర్వక కృతజ్ఞత. ఆలస్యంలేకుండా దీనిని చక్కగా, ముద్రించి తోడ్పడిన సర్వోదయ ముద్రణాలయ కార్యకర్తలకు మా అభినందనలు. కాగితం దొరకటమే కష్టమయిన ఈ రోజుల్లో అనేక వ్యయప్రయాసలకోర్చి పుస్తకాన్ని వెలువరించగలిగాము. పాఠకలోకం దీనిని ఆదరించి మాకు ప్రోత్సాహాన్ని ఇస్తుందని ఆశిస్తున్నాము.

**కోదాటి నారాయణరావు**

కార్యదర్శి, సంపాదక సమితి

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

హైదరాబాదు

తేదీ : 30-8-1974

# బా, బాపూజీల చల్లని నీడలో

౧

## చల్లని నీడలో

1942 మే నెలలో బాపూజీ 'ఆండ్రూస్' నిధి వసూళ్లు చేయటానికి బొంబాయి వచ్చారు. నన్ను తన దగ్గరకు రప్పించుకొంటానని ఆయన కొంతకాలంగా ఆశపెడుతూ వచ్చినా చివరకు 'నలుగురు అప్పచెల్లెండ్రుండగా ఒక్కతైనా సేవా పరాయణురాలు కాలేదే' అన్న మాట విని నేను ఆయనవద్దకు వెళ్ళటానికి సిద్ధపడ్డాను. మే నెల సెలవులు అయిపోయే వరకు తమవద్దవుండే ఒప్పందంమీద కరాచీనుండి బయలుదేరి బొంబాయి చేరుకున్నాను. మే 23 వ తేదీన బాపూజీతో కలిసి నేనుకూడ సేవా గ్రామ్‌కు బయలుదేరాను.

మరునాడు గం. 11-30 లకు మేము సేవాగ్రామం చేరాము. బాపూజీ నా భుజంమీద చెయ్యివేసి నేరుగా బా దగ్గరకు తీసికొనిపోయి, ఆమె ముందరికి నెట్టి "ఇదిగో నీకోసం ఒక అమ్మాయిని తీసుకొచ్చాను, జాగ్రత్తగా పట్టుకొని ఉంచుకో, పారిపోయేనుసుమా!"- అన్నారు.

బాపూజీ ఆనాడు అన్న మాటలు ఇప్పుడు నేను నా డైరీలో చదువుతుంటే ఆయన ప్రతి మాటా భవిష్యద్వాణి లాగ పలికినట్లనిపిస్తున్నది. నేను సేవాగ్రామం వెళ్ళింది రెండు నెలల సెలవు గడపటానికి మాత్రమే, అయినప్పటికీ మా పెద్దలు చేసిన పూర్వపుణ్యంవల్ల వారి అంత్యకాలంలో బా బాపూజీల సేవ చేసే భాగ్యం నాకు లభించింది.

బా నన్ను తన గదిలోకి పిలుచుకొని పోయింది. నా సామానంతా స్వయంగా సర్ది పెట్టింది. తరువాత ప్రేమ నిండారగా ఇలా అన్నది- "అమ్మాయీ! నీకు ఆకలివేస్తున్న దేమో, లేచి ముందు స్నానం చెయ్యి, నువ్వు 'ఫ్రాక్' (గౌను) తొడుక్కున్నావు. నాకది ఇష్టంలేదు. నీకు కనీసం 13 లేక 14 ఏండ్లయినా ఉంటవి, వేసుకోటానికి ఓణీకూడ లేదేమో! ఇదిగో నా చీర కట్టుకో, ఆనక నీకు ఓణీ చింపించి ఇస్తాను." ఇలా అంటూ ఆమె ఉతికిన చీరె ఒకటి నాచేతి కందించింది. 'ఇంత పేరు ప్రతిష్ఠలుగల బా చీరెనా నేను కట్టుకోవలసినది?' అనుకొని క్షణంసేపు తటపటాయించాను. కాని బా నా సంకోచాన్ని గ్రహించి, 'దీనికింత ఆలోచ నెందుకు? ఉతికించి మళ్లీ రేపు నేను కట్టుకొంటానుగదా!"- అన్నది. అయినా నాకు జంకు వదల్లేదు.

బా బాపూజీల వస్త్రాలు మహాప్రసాదంలాగ కండ్లకు అద్దుకోవలసినవిగదా? వాటిని కట్టుకోవటం ఎలాగ? వారి వస్తువులను ఎందరో ప్రసాదంలాగ స్వీకరించి తమవద్ద దాచు కుంటూ ఉంటారు. బా కట్టుడుచీరె నేను కట్టుకుంటే, పాపం తగలదా? ఇటువంటి సందేహాలు నా మనస్సులో పొడసూపి నవి. అయినా ధైర్యంచేసి ఆమెతో వద్దని చెప్పలేకపోయాను. మాట్లాడక స్నానంచేసి ఆ చీరె కట్టుకున్నాను.

అలవాటు లేకపోవటంవల్ల నాకప్పుడు చీరె కట్టుకోవ టం రాలేదు. బా వెంట ఉంటున్న ఒకామె చీరె కట్టుకో టం నాకునేర్పింది. బాకు చాలా సంతోషమయింది. "ఇప్పుడు

నువ్వెంతో బాగున్నావు. 14 ఏండ్లు వచ్చిన పిల్లకు గౌను ఏంబాగుంటుంది? అయినా ఇప్పుడు విదేశీ 'ఫాషన్' తుపాను లాగ దేశమంతటా వ్యాపించింది." అన్నదామె.

బా నన్ను భోజనానికి తీసికొని వెళ్ళింది. ఉడికించిన కూర, రొట్టె, వెన్న, పెరుగు, బెల్లం వడ్డించారు. ఆశ్రమంలో గం. 11 లకే భోజనానికి గంట కొడతారు. ఆరోజు నే నొక్కతెనే మిగిలిపోయాను. ఉడకబెట్టిన సొరకాయ ముక్కలు నోట్లో పెట్టుకోటంతోనే డోకొచ్చినట్లయింది. బా నా అవస్థ గ్రహించింది. ఆరోజు ఆమెకు ఏకాదశీ వ్రతం. అందుకని కందగడ్డ ఉడికించి కూరచేశారు. దానిలో కొంచెం నాకు వేసింది. కాని నాభయం నాదే. నియమాన్ని ఉల్లంఘించి ఇలా కూర తిన్నానని బాపూజీకి తెలిస్తే నన్నేమంటారో కదా! ఆశ్రమానికి సంబంధించిన ఆజ్ఞలనూ, నియమాలనూ ఉల్లంఘించినవాళ్లు తినే చీవాట్లను గురించి నాకు ఇదివరకే మా నాయనగారూ, అక్కలూ చెబుతూవచ్చారు. అందువల్ల నేను మొదటినుంచి జాగ్రత్తపడాలని అనుకున్నాను. నా ముఖంచూచి నా మనస్సులో ఉన్న సందేహాన్ని పసికట్టింది బా... "ఈ రోజుకుమాత్రం తిను, తరువాత నెమ్మదిగా అలవాటుపడితే నిన్నేమీ బలవంతపెట్టను."- అన్నది.

నాకు భోజనంపెట్టి బా, బాపూజీ ఉన్న గదిలోకి వెళ్ళింది. వెడుతూ "బాగా అలసిపోయివుంటావు, కొంచెం సేపు నిద్రపో" అని చెప్పింది. తరువాత మళ్ళీవచ్చి నేను మెలకువతో ఉండటం చూచి నన్నిలా మందలించింది. "నిద్ర

ఎందుకు పోలేదు? ఆశ్రమంలో జబ్బు పడకూడదు. చదువు సంధ్యలు నేర్చుకొని తెలివితేటలు సంపాదించాలి."

తరువాత కొంతసేపటివరకు గాంధీ కుటుంబంవారి పూర్వోత్తరాలను నాకు తెలియజెప్పింది. "మీ నాయనమ్మ నాకు పెద్ద తోడికోడలు అవుతుంది. ఆమె పేరు మోతీబాయి. బాపూజీ ఇంగ్లాండు వెళ్ళినప్పుడు ఆమె నన్ను చాల జాగ్రత్తగా చూచింది. అప్పటి కష్ట సుఖాల్లో మేమిద్దరం ఒకళ్ళ కొకళ్ళం తోడునీడగా ఉండేవాళ్ళం. మా అత్తగారెప్పుడైనా కఠినంగా మందలిస్తే మేమిద్దరం ఒకరికొకరం ధైర్యం చెప్పుకొని ఓదార్చుకొనేవాళ్ళం. అన్ని పనుల్లో మేమిద్దరమూ జతగా ఉండేవాళ్ళం. ఈ రోజుల్లో అంత స్నేహంగా మెలిగే తోడికోడళ్లు ఎక్కడా కనబడరు. ఒకసారి, మా అత్తగారు– "కస్తూరినీ మోతీనీ ఒక కొట్లో వేసి ఆరు నెలల వరకు తిండి పెట్టకుండా ఉంచినప్పటికీ వాళ్లిద్దరూ మాటలతోనే కడుపు నింపుకుంటూ ఉంటారు. ఆరు నెలల తరువాతకూడ ఒక్క నిమిషమైనా వాళ్లు మాట్లాడుకోకుండ ఉండలేరు"– అన్నది. మాకిద్దరికీ ఆవిధంగా జతకుదిరింది. నువ్విక్కడికి రావటం నాకెంతో సంతోషంగా ఉన్నది. స్వర్గంలోఉన్న మా అక్క మోతీబాయే నామీద ప్రేమ చూపిస్తున్నదేమో, ఎవరికి తెలుసు? అప్పుడప్పుడు ఆమె నాకు జ్ఞాపకం వస్తుంది. మీ అమ్మకూడ ఈ విధంగానే సేవాభావం కలిగిఉండేది. పాపం, ఆమె రోజూ నాతలకు నూనె పెట్టకుండా, కాళ్లు ఒత్తకుండా నిద్రపోయేదికాదు."

ఈ పూర్వపు సంగతులు వింటుంటే నాకెంతో ఆనందం కలిగింది. మా నాయనమ్మను గురించిన సంగతులు వేరే నాకు చెప్పేవారెవరు? నేనామెను ఎరగనే ఎరగను. బా మళ్లీ ఇలా అన్నది "మీ తాతగారు కోపధారి. ఎప్పుడైనా రొట్టె సరిగా కాలకపోతే 'ఇది ఏ కోడలు చేసిం'దని గద్దించేవారు. బాపూజీ లేనికారణాన నాకేవిధమైన కష్టం కలగకుండా ఆయన జాగ్రత్త తీసికొనేవారు మా మామగారిని మీ తాతగారు చాలా శ్రద్ధగా చూచేవారు. ఎంత చిన్నపనైనా ఆయన్ను అడగకుండ చేసే వారుకారు."

ఈ విధంగా ఒక గంటసేపటివరకు మా తాత, నాయనమ్మల పూర్వవృత్తాంతం బా నాకు చెప్పింది. బాపూజీ కూడా ఇంకెవరూ చెప్పని పూర్వ వృత్తాంతాలు నాకు అప్పుడప్పుడు చెవుతూవుండేవారు. బా కాళ్ళు పిసుకుతూ నేను ఆమెవద్దనే పడుకొని నిద్రపోయినాను. మధ్యాహ్నం ఒక అరగంటసేపు నిద్రపోవటం బాకు అలవాటు. అరగంట తరువాత ఆమె నిద్రలేచింది, కాని నన్ను లేపలేదు. అది మామిడిపండ్ల కాలం ఆమె స్వయంగా పాకశాలకు వెళ్ళి మాకోసం పండ్లు తెచ్చి నీళ్ళలో నానవేసి ఉంచింది. ఆ రోజుల్లో రామదాసు కాకా కుమారుడు కాన్‌హా కూడా బావద్దనే ఉండేవాడు. బా మాకందరికీ ఫలహారం పెట్టింది. నేను వద్దనటంచూచి; అక్కడే ఉంటున్న ఒకామె బా స్వభావాన్ని గురించి ఇలా తెలియజెప్పింది: "బా తినటానికిగాని, కట్టుకోటానికిగాని ఇచ్చే వస్తువులను ఇష్టమున్నా లేకపోయినా తప్పక తీసుకోవాలి. ఇంకొకరికి పెట్టటం అంటే బాకు చాలా సంతోషం;

కనుక తీసికోకపోతే ఆమెకు కోపం వస్తుంది" ఈమాటలు విని నేను ఆమెపెట్టిన ఫలహారం గుప్ చుప్ గా తినేశాను.

ఇంతలో వార్తా పత్రికలు వచ్చాయి. నేను చదివి బాకు వినిపించాను. తరువాత బా నాతో తన ఉత్తరాలకు సమాధానాలు వ్రాయించింది అప్పటికి మూడుగంటలు కొట్టారు. బా రాట్నం వడకటం మొదలుపెట్టింది. చర్ఖా మీద చెయ్యివేస్తూనే, "నువ్వు చర్ఖా తెచ్చుకోలేదా?" అని నన్ను ప్రశ్నించింది. నాకు సిగ్గేసింది. చెప్పటానికి లేదని చెప్పానేకాని, చర్ఖాలేకుండ బా దగ్గర నే నెలా ఉండగలను? అని మనసులో భయం కలిగింది. చర్ఖా వెంట తెచ్చుకోనందుకు బా కోపిస్తుందనుకున్నానుగాని ఆమె ప్రేమవాక్కులతో నాకు చర్ఖా తత్వాన్ని ఉపదేశించింది "ఇలా అయితే పనిసాగదు. మనం రోజూ తప్పకుండా రాట్నం వడకాలి. నీకు నిత్యం కట్టుకోటానికి గుడ్డలు కావాలిగదా! సిగ్గు మూసుకోనటానికి మాత్రమేకాదు మనం బట్టలు కట్టుకోవటం, చలికి, వేడికిబాధ పడకుండా శరీరాన్ని కాపాడుకోటానికికూడ అవసరమే. అందుకనే నువ్వు మరచిపోకుండా పెట్టెనిండా గుడ్డలు పెట్టుకొని కరాచీనుంచి వెంట తెచ్చుకున్నావు. ఎక్కడికైనా వెళ్లేటప్పుడు బట్టలజత వెంటతీసికొనిపోవటం మనకందరికీ అలవాటే. అలాగే నిత్యం వడకటానికికూడ భారతీయులు అలవాటుపడినట్లయితే- బాపూజీ తలపెట్టిన లక్ష్యం త్వరలోనే సిద్ధిస్తుంది. ఇదిగో నాదగ్గర ఇంకో రాట్నం ఉన్నది. నువ్వుదానిమీద వడుకుతూవుండు."

ఈ విధంగా రాట్నం ప్రాముఖ్యాన్ని ముక్తసరిగా తెలియచెబుతూ బాపూజీ ప్రబోధించిన చర్ఖా కార్య క్రమాన్ని తీవ్రం చెయ్యటానికి తన మనస్సులో ఉన్న ఆదు ర్దాను ఆమె వ్యక్తపరచింది. ఒక అర్ధగంటవరకు రాట్నం వడి కిన తరువాత, ఆరవేసిన మా బట్టలుతీసి మడతలు పెట్టాను. బా తీవ్రదృష్టి నాఫ్రాకుమీదపడ్డది. వెంటనే ఆమెఅన్నది. "అమ్మాయీ, చూసు నీఫ్రాకుమీద మచ్చలు ఎలా ఉన్నాయో; నీకు బట్టలు ఉతుక్కోటం చేతకానట్టున్నది. కరాచీలో నౌకర్లే ఉతికేవారేమో! నాకు నీ వయస్సులోనే పెళ్లైపోయింది నౌకర్లను పనివాళ్లనుపెట్టి తల్లిదండ్రులు ఈకాలపు ఆడపిల్లలను పనికిమాలిన వాళ్ళనుగా చేస్తున్నారు. ఇలా తీసుకురా. నేనా మచ్చలను పోగొడతా; వాటికిఎక్కువ సబ్బుకూడ అవసరంలేదు. చేతితో బాగా నలిపి ఉతకాలి. నువ్వురోజూ గుడ్డలు ఉతికి నాకు చూపించు. నాలుగయిదు రోజులలోనే ఉతికే పద్ధతి నేర్చుకుంటావు. ఇటువంటి పను లన్నీ ఇక్కడ ఎక్కువగా నేర్చుకోవలసి ఉంటుంది. చదువుతో పాటు పనిపాటలు చక్కగా చేయటంకూడా నేర్చుకోవాలి."

ఉదయం నన్ను బాదగ్గర దిగవిడచి వెళ్ళినప్పటినుండి నేను బాపూజీ దగ్గరకు మళ్ళీ వెళ్ళలేదు. సాయంకాలం 5 గంట లకు భోజనాలకు గంటకొట్టారు. బాపూజీని పిలుచుకురమ్మని బా నన్నే పంపింది. బాపూజీ ప్రొద్దునా సాయంకాలం అంద రితోపాటు భోజనశాలలోనే భోజనం చేస్తున్నారు. నన్ను చూడటంతోటే బాపూజీ- "అరే! ఉన్నట్టుండి ఈ పిల్ల పెద్దమనిషిగా మారిపోయిందే! ఇవ్వేళ చీరెందుకు కట్టావు?

ఇది బా చీరె అనుకుంటాను. నీకసలే ఓపికలేదు, నిన్ను నువ్వే మోసుకోలేకుండా ఉన్నావు; ఈ చీరె బరువుకూడా ఎందుకు మీదవేసుకున్నావు? గౌన్లులేవా? లేకపోతే చెప్పు, కుట్టిస్తా." అన్నారు.

"బాపూజీ! బామ్మకు 'ఫ్రాకు' ఇష్టంలేదు. నన్నుచీరే కట్టుకోమని చెప్పి తనచీరె ఇచ్చింది. పొద్దుటినుంచీ చీరె కట్టుకొనేఉన్నాను." అని చెప్పాను. మేమిద్దరము మాట్లాడుకుంటూ వరండాలోకి వచ్చాము. బా బయటికి రావటంతోటే బాపూజీ అందుకున్నారు: "పాపం, ఈ పిల్లకు చీరెందుకు కట్టావు? వయస్సు 14 పండ్లుండవచ్చు, కాని నాకుమాత్రం 11 లేక 12 పండ్ల పిల్లలాగే కనిపిస్తున్నది. దీనికి బంధాలేమీ లేకుండా గంతులువేసి ఆడుకొనే వీలుండాలి. ఇది తనచీరె కూడ ఉతుక్కోలేదు. నాకు తెలిస్తే పొద్దున్నే విడిపించి ఉండేవాణ్ణి." అన్నారు.

అదివిని బా కోపంగా "నేను దీన్ని ఫ్రాకు తొడుక్కోనివ్వను. ఆడపిల్లలసంగతి నాకు బాగా తెలుసు. చీరె ఇవ్వేళకు మాత్రమే, రేపటినుంచి లంగా ఓణీ కట్టిస్తా. ఫ్రాకు తొడుక్కోటమే దీనికిష్టమైతే నేనేమీ బలవంతం చేయను." అన్నది. నేనిప్పుడు ధర్మసంకటంలో పడ్డాను. ఎవరిమాట వినేది? బామ్మమాటా లేక బాపూజీ మాటా? చివరకు "ఇప్పుడు నా దగ్గిర ఆరుఫ్రాకులున్నాయి, వాటిని కట్టివేసుకొన్న తరువాత ఇంక కొత్తవి కుట్టించుకోను." అన్నాను. నా మాటకు ఇద్దరూ సరే అన్నారు. బాకూడా అడ్డుచెప్పలేదు.

ఈ విధంగా 24 మే 1942 నుండి నా కీ ఇద్దరు మహనీయుల చల్లనినీడలో ఉండే అదృష్టమబ్బింది ఆ శుభ దినం నా జీవితంలో శాశ్వతంగా అంకితమైపోయింది. నేడు అదంతా స్వప్న జగత్తుగా పరిణమించింది. తలుచుకున్నప్పు డల్లా గడిచినదంతా స్వప్నమా లేక మహాత్ముల సహవాసమా - నిశ్చయంగా బోధపడటంలేదు.

నా చదువు, అన్నం, నీళ్ళు మొదలైన ప్రతివిషయం బా శ్రద్ధగా గమనిస్తుండేది. 'వీరిద్దరికీ సేవచేయటంతోను. ఆటపాటలతోనూ, చదువు సంధ్యలతోనూ నియమబద్ధమైన ఆశ్రమ జీవితంలో నారోజులు ఆనందంగా గడవటం మొదలు పెట్టినవి.

## మొదటి పాఠం

నేను వచ్చిన తరువాత నాతో కూడా ఉన్నామె జబ్బు పడింది. జ్వరం తీవ్రంగా వస్తుండేది. బాకు చేయవలసిన సేవ యావత్తూ నాపైన పడింది. కావాలని ఆ రోగి మంచం కూడ బా తనగదిలోనే వేయించుకున్నది. ఆమెకు జ్వరం ఎప్పుడు వచ్చేది, ఎంత వచ్చేది, గమనిస్తూ ఆహారము, పథ్యమూ, స్పాంజ్, ఎనిమా, మట్టి కట్లూ మొదలైన ఉపచారమంతా ఎంతో ప్రేమతో బా చేయిస్తుండేది. ఆజబ్బు మనిషికి రాత్రుం చప్పుడు సరిపడేది కాదు. అందుకని బా ప్రక్కనున్న చిన్న కొట్లో కూర్చొని నూలు వడికేది. జబ్బుతో వున్న పరాయి

మనిషిని ఈవిధంగా చూచుకొనే ఆడవాళ్ళు చాలా అరుదుగా ఉంటారు.

బా నాకు చదువు చెప్పేపనిని భణసాలీభాయికి అప్ప గించింది. ఆయన వద్ద నాకు ఇంగ్లీషు, గుజరాతీ, బీజగణితం, క్షేత్రగణితం, సంస్కృతం, చరిత్ర, భూగోళం మొదలైన వాటిలో పాఠాలు క్రమంగా సాగుతూ వచ్చినవి. అప్పుడప్పుడు పరీక్ష పెట్టవలసిందని బా ఆయనకు సలహా చెప్పింది. అయిదవ తరగతి ఇంగ్లీషు చదువుతున్న మా ముగ్గురు నలుగురు అమ్మా యీలకు భణ్‌సాల్‌భాయీ ఒకసారి పరీక్ష నిశ్చయించారు. బాకు ఈసంగతి తెలుసు. కాని పరీక్ష జరుగవలసిన రోజునే సేవా గ్రామంలో కాంగ్రెసు వర్కింగు కమిటీ సమావేశం ఏర్పాటైనందున చాలా మంది అతిథులు వచ్చారు. సాయం కాలపు భోజనానికి రొట్టెలు తయారుచేయాలి. పనిచేసే ఆడ వాళ్లు కొద్దిమందే ఉన్నారు. నాపరీక్ష ఆరుగంటల తరువాత జరుగవలసి వున్నందున మిగిలిన స్త్రీలతో కలిసి రొట్టెలు వత్తి ఇవ్వటానికి నేను కూడ భోజనశాలలోకి వెళ్ళాను. అయిదారు రొట్టెలు వత్తానో లేదో బా వచ్చి నాచేతిలోంచి అప్పడాల కఱ్ఱ గుంజుకొని మెత్తని మాటలతో చివాట్లు పెట్టింది. "అమ్మా, నీకు బదులు నన్ను కూర్చోబెడుంటావా పరీక్షలో? పాపం! చదివి చదివి అలిసిపోయినట్లున్నావు. అందుకనే ఇక్కడికి వచ్చి కూర్చున్నావు, తరువాత కోప్ప డితే 'రొట్టెలు వత్తటానికిపోయినా' నని సాకుచెప్పవచ్చు. 'రొట్టెలు వత్తటానికి వెళ్ళనా వద్దా?' అని నన్నెందుకడగలేదు నువ్వు?" అని అడిగిందామె. క్షణం సేపు నోటమాట

రాలేదు నాకు. తెప్పరిల్లి "ఇప్పుడు నాలుగున్నర అయింది, భోజనానికి చాలా మంది ఉండటంచేత రొట్టెలు వత్తటానికి నన్ను కూడా పిలిచారు, అందుకనే వచ్చాను. అయినా, నా పాఠాలు పూర్తిగా చదువుకున్నాను; మీకు రొట్టెలు వత్తితే అలిసి పోతారు. కొద్దిగానే ఉన్నవి. ఆకాసిని వత్తియిచ్చి నేను ఇప్పుడే వెళ్ళిపోతా" నన్నాను.

ఈ మాటలు చాలా ధైర్యం తెచ్చుకొని చెప్పాను. కాని బా జవాబు విన్న తరువాత పశ్చాత్తాపం కలిగింది. "ఔను మీచదువు దొంగలసంగతి నాకు తెలియదా! పాఠం ఎగగొట్టటానికి ఈ ఎత్తు వేశావని చెప్పరాదూ? వెళ్ళు ఇక్కడి నుంచి; సరాసరిగదిలోకి పోయి పుస్తకం పట్టుకొని కూర్చో. కఠినమైన ప్రశ్నలు ఇవ్వవలసిందని ఇప్పుడే భణసాలీతో చెబుతా, మార్కులు తక్కువవస్తే నీపని పట్టిస్తా చూడు."

మారు పలకకుండా నేను లేచివచ్చేశాను. శరీరకష్టం సహించి అయినా, తాను స్వీకరించిన కర్తవ్యభారం బా నిర్వహించి తీరుతుంది.

నాకంటికి జబ్బుచేసి దృష్టి దెబ్బతిన్నది సులోచనాలున్నప్పటికీ నేనువాటిని వాడటంలేదు. బాకు నాకండ్లజబ్బు సంగతే తెలియదు.

బా గదిలో ఒక గూడున్నది. దానిలో కుంకుమతో ఓంకారం గీయబడిఉన్నది. సేవాగ్రామం ఆశ్రమంలో నేటికిని ఆ ఓంకారం చెక్కుచెదరకుండ కనిపిస్తున్నది. దాని వద్ద బా నిత్యం నేతితో దీపారాధన చేసేది; జపమాల త్రిప్పుతూ మంత్రోచ్చారణచేసేది; భగవద్గీత పఠించేది; ఒకటి రెండు

పూలు సమర్పించేది. ఓంకారం మాసిపోతుండగా ఒకనాడు తిరిగి దాన్ని చక్కగా గీయమని బా నన్ను ఆజ్ఞాపించింది. నేను కుంకుమతో ఓం గీశాను, కాని క్రింది రేఖ సరిగా ఏర్పడ లేదు. ఆలోపం నాకంటికి స్పష్టంగా కనిపించలేదు. అయితే బాకున్న కళాత్మక దృష్టికి అది వెంటనే గోచరించింది. "మనూ, దూరాన్నుంచి చూడమ్మా, ఓంకారంలోని క్రింది రేఖ కొంచెం వికారంగా కనిపిస్తున్నట్టున్నది" అన్నది ఆమె. నేను దూరాన్నుంచి చూడటానికి ప్రయత్నం చేశాను, కాని దృష్టిలోపం వల్ల నాకది కనిపించలేదు. ఆమెకు సమాధానం చెప్పటం అవసరం గనుక "ఇప్పుడే దాన్ని సరిదిద్దుతా"నని చెప్పాను. బా బయటి వసారాలోకి వెళ్లికూర్చున్న తరువాత నేను సులోచనాలు పెట్టుకొని చూచాను. బా గది గోడలో జాలీ ఉన్నది. నేను సులోచనాలు పెట్టుకొని ఓంకారం చూడ టం-ఆమెకు దానిలోనుంచి కనిపించింది. తక్షణం లోపలికి వచ్చి ఆమె "నీకు కూడ సులోచనాలు కావాలా? అయితే వాటిని నువ్వెందుకు వాడటంలేదు? చూపు ఇంకా చెడగొట్టుకో దలచావా? అవి పెట్టుకోక పోతే రామదాసు కూతురు సుమి త్రకు పట్టినగతే నీకూపడుతుంది. ఇవ్వేళనుంచీ సులోచనాలు పెట్టుకోక పోయినావా నాపనేదీ ముట్టుకోనీయను జ్ఞాపకం ఉంచుకో ఈసంగతి బాపూజీతో కూడా చెబుతా రోజూ మధ్యాహ్నం వేళ నువ్వుకూడా మూడు కమలాపండ్ల రసం తాగాలి దానివల్ల సుమిత్రకు చాలా లాభం కలిగింది" అని చెప్పింది. ఈవిధంగా బా నాదొంగతనం పట్టుకుంటుందని ఊహించలేదు. నిజానికారోజున బా నన్ను సులోచనాలు

వాడమని నిర్బంధించక పోయినట్లయితే ఇప్పటికి నేను గుడ్డి దాన్నయి ఉండేదాన్ని. లేదా దృష్టి చాలాక్షీణించి ఐనా ఉండేది.

నాకో చెడ్డ అలవాటుండేది. అన్నానికికూర్చు నేటప్పుడు నేనెప్పుడూ మంచినీళ్లు పెట్టుకునేదాన్ని కాదు. దీనికి కారణం ఏమంటే మేము నలుగురైదుగురు బాలికలం ఒకేసారి భోం చేసి, మాలో ఎవరు త్వరగా కంచాలు, కప్పులు కడుగుతారా అని పందాలు వేసుకునే వాళ్ళం. కంచాలు కడిగే అభ్యాసం నాకు తక్కువైనందువల్ల సాధ్యమైనన్ని తక్కువ గిన్నెలూ పళ్ళాలు భోజనానికి ఉపయోగించేదాన్ని. నీళ్ళు పెట్టుకోక పోవటం వల్ల ఒకగ్లాసు తోమటం తక్కువ అవుతుంది కదా! ఇది కూడా ఒక విధంగా మానసిక దౌర్బల్యమే. జోహారా బహాన్ అనే ఒక మహమ్మదీయ సోదరిసంగతి నాకు బాగా జ్ఞాపకం. ఆమె నాకన్న రెట్టింపు గిన్నెలు, పళ్ళాలువాడేది. అయినా వాటిని తోమి శుద్ధి చేయటంలో నన్ను ఓడించేది. ఈ పోటీని చూచి బా ఆనందించేది.

ఆరోజుల్లోనే ఒకసారి ప్రార్థన జరిగిన తర్వాత నాకు తేలు కుట్టింది. దాని బాధ 24 గంటలూ ఉండనే ఉంటుంది. అప్పట్లో బాతోకూడ నేనొక్కత్తెనే ఉంటూండటం వల్ల ఆమెకు పడక, భోజన భాజనాల ఏర్పాట్లు అన్నీ నేనొకతెనే చేస్తుండేదాన్ని. మాకార్యక్రమం ప్రకారం ప్రార్థన అయిన తర్వాత పిల్లలమందరం కలిసి రోజూ 'అంత్యాక్షరి' ఆటఆడే వాళ్ళం లేదా బాదగ్గర కూర్చుని ప్రభుదాస్ గాంధీ తల్లియైన కాశీతాయీ భజనపాటలు వినేవాళ్ళం. ఆశ్రమ వ్యవస్థాపకు

జైన సుమన్‌లాల్ షాహ్ గారి భార్య శకరీపిన్ని, మహాదేవ్ దేశాయ్ గారి భార్య దుర్గాపిన్ని, కిశోర్ లాల్ మశ్రూవాలా గారి భార్య గోమతి పెద్దమ్మ, వీరందరు భోజనాల పని ముగించుకొని బా దగ్గర కూర్చునే వాళ్ళు. ఈ విధంగా రాత్రివేళ ఆశ్రమం కుటుంబీకుల ఆనందంతో కలకలలాడుతూ ఉండేది. కాని నాకు తేలుకుట్టిన రాత్రి మా సరసగోష్ఠి విరసమై పోయింది. బాపూజీపడుకోబోయేటప్పుడు బాదగ్గరకు వచ్చారు. "చూడండి, పాపం, పిల్ల ఆడుకుంటుంటే తేలు కుట్టింది." అన్నది బా

ఆశ్రమంలో ప్రార్థన చేసే చోట, ఆరుబయట, ఇసుక మీద పిల్లలం బా, బాపూజీలతో సహా రాత్రిపూట నిద్ర పోయేవాళ్ళం. ఆ రాత్రి బా చాలాసేపటివరకు నాదగ్గరే కూర్చొని తల నిమురుతూ ఉన్నది. మర్నాడు కూడ నేను ఏపనీ ముట్టుకోలేకపోయినాను. నిత్యం బాకు నేనే భోజనం అమర్చి పళ్ళెం తెచ్చి పెట్టేదాన్ని. కాని ఇప్పుడు బాయే నాకు వడ్డించిన కంచం, చెంబుతో మంచినీళ్ళు తెచ్చి నాముందుంచి ఇలాఅన్నది. "అన్నానికి కూర్చొనే టప్పుడే మంచి నీళ్లు పెట్టుకోటం నీకు అలవాటులేదు. దీన్నిగురించి నీతో చెప్పాలని రోజూ అనుకుంటూనే మరచిపోతున్నా. చెంబుతో నాకు మంచినీళ్ళు పెట్టటానికి జాగ్రత్త చూపుతున్నట్టు గానే నీకోసం చేసికొనే పనుల్లో కూడ జాగ్రత్తపడుతూఉండాలి. బా పనిమాత్రం చక్కగా చేసిపెట్టి నీపని పట్టించుకోక పోవటం మంచిదికాదు. అట్లాచేసేవాళ్ళు ముందుకు పోలేరు. భోజనం చేసేటప్పుడు నీళ్ళుతాగటం అవసరం అవుతుంది.

అప్పుడు నువ్వు ఎంగిలి చేత్తోనన్నా లేచి తెచ్చుకోవాలి, ఎవరినైనా తెచ్చిపెట్టమని వేడుకోవాలి. ఒక్క చెంబైనా కడగటం తప్పిపోతుందికదా అనుకుంటే అది సోమరితనం అనిపించుకుంటుంది. ఇవ్వేళనుంచి మంచి నీళ్లు పెట్టుకొని అన్నానికి కూర్చో."

చిన్న చిన్న అలవాట్ల విషయంకూడా బా ఎంతో సూక్ష్మంగా గమనించి నెమ్మదిగా మనస్సుకు పట్టేటట్లు బోధిస్తుండేది.

## 3

## బా, బాపూజీల వీడ్కోలు

**1942** సంవత్సరం జూలై నెల చిరస్మరణీయమైనది. బాపూజీ ఉపవాసం చేస్తారనీ, ఆమరణ నిరాహారదీక్ష పూనుతారనీ రోజూ వార్తాపత్రికలలో సూచన వస్తుండేది. బాపూజీ ఉన్న కుటీరంలో సంభాషణలు జరుగుతుండేవి. బా తలచుకొన్నట్లైతే ఆమె కూడా ఈ సంభాషణల్లో పాల్గొనగలిగేది. ఆమెను ఎవరూ అడ్డుపెట్టేవారు లేరు. అయినప్పటికి ఇటువంటి పరామర్శలు వినవలెనని ఆమె ఎన్నడు తలపెట్టలేదు. ధర్మపత్ని అయిన కారణంచేత బాపూజీ మీద ఇతరుల కంటె తనకు ఎక్కువ అధికారం ఉంటుందనే సంగతే ఆమె మరచిపోయింది. కారణం ఏమంటే బాపూజీ అందరికి బాపూ అయినట్లే బాకుకూడ 'బాపూ' అయినారు. అలాగే బా కూడ అందరికీ 'బా' అయినట్లే బాపూజీకి కూడ 'బా' యే

అయింది. అందుచేత, ప్రజాసామాన్యం వార్తాపత్రికల ద్వారా తృప్తి పొందినట్లే బా కూడా పత్రికలద్వారా తెలిసే వార్తల వల్లనే తృప్తిపడుతుండేది.

'హరిజన బంధు'లో బాపూజీ వ్రాసిన "ఇంగ్లీషువారు భారతదేశం విడిచిపోవాలి" అనే వ్యాసం నేను బాకు చదివి వినిపించాను. ఈఆందోళనను గురించి బాకు చాలా చింత కలిగింది. ఆవ్యాసాన్ని బా చాల శ్రద్ధతో సావధానంగా విన్నది. కాని వినటంతో తృప్తికలుగనందున కాబోలు ఆమె స్వయంగా ఆవ్యాసాన్ని నెమ్మదిగా చదివి చూచుకున్నది. ('హరిజన బంధు'లో రాబోయే వ్యాసాలను ఆమె ముందుగా చదివేదికాదు. అచ్చుపడి వచ్చిన తరువాతనే ప్రతివారం తప్పని సరిగా చదువుతుండేది.) పైన చెప్పిన వ్యాసం చదివిన తరువాత బా ఇలా అన్నది- "బాపూజీ ఇదివరలో ఇంత కాఠిన్యం చూపించలేదు. ప్రభుత్వం ఈ పత్రికను మూసి వేయించటమైనా జరుగుతుంది లేదా ఏవైనా గందరగోళాలైనా సంభవిస్తాయి." ఆరోజుల్లో దాదాభాయీ నౌరోజీ మనుమరాలైన ఖుర్షేద్ బహెన్ కూడ అక్కడే ఉన్నది ఆమె రోజూ బా వుండే గదిలోకి స్త్రీలను పిలిచి సభచేసేది. బాపూజీ యుద్ధం ఆరంభించి నట్టయితే స్త్రీలు చేయవలసిన పనులను గూర్చి ఆమె అందరికీ బోధిస్తుండేది.

చివరకు ఆగష్టునెల వచ్చింది. కాంగ్రెస్ కమిటీ సమావేశంలో పాల్గొనటానికి బాపూజీ రెండవ తారీఖున బొంబాయి వెళ్ళ వలసి ఉన్నది. బా ప్రయాణాన్ని గురించి నిశ్చయం కాలేదు. ఆమె ఆరోగ్యం సరిగా లేదు. పైగా ప్రభుత్వం

వారు ఈమాటు తమను నిర్బంధించ బోవటంలేదని బాపూజీ నమ్మకంగా చెప్పారు అందుకని ఆయన ఆమెతో "నువ్వు ఇక్కడే ఉండు. ప్రభుత్వం నన్ను పట్టుకోదు. అది అంత పిచ్చిది కాదు" అన్నారు.

కాని ఇంతమాత్రానికి బా ఒప్పుకొనే మనిషికాదు. "నన్నుకూడా ఎందుకు తీసుకుపోరు? మీ జిత్తులు నాకు తెలుసు మీరింతఘాటుగా వ్రాసినప్పుడు ప్రభుత్వం ఎందుకు పట్టుకోదు? నేను తప్పకుండా వస్తా మీరెక్కడో నేనక్కడే" అని బా బదులుచెప్పింది

"ఐతే నువ్వు తయారుకా," అన్నారు బాపూజీ కాంగ్రెస్ కమిటీలో బాపూజీయే స్వయంగా తీర్మానం ప్రతిపాదించి ఉపన్యాసం ఇచ్చారు తనను నిర్బంధించరని అనుకున్నారుగాని వారి ఊహ నిజంకాలేదు. వార్తాపత్రికలు మాత్రం చదివి ఊహించిన బా ఊహయే నిజమైంది. అందరూ జైలుకు పోవలసివచ్చింది

బా నన్ను సామాను సిద్ధం చేయమన్నది భవిష్యత్తు తెలిసినదానిలాగ ప్రతిచిన్న వస్తువూ నాకు జ్ఞాపకంచేస్తూ ప్రయాణానికి కావలసిన సన్నాహాలు చేయించింది సేవాగ్రామానికి తిరిగిరావటం పడదని బా స్పష్టంగా పలికింది "బామ్మా నేనుకూడ వచ్చేదా?" అని నేనడిగాను అందుకామె- "నిన్ను వెంట తీసుకొని పోవటం నాకిష్టమే, కాని ఈమాట బాపూజీతో చెబితే నా ప్రయాణంకూడ నిలిచిపోవటం నిశ్చయం. బొంబాయిలో ప్రభావతి ఉన్నదికనుక నాకేమీ ఇబ్బంది కలగదు" (ప్రభావతి జయప్రకాశ్ నారాయణ్ గారిభార్య)

నేను బా పెట్టె సర్దాను పెట్టెలో తన చీరెలుపెట్టిస్తూ బా అన్నది- "ఈచీరె నాకు రాజకుమారి వడికి ఇచ్చింది దీన్ని తప్పకుండా పెట్టెలో ఉంచు నేను కట్టుకుంటే ఆమె చాలా సంతోషిస్తుంది" ఇతరులను సంతోషపెట్టటం బాలో ఉన్న గొప్పగుణం బాపూజీ వడికిన నూలుతో నేసిన ఒక ఎఱ్ఱంచు చీరె నా చేతిలో పెడుతూ గద్గదస్వరంతో ఇలా అన్నది- "అమ్మాయీ, బహుశః మేము పట్టుబడవచ్చు, ఆశ్రమాన్ని కూడ జప్తు చేస్తారేమో, ఈ చీరె నువ్వు భద్రంగా కాపాడాలి దీన్ని నేయించి నాకిచ్చిననాడే నామనస్సులో నిశ్చయం చేసుకున్నా మరణసమయంలో బాపూజీ చేతినూలుతో నేసిన ఈచీరే కప్పుకొని నేను ప్రాణం విడుస్తా. ఇదే నా చివరి కోరిక. నా ఈ కోరికను నువ్వే తీర్చాలి ఈ సంగతి నీకు మాత్రమే చెబుతున్నా, ఇంకెవరికీ చెప్పలేదు ప్రభుత్వం ఏది జప్తుచేసి తీసుకుపోయినాసరే ఈ చీరెను మాత్రం భద్రంగా కాపాడాలి ఆభారం నీమీద పెడుతున్నా"

ఆమె అన్నట్టుగానే జరిగింది ఆశ్రమం జప్తుకాలేదు కాని కిశోరలాల్ మశ్రూవాలాను పట్టుకోటానికి అర్ధరాత్రి పోలీసులు వచ్చినప్పుడు ఆశ్రమాన్ని జప్తుచేస్తారన్న భయం కలిగింది కాని, ఆ చీరెను నేను బా బాపూజీలను నిర్బంధిం చారని విన్న వెంటనే వర్ధాలో ఉన్న బజాజ్ వాడీకి పంపించి వేశాను. తిరిగి దాన్ని నేను ఆగాఖాన్ భవనం చేరుకొన్న తరువాత నాదగ్గరకు తెప్పించుకొన్నాను. అక్కడ నాచేతి తోనే ఆమె శవంమీద కప్పాను. ఈ చిన్న కడసారి కోరికను నెరవేర్చగలగటం నేను చేసుకున్న పుణ్యం కాకపోయినా

పెద్దల ఆశీర్వాద బలమని నా నమ్మకం. ఈ సంగతి తలుచు కుంటే నా కపారమైన సంతోషం కలుగుతున్నది. బా హృదయంలో ఉన్న పతిభక్తి- ఎంత గొప్పదో, ఎంత భవ్యమైందో ఈ చీరె ప్రసంగం రుజువు చేస్తుంది. 2వ తారీఖున స్టేషన్‌కుపోతూ పోతూ బా నాకెన్నో సంగతులుచెప్పింది- "నేతి దీపారాధన నియమంగా చేస్తుండు. ప్రభుత్వం మమ్మల్ని పట్టుకున్న తర్వాత నువ్వు కరాచీ వెళ్ళిపో, నీ ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకో, నాగదిలో వంటరిగా పడుకోలేకపోతే దుర్గగదిలోకి పోయిపడుకో" నాకుసరిగా ఫలహారం ఏర్పాటు చేస్తుండవలసినదని భోజనశాలాధ్యక్షులైన కృష్ణచంద్రునితో మరీమరీ చెప్పిపోయింది

బా నెళ్ళేలోపల ఒకసోదరి "థేప్లా" అనే ఒకకారపు తినుబండారం బా కోసం తయారుచేసి పంపింది. సెనగపిండి, పెసరపిండి మొదలైన వాటితోచేసిన కారపువస్తువులంటే బాకు చాలా ఇష్టం కాని బా ఆ సోదరికి ఇలా వ్రాయించి పంపింది- "ఆశ్రమ నియమాలను నీ వెరుగుదువుకదా? నాకీ తినుబండారం ఎందుకు పంపించావు? నేను తినదల్చుకుంటే నన్నెవ్వరూ అడ్డుపెట్టలేకపోయినప్పటికీ బయటినుంచివచ్చే తినుబండారాలను నియమభంగంచేసి నేనెలా తింటాను? బాపూజీ ఎదుట నా దొంగతనం బయట పడదా?"

చివరకు ఆ 'థేప్లా' ముక్కలు ముక్కలు చేసి బా అందరి కంచాల్లో ఒక్కొక్క ముక్క వేయించింది తాను ఒక్క ముక్కకూడ రుచి చూడలేదు. ఈ విధంగా బాపూజీ పెట్టిన నియమాల నన్నిటినీ బా జాగ్రత్తగా పాటిస్తుండేది,

కాపురానికి వచ్చిన కొత్తలో తెలిసో తెలియకో బాపూజీకి ఎదురు చెప్పి ఉండవచ్చును గాని ఆయన మాటలను సరిగా అవగాహన చేసుకొన్న తరువాత మాత్రం వాటిని తు చ తప్పకుండా పాటిస్తుండేది. కావాలంటే ఆమె ఆ 'ధేప్లా' లను తన గదిలో దాచివుంచి మరునాడు ప్రయాణంలో తినటానికి వెంటతీసుకొని పోయిఉండేది కాని బా అటువంటి పాపానికి ఎప్పుడూ తలపెట్టదు ఆ దాపరికం ఉంటే ఆమె "బా" అనిపించుకొనేదే కాదు

బా, బాపూజీ గంభీర వాతావరణంలో ఆశ్రమం నుంచి వీడ్కోలు పొందారు రాజకీయ మేఘాలే కాకుండా, ఆకాశంలో వర్షాకాలపు మేఘాలు కూడ ఆవరించి ఉన్నవి. బాగా ఎండ కాస్తూ సూర్యుడు ప్రకాశిస్తున్నా ఆనందంగానే ఉంటుంది లేదా వాన కురుస్తున్నా మనోహరంగానే ఉంటుంది, కాని ఆ రోజు ఎండా కాకుండా, వానా కాకుండా నీరసమైన వాతావరణం క్రమ్ముకొని ఉన్నది అంతకు ముందు కన్న ఆ రోజునుంచి నాకు శకునాలమీద నమ్మకం హెచ్చింది. "మళ్లీ ఈ ఆశ్రమానికి రావటం ఎక్కడిది? తిరిగివచ్చి దీన్ని మళ్ళీ చూస్తానని నాకు తోచటం లేదు" అనే మాటలు బా నోటినుండి వెలువడినవి

అన్నట్టుగా నే బా సేవా గ్రామం ఆశ్రమానికి తిరిగి రాలేదు ఆ నాటి వీడ్కోలు ఆమెకు శాశ్వతమైన వీడ్కోలుగా పరిణమించింది

## ४

# నిర్బంధం

బా, బాపూజీలు బయల్దేరి వెళ్లిన రోజు ఆశ్రమం అంతా బావురుమంటూ కనిపించింది ఎవరికీ ఏమీ చేయ వలసిన పని లేనట్టు ఎక్కడి వాళ్ళక్కడే ఉండిపోయినారు. రెండోరోజు నేను బాపూజీ గది శుభ్రం చేశాను సామా నంతా పక్కగదిలో సర్ది తాళం వేసి తాళపుచెవి ఆశ్రమ వ్యవస్థాపకుడైన చిమన్‌లాల్ కాకాకు ఒప్పగించాను.

అందరి దృష్టి బొంబాయి నుంచి వచ్చే వార్తా పత్రి కల మీదనే లగ్నమైంది ఆశ్రమానికి వచ్చినప్పటి నుండి ఆశ్రమవాసులకు విహితమైన పాకీ దొడ్డి శుభ్రం చేసే నియ మాన్ని నేను పాటించలేదు ఎందుచేతనంటే బాకు పరిచర్య చేయటంలోనే ఉదయకాలమంతా గడిచిపోయేది ఇప్పుడు బా, బాపూజీలు బొంబాయి వెళ్ళిన తర్వాత పాకీదొడ్డి పారిశుధ్యంలో వున్న ఆనందం తెలుసుకోవలెనని నాకు కోర్కె కలిగింది బాపూజీ స్థాపించిన ఆశ్రమాల్లో స్వయంగా పాకీదొడ్డి పరిశుభ్రం చేయటం జీవితానికి ఆనందం గౌరవం సమకూర్చే పనులలో ఒకటిగా ఏర్పడింది. జీవిత నిర్మా ణానికి ఈ పని ఎంత తోడ్పడుతుందో అనుభవంగల వారికి మాత్రమే అంతుపడుతుంది మైలా మురికీ అంటే నేను చాలా అసహ్యపడేదాన్ని వాంతి చేసుకునే సమయంలో ఎవరినైనా చూస్తే వెంటనే నాకు వాంతి అయ్యేది. ఈ అస హ్యం పోగొట్టుకొనే ఉద్దేశ్యంతోనే బుద్ధిపూర్వకంగా నేసీ

పాకీపని కావాలని అడిగి తీసుకొన్నాను. నా అసహ్యపడే అలవాటంతా ఈ కార్యక్రమంతో తొలగిపోయింది. అది పోకపోతే నేను బా, బాపూజీలవద్ద ఉండటం సాధ్య పడేదేకాదు. ఒక వారం రోజులు అశుద్ధముండే బకెట్లు తీసివేసి శుభ్రం చేసేటప్పటికి నాకెంతో లాభం కనిపించింది. ఆగస్టు 8 నేనీ పనిని ముగించటానికి ఏర్పాటైన చివరిరోజు. ఆ మరునాడు బా, బాపూజీలు తిరిగి ఆశ్రమానికి రాగలరని అందరూ నమ్మకంతో ఉన్నారు. అందుకనే నేను పాకీ పని ముగించుకొని బాపూజీ కుటీరాన్ని శుభ్రం చేశాను. ముందరి పంచ అలికి ముగ్గువేసి అలంకరించాను బా కు సంబంధించిన వస్తువులన్నీ యథాస్థానంలో అమర్చిపెట్టాను కాని ఈశ్వర లీల ఎవరు గుర్తించగలరు? 9వ తారీఖు ఉదయం 8-30 గంటలకు నాయకులందరినీ నిర్బంధంలో ఉంచారని వార్త వచ్చింది. బజాజ్ వాడీనుంచి వార్తలన్నీ మాకు నేరుగా టెలి ఫోను ద్వారా చేరుతుండేవి.

ఈ వార్త సేవాగ్రామంలోను, చుట్టుపట్లను వాయు వేగంతో వ్యాపించిపోయింది. ఇరుగు పొరుగు గ్రామస్థులంతా బయలుదేరి వచ్చారు. అందరూ కిశోర్‌లాల్ కాకాగారి బసలోచేరి వ్యాకులచిత్తంతో ప్రార్థనచేశారు బాపూజీకి ప్రియమైన 'వైష్ణవజనతో' అనే గీతం పాడారు. సేవా గ్రామంలోని మనుష్యులేకాక ఫలపుష్ప వృక్ష లతాదులు కూడ దుఃఖంతో జడత్వం పొందినట్లు కనిపించినవి. సూర్య భగవానుడు కూడ మేఘాలచాటున దాగి శోకిస్తున్నట్లు కనిపించాడు. కిశోర్‌లాల్ కాకా ఎంతో కష్టం మీద లైను కలిపి

బొంబాయికి టెలిఫోను చేశారు. మహాదేవ్ భాయీ, శ్రీమతి సరోజినీ నాయుడు, మీరా బహన్లు మాత్రం బాపూజీతో ఉన్నట్లు కబురందింది. బా సంగతి ఏమిటి? మీరు బాపుతో కూడ ఉండదల్చుకుంటే ఆయన వెంట వెళ్ళవచ్చు" అని పోలీసులామెతో చెప్పారు కాని బా ధైర్యశాలి కదా! ప్రభుత్వం ఇలా దయచూపితే ఆమె సహించగలదా? ఆమె ఒప్పుకోలేదు ఆరోజు సాయం కాలమే స్త్రీల సభ ఏర్పాటు చేయించింది. అందరికీ తన సందేశం అందజేసింది. ఆమె తయారు చేసియిచ్చిన సందేశం ఇలా ఉన్నది.

## సోదరీమణులకు కస్తూర్బా సందేశం

మహాత్ముడు మీకు చాల సంగతులు చెప్పే ఉన్నారు. నిన్న కాంగ్రెస్ కమిటీ సమావేశంలో రెండున్నర గంటల సేపు ఆయన తన హృదయంలోని ఆవేదనను వ్యక్త పరచారు. అంతకన్న ఎవరేమి చెప్పగలరు?

ఇప్పుడు మనం ఆయన ఆజ్ఞలను అనుసరించి కార్యాచరణకు దిగాలి. స్త్రీలు ధైర్యసాహసాలు చూపించే సమయం ఇప్పుడు ఆసన్నమైంది. అన్ని కులాల వారు కలిసి ఈ పోరాటంలోకి పోకాలి. సత్యాన్ని, అహింసను విడువకుందురు గాక

కస్తూర్బా గాంధి

బిర్లా భవనం బొంబాయి
తా. 9-8-1942

బా వ్యక్తిత్వం ఇటువంటిది ఆమె చదువు కొనక పోయినా కొద్దిపాటి మాటల్లో ఆకర్ష వంతమైన సందేశం తయారుచేసి వెల్లడించింది

కాని ప్రభుత్వానికి ఆమెపై దయకలిగిందో లేక ఆమెను చూచి భయపడిందో చెప్పలేముకాని ఆమెకు ఆ సభకు వెళ్ళే కష్టంమాత్రం కలుగకుండ చేసింది. సభకు వెళ్ళబోతుండగా ఆమెను మోటారులో కూర్చొబెట్టి నేరుగా ఆర్థర్ రోడ్ జైలుకు తీసుకుపోయినారు. బా వెంట డా॥ సుశీలానయ్యార్ ఉన్నది. కొంచెంసేపు అక్కడవుంచి వాళ్ళిద్దరినీ బాపూజీ దగ్గిరకు పంపించారు ఆర్థర్ రోడ్ జైలునుంచి బా పూనా వెళ్ళింది. ఆ తరుణంలో బా మానసికస్థితి ఎలాఉన్నదీ, బాపూజీ వద్దకు వెళ్ళినప్పుడు ఏమైనదీ, ఈ వృత్తాంతమంతా తెలుసుకోదగినది. ఆ సమయంలో బా వెంటనున్న సుశీలా బహన్ "మన బా"* అనే పుస్తకంలో ఈ విషయం ఎంతో చక్కగా వర్ణించింది. ఆవర్ణనలోనుంచి సందర్భోచితంగా కొంతభాగం ఈ క్రింద ఉదహరిస్తున్నాను

## ఆర్థర్ రోడ్ జైల్లో

10-8-1942

"రాత్రి రెండుగంటలప్పుడు ఏదోచప్పుడువిని నేనులేచి కూర్చున్నాను. చూచేటప్పటికి బా దొడ్డినుంచి తిరిగివస్తూ కనిపించింది. రాత్రంతా ఆమెకు పలుచని విరేచనాలు అయి నవి. నేను లేవటానికి ముందే ఆమె ఎన్నోసార్లు దొడ్లోకి

---

* నవజీవన్ ట్రస్టుద్వారా ప్రకటింపబడ్డది.

వెళ్ళివచ్చింది. నేనులేచి బాను చెట్టబట్టుకొని పక్కమీద పరుండబెట్టాను. మర్నాడు డాక్టర్ రాగానే సుస్త్రీకి తగి నట్టుగా బాకు ప్రత్యేకమైన ఆహారం ఇప్పించవలసిందని నేనాయనతో చెప్పాను... మేమున్న గదిలో గాలి అనా రోగ్యకరంగా ఉండటంవల్ల అక్కడ కూర్చోగానే తల నొప్పి వచ్చింది. మేట్రన్‌కు కూడ ఇదే అనుభవం కలిగింది. అందుకని ఆమె మమ్ములను తన గదిలోకి తీసికొనిపోయి కూర్చోబెట్టింది— కాని బా వెంటవెంటనే దొడ్లోకి వెళ్ళ వలసి వచ్చింది ఆమెకు నడవటానికి తగినంత శక్తి లేనందున మేము తిరిగి మాగదికే చేరుకున్నాము. గదిబైట మంచి గాలిలో కూర్చోమని బా నన్ను బలవంతపెట్టింది. ఆ మెమాట తీసివేయలేక నేను కొంచెముసేపు బయటకూర్చుని తిరిగిలోప లికి వెళ్ళాను. అప్పుడే ఇంకొక మహిళనుకూడ మాగదిలోకి తీసికొనివచ్చారు. ఆమె ముగ్గురు నలుగురు చిన్నపిల్లల్ని ఇంట్లో వదలి జైలుకు వచ్చింది. బా ఎంతో ప్రేమతో ఆమె సంగతి సందర్భాలు విచారించి తెలుసుకొన్నది... బా మన స్సును వ్యక్తిగతమైన దుఃఖంగానీ, చింతగానీ క్రుంగదీయలేదు. ఆమెను బాధిస్తున్న చింత వేరేఉన్నది. బాపూజీ భారతదేశపు కష్టాలు తొలగించ గలుగుతారాలేదా, అన్నదే ఆమెకు కలి గినచింత! స్టేషన్‌కు తీసికొనిపోయి మమ్మ వెయిటింగు రూములో కూర్చోబెట్టారు. నాకు నిద్రవస్తున్నా బా మాత్రం మెళకువతోనే ఉన్నది. స్టేషన్‌లో మామూలుగా మనుష్యుల రాకపోకలూ, అల్లరీ ఆగం జరుగుతూనే ఉన్నది. ఇదంతా చూచి బా హఠాత్తుగా– "చూచావా సుశీలా?

ఏమీ జరగనట్టుగా లోకం యథాప్రకారం సాగిపోతూనే ఉన్నది. ఇలాఉంటే బాపూజీ తలపెట్టిన స్వరాజ్యం ఎలా వస్తుంది?" అన్నది. ఆమె కంఠస్వరంలోతొణికిసలాడుతున్న కరుణ భావానికి నా కళ్ళవెంట నీళ్ళుకారినవి.

## ఆగాఖాన్ మహల్లో ప్రవేశం

**11-8-1942**

ఉదయం సుమారు 7 గంటలకు మా రైలు ఒకచిన్న స్టేషన్‌లో ఆగింది. ఒక పోలీసు అధికారి మమ్మ తీసికొనిపోవ టానికి వచ్చాడు రాత్రి అంతా విరేచనాలు కావటంవల్ల బా బొత్తిగా డీలుపడిపోయింది. స్టేషన్‌లో ఆమెకు ఒకకుర్చీ తయారుగా ఉంచారు. కాని ఆమె కుర్చీలో కూర్చోటానికి ఒప్పుకోలేదు. శరీరం స్వాధీనంలో ఉన్నంతవరకు దాన్ని నడి పించటం, ఇతరులమీద బరువువేయకపోవటం ఆమె స్వభావం. ఆమె స్టేషన్ వెలుపలకు నడిచేవచ్చింది. మోటారు సిద్ధంగా ఉన్నది ఒక అరగంటలో ఆగాఖాన్ మహల్ సింహ ద్వారం చేరుకున్నాం పహరావాళ్లు ఒక పెద్దగేటు తెరి చారు. కొంతదూరం పోయిన తరువాత మరొక జాలీల తలు పులుగల ద్వారం తెరిచారు. భవనం ముందు మోటారు ఆగింది. నా భుజంమీద చెయ్యివేసి బా నెమ్మదిగా మెల్లి క్కింది. కొందరు ఖైదీలు వరండా ఊడుస్తూ కనిపించారు. "బాపూజీ ఉన్న గది ఏది?"- అని మేము వాళ్ళను అడి గాము. "అదో ఆచివరిది" అని ఒకడు బదులు చెప్పాడు. నా చెయ్యిపట్టుకొని బా నెమ్మదిగా బాపూజీ ఉన్న గదిలోకి నడి

చింది. ఆయన ఒక ఎత్తైన గద్దెమీద కూర్చొని చేతిలో పెన్సిల్ పట్టుకొని ఏదో వ్యాసం దిద్దుతున్నారు మహాదేవ భాయీ ప్రక్కన నిల్చొని ఆయనతో ఏదో చర్చిస్తున్నారు. దగ్గరకు వెళ్ళగానే మహాదేవ్ భాయీ మమ్మల్ని చూచి సంతోషం వెలిబుచ్చారు. కాని బాపూజీదృష్టిమాత్రం తీవ్ర మయింది. హృదయ దౌర్బల్యంవల్ల బా తన్నువిడిచి ఉండ లేక వెంటపడి వచ్చిందేమోనని ఆయనకు అనుమానం కలి గింది ఆయన తీక్ష్ణస్వరంతో- "నువ్వు ఇక్కడికి వస్తానని కోరుకున్నావా లేక ప్రభుత్వమే నిన్ను బంధించి పంపిందా?" అని ప్రశ్నించారు. బా క్షణంసేపు మౌనంగా ఉండిపోయింది. బాపూజీ అడుగుతున్నదేమిటో ఆమెకు సరిగా అర్థంకాలేదు. ఇంతలో నేనే ఆ ప్రశ్నకు సమాధానం చెప్పాను. "కాదు బాపూజీ, ప్రభుత్వం ఆమెను అరెస్టుచేసి ఇక్కడికి పంపిం చింది." కొంచెం తెప్పరిల్లిన తరువాత విషయం అర్థం చేసి కొని బా "నేనేమీ వారిని కోరలేదు, వారే మమ్మల్ని పట్టుకొన్నారు" అని బదులు చెప్పింది బాను మంచంమీద పడుకోబెట్టి ఆమెకు మందు తెప్పించాను. కాని బాపూజీ దర్శనంతోనే ఆమె మనస్సు తేలికపడ్డది అంతటితో విరేచ నాలుతగ్గి స్వస్థత ఏర్పడింది నేను తెప్పించిన మందులో ఒకే మోతాదు ఆమె పుచ్చుకున్నది రెండవది అవసరంలేక పోయింది అసలు మందేమీ లేకపోయినప్పటికీ ఆమెకు స్వస్థత చిక్కిఉండేదే!

## ౫

# మహాదేవ్ కాకా నిర్యాణం

ఒక వారం అయినా తిరగకముందే అకస్మాత్తుగా అతి దారుణమైన దుర్ఘటన సంభవించింది నేటికి ఎనిమి దేండ్లు గడచి పోయినప్పటికీ దానివల్ల కలిగినదుఃఖం ఇప్పుడే తగిలినదెబ్బలాగ సంబంధీకుల హృదయాలను వేధిస్తున్నదంటే అదెంత భయంకరమైన ఆఘాతమో ఊహించుకోవచ్చు భార్యా పుత్రులు, పెంపుడు కూతుళ్లు, బంధుమిత్ర వర్గము, పరిచితులు, పేరుమాత్రమే వినివున్నవాళ్లు, వ్యాసాలను లేఖలను చదివి ఆనందించిన జిజ్ఞాసువులు-అందరి హృదయాలను తీవ్రంగా గాయపరచిన ఆదుర్ఘటన మహాదేవకాకాగారి ఆకస్మిక నిర్యాణం. చెట్టంత మనిషి ఇంత హఠాత్తుగా కూలి పోతారని కలలో కూడ ఎవరూ అనుకోలేదు. మహాదేవ భాయీ చనిపోయినారన్న రేడియోవార్త బజాజ్ వాడీ భవనంనుంచి టెలిఫోన్ద్వారా మాకు అందింది మేము వెంటనే నమ్మలేక పోయినాము. దుర్గా పిన్నికి ఈ సంగతి ఎవరు చెప్పగలరు ? రెండోసారి వచ్చిన ఫోన్ద్వారా కర్నల్ భండారితో మాట్లాడుతూనే మహాదేవ భాయీ తల తిరిగి పడిపోయినారని తెలిసింది. సుశీల బహన్ తన 'మన బా' అనే పుస్తకంలో మహాదేవ కాకాగారి మరణానికి సంబంధించిన కరుణా దృశ్యాన్ని కన్నులకు కట్టినట్టు వర్ణించింది. అందులో నుంచి కొంత భాగం ఇక్కడ ఉదహరిస్తున్నాను.

శనివారం 15-8-1942

"ఎప్పటి వలెనే ఉదయం గం. 7. 30 లకు ఆరుబయట తిరగటానికి షికారు బయలుదేరారు. మహాదేవ్ భాయీ కూడ వెంట వచ్చారు. 8 గంటలకు అందరం ఇంటికి తిరిగి వచ్చాము. బాపూజీ ఒళ్లు మాలిష్ చేయించు కోటానికి కూర్చున్నారు. మహాదేవ్ భాయీ తనపని చూసుకుంటున్నారు. ఆరోజు జైళ్ళ ఇన్‌స్పెక్టర్ జనరల్ కర్నల్ భండారీ తనిఖీకి రానున్నందున ఖైదీలు కొందరు వరండాను శుభ్రం చేస్తున్నారు. బా సరోజినీ నాయుడుగారి గదిలో కూర్చున్నది కొద్దిసేపటికి కర్నల్ భండారీగారి మోటారు వచ్చింది. నేనూ, బాపూజీ మినహా మిగిలిన వారందరు శ్రీమతి నాయుడుగారి గదిలోకి వెళ్ళి కర్నల్ గారితో మాట్లాడుతూ కూర్చున్నారు. నేను బాపూజీకి మాలిష్ చేస్తున్నాను. ఉండి వుండి మహాదేవభాయీ మొదలైనవారి నవ్వు వినిపిస్తూ వచ్చింది తటాలున నిశ్శబ్దం అయింది. ఎవరో నన్ను కేకవేశారు. భండారీగారితో మాట్లాడటానికి రమ్మని పిలుస్తున్నా రనుకున్నాను నేను. ఇంత లో బా పరుగెత్తుకొని వచ్చి "సుశీలా, త్వరగా రా, మహాదేవుకు మూర్ఛ వచ్చింది" అన్నది. నేను పరుగెత్తి వెళ్లి చూచాను. మహాదేవభాయీ మహాప్రస్థానానికి సిద్ధపడుతున్నారు. నాడి ఆడటం లేదు. గుండె కొట్టుకోటం నిల్చిపోయింది. శ్వాసమాత్రం ఆడుతున్నది. శరీరం నీలుగుకొని పోతున్నది. "నేను బాపూజీని పిలిపించాను. ఆయన కూడా, భండారీగారిని కలుసుకోటానికే పిలుస్తున్నారని అనుకున్నారు. మహాదేవ్ భాయీ మూర్ఛపోయా

రని ఎవరో చెప్పారు. కాని ఆయన మహాప్రయాణానికి సిద్ధ పడుతున్నారని పాపం, బాపూజీ మాత్రం ఎలా ఊహించు కోగలరు? వెంటనే వచ్చి మహాదేవ్‌గారి మంచం దగ్గర నిల్చొని "మహాదేవ్! మహాదేవ్!" అని పిల్చారు. బా కూడా "మహాదేవ్! బాపూజీ వచ్చారు, మహాదేవ్! బాపూజీ నిన్ను పిలుస్తున్నారు" అని పిలవటం మొదలుపెట్టింది కాని, మహాదేవ్‌భాయీ ఎవరికీ బదులు చెప్పేస్థితిలో లేరు. నెమ్మది నెమ్మదిగా శ్వాస కూడా నిల్చిపోయింది. అందరికన్న బాకు ఈ వజ్రఘాతాన్ని సహించటం కష్టమైపోయింది ఎంతో ధైర్యం కూడగట్టుకొని ఆమె ప్రార్థనలో పాల్గొన్నది. కండ్ల వెంబడి కన్నీటిధార ఆగనేలేదు. లోకం అంతా ఆమెకండ్ల యెదుట గిరగిర తిరుగుతున్నట్టు కనిపించింది.

చివరకు శవాన్ని దహనానికి తీసుకొని పోయేందుకు మేడమీదినుంచి క్రిందకు దించారు. బా పట్టుదలతో తాను కూడా కిందికి దిగివచ్చింది కాని ఆమె ఒంట్లో మెట్లు ఎక్కి దిగే శక్తిలేదు. అయినా, తన మహాదేవును వీడ్కోలుప టానికి తాను రాకుండా ఉండగలదా? బా దుర్బలంగా ఉండటం చూచి, దహనం చూడకుండా ఉంటే బాగుం టుందనుకొన్నాం. కాని వద్దంటే బా ఆగే మనిషా? చివ రకు చితికి కొంచెం దూరంగా ఆమెను కుర్చీవేసి కూర్చో పెట్టాము. కూర్చున్నంతసేపూ ఆమె చేతులు జోడించి - 'మహాదేవ్, నువ్వు ఎక్కడికి పోయినా సుఖంగా మాత్రం ఉండు' అని ప్రార్థిస్తూనే ఉంది "మహాదేవ్ ఎందుకు వెళ్ళి పోయినాడు? నేనెందుకు పోలేదు? దైవం చేసే న్యాయం

ఇదేనా ?" అని మధ్యమధ్యన ప్రశ్నిస్తుండేది. శవాన్ని దహనంచేసి మేమందరం ఇంటికి చేరుకునేటప్పటికి సాయంకాలం 5 గంటలైంది. అంతటా నిశ్శబ్దం. భవనమంతా బావురుమంటున్నది. ఎవర్ని యెవరు ఓదార్చేవారు? బ్రాహ్మణుని చావు చాలా అపశకునమని బా భావించింది. "ఔను, అది ప్రభుత్వానికే" అని బాపూజీ సమాధానం చెప్పారు. కాని బా మనస్సులోనుండి ఈ శంక పోనేలేదు. కొన్ని రోజులైన తరువాతకూడ ఆమె మళ్లీ ఒకసారి "సుశీలా! ఈ బ్రహ్మహత్యా పాతకం మనకు తగులుతుంది కదూ? బాపూజీ ఈ యుద్ధకాండ సాగించారు. అందువల్ల మహాదేవ్ జైలులో పడ్డాడు. ఇక్కడ ఆయనకు మరణం సంభవించింది, ఈ పాపం మన తలకు చుట్టుకోకపోతుందా ?" అని అడిగింది-"

ఆగాఖాన్ భవనంలో ఆనాడు కనుపించిన దృశ్యం ఎంత భయంకరమైందో పై వర్ణననుబట్టి కూడా మనకు పూర్తిగా అవగాహన అవటం కష్టం.

నన్నూ, నా కండ్ల జోడునూ చూచి మహాదేవ్ కాకా ముద్దుగా 'పిల్లి పిల్లా' (మినీ) అని పిలిచేవారు. నా ప్రసంగం వచ్చినప్పుడల్లా- "ఇది నా పెంపుడు పిల్లి" అనేవారు. ఆయన భోజనం చేసేటప్పుడు, ఏదైనా మంచి రుచిగల పదార్థం వడ్డిస్తే నన్ను చూచి- "పెంపుడు పిల్లి నా పళ్లెంలో నుంచే తీసుకు తింటుంది. అరచి ఆగం చెయ్యదు." అని ఊరించేవారు. దీని అర్థం ఏమిటంటే : నేనుకూడా అల్లరీ ఆగం చేయకుండా కావలసిన వస్తువు పెట్టించుకొని తినిపోవాలని! నేను "తినటానికేమి, తింటాను. కాని

బాపూజీ అనుమతి కావాలి గదా ?''- అని నేను బదులు చెప్పేదాన్ని. ఎందుకంటే, ఆశ్రమ నియమాల ననుసరించి ఆశ్రమ వంటశాలలో భోజనంచేసే వారెవరూ ప్రత్యేకంగా ఇండ్లలో తినే వారి వంటకాలు ఏమీ తినకూడదు. కాని మహాదేవ్ కాకా నవ్వుతూ నా చెయ్యి పట్టుకొని కూర్చో పెట్టి తినమనేవారు. "నువ్వు పిల్లివిగదా? నీకు నియమా లేమిటి? 'మా ఆశ్రమంలో తప్ప వేరే ఎక్కడా పిల్లికి నియమాలుండ'వని నేను బాపూజీతో చెబుతాలే. 'నరోవా కుంజరోవా' అని నిజమూ కాకుండా అబద్ధమూ కాకుండా ధర్మరాజుతో పలికించాడు శ్రీకృష్ణ పరమాత్మ. మనంకూడా అలాగే చేద్దాము,''- అంటూ నవ్వుతూనే ఒక చిన్నముక్క రుచి తెలిసేటంతమాత్రం నోట్లో వెయ్యకుండా విడిచిపెట్టే వారు కారు. తరువాత దాపరికం లేకుండా ఆసంగతి బాపూజీతో చెప్పి- "పిల్లికి నియమాలు పెట్టటం ఎక్కడా చూడలేదే!''- అని నవ్వేవారు. "అది నాలుగు కాళ్లదైతే ఇది రెండు కాళ్ళది, అదే భేదం రెంటికీ.''- అని బాపూజీ తగినట్టు సమాధానం చెప్పేవారు. మహాదేవ్ కాకాకు మాత్రం తక్కువ తెలివి ఉన్నదా? "అయితే నువ్వు రెండుచేతుల మీదా, రెండు కాళ్ళమీదా నడిచి వస్తుండు మా యింటికి; నామాటా అబద్ధంకాకూడదు, బాపూజీ మాటాఅబద్ధం కాకూడదు.''- అని ఉపాయం చెప్పారు. అందుకు బాపూజీ "చూడు, మనూ, తిండి పెట్టటం కోసం మహాదేవ్ నిన్ను జంతువుగా మార్చివేస్తున్నాడు, జాగ్రత్త.'' అనేవారు.

ఈ విధంగా ఎన్నోసార్లు పరిహాసం చేశారు కాకా. ఆయన ఎంత పనిలో మునిగివున్నా సరే, మేము పిల్లలం దగ్గరకు వెళ్ళేసరికి, గాంభీర్యమంతా మరచిపోయి నవ్వుతూ, నవ్విస్తూ, జుట్టుపట్టుకొని గుంజి, చెవి మెలిపెట్టి, లేక చెంప దెబ్బ వేసి ఆనందించేవారు. పిల్లలమీద అంత ప్రేమ, చనవు చూపించేవారు ఆయన సేవా గ్రామంనుంచి కడసారి సెలవు పుచ్చుకొని వెళ్ళేటప్పుడు నేను ఆయనకు నమస్కారం చేయటానికి వెళ్ళాను. నన్ను దగ్గర కూర్చో పెట్టుకొని "మంచిది, మినీ! మనం తిరిగి కలుసుకుంటామో లేదో తెలియదు" అన్నారు. విధి అప్పుడప్పుడు మన నోటిగుండా జరుగనున్నదాన్ని పలికిస్తుంది. నేను ఏడుస్తూ "కాకా, మీరు జైలుకు వెళ్తారు కదా! నేనుకూడ వస్తాను" అన్నాను. "అరే, నువ్వింత చిన్నపిల్లవు, నిన్ను జైలు కెవరు తీసుకుపోతారు? కాని జైలులో పిల్లులు చాలా ఉంటాయి, నువ్వు వాటితో కలిసి ఉండవచ్చు" ఇవే కాకా నాతో పరిహాసంగా అన్న కడసారి మాటలు బయలుదేరి వెళ్ళటానికి ముందు నా చేత ఈ క్రింది భజనపాట పాడించి విన్నారు. అది ఆయనకు చాలా ఇష్టమైన పాట. అది నేను కరాచీలో నేర్చుకున్నాను. బాపూజీకి కూడా ఈ భజన ప్రియమైనది:

"ధాకే న ధాకే ఛతాయే ఓ మానవీ,
న లేజే విసామో,
నే జూఝు జే ఏకలా బాఁయే,
హో మానవీ! న లేజే విసామో!

తారే ఉల్లంఘువానా మారగ ఛలామణా,
తారే ఉద్ధార వానా జీవన దయామణాం,
హిమ్మత న హారజే తుం క్యాయే,
హో మానవీ! న లేజే విసామో!

జీవననే పంథ్ జతాం తాప ధాక లాగశే,
వధతీ విటంబణా సహాతాం తుం ధాకశే.
సహాతాం సంకట ఏ బధాయే,
హో మానవీ! న లేజే విసామో!

జాజే వటావీ తుజ ఆఫతనో టేకరో,
ఆగే ఆగే హాశే వణ ఖేడ్యా ఖేతరో.
ఖేతే ఖేడే ఏ బధాం ఛే,
హో మానవీ! న లేజే విసామో!

ఝూంఖా జగతమాం ఏకలో ప్రకాశజే,
ఆవే అంధార్ తేనే ఏక్ లో విదారజే.
ఛోనే ఆ ఆయఖుం హణాయే,
హో మానవీ! న లేజే విసామో!

లేజే విసామో న క్యాయే, హే మానవీ, దేజే
విసామో,
తారీ హైయా వరఖడీనే ఛాయే,
హో మానవీ, దేజే విసామో.

---

" ఓ మానవుడా! నువ్వు అలసినా అలసిపోకపోయినా విశ్రాంతి తీసికోవద్దు. ఒంటరిగానే పోరాడు. ఓ మానవుడా! విశ్రమించవద్దు. విన్న మరపించే మార్గాలను దాటిపోవలసి ఉన్నది. దీనుల జీవితాలను ఉద్ధరించ

ఈ గీతం మహాదేవ్ కాకాకు చాల ప్రియమైనది. ఇటువంటి గీతాలను తన జీవితంతో మేళవించుకొని సార్థకం చేసుకొన్నారు. ఈ పాటలోని చివరి పంక్తులకు ఆయన తన జీవితాన్ని ప్రత్యక్ష నిదర్శనంగా గడిపారు.

రాత్రనక, పగలనక, ఎండవానలకు వెరవక, 25సం॥లు మహాదేవభాయీ బాపూజీకి అఖండమైన సేవచేశారు. చివరి క్షణంవరకు బాపూజీకి సంబంధించిన పనిలోనే తన మనః ప్రాణాలను లీనంచేస్తూవచ్చారు. అలసిపోయి చివరికి విశ్రమించారు. అందుకనేకాబోలు భవిష్యత్ సూచకమైన ఈపాట నాచేత అడిగిపాడించుకొని విన్నారు. ఇది ఆయనకు కంఠస్థం కాలేదు, స్వరంకూడ సరిగాకుదరలేదు. కాని జీవన మంత్రంగా స్వీకరించిన పాటకు స్వరకల్పన లేకపోతేమాత్ర మేమి ?

---

వలసి ఉన్నది. ఎక్కడనూ ధైర్యం విడనాడవలదు ఓ మానవా! విశ్రమించకు. జీవిత మార్గంలో నడచిపోయేటప్పుడు నీకు ఎండ తగిలి అలసట కలుగుతుంది. పెరిగిపోతున్న కష్టాలను, అవమానాలను సహించి, సహించి నీవు అలసిపోతావు. ఓ మానవా! ఈ విపత్తు లన్నింటిని ధైర్యంతో ఎదుర్కో. అంతేగాని, విశ్రమించకు. కష్టాలనే పర్వతాలను దాటుతూ పోవాలి. వాటికి ఆవలి గట్టున దున్నని పొలాలూ, బీళ్లూ ఉన్నవి. శ్రమకు ఓర్చి దున్నగలిగితే అవన్నీ నీకేలభిస్తాయి ఓ మానవా! విశ్రమించకు. ఈ చీకటి లోకంలో నువ్వు ఒంటరిగానే వెలుగు వ్యాపింపజెయ్యి. నీకు అడ్డంవచ్చే చీకట్లను ఒంటరిగానే ఛేదించుకొనిపో. ఈ జీవితం నశించినా సరే, ఓ మానవా, విశ్రాంతి తీసుకోవద్దు. ఎక్కడనూ ఆగకు. నువ్వు ఇతరులకు విశ్రాంతి ఈయవలె. ఓ మానవుడా, నీ హృదయ వృక్షచ్ఛాయలో అందరిని విశ్రమింపజెయ్యి"

ఈపాట వెంటనే కాగితంమీద వ్రాసియిమ్మని నన్నడిగి తీసికొన్నారు. అది తనచొక్కా జేబులో భద్రంగా ఉంచుకొని సేవాగ్రామాన్ని శాశ్వతంగా విడిచివెళ్ళారు. ఇంత ఘోర విపత్తు సంభవించినప్పటికీ బాపూజీ జైలు నిబంధనల మూలంగా మహదేవ్ కాకా ప్రియపుత్రుడయిన నారాయణనూ, సతీమణియైన దుర్గాబహిన్‌నూ ఓదార్చుతూ రెండు ముక్కలు వ్రాసి, ఉత్తరం పంపలేకపోయినారు. ఇది సహించలేని విషమస్థితి. దీన్ని గురించి బాపూజీ, "నేనెవరికీ ఉత్తరం వ్రాయవలసిన పనిలేదు, నిజానికి నా కుటుంబం 'గాంధీ వంశం' వరకే పరిమితంకాదు, ఇటువంటి సంకీర్ణ పరివారంలో జీవించటం నేను ఎన్నడో వదిలేశాను"- అన్నారు. ఆనాటి నుంచి బాపూజీ అనుచరులెవరూ జైలులో ఉన్నంతవరకు తమ బంధువులకు ఉత్తరాలు వ్రాయలేదు.

32 లక్షణాలుగల మనిషిని బలిచ్చినట్లయితే ఏదో సిద్ధిస్తుందని మన పౌరాణికగాథలు చెబుతున్నవి. ముఖ్యంగా దేవతల విషయంలో ఈ నమ్మకం వ్యాప్తిలో ఉన్నది. మహాదేవ్ భాయీ విషయంలోకూడ ఇటువంటిదే జరిగిఉండవచ్చు. భారతదేశ స్వాతంత్ర్య యుద్ధంలో సామాన్యులు మొదలు పేరుపొందిన దేశసేవకులవరకు ఎందరో బలిఅయినారు. కాని ఎన్ని జీవాలైనా ఏనుగుకి సరిపోనట్లు మహాత్ముడైన మహాదేవభాయీని బలిగొన్న ఆగస్టు 15వ తేదీన స్వాతంత్ర్య దేవికి తృప్తి కలిగిందనుకుంటాను. కనుకనే దాస్య శృంఖలాలను త్రెంపుకొని స్వాతంత్ర్యదేవి ఆగస్టు 15వ నాడే అవతరించింది. ఈ కారణంచేతనేకావచ్చు ఇంగ్లీషువారు అదే

తేదీన భారతమాతకు దాస్యవిముక్తి కలిగించి తమవాపం కడిగివేసుకున్నారు. ఏదేమైనా, బాగా ఆలోచిస్తే ఈతేదీ కలయికలో ఏదో దైవ సంకేతమున్న దనిపించకపోదు.

సేవాగ్రామంలోని వారింట్లో వారి మాసికంరోజున మేమందరంచేరి నూలువడికి, ప్రార్థన గీతాపరనంచేసి ఆయన ఆత్మకు ప్రీతి కలిగించే కార్యక్రమాన్ని నడిపించాము.

౬

## సేవాగ్రామంలో అరెస్టులు

సేవాగ్రామం,
22-8-1942

మహాదేవ్‌కాకా పరమపదించిన మొదటివారం దుఃఖ భారంవల్ల ఒక ఏడాది దీర్ఘమై, నెమ్మదినెమ్మదిగా నడిచి పోయింది. ఆగస్టు మూడోవారం వచ్చింది

ఈవారంకూడ కఠినపరీక్షా సమయంగానే పరిణమించింది. మా దుఃఖం ఉపశమించటం భగవంతుడు సహించలేక పోయినాడేమో లేక మమ్మ పరీక్షించటం ఇంకా పూర్తి కాలేదేమో! ఎందుకంటే దుర్గపిన్నిని, నారాయణుని, ఆశ్రమ వాసులను ఇంతవరకు ఓదారుస్తున్న పెద్దలనుకూడ ప్రభుత్వం పట్టుకొని జైల్లో బంధించింది

ఆగస్టు 2వ తారీఖున బా, బాపూజీ, మహాదేవ్ కాకాలు ఆశ్రమంనుండి బొంబాయికి బయలుదేరారు. 8వ తారీఖున అందరూ జైలుకు వెళ్ళారు. మహాదేవ్‌కాకా

అయితే శాశ్వతంగానే విడిచిపెట్టి పోయినారు. ఓదార్చే కిశోర్‌లాల్ కాకా కూడ 22వ తేదీరాత్రి సేవాగ్రామంవదలి వెళ్ళవలసివచ్చింది. ఈ విధంగా మొత్తంమీద ఆగస్టు మాస మంతా మాకు అగ్నిపరీక్షగానే తయారయింది.

ఆగస్టు 22వ తేదీ రాత్రి 20 మంది సాయుధపోలీసుల దండు అకస్మాత్తుగా సేవాగ్రామంలో దిగింది మున్నాలాల్ అనే ఆశ్రమవాసి 'మీా కెవరితో పని ఉన్న'దని ఒక అధి కారి నడిగినాడు 'కిశోర్‌లాల్ మశ్రువాలా ఇల్లు సోదా చేయవలసి ఉన్నది' అని చెప్పి ఆయన ఇల్లు చూపించ మన్నాడు అప్పుడు రాత్రి సుమారు 2 గంటలై ఉంటుంది. కిశోర్‌లాల్‌గారి ఇంటి తలుపులు తెరచే ఉన్నాయి.

వర్ధాకు 5మైళ్ళ దూరాన ప్రశాంతమైన స్థలంలో ఆశ్రమం ఉన్నది. రాత్రి నిశ్శబ్దంగా ఉండటం వల్ల పోలీసు లారీ చప్పుడు అందరినీ నిద్రలేపింది అదిగాక ఆశ్రమంలో ఏదైనా ఆకస్మిక ఘటన సంభవించినప్పుడు మామూలు కంటె వేరే విధమైన గంటమోగుతుంది. ఈపనిని నాకు ఒప్ప గించారు. అందుకని లారీ వచ్చిన వెంటనే నేను గంట మోగించాను అది అపాయాన్నిసూచించే గంట గనుక విన్న వెంటనే ఊళ్ళో వాళ్ళంతా పరిగెత్తుకొని వచ్చారు. సమీపంలో ఉన్న ఖాదీ విద్యాలయం, తాలీం సంఘంనుంచి కూడ స్త్రీ, పురుషులు యావన్మంది వచ్చి కిశోర్‌లాల్‌గారి ఇంటి వద్ద చేరారు

"మీలో ఎవరైనా అల్లరి చేసినట్లయితే మా దగ్గర కావలసినంత ఆయుధ సామగ్రి వున్నది. కాని మేము వాటిని

ఇక్కడ ఉపయోగించవలసిన అవసరం రాకూడదని మా అభిప్రాయం." అని అధికారి అన్నాడు.

"అక్కరలేదు, ఇక్కడ హంగామాచేసే వాళ్ళెవరూ లేరు" అని ఆశ్రమ వ్యవస్థాపకుడు బదులు చెప్పాడు.

యమదూతలవలె ఉన్న ఆ పోలీసు వారిని చూచి నేను నిశ్చేష్టురాలనై ఉండిపోయినాను నోట మాట రాలేదు. అంతకు ముందెప్పుడూ నేను తుపాకులు, కత్తులు పట్టుకున్న పోలీసులను గానీ, వాళ్ళు ఎవరినైనా బంధించి పట్టుకోవటంగాని చూడలేదు. ఇటువంటి సంఘటనలను గురించిన వార్తలను మాత్రం పత్రికల్లో చదువుతుండే దాన్ని. కాని ఇప్పుడు ప్రత్యక్షంగా చూచిన అనుభవం ఆవార్తలు చదివినప్పుడు కలగలేదు.

ఈ పోరాటంలో నేనుకూడా పాల్గొనాలని నిశ్చయించుకున్నాను కనుక నాభయం, నాముఖం చూచి ఎవరైనా పసిగట్టేస్తారేమోనని, కప్పిచ్చటానికి నేనెంతో ప్రయత్నం చేశాను. నిజానికి నేను అరెస్టు అయినప్పుడు కూడ ఇంత శ్రధ్ధపడలేదు. పోలీసు అధికారులు ఇల్లంతా గాలించి ఒక్కొక్క కాగితమే తిరగవేసి చూచారు. కానివారికి ఆక్షేపించదగిన కాగితాలుగాని, పుస్తకాలు గాని ఏమీ దొరకలేదు. కిశోర్‌లాల్ కాకాను ఏదో కాగితం మీద సంతకం పెట్టమన్నారు. కాని ఆయన అందుకు ఒప్పుకోలేదు. 'చిక్కాడురా మిడతంభొట్లు' - అని అదేసాకుమీద పోలీసు అధికార్లు వారంటు చూపించారు. కాకాను వెంటనే

ప్రయాణానికి సిద్ధపడమన్నారు. అప్పటికి తెల్లవారగట్ల 3 గంట లైంది. అందరము గుండెనిబ్బరము చేసికొని దైవప్రార్థన చేశాము. ఆయన వెంట తీసికొనిపోయే సామాన్లలో ఒక ఏకుల కట్ట, ఒక రాట్నం మాత్రమే ఉన్నవి. దేహారోగ్యం సరిగాలేని స్థితిలో కూడ కిశోర్‌లాల్‌కాకా ఒక్క శాలువ తప్ప కట్టుకోటానికిగాని, పరచుకోటానికిగాని వేరేబట్టలు తీసి కొని వెళ్ళలేదు. గోమతి పిన్నమ్మ చాల ధైర్యశాలి. అందరి కన్న ముందుగా ఆమె భర్తకు నమస్కరించి వీడ్కోలు చెప్పింది

రాజపుత్రులు యుద్ధానికి వెళ్ళేటప్పుడు వారి వీరాంగ నలు తమ భర్తల శరీరాన్ని ఆయుధాలతో అలంకరించి, నుదుటతిలకందిద్ది, నవ్వుతూ వారిని సాగనంపేవారనీ, ఓడి పోయి వెనక్కు రావద్దనీ, ఇంటిమీది మోహం విడిచి శత్రువులతో పోరాడుతూ యుద్ధ భూమిలోనే ప్రాణాలు అర్పించవలసిందని భర్తలను వేడుకొనేవారనీ ప్రాచీన చరి త్రలు చెబుతున్నవి రాజపుత్ర వీరాంగనల వారసత్వం ఈ కాలపు స్త్రీలకు సంక్రమించలేదని చెప్పటానికి వీలులేదు. ఎందరో అనుచరులుండగా, గోమతి పిన్నమ్మ అందరికన్న ముందుగా కిశోర్‌లాల్ కాకాకునమస్కరించి వీడ్కోలపటం చూచి నాలో కూడ అటువంటి ఉత్సాహమే పుట్టింది ఇది కూడ ఒక విధంగా రణరంగమేకదా! వస్తుస్థితి రెంటికీ సమానమే. నిజానికి ఈనాటి రణరంగం వెనుకటి దానికన్న ఎక్కువ భీకరమైనదనే చెప్పాలి. ఎందుకంటే ఈ అహింసాత్మక పోరాటంలో శత్రువును చంపటమనేదే ఉండదు సరికదా,

చంపటం అనే భావంకూడ మనస్సులో రాకూడదు. చచ్చి తన ప్రాణాలను అర్పించటం ఒక్కటే చేయవలసినపని. కనుక ఈపోరాటంలో పాల్గొనే వీరులకు తమ మనస్సును వశంలో ఉంచుకోటం ఎంతో కష్టమైనపని.

నమస్కారం చేయటానికి నావంతు అందరికన్నా చివరకు వచ్చింది కిశోర్‌లాల్ కాకాగారి ముఖం ఎప్పటి వలె మందహాసంతో వికసించే ఉన్నది. ఆయన వెళ్ళేటప్పుడు ఎవరెవరికి ఏయేపనులు ఒప్పగించవలెనో వారికది స్పష్టంగా తెలియ జెప్పారు. నాకు ఈవిధంగా సలహా చెప్పారు. "నీకు కరాచీ పోవలెననిలేదు. మీనాయనగారు కూడ నీ యిష్ట ప్రకారం నడుచుకోటానికి అనుమతించారు ఈపోరాటంలోకి దిగవద్దని నిన్ను నేను అడ్డుపెట్టను కాని నువ్వు బాగాఆలో చించుకో, తొందరపడవద్దు. మనస్సులో చక్కగా ఆలోచన చెయ్యి. కాని ఒకసారి దీనిలో అడుగుపెట్టిన తరువాత వెనక్కు మాత్రం పోవద్దు. నీదింకాచిన్నవయస్సు. వెనకా ముందూ చూడకుండా ఆవేశంలో ఉరకవద్దు. ఈపోరా టంలో లాఠీ దెబ్బలు తగలవచ్చు లేదా తుపాకిగుండ్లూ తగలవచ్చు. అన్నిటినీ సంతోషంగా సహించవలసి ఉంటుంది. ఈసంగతులు నువ్వు సమగ్రంగా ఆలోచించుకొని ధైర్యంతో పనిచెయ్యి." తెల్లవారుఝాము 4 గంటలకు కిశోర్‌లాల్ కాకా జైలుకు సిద్ధపడి లారీఎక్కి కూర్చున్నారు.

ఈఆగస్టు మాసంలో ఆశ్రమవాసులు పడవలసిన యాత నలు ఇంకా సాంతంకాలేదు. దుష్టగ్రహం పట్టుకున్నప్పుడు

మనుష్యులను పీల్చిపిప్పిచేసేవరకు అది వదలదని మనం సాధా రణంగా చెప్పుకుంటాము. మా ఆశ్రమాన్ని ఏ దుష్టగ్రహం పట్టిందోకాని నాకుమాత్రం ఈ చివరివారం ఆనందమేకలి గింది. ఆగస్టు 30 నుండి మహిళలజట్లు వంతులవారీగా వర్ధాలో 144వ సెక్షన్ భగ్నం చెయ్యాలని మహిళాశ్రమంలోఉన్న స్త్రీలు కార్యక్రమం ఏర్పాటు చేసుకున్నారు. దానిప్రకారం ఈరోజు శాసనధిక్కారం చేసేవంతు ఆశ్రమంస్త్రీలదయింది. కొత్తసంఘటన ఏదీ జరగకుండా ఆగస్టు చివరివారం శాంతంగా గడచిపోదని మాకు బాగా తెలుసు.

నేను సంతోషంతో ప్రయాణానికి కావలసిన సన్నా హం చేశాను. మాజట్టులో ఉన్న 8 మంది మహిళల్లో మేము ముగ్గురం మాత్రం రెండుమూడేండ్ల హెచ్చు తగ్గుగా ఒకే వయస్సు పిల్లలం. జోహరాబహన్ నాకు ముఖ్యమైన స్నేహితు రాలు. మేమిద్దరం కలిసి ఒకేపడక కట్టుకున్నాం. మేము ధరిం చిన దుస్తులుకూడ ఒకే మోస్తరుగా ఉన్నవి. మేము ఉత్సా హంతో యాత్రకు సిద్ధపడ్డాం నేను చిన్నదాన్నయినందున ఫ్రాక్ తొడుక్కున్నా. "మనూ, జోహరాలు ఇంకవిడి పోతార్లే, మనూ చిన్నపిల్లకనుక ఆమెను పోలీసులు పట్టు కోరు"- అని అందరూ మమ్మల్ని ఆటపట్టించారు. ముఖ్యంగా వినోద స్వభావంగల బలవంతసింహాజీ, ప్రొఫెసర్ భణ్సాలీ నన్ను ఎగతాళి చేసేవారు. అందువల్ల నాకు చాల చిరాకు కలిగింది. మేమిద్దరం ఒకఉపాయం ఆలోచించాము. నేను వేసి కొన్న దుస్తులపైన వేరే ఒకచీర అదనంగా కట్టుకున్నా.

దానితో నేను పెద్దదాన్నిగానూ, లావుపాటిదాన్నిగానూ కనిపించటం జరిగింది

మా జట్టులో నలుగురు మహిళలు ఇరవయ్యేయిదేళ్ళ లోపువాండ్లు, మిగిలినవారు ప్రౌఢలు. మేమందరం కలిసి ప్రార్థన చేశాం ఆశ్రమవ్యవస్థాపకుడు చిమన్‌లాల్ కాకా- 'ధాకే నధాకే ఛతాయే'- అన్నపాట పాడమన్నారు. ఆయ నలోకూడ ఉత్సాహం పొంగివచ్చింది.

ఆశ్రమవాసులందరిలోకీ నేనే చిన్నదాన్నవటంచేత వరసపెట్టి అందరికీ నమస్కరించే అదృష్టం నాకుమాత్రమే అబ్బింది. నాకన్న రెండుమూడేండ్లు మాత్రమే పెద్దవాళ్ళ యిన ఇద్దరు మగపిల్లలు నన్ను పరిహాసం చేస్తూ- "ఓకీ మనూపిల్లా! మేంకూడా నీకన్న పెద్దవాళ్ళమే మాకాళ్ళకు మొక్కవేమిా ?"- అన్నారు. నేను మనస్సులో అనుకున్నా- "నాకన్న చిన్నవాళ్ళుంటే నేనుకూడా వాళ్ళని నాకాళ్ళకు మొక్కమని బలవంతపెట్టి వీపుచరిచి ఉండేదాన్ని" కాని దురదృష్టవశాత్తూ అలాంటి వాళ్ళెవరూ అక్కడలేక పోయారు

నేనెవరికాళ్ళకు నమస్కరించానో వాళ్ళందరూ గట్టిగా వీపుచరిచి నన్ను ఎగతాళిచేశారు. వాళ్ళకది ఆటగా తోచింది. నాకుమాత్రం ప్రాణసంకటమయింది. ఆ మగపిల్ల లిద్దరికీ నమస్కారం చేసేటప్పుడు నాకు చాలాకోపం వచ్చింది. కాని జైలుయాత్రకు వెళ్ళే శుభసమయాన అపశకునం ఎందు కని నేనువాళ్ళకాళ్ళకుకూడా దణ్ణాలుపెట్టాను. వాళ్ళందరిఆశీర్వా

చనాలూ ఫలించినవని నాకు తరువాత స్పష్టమైంది చివరకు బలవంతసింహ్‌గారు, భణ్‌సాలీగారు నాతో- "పోరాటంలో పాల్గొని జైలుకు పోవాలనే ఉత్సాహం నీలో నిండిఉన్నది. కాని బాపూజీని తీసుకురాకుండా నువ్వు ఒక్కతెవే వచ్చావంటే జాగ్రత్త, నీపని పట్టిస్తాం"- అన్నారు. యథార్థానికి పెంద్ల వాక్కే ఫలించింది., బాపూజీ లేకుండ నేను జైలులోంచి బయట అడుగుపెట్టలేదు. మమ్మల్ని వీడ్కొలిపే సమయంలో ఆశ్రమంలోని పెద్దలు శుద్ధాంతఃకరణతో పలికిన ఆశీర్వచనమే ఈ సత్ఫలితానికి కారణభూతమైంది.

మహిళలం అందరం సరిగా 4 గంటలకు వర్ధాలోని తిలక్‌చౌక్ వద్దకు చేరుకున్నాము. ఇష్టం ఉన్నవాండ్లు ఉపన్యాసాలు చెప్పారు. చిన్నపిల్లలం కలిసి దేశభక్తి గీతాలు పాడటం, జయజయధ్వానాలు చేయటం మొదలు పెట్టాం. అరగంటసేపట్లో మాచుట్టూ జనం గుంపు కూడారు ఇంతలోనే రాక్షసివలె పోలీసు లారీ రానేవచ్చింది. అందులో కూర్చున్నవాండ్లను చూచి మాకు ఆవేశం ఎక్కువైంది. దేశభక్తి గీతాల స్థాయి హెచ్చింది. పోలీసులను రెచ్చగొట్టటానికి మరింత పెద్దగా- "ప్రభుత్వపు ఉద్యోగాలు వదలి వెయ్యండి". అని కేకలువేయటం మొదలుపెట్టాము. పోలీసులకు మామీద కోపం వచ్చింది అవసరం లేకపోయినా పెట్రోలు ఖర్చుచేసి లారీ ఇంజన్ను నడవనిస్తూ పెద్ద శబ్దం చేశారు. అది విని జనులు భయపడి గుంపు కూడరని వాళ్ళు అనుకొని ఉంటారు. ఇంతలో బాండు మేళంతో ఒక పెళ్ళి

ఊరేగింపు వచ్చింది. బాండు మేళగాళ్ళు పాపం చెడ్డ ఘడియల్లో బయలుదేరినట్టున్నారు. ఎందుకంటే, ఈ శాసనోల్లంఘనం చేసే స్త్రీల ఊరేగింపు ముందర బాండు వాయిస్తూ నడుస్తుండ వలసిందని పోలీసు అధికార్లు వాళ్ళను ఆజ్ఞాపించారు. బాండుమేళం శబ్దంలో స్త్రీల దేశభక్తి గీతాలు, నినాదాలు అణిగి పోతాయని వారి భావన. మా గొంతు లెండిపోయి స్వరం సన్నగిల్లిపోయినప్పటికీ వంతులవారీగా ఒకొ్కక్కళ్ళే నినాదాలుచేస్తూ, గీతాలు పాడుతూ ఏదో విధంగా పోలీసులను ఏడిపిస్తూండటం మాకు తప్పనిసరైంది.

బాండు మేళం ఏర్పాటు చేసుకున్న పెళ్ళివారు చివరకు వాళ్ళను వదిలి తమదోవన తాము వెళ్ళిపోవలసివచ్చింది. మేళం మాకోసమే ఉండిపోయింది

మా జట్టులో ఆశ్రమ వ్యవస్థాపకుని భార్యయైన శకరీబాయి ఉన్నది. ఆమెను నేను 'పిన్ని' అని పిలిచేదాన్ని. ఆమె వయస్సు మళ్ళినదైనప్పటికీ హాస్యప్రియ. హాస్యాలు, నవ్వులాటలు ఆమెకు చాలా ఇష్టం ఈ దంపతులు ఆశ్రమంలో ఉండి ఏండ్లతరబడి బాపూజీకి సేవజేశారు. ఆర్భాటంలేకుండ మౌనంగా తమ పని తాము చేసుకొని పోయేవారు. ఈరోజు వరకు వారు అదే శ్రద్ధతోనూ, నిష్ఠతోనూ ఆశ్రమాన్ని నడుపుతున్నారు. ఎన్నోసార్లు బాపూజీ వీరి విషయం నాతో చెబుతుండేవారు. "శకరీబాయి త్యాగంలో బాకు తీసిపోదని నా నమ్మకం. ఈ భార్యా భర్త లిద్దరూ నా ఆజ్ఞ కావటంతోటే ఏ విధమైన అడ్డుచెప్పకుండా శిరసా వహిస్తారు". ఇటు

వంటి కుటుంబాలను ఎన్నిటినో, బాపూజీ మనకోసం ఆస్తి రూపంగా ఇచ్చిపోయినారు. ఇది ఈదేశానికి గొప్ప అదృష్టం కాదా ? శకరీ పిన్నికి హిందీ బాగారాదు. సగం మరాఠీ కలిపి ఆమె ఇలా అన్నది- "ఇది మామగారి పెళ్ళి ఊరేగింపు. అందుకని మేళం ఏర్పాటు చేశారు. మామగారింట్లో తినటానికి రొట్టెల్లేవు, కూర్చోటానికి అరుగుల్లేవు". ఆమె మాటలకు మేము కడుపుబ్బ నవ్వాము. పోలీసులకు మేము పరిహాసంగా మామగారనే పేరు పెట్టాము. మమ్మల్ని పోలీసులు పట్టుకోనూలేదు. మా నినాదాలు ఎవరినీ వినసీయనూ లేదు. 2 గంటల వరకు మా ఉత్సాహం ఉన్నది. చివరకు అలసిపోయి సేద దీర్చుకోటానికి మేమొక అరుగుమీద కూలబడ్డాము. మాతోపాటు మేళంకూడ నిలిచిపోయింది. కాని మేము తిరిగీ మా ఉపన్యాసాలు ఆరంభం చేసేసరికి వాళ్ళు కూడా వాయించటం మొదలుపెట్టారు.

చివరకు ప్రొద్దుక్రుంగిన తరువాత 7 గంటలకు పోలీసు అధికారి మమ్మల్ని మోటారులో కూర్చోమన్నాడు ఆయన నోటినుంచి మాట వచ్చిందో లేదో నేనే ముందుగా ఎక్కి కూర్చున్నాను. "అమ్మయ్య! ఈరాత్రికి బాగా నిద్రపోవచ్చు" అందరినోటా ఇదేమాట వెలువడింది. కేకలు వేసివేసి అందరి గొంతులూ బొంగురు పోయినాయి. 15, 20 నిమిషాల్లో మేము జైలు ద్వారం దగ్గరకు వచ్చి చేరాం

ద్వారం దగ్గర, మొదట ఆచరించవలసిన విధి నియమాలన్నీ పూర్తిచేయబడినవి మా పేర్లు, చిరునామాలూ వివరంగా రాసుకున్నారు 8 గంటలకు మమ్మల్నందర్నీ ఒక

కొట్లో పెట్టి తాళం వేశారు. ఆ గదిలో 30, 40 మంది స్త్రీలు అంతకుముందునుంచే ఉన్నారు. మమ్మల్ని చూచి వాళ్ళకు సంతోషం కలిగింది; మేమేదో కొత్త సంగతులు చెబుతామని వాళ్ళు అనుకున్నారు.

ఆకలి రెపరెప లాడుతున్నది, కాని ఆ సమయంలో జైల్లో తిండి దొరకదని వార్త వచ్చింది; ఆకలిమీది కోపాన్ని మేము జైలరుమీద చూపించాము. "ఈ ఉడకపోతలో మేము 30, 40 మంది స్త్రీలం ఇంత చిన్న కొట్లో ఉండలేము, కావలిస్తే మీరు బయటి తలుపు తాళం వేసుకోవచ్చు"అని మేమందరం గదిలోనుంచి బయటికి వచ్చి నిలబడ్డాం. జగడం పెట్టిన తరువాత చివరకు మా గది తలుపులు తెరిచివుంచటం జరిగింది. అయినప్పటికీ, పెద్దపెద్ద ఎలుకలవల్ల, పురుషుల బారక్సులో గోలవల్ల రాత్రి అంతా మాకు కన్ను మూతపడలేదు. ఎలాగో తెల్లవారింది.

## 8
## జైలు అనుభవాలు

మేము వర్ధా జైల్లో ఉన్నది రెండు రోజులే, అయినా మాకు అనుభవాలు చాలా కలిగినవి. మొదటిరోజు రాత్రి మేము ఆకలితోనే నిద్రపోయినాము. మరునాడు ఉదయం జొన్నపిండిజావ ఇచ్చారు. జైలుకు అలవాటు పడ్డవాళ్లు ఆ జావ తాగేశారు, కాని మేము కొత్తవాళ్ళం. నోట్లో పోసుకోగానే థూ-థూ అని ఉమ్మివేశాము. ఆ జావనిండా రాళ్లు. పైగా ఏదో వెగటు పుట్టించే వాసన. మధ్యాహ్నం తిన

దగిన ఆహారం ఏదైనా దొరుకుతుంది గదా, అనే ఆశతో మేం పొద్దుట ఏమీ తినలేదు. ఇదిచూచి మాలో పెద్ద లయిన కొందరు స్త్రీలు మమ్మల్ని కేకలు వేశారు. 'జైలుకు వచ్చి ఇటువంటి వేషాలువేస్తే ఎలాగ?' అన్నారు.

నీళ్ళు లేనందున మేము స్నానం చేయటం కుదర లేదు. ఇదిగో అదిగో అని 11 గంటలకు అన్నం వచ్చింది. వెల్లుల్లిపాయలు వేసిన మినప్పప్పుకట్టు, సన్నటి రాళ్ళతో నిండిన లావుపాటి జొన్నరొట్టెలూ - ఇవీ వచ్చినవి. పప్పులో అయితే అయిదారు పప్పుబద్దలు మాత్రం లోపల తేలుతు న్నాయి. నేనేమీతినకుండానే మధ్యాహ్నం నిద్రపోయాను. "ఇట్లయితే నీరసించి త్వరలోనే జబ్బునపడతావు"అని మాలో పెద్దలు మందలించారు. కడుపులో ఆకలి వేస్తూనేఉన్నది. అయినా సాయంకాలంమీద ఆశ పెట్టుకొని అంతవరకు కాలం ఎలాగో గడిపాను. కాని భోజనంలేకుండా యెంతసేపు ఉండగలం.

సాయంకాలం 6 గంటలు కొట్టగానే ఆహారపదార్థాల బకెట్లు దిగినవి. మళ్ళీ రొట్టెలు, పప్పునీళ్ళూ. అయినా ఆకలి మీద అవే ఎంతో రుచి అనిపించాయి. మధ్యాహ్నం భోజ నంచేయని సంగతి జైలరుకు తెలిసి సాయంకాలం మంచి పదార్థాలు పంపించాడని అన్నానునేను; కాని, నిజానికి అదేమీకాదు. అవే రాళ్ళరొట్టెలు, అదే వెల్లుల్లిపాయ కంపు కొట్టే పప్పునీళ్ళు. అయినా నా ఆకలిమంటకు ఆ రొట్టెలే ఎంతో తియ్యగానూ రుచిగానూ ఉన్నట్లు అనిపించింది. ఆహారం అంత స్వాదిష్టంగా నాకు ఎన్నడూలేదు.

మూడోరోజు గోకులాష్టమి. ఎవరెవరు ఉపవాసం ఉంటారని జైలరు అడగటానికి వచ్చాడు. ఇంచుమించుగా అందరూ ఉపవాసానికి సిద్ధపడ్డారు. వాళ్ళల్లో ముస్లిము స్త్రీలు కూడ ఉన్నారు ఏదైనా మంచిపదార్థం ఫలహారానికి దొరుకు తుందనే ఆశకూడ మా మనస్సులో లేకపోలేదు. వేయించిన వేరుసెనగలు, ఉడకబెట్టిన చిరుగడమంపలు ఫలహారాని కిచ్చారు అవేమాకు ఉత్తమమైన పదార్థాలుగా తోచాయి కడుపు నిండుగ తిన్నాము. ఫలహారమైన తరవాత నాగపూరు సెంట్రల్ జైలుకు ప్రయాణం చేయడానికి సిద్ధపడవలసిందని మాకు ఉత్తరువులిచ్చారు.

వర్ధానుంచి నాగపూర్‌కు బస్సులో ప్రయాణం చేశాము రాత్రి సుమారు 8 గంటలకు నాగపూర్ జైలుకు పోయి చేరాము. అది చాలాపెద్దది, వసతులుకూడ చాల బాగున్నవి. మేము లోపల ప్రవేశించగానే వేడివేడి అన్నం, కూర, పప్పు, రొట్టెలు మాకు వడ్డించారు. మాకు చాలా ఆనందం కలిగింది. కృష్ణాష్టమి వ్రతం రోజంతా ఉపవాసం ఉండదగినది ఐనా మేము పప్పు, అన్నం తిన టానికి గాను వ్రతభంగం కూడ చేశాం నాలుగురోజుల్నించి ఆకలితో ఉన్నందున సుష్టుగా భోజనం దొరికేటప్పటికి చాల సంతోషం కలిగింది. భోజనం చేసినతర్వాత వ్రతభంగం చేసినందుకు పశ్చాత్తాపంకూడా కలిగింది. మర్నాటిఉదయం 8 గంటలవరకు సుఖంగా నిద్రపోయాం. నాగపూర్ జైల్లో మా కేమాత్రం కష్టం కలగలేదు. మేట్రన్ చాలమంచిమనిషి. జైలుఅధికార్లుకూడా మంచివాళ్ళే

మాకు 'బి' క్లాస్ ఇచ్చారు. నెలకు నాలుగు ఉత్తరాలు రాసే అవకాశం లభించింది. జైలుపని చేయవలసిన అవసరం కూడా లేదు. మేము మా ఇష్టం వచ్చినట్టు కార్యక్రమాలు ఏర్పాటు చేసుకున్నాం. నూలు వడికేపని చాలా ఉత్సాహంగా జరిగింది. మాకు వచ్చే ఉత్తరాలు గాని, కొత్త సమాచారాలు గాని రోజూ సాయంకాలం 4 గంటలకు మేట్రన్ వచ్చినప్పుడు లభించేవి. జైలు ఆవరణలో ఒక అందమైన రావిచెట్టున్నది. మేట్రన్ దానికింద కూర్చునేది. తలుపులు తెరుచుకోటంతోనే మేమందరం పరిగెత్తుకొని వెళ్ళి మా ఉత్తరాలు అడిగి తీసికొనేవాళ్ళం. మాలో ఎవరికి ఉత్తరం వచ్చినా సరే అందరం ఆత్రంగా వినేవాళ్ళం మేమందరం ఇంచుమించుగా 150 మంది స్త్రీలమున్నాము.

జైలులో మాకెన్నో అనుభవాలు కలిగినవి, కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి బాపూజీ, భణసాలీ గార్లు ఉపవాసం చేస్తున్న రోజులలో మా స్థితి విషమించింది. బయటి సమాచారాలు ఏవీ మాకు తెలియటంలేదు ఒకే ఒక పత్రిక వచ్చేది, కాని దానిలో ముఖ్యమైన వార్తలేమీ ఉండేవి కావు. సేవాగ్రామం నుంచి మాకు వచ్చే ఉత్తరాలలో వార్తలు ఏవైనా ఉంటే జైలు అధికార్లు వాటిమీద తారుపూసేవాళ్ళు. కొన్నికొన్ని ఉత్తరాలలో చిరునామా తప్ప వేరే వ్రాతలేమీ కనిపించకుండ తారుపూత పూయబడి ఉండేది!

1943 మార్చి 19వ తారీఖు సాయంకాలం అకస్మాత్తుగా జైలరు మా వద్దకు వచ్చాడు. మేము మా మేట్రన్‌కు నూలు

వడకటం నేర్పించాం. అప్పుడు ఆమె చర్ఖామీద నూలు వడుకుతూ కూర్చున్నది. పై అధికారి ఈ విధంగా ఆకస్మికంగా రావటంచూచి కారణం తెలియక పాపం, ఆమె గాబరాపడి పోయింది.

ఆ రోజులలో నాకు కండ్లజబ్బు ఎక్కువైంది, జ్వరం కూడ వస్తుండేది. జైలరు నేరుగా నా దగ్గరకు వచ్చాడు. ఆయన మొదట మనూగాంధీ ఎవరని విచారణ చేశాడు. ఎందుకంటే ఈ పేరుకలవారం ఇద్దరం ఉన్నాము. మా నవిన గారి అసలుపేరు మనోజ్ఞ. ఐనప్పటికీ ఆమెను అందరూ 'మనూ' అనే పిలుస్తుండేవారు ఆమె కొడుక్కు జబ్బుచేసి నందున బహుశః ఆమెను పెరోల్ మీద విడిచిపెట్టటానికి అధికారి వచ్చి ఉండవచ్చునని మేమనుకున్నాం కాని జైలర్ ఇద్దరు మనూలుండటం చూచి కావలసిన మనూ ఎవరో బొంబాయి ప్రభుత్వాన్ని తిరిగి విచారించాడు అదేరాత్రి బొంబాయి నుండి నాగ్‌పూర్ జైలు సూపరింటెండెంట్‌కు 'కావలసిన మనూ 14 ఏళ్ళబాలిక' అని టెలిగ్రాంద్వారా బదులు వచ్చింది. ఆ రాత్రే జైలర్ రెండోసారి నా దగ్గరకు వచ్చి నన్ను ప్రయాణానికి సిద్ధం కమ్మని చెప్పాడు. నాకు వచ్చిన జబ్బువల్ల నన్ను విడిచిపెడుతున్నారనుకొని ఎందరో స్త్రీలు బయటనున్న తమ బంధువులకు అందించవలసినదిగా ఎన్నో సందేశాలు నాతో చెప్పారు. కొందరు తాము వడికిన నూలు నేయించవలసిందని నాకిచ్చారు మరికొందరు తమ పిల్లలకు ఇవ్వవలసిందని బహుమతులిచ్చారు. నేను ప్రయాణానికి రెండు పడకచుట్టలు. ఒకపెట్టె తయారుచేసుకున్నా

ఇంతలో మేట్రన్ వచ్చి-"ఇవ్వాళ కాదు రేపు వెళ్ళేది, నువ్వు ఎవరికీ బహుమానాలు తీసికొని వెళ్ళనవసరం లేదు. నిన్ను విడిచిపెట్టటం లేదు. ఈ జైల్లోంచి ఇంకో జైలుకు మారుస్తు న్నారు" అని చెప్పింది మార్పు అనేమాట విని నేను ఉలిక్కి పడ్డాను. నాతో కూడ ఉన్న పెద్దవాళ్ళు "పాపం, దీన్ని ఒక్క తెనే ఎందుకుమారుస్తున్నారు?" అని ఆందోళన పడ్డారు.

మాతో కూడ ఉన్న రైహానా త్యాబ్జీ- "ఒంటరి బాలికను మరొక జైలుకు మార్చటం మా కిష్టం లేదు. మేము పోట్లాడుతాం. అధికారితో చెప్పండి"- అని కోపంతో తన అసమ్మతి తెలుపుతూ జైలు సూపరింటెండెంటును పిలి పించింది. ఆయన రాగానే రైహానా కోపంతో- "మనూను ఎక్కడికి మారుస్తున్నారో చెప్పండి, ఈమె గాంధీగారి దగ్గర బంధువు, అందువల్ల మాకుకూడ కావలసినపిల్ల. ఈమెను మేము ఒంటరిగా పోనివ్వము"- అని గట్టిగా చెప్పింది. రైహానా తన ఆవేశాన్నంతా ఒకేగుక్కలో వెళ్ళబుచ్చింది. సూపరింటెండెంటు కూడ మహమ్మదీయుడే. ఆయన శాంతంగా విని చివరకు ఇలా అన్నాడు! "ఇంతేనా ఇంకేమైనా చెప్ప వలసిందున్నదా? ఈ అమ్మాయి అపారమైన పుణ్యం చేసు కున్నది. ఇక్కడున్న మీ 200 స్త్రీలలో ఈమె ఒక్కతే అదృష్టవంతురాలు. నా జైలులోంచి ఒకచిన్న బాలికను లోకానికంతంటికీ మహాపురుషుడైన గాంధీగారికి పరిచర్యచేయ టానికి పంపించటం నాకూ, ఈ జైలుకూ మహాభాగ్యం అబ్బి నట్టు భావిస్తున్నాను ఇది సామాన్యవిషయం కాదు. కస్తూర్ బాకు గుండెజబ్బు వచ్చినందున ఈ మనూను తమవద్దకు

పంపించమని అడిగారు. మీ అందరికంటె కూడ ఈ బాలిక కారాగారవాసం సఫలమైందని చెప్పవచ్చు. ఈమె రేపు ఆగా ఖాన్ మహాలుకు ప్రయాణమై వెడుతుంది. చెప్పండి, మీ అభిప్రాయం, ఈమెను పంపించవలెనా, వద్దా?''- అని ప్రశ్నించారు.

ఎవరూ నోరు తెరిచి మాట్లాడలేక పోయినారు. సూప రింటెండెంటు మాట్లాడేటప్పుడు చీమ చిటుక్కుమన్నా విని పించే టంతటి నిశ్శబ్దంగా ఉన్నది. నాకైతే ఆనందంతో పిచ్చెక్కినట్లయింది "నీవు నా బిడ్డవు మహాత్మాజీకి, కస్తూర్ బా మాతకు నా నమస్కారాలు చెప్పి వారి ఆరోగ్యం విచారించినట్లు నా తరఫున మనవిచెయ్యి మహాత్ముడు పైగంబరు మహమ్మదువంటి అవతార పురుషుడని నా విశ్వాసం" అని సూపరింటెండెంటు చెప్పుతుంటే ఆయన స్వరం కంపించి పోయింది.

సూపరింటెండెంటు మహమ్మదీయుడు, పైగా గొప్ప అధికారి, మేము సామాన్య ఖైదీలము, మాతో పై విధంగా చెప్పవలసిన అవసరం ఆయనకు లేదు, అయినప్పటికీ ఆయన చాలా వినయశీలుడైన ప్రభుత్వోద్యోగి.

౮

## నాగపూరునుండి పూనా

1943 మార్చి 19వ తారీఖు సాయంకాలం నాకు ఆగా ఖాన్ భవనానికి వెళ్ళబోయే సమాచారం అందింది. నాతో

పాటు రాజకీయ ఖైదీలుగా ఉన్నమహిళలు, నేరస్థులనిపించు కొనే ఇతర స్త్రీ ఖైదీలు అందరూ కలిసి వీడ్కోలిచ్చే సంద ర్భంలో 20 వ తారీఖున ఒక వినోద కార్యక్రమం ఏర్పాటు చేశారు. కార్యక్రమం ఆనందాన్ని కల్పించినప్పటికీ మేము స్నేహితురాండ్రం విడిపోతున్నందుకు కన్నీరు ధారకట్టింది.

మధ్యాహ్నం రెండుగంటలప్పుడు, ఇంచుమించుగా ఏడు నెలలు నాలుగు గోడలమధ్య బంధింపబడివున్న తరువాత నాకోసం జైలు పెద్దద్వారం తలుపులు తెరుచుకున్నవి ఒక చిన్న సంచీ, ఒక పడకచుట్ట మాత్రమే నా దగ్గర వున్న సామాను సోదరీమణులందరూ ద్వారందాకా నన్ను సాగ నంపటానికి వచ్చారు మేట్రన్, జైలరు చూపించిన దయ వల్లనే ఇది సాధ్యమైంది. లేకపోతే సామాన్య ఖైదీలను బయటికి అంతవరకు రానిచ్చేవారా? మా బారెక్సు వదిలి కొంతదూరం నడవగానే పురుషులున్న బారెక్సు ఉన్నది. కాకా సాహెబ్, కృష్ణదాస్ గాంధీ, ఇంకా మా ఆశ్రమానికి చెందిన ఇతర కుటుంబీకులు కొందరు అక్కడే నిర్బంధంలో ఉన్నారు. ఐనా నాకు వాళ్ళను కలుసుకునే అవకాశం ఇవ్వ టానికి వీలులేదు కదా? రైహానా సోదరి తరవాత అందజేసిన సమాచారాన్నిబట్టి వారందరికీ నా జైలు మార్పువల్ల సంతోషం కలిగిందని తెలిసింది.

నన్ను జైలు కార్యాలయం లోపలికి తీసికొని వెళ్ళారు. అక్కడ నా వెంటరానున్న ఇద్దరు పోలీసుయువకులు సిద్ధంగా నిల్చొని ఉన్నారు. నాకు సంబంధించిన కాగితాలు జైలరు వాళ్ళకు ఒప్పగిస్తున్నాడు. ఇంతలో సూపరింటెండెంటుగారు

వచ్చారు నన్ను చూచి చిరునవ్వునవ్వి- "జాగ్రత్తగా వెళ్లు, దోవలో నీకేమైనా కావలసివస్తే వెంటనున్న సిపాయీ లతో చెప్పు"- అన్నారు. ఆయన దృష్టి ఆ ఇద్దరు జవాన్ల మీద పడ్డది. వెంటనే వాళ్ళ నిద్దరిని బయటికి పంపించి నా ఎదటనే జైలరును ఇలా చీవాట్లు పెట్టారు. "ఈ అమ్మాయి వెంట పంపటానికి ఇంత పిన్నవయస్సు జవాన్లా దొరికారు నీకు? (స్త్రీ) ఖైదీని గురించి ఎంత బాధ్యత వహించవలసి ఉంటుందో జైలరుగా ఉండికూడ నువ్వు గ్రహించినట్టు లేదే! దశరథుని, గోవిందుని సిద్ధంచేసి పంపించు, ఈ యువకులు వద్దు" (దశరథుడు, గోవిందు 40 ఏండ్లకు పైబడిన వయస్సు మళ్ళిన వాళ్ళు, ఆ యువకజవాన్లు కట్టుకున్న పడకచుట్టలే వీళ్ళకు ఇప్పించారు ఎందుకంటే, రైలుబండి 5 గంటలకు బయలుదేరుతుంది, ఇక్కడే గం॥ 3-45 అయిపోయింది. ఈ సిపాయీలను సామాను తెచ్చుకోమని ఇంటికి పంపితే ఆలస్యమైపోతుంది పాపం, దశరథుడు అన్నాడు: "అయ్యా! నేను ఇంట్లో చెప్పివస్తా నిప్పుడే, నా కోసం ఆదుర్దాపడు తుంటారు" సూపరింటెండెంటుగారు తన మోటారిచ్చి వాళ్ళి ద్దరిని ఇంటికిపోయి వెంటనే తిరిగి రమ్మని పంపించారు. ఆయన చాలా దయగల అధికారి, అట్లా కాకపోతే- "నువ్వు నౌకరీ చేస్తే చెయ్యి, ఇంటికి మాత్రం వెళ్ళటానికి వీలులేదు" అని గట్టిగా చెప్పిఉండేవాడే. ఆయన ఎంత దయాశీలుడో నేను చూస్తూనేవున్నా, సిపాయీలిద్దరు పదినిమిషాల్లో తిరిగి వచ్చారు. నన్ను తీసికొని పోవటానికి స్టేషన్ వాగన్ వచ్చింది. సామాను లోపల పెట్టించేశారు, మేట్రన్‌కు సూపరిం

టెండెంటుకు నేను నమస్కారం పెట్టాను. మేట్రన్ ఐతే ఏడ్చేసింది. సూపరింటెండెంటు నా వీపుతట్టి గద్గద స్వరంతో అన్నారు.

"అమ్మాయీ! నా ఉద్యోగానికి పద్దెనిమిది ఏండ్లు నిండవస్తున్నవి. ఎందరో ఖైదీలు వచ్చారు, వెళ్ళారు, చాలా మందిని ఉరితీయటం కూడ చూడవలసి వచ్చింది. ఇంకా అనేక జైళ్ళలో ఉద్యోగం చేశాను, కాని నా జీవితంలో ఇది నాకూ, నా వారసులకూ చెప్పుకోతగ్గ గొప్ప సంఘటన. నాజైలులో ఉన్న ఒక బాలికను గాంధీమహాత్ముని వద్దకు పంపే సదవకాశం నాకు కలిగింది. ఇది సామాన్యమైన సంగతిగా నేను భావించటంలేదు. ఈ మహాపురుషుడే మనకు దాస్య విముక్తి కలిగించబోతున్నాడని నా నమ్మకం. ఆయన సాగిస్తున్న ఈ పోరాటం 'తుదిపోరాటం'గా పరిణమించాలని నేను ఆశిస్తున్నాను. నేనెందరు ఖైదీలనో బాధ పెట్టాను కాని కస్తూర్బా వంటి దేవికి సేవచేయటానికి నిన్ను పంపించటంతో నా పాపాలన్నీ దహించుకుపోతాయి. అమ్మా! నన్ను మరచిపో వద్దు. నిన్ను మళ్ళీతప్పక కలుసుకుంటాను. భగవంతుడు నీకు మేలుచేయుగాక". ఆయన ఈ మాటలు మోటారు తలుపు చేత పట్టుకొని ఐదు నిమిషాలవరకు చెబుతూ పోయినారు. ఆయన అన్నమాటలు ఇప్పటికీ నా చెవుల్లో ప్రతిధ్వనిస్తు న్నవి. ఆయన పలికిన ప్రతిమాట నేను నాగపూరు స్టేషను లోనే నా డైరీలో రాసుకున్నాను. అప్పుడే రాసిపెట్టు కోటానికి కారణం ఏమిటంటే ఈ ముస్లిమ్ అధికారి ఇటువంటి

నాకని నేను పూనా చేరినవెంటనే బాపూజీతో చెప్పవలను
కున్నాను. అందుకని అవి మరుపునకు రాకూడదు

ఈ సూపరింటెండెంటుగారే 1946లో నాకు ఢిల్లీలో
కనిపించారు ఆయనకు ముసలితనం రావటంవల్ల నేను
వెంటనే గుర్తుపట్ట లేక పోయినాను పరిచయంలేని మనిషికి
చేసినట్లు నేను దూరాన్నుంచే ఆయనకు నమస్కారం
చేశాను కాని ఆయన నన్ను గట్టిగానే మందలించారు.
“నువ్వు పెద్దదానవై ఇప్పుడు దూరాన్నుంచే దణ్ణం పెట్టి
నప్పటికీ నిన్ను నేను నాబిడ్డగానే భావిస్తున్నా. నాగపూర్
జైలు ఎప్పుడైనా జ్ఞాపకం వస్తుందా? మన పూర్వస్థితిని మన
మెన్నడూ మరచి పోకూడదు. అలా మరచి పోతే మనకు
విలువ ఏమీ ఉండదు. మనకెంత వైభవం వచ్చినా, ఎంత
గొప్ప పదవిలభించినా వివేకం పోగొట్టుకున్నట్లైతే మనం
పతనం చెందుతాం. కుమార్తె అనే భావంతో నేను నీకీ
సంగతి బోధ పరుస్తున్నా నువ్విప్పుడు చాల గొప్పదానవై
నావు. బాపూజీవెంట నీఫోటో చూచినప్పుడు నా మనస్సు
ఆనందంతో పొంగిపోతుంది నువ్వింకా చిన్నదానవైనప్ప
టికీ బాపూజీ మూలంగా జనులు నిన్ను గౌరవిస్తుంటారు.
అయినా నువ్వు నీ నమ్రతను వదలివేయకూడదు” అన్నా
రాయన

నాకు ఆయన సంగతంతా తటాలున జ్ఞాపకం వచ్చింది.
చూచినవెంటనే గుర్తుపట్టలేక పోయినందుకు క్షమాపణ
కోరాను. నేను ఆయన్ను నాగపూర్ జైలులో ఇంగ్లీషు

దుస్తులు ధరించి ఉండటం చూశాను. కాని ఢిల్లీలో నన్ను చూడటానికి వచ్చినప్పుడు ఆయన పైజమా, చొక్కా తొడుక్కొని ఉన్నారు అందుచేత వెంటనే గుర్తుపట్టలేక పోయినాను. ఆయనకు దణ్ణంపెట్టి వెంటనే బాపూజీ సముక్షం లోకి తీసికొని పోయినాను. ఆయన్ను చూచి బాపూజీ సంతోషపడ్డారు. "ఈమె నాకు జైలుబిడ్డ. ఈమె వల్లనే మీ దర్శనం లభించింది." అని బాపూజీతో అన్నారాయన. ఆరోజు ప్రార్థనలో ఖురాన్ షరీఫ్ సూక్తులు ఆయనే చదివారు. వెళ్ళేటప్పుడాయన పైన చెప్పిన మందలింపు మాటలు అన్నందుకు క్షమాపణకోరారు "మీకు నన్నుకొట్టే అధికారం కూడ ఉన్నది మీరు నన్ను క్షమాపణ కోరినట్లైతే నాకు పాపం తగులుతుంది తండ్రి ఎక్కడైనా తన బిడ్డను క్షమాపణ కోరతాడా?" అన్నాను అందుకాయన "నువ్వు నన్ను ఏకారణంచేత గుర్తుపట్టలేక పోయినావో అడిగి తెలుసుకోకుండానే నేను నిన్ను గురించి కఠినమైనమాట లన్నాను. అందుకే నేను క్షమించమని అడుగుతున్నది" అని వివరించిచెప్పారు "మీరు నాకు హెచ్చరిక చేశారు నేను ఎల్లప్పుడూ నమ్రతకలిగి ఉండేటట్లు మీరు కూడ భగవంతుణ్ణి ప్రార్థించండి నన్ను ఆశీర్వదించమని మీ బోటి పెద్దలను నేను ప్రార్థిస్తుంటాను" అని నేను సమాధానం చెప్పాను.

నాగపూర్ స్టేషన్ చేరుకునేటప్పటికి బండి అరగంట ఆలస్యంగా వస్తుందని తెలిసింది. నారాకను గురించిన కబురు కొందరుముందుగానే విన్నారు కాబోలు ఒక చిన్న గుంపు

నాచుట్టూ మూగింది. మిమ్మల్ని ఎక్కడికి మారుస్తున్నారని కొందరు నన్ను ప్రశ్నించటం మొదలుపెట్టారు. జైలుకు పోయిన తరవాత జైలు నియమాలను భంగంచేయటం బాపూజీకి ఇష్టం ఉండదని నాకు బాగా తెలుసు. నియమ భంగం చేసినట్టు నేనాయనతో చెప్పినా లేక ఆయన నన్నడిగి తెలుసుకున్నా ఆయన సహించలేరు. అందుచేత నేను వెంట వున్న సిపాయిలను అడిగి తెలుసుకోమనీ, నేను ఖైదీని కనుక ఈ ప్రశ్నకు బదులు చెప్ప కూడదనీ అడిగిన వారందరికీ సమాధానం ఇస్తూ వచ్చాను. నామాటలు విని కొందరు ఎగతాళి చేయటం మొదలు పెట్టారు. "మీరెక్కడికి వెళ్ళేదీ మాతో చెప్పటం వల్ల మీకే లాభం కలుగుతుంది. మేము మా బంధువులకుగాని, పరిచితులకుగాని టెలిగ్రామిస్తే వాళ్ళు స్టేషన్ దగ్గరకు వచ్చి మీకు కావలసిన సహాయాలు చేస్తారు." అని కొందరు యువకులు అన్నారు ఒకరిద్దరు సోదరులు "అరె, ఇంత మూర్ఖురాలినా మహాత్మాగాంధీగారి దగ్గరకు తీసుకొని పోతున్నారు? బదులు చెప్పే అవకాశం ఉన్నా చెప్పటం లేదు. మనమే ఈస్థితిలో ఉండి ఈ ముసలి సిపాయిలే వెంట ఉన్నట్లయితే తప్పకుండా ఒక సభచేసి ఉండేవాళ్ళం" అని తమలో తాము మాట్లాడుకుంటూ నన్నెగతాళి చేశారు. నాకు వారి మాటలు సరిపడక పోయినప్పటికీ నోరుమూసుకొని వింటూకూర్చున్నా బదులు చెప్పటానికేమున్నది? 5-30 గంటలకు బండి వచ్చింది ఈ అర గంట నాకు ఒకరోజులాగా అనిపించింది. బండిలోకి ఎక్కిన తర్వాత ప్రాణం కుదుట బడ్డది,

నన్ను రెండో తరగతి పెట్టెలో కూర్చో బెట్టారు. అక్కడ కూడా స్టేషన్‌లో కలిగిన అనుభవమే ఎదురయింది ఇతర ప్రయాణీకులున్నప్పటికీ నాకు ఒక సీటు రిజర్వు చేసి ఉంచారు కాని ఇతరులకు తెలియకుండ ఉండటానికి గాను నా పేరు మాత్రం రాయలేదు స్టేషన్ మాస్టర్ స్వయంగా నన్ను పెట్టెలో కూర్చోబెట్టి వెళ్ళాడు నాగపూరు స్టేషన్‌లో బండి 20 నిమిషాలు ఆగింది. ఈలోపల స్టేషన్‌లో కూడిన గుంపు పెరిగింది మా పెట్టె దగ్గర సుమారు వందమంది నిల్చొని 'మహాత్మాగాంధీకీ జై' అని నినాదాలు చేయటం మొదలు పెట్టారు నాకది కష్టంగా తోచినా చేసేదిలేక ఊరు కున్నాను.

బండి కదిలింది పెట్టెలో కూర్చున్న పెద్దమనుషుల్లో ఒకాయన పోరుబందరు నివాసి; మా గాంధీ కుటుంబాన్ని బాగా ఎరిగినవాడు ఆయనకూడ సంగతిసందర్భాలు తెలిసికో దలచి నన్నడిగాడు. నేను దశరథుణ్ణిచూపించి 'మీరితన్ని అడిగి తెలిసికోండి' అని బదులుచెప్పాను ఆ పెద్దమనిషి దశరథుణ్ణి మంచిమాటలతో వశపరచుకున్నాడు. దశరథుడు సంగతి అంతా చెప్పివేశాడు. పైగా నా పేరున ఉన్న ఉత్తరువు కాగితంకూడ తీసి చూపించాడు

కొంతసేపటికి కల్యాణ్ స్టేషన్ వచ్చింది. ఆ మార్గంలో నాకిది తొలిసారి ప్రయాణం కావటంవల్ల అక్కడ బండి మారవలసిన సంగతి నాకు తెలియలేదు. వెంటనున్న మా గలి సిపాయీలు ఏమీ తెలియనివాళ్ళు. అందువల్ల మేము అదే రైలులో బొంబాయిలోని బోరీబందర్ స్టేషన్‌కు వెళ్ళి

చేరుకున్నాం. నాకు చాలా చిరాకుకలిగింది. మాతో ప్రయాణం చేస్తున్న ఆ పెద్దమనిషి మధ్యలో ఎక్కడో దిగి పోయినాడు. కస్తూర్‌బాకు తీవ్రమైన గుండెపోటు తగిలిందని వార్తా పత్రికలో చూచాను అందువల్ల నాకు చాల విచారం కలిగింది. దీనికి తోడు రెండురోజులనుంచి నిరాహారంగా ఉన్నాను, రైలులో ఏమీ తినను కూడా తినలేదు. బాపూజీ దగ్గరకు చేరిన తరువాతనే భోజనం చేదామని నిశ్చయించు కున్నాను ఆకలికన్న ఎక్కువ బాధాకరంగా ఉన్నది బాపూను ఎప్పుడు కలుసుకుంటానా అన్న చింత! బోరీబందర్ స్టేషన్‌లో విచారణ చేస్తే పూనా వెళ్ళేబండి సాయంత్రం 4 గంటలవరకు లేదని తెలిసింది ఇంకా మూడుగంటలు గడప వలెనంటే నాకు భయంవేసింది.

అక్కడ పూనాలో స్థానిక పోలీసు సూపరింటెండెంటు, జవాన్లు వగైరాలు నన్ను తీసికొని వెళ్ళడానికి స్టేషనుకు వచ్చి వెదికారు నేను కనిపించక పోయేసరికి టెలిగ్రాములు, టెలి ఫోన్లు చేసి ఆచూకీ తీశారు బోరీబందర్ స్టేషన్‌లో నేను స్త్రీల విశ్రాంతి గదిలో కూర్చోటానికి వీలుకలుగలేదు. ఎందుకంటే సిపాయీలు నన్ను విడిచి ఎలావుంటారు? పోనీ పురుషుల గదిలో కూర్చుందామా అంటే నేను స్త్రీని కావ టంచేత అదికూడ వీలుపడలేదు. కనుక బయట బెంచిమీద కూర్చున్నా పూనానుండి కబురువచ్చినందున స్టేషన్‌మాస్టరు నన్ను వెదుక్కుంటూ వచ్చాడు నా ఊరూ పేరూ అడిగి తెలుసుకొని - "అమ్మాయీ! నీ కోసం చాలా వెదకటం జరుగుతున్నది. నువ్వు ఇక్కడికి ఎలా వచ్చావు?" అని అడి

గాడు. నేను జరిగిందంతా చెప్పాను ఆయన నన్ను ఆఫీసు గదిలో కూర్చుండబెట్టి ఆహారం తీసుకోమని బలవంతపెట్టాడు. నేను వేరేమీ తినకుండా నిమ్మకాయ షర్బత్తు మాత్రం పుచ్చుకున్నా. వార్తా పత్రిక ఇస్తే చదివేశాను. మాటల సందర్భంలో 'మా అక్కగారు బొంబాయిలోను, మేనత్త విలేపార్లేలోను ఉన్నా'రని స్టేషన్ మాస్టరుతో చెప్పాను. అప్పుడాయన నాకు వారిని చూడాలనివుంటే తన మోటారు పంపించి రప్పిస్తానని మరీమరీ అన్నాడు. కాని నేను లోభించి అందుకు ఒప్పుకోలేదు ఒప్పుకున్నట్లయితే బాపూజీకి కలిగే బాధను ఊహించుకొని స్టేషన్ మాస్టరు చూపిన ఆదరణకు కృతజ్ఞత తెలుపుతూ ఆయన ప్రయత్నం మాన్పించాను

సాయంకాలం 3-30 గంటల రైలులో పూనాకు బయలుదేరాము 6-30 గంటలకు పూనా స్టేషన్ చేరుకున్నాము. పోలీసు బంత్రోతులూ, సూపరింటెండెంటు లేకుండ నన్ను ఆగాఖాన్ మహల్‌కు తీసికొని పోయేదెవరు? అక్కడకూడ అరగంటవరకు స్టేషన్ ఆఫీసులో వేచివుండవలసి వచ్చింది. 7 గంటలకు వాళ్ళు వచ్చారు, నేను 'మనూ'ను ఔనా కాదా అని నిర్ధారణ చేసుకోటానికి నన్ను ఎన్నో ప్రశ్నలువేసి వితర్కించారు నాగపూరులో నేను చేసిన దస్కత్తులతో, ఇంగ్లీషు, గుజరాతీ, హిందీ అక్షరాల్లో మళ్ళీ దస్కత్తులు పెట్టించుకొని పోల్చి చూచుకున్నారు నేను చాలా అలసి పోయి ఉన్నందున వెంటనే గమ్యస్థానానికి చేర్పించుటయే వాళ్ళ కోరికకూడా' అందువల్ల ఈ పరీక్షంతా వాళ్ళకూ ఇష్టంలేదు. కాని నియమాలను అనుసరించి ఈ కాండ

అంతా జరపటం తప్పనిసరి అయినందున నాతో మధ్యమధ్య 'క్షమించండి, క్షమించండి' అని అంటుండేవారు

చివరకు ఒక మోటారు లారీలో నేను, వెంటవచ్చిన దశరథ్-గోవిందులు, ఇద్దరు తెల్ల సార్జెంట్లు, పోలీసు సూపరింటెండెంటు, జవాన్లు కూర్చొని ఆగాఖాన్ మహలుకు బయలుదేరాం 15 నిమిషాలలో మేము మహల్ సింహద్వారం చేరుకున్నాము

## ౯

## ఆగాఖాన్ మహల్‌లో

20-3-'43 తారీఖు సాయంకాలం నేను ఆగాఖాన్ మహల్ చేరుకున్నాను మహల్‌చుట్టూ పోలీసులు కాపలా కాస్తున్నారు వెళ్ళటంతోటే సింహద్వారం దగ్గర ఇద్దరు తెల్ల సార్జెంట్లు తుపాకులు పట్టుకొని నిల్చొని కనిపించారు. వాళ్ళు మా మోటారును ఆపి నన్నూ నా సామానూ సోదా చేశారు (జైలులో ఉండబోయే ఖైదీల వయస్సు, ఊరు పేర్లతోపాటు వారి ఒంటిమీద ఉండే మచ్చలు, గుర్తులు మొదలైన వాటినికూడ పుస్తకంలో రాసి ఉంచుతారు. దానితో ఒకవేళ ఖైదీ పరారు అయితే వెదకి పట్టుకోవటం సులభమౌతుంది ) నా కుడి అరకాలికున్న పుట్టుమచ్చ చూపించమని సార్జెంటు అడిగాడు నేను చూపించటానికి అభ్యంతరం చెబుతూ- "మీకింత అపనమ్మకం ఉంటే నాగపూరు జైలు అధికార్లను పిలిపించి తెలుసుకోండి, అంతవరకు

రెండు రోజులైనా నేనిక్కడ ద్వారం దగ్గరే పడివుంటాను. నన్నింతవరకు ఈ విధంగా ఎక్కడా పరీక్ష చేయలేదు. ఈ పోలీసు జవానుకూడ ఇంతగా పరీక్ష చేయలేదు'' అన్నాను. "వీళ్ళు తెల్లవాళ్ళు మనమంతా ఒకటే, మిమ్మల్ని చూడటంతోటే గాంధీ కుటుంబానికి చెందిన వాళ్ళని తెలిసి పోతున్నది అయినా, చట్టం ప్రకారం మీ సంతకాలను మాత్రం పోల్చిచూడుకున్నాం. ఇప్పుడు మీకు ఆలస్యం ఔతున్నది కూడ, కనుక చూపించేసెయ్యండి''- అని చెప్పాను ఆ పోలీసు జవాను ఇంతలో ఆగాఖాన్ మహల్ సూపరిం టెండెంటు కటేలీగారు వచ్చారు ఆయన తెల్ల సార్జెంటుకు తెలియజెప్పారు.

"ఇది ఈమెకు అవమానకరమైన విషయం. చూడండి, స్టేషను దగ్గరే ఈమె సంతకాలు పోల్చిచూచి పరీక్షించటం ఐపోయింది నాగపూరు సెంట్రల్ జైలువారి ఈ రిపోర్టును బట్టి చూచినాగాని ఈమె మనూగాంధీయేనని రుజువౌ తున్నది.''- అన్నారు.

అప్పటికిగాని సార్జెంటు శాంతించలేదు. ఎంతో కష్టంతో పెనగులాడి మొదటిద్వారం దాటివచ్చాం. ఇప్పుడు ఇనుపగొలుసులు వేసిన తలుపులుగల రెండోద్వారం ఎదు రైంది. అక్కడ నా పెట్టె, పడకచుట్ట తెరిచి చూపించ మన్నారు కటేలీగారు పై పైన చూచి సరే నన్నారు. నాకు భత్యానికి గాను ఇచ్చిన పైకమంతా మిగిలిపోయింది. వెంటవచ్చిన జవాన్లు ఆ లెక్క ఒప్పగించారు. ఆ రూపా యలన్నీ నేను వాళ్ళకే ఇచ్చివేశాను. వాళ్ళు ఎంతో

సంతోషపడ్డారు. వాళ్ళకు దూరాన్నుంచి బాపూజీ దర్శనం కూడా లభించింది.

ఈ పని అంతా అయిదారు నిమిషాలులో ముగించుకొని నేను వరండా మెట్లెక్కాను. ఎన్నో గదులు కనిపించినవి. బా, బాపూజీలను వెదుక్కుంటూ నేనా గదులన్నీ దాటి పోయినాను.

ఆ రోజు శ్రీమతి సరోజినీ నాయుడుకు జబ్బుగా ఉన్నందున డాక్టర్లంతా హడావిడిగా ఉన్నారు ఆ గదికి వెనుక నున్న గదిలో ఒక చెక్కబల్లమీద స్వచ్ఛమైన పరుపూ, దాని మీద స్వచ్ఛమైన ఒక జైలుదుప్పటి పరచిఉన్నాయి. దాని మీద చేతిలో ఒక కొయ్యగరిటె, జైలు వాళ్ళిచ్చిన మెటలు గిన్నె పట్టుకొని బాపూజీ కూర్చొని ఉన్నారు. ఉపవాసం వల్ల కలిగిన బలహీనత ఇంకా పూర్తిగా పోలేదని స్పష్టంగా కనిపిస్తున్నది. ఆయనకు ఎదురుగుండా ఒక మంచంమీద బా కూర్చొని ఉన్నది. వెళ్ళటంతోటే నేను బాపూజీకి నమస్కారం పెట్టాను. ఆయన గట్టిగా ఒక దెబ్బవేసి ఎప్పటి వలెనే నా చెవిపిండి "ఎక్కడికి తప్పించుకొని పోయినావు?" అన్నారు. నేను అప్పుడు చీరె కట్టుకొని ఉన్నా, అందుకని ఆయనకు వెనుకటి సంగతి జ్ఞాపకం వచ్చి "ఇప్పుడు నువ్వు 'మనూబాయి'వై పోయినావు. కాని నా కిప్పుడు బాను సతాయించాలనిగాని నిన్ను 'మనూపిల్ల'గా మార్చి వెయ్యాలనిగాని లేదు." అన్నారు.

నేను బాకు నమస్కారం పెట్టటానికి పోకముందే ఆమె లేచి వచ్చి బాపూజీ మంచంమీద కూర్చున్నది.

మాటలు సాగుతున్నప్పుడే నేను ఆమె కాళ్ళకు మొక్కాను. బామ్మ చాలా బలహీనంగాను కాంతి హీనంగాను కనిపించింది. నన్ను చూచి- "ఏమమ్మా! ఎందుకిలా ఎండిపోయినావు? మొన్న జయ సుఖలాల్ వచ్చి చెపితేనే నువ్వు నాగపూరులో ఉన్నట్టు తెలిసింది. నిన్ను కరాచీ వెళ్ళి పొమ్మని చెప్ప లేదా నేను? నువ్వెందుకు వింటావు? సరే ఏనదేమో అయింది. ఇక పద, ఆకలివేస్తుండవచ్చు ముందు స్నానంచెయ్యి, తరువాత మాట్లాడుదాం. శ్రీమతి సరోజినీనాయుడు ఇంతకు ముందే నువ్వువచ్చావా లేదా అని అడిగింది. అందరూ పెందలాడే భోజనం చేశారు. ఐనా ఆమె నీకోసం అన్ని పదార్థాలూ తీయించి ఉంచింది."

అక్కడి భోజనశాలమీద పెత్తనం శ్రీమతి నాయుడు గారిది. ఆమెకు కొత్తరకాల వంటలు వండించటం, అందరికీ పెట్టించటం అంటే ఎంతో సరదా. అంతరోగంతో ఉండి కూడ ఆమె తనమంచం భోజనశాలలోనే వేయించుకున్నది. స్నానం చేసినతరువాత బా నన్ను భోజనశాలలోకి పిల్చుకొని పోయి 'ఇదిగో మీ అమ్మ ఈమెకు మొదట దణ్ణంపెట్టి తరువాత నువ్వు భోజనంచెయ్యి' అన్నది.

ఈ విధంగా శ్రీమతి నాయుడుగారితో పరిచయంచేసి బా ఆమెకు నాకు శాశ్వతమైన బాంధవ్యం కల్పించింది. నేను నమస్కరించినప్పుడు సరోజినీదేవి తన సహజ స్వభావానుసారంగా నన్ను ముద్దుపెట్టుకున్నది. నేను కొంచెం జంకి అలాగే కదలక మెదలక నిల్చొనిపోయినాను. మనస్సులో కలిగిన హర్షానికి నోటమాట రాలేదు. బా బాపూజీలకూ, నాకూ

ఉన్నది రక్తసంబంధం, నేను వాళ్ళ ఒళ్ళో పెరిగాను, కనుక వాళ్ళను కలసికొన్నప్పుడు నాకేమీ విచిత్రమైన అనుభవం కలుగలేదు. కాని సరోజినీదేవి సంగతి అలాకాదు ఆమె గొప్ప దేశనాయకురాలనీ, ఆమెను 'ఏదైనా సభలో దూరాన్నుంచి దర్శించే అవకాశం చిక్కటం' కూడ ఎంతో అదృష్టమనీ నేను మనస్సులో భావించుకుంటూ వుండేదాన్ని, అటువంటి ప్రసిద్ధిచెందిన నాయకురాలి సాన్నిధ్యం లభించటం, నేను నమస్కరించగానే ఆమె నన్ను చేరదీసి ముద్దాడటం స్వప్నంగా తోచింది. ఈ భావన నన్ను శూన్య మనస్కురాలినిగా చేసింది, మరుక్షణం- "అమ్మాయీ, ఇకనువ్వు వెళ్ళి భోజనంచెయ్యి, తరువాత నా దగ్గిరకు వచ్చి కూర్చో. నాకుకూడ సేవచేస్తావుకదూ?" అన్నదామె.

నేను భోజనాల బల్లదగ్గర కూర్చున్నాను. ప్యారేలాల్ గారు అప్పుడే భోజనం చేస్తున్నారు. ఆయనతో ఆమె "ఈ అమ్మాయికి పచ్చి టమోటోలు, చట్నీ, పుడ్డింగు మొదలైన పదార్థాలన్నీ పెట్టాడి, చాల బక్కచిక్కి ఉన్నది. ఇక్కడ బలిసేటట్టు చేయాలి" అన్నది.

భోజనంచేసి నేను మళ్ళీ ఆమె దగ్గిరకు వెళ్ళాను. నన్ను ఎంతో గారాబంగా దగ్గిర కూర్చోపెట్టుకుంది. నేను ఆమెకు కాళ్ళు పిసికాను. దాంతో కన్నకూతురువలె నేను ఆమెకు సన్నిహితురాలి నయిపోయినాను మొదటిసారి కలుసుకొన్నప్పుడు నాకు కలిగిన జంకు ఇప్పుడు తీరిపోయింది. కాని ఆమెకు సేవచేసే అదృష్టం ఆ ఒక్కపూట మాత్రమే నాకు కలిగింది ఎందుకంటే, ఆమె జబ్బుతీవ్రంకావటంవల్ల

ఆ రాత్రికే ఆమెను వదలిపెట్టవలసిందని ఆజ్ఞ అయినట్టు జైలు సూపరింటెండెంటు తెలియజేశారు.

కొంతసేపటికి బొమ్మ "మనూ, సుశీలతో కూడ వెళ్ళి మహాదేవ్‌కు పూలు అర్పించిరా" అన్నది. నాకేమీ బోధ పడలేదు. ఇంతలో సుశీలక్క కేకవేసి చెప్పింది.- "పద, మహాదేవభాయీ సమాధిమీద పూలుంచి వద్దాం మన మిద్దరం." బా అన్న మాట నాకు అప్పుడు అర్థమయింది.

అక్కడినుంచి వచ్చిన తరువాత నా నాగపూరు జైలు అనుభవాలు, అక్కడున్న స్త్రీల మూర్ఖత్వం చెప్పి వినిపించాను. అందరూ నవ్వారు. ఇంతలో సాయంకాలపు ప్రార్థనకు వేళ అయినందున అందరం ప్రార్థన చేశాము. ప్రార్థన తరువాత బాపూజీ సరోజినీదేవి దగ్గరకు వెళ్ళారు. నేను బా కాళ్ళకు నూనె మర్దించాను మాలిష్ చేయించుకుంటూ బా అందరి సంగతులూ అడిగి తెలుసుకుంది కాని మాటల ధోరణి ఆపి ఉన్నట్టుండి "బాపూజీ చేతి నూలుచీరె ఒకటి సేవాగ్రామములో నేను నీకు ఒప్పగించాను. చనిపోయేటప్పుడు దాన్ని నామీద కప్పమని చెప్పాను, అదేదీ ? ఇంక నేను ఎక్కువ రోజులు జీవించను. నువ్వు రేపే ఉత్తరం రాసి దాన్ని తెప్పించు." అన్నది.

నాకు కండ్లనీళ్ళ పర్యంతం అయింది. "బామ్మా! ఇదేమిటిలా అంటున్నావు? నీ చీరె అయితే తెప్పించి ఇస్తాగాని, బాపూజీని ప్రభుత్వం ఇంకెంతకాలం జైలులో ఉంచుతుందనుకుంటున్నావు నువ్వు?" అన్నాను నేను

"అదంతా అబద్ధం. బాపూజీ ఏడేండ్లవరకు జైల్లో ఉంటామంటున్నారు. కాని నేను మాత్రం ఇంకా రెండు మూడు నెలలకన్న ఎక్కువ బ్రతికేదిలేదు." అన్నదామె.

బాపూజీకి పక్క వేసి బా కొంచెంసేపు సరోజినీదేవి దగ్గర కూర్చొని వచ్చింది. బా బాపూజీలకు కాళ్ళు పిసికి నేను రాత్రి పదిన్నర గంటలకు నిద్రపోయాను. అవసరమైనప్పుడు పిలవటానికి వీలుగా, నా మంచం బా మంచం ప్రక్కనే వేసుకున్నా. సుమారు 12-30 గంటలప్పుడు బాకు తీవ్రంగా దగ్గు రావటం మొదలుపెట్టింది. నేనామె మంచం మీదికి పోయికూర్చున్నా "అమ్మాయీ, నువ్వు నీ మంచం మీద నాపక్కన పడుకో, నీకు నిద్ర చెడుతుంది" అని అన్నది బా. "బామ్మా! నీకు పరిచర్య చేసే సదవకాశం నాకిచ్చావు, అదే పదివేలు. నన్ను గురించి నీవు చింతపడవద్దు"- అని చెప్పి కొంచెంసేపు వీపు, కాళ్ళూ పిసికాను. దాంతో ఆమెకు కొంచెం నయమనిపించింది. తల్లి తన ఆరేడు నెలల బిడ్డను చిచ్చికొట్టి నిద్రపుచ్చినట్టుగా బా నన్ను జోకొట్టింది. నాకు నిద్రా భంగం కలుగుతోందని ఆమెకు చింత కలిగింది. ఆమె చూపిన ప్రేమ, వాత్సల్యాల వెచ్చదనంలో నేను హాయిగా నిద్రపోయాను. తెల్లవారగట్ల ప్రార్థన సమయానికి కూడ మెలకువ రాలేదు.

బా, బాపూజీల హృదయంలో నామీద ఉన్న అనురాగంవల్ల నన్ను వారు నిద్రలేపలేదు. "పాపం, రాత్రంతా నిద్ర కాచింది. అందుకని దీన్నిప్పుడు లేపకూడదు" అని అనుకున్నారు. కాని భజన చేస్తున్న శబ్దం విని నేను ఉలిక్కి-

పడి లేచాను. వెంటనే నెమ్మదిగా లేచి ప్రార్థనలో కూర్చున్నా. ప్రార్థనానంతరం నన్నెందుకు సమయానికి లేప లేదని నేను బాపూజీని ప్రశ్నించాను. అందుకు బాపూజీ "బాకు రాత్రంతా దగ్గు వస్తూండటం వల్ల నువ్వు జాగరణ చేశావని ఇంకా నీ అలసట తీరలేదని చెప్పి సుశీల నిన్ను లేపవద్దన్నది" అన్నారు. "ఆ రేడు నెలల పసిబిడ్డలాగ బా నన్ను జోకొట్టుతుంటే నేనెంత హాయిగా నిద్రపోయినానో మీరు ఊహించలేరు" అని నేను బదులు చెప్పాను.

ఆగాఖాన్ మహలులో ఆ మొదటరోజు రాత్రి నాకు కలిగిన ఆనందమూ, ఉల్లాసమూ నా జీవితానికే స్వర్ణప్రభాత మైనట్టు అనిపించింది..

## ౧౦
## మాత సరోజిని విడుదల

ఆగాఖాన్ మహల్, పూనా.

ది. 21-3-1943

ఈ వేళ శ్రీమతి సరోజినీనాయుడు జైలునుంచి విడుదల కావలసి ఉన్నారు. మేమామెను "అమ్మాజాన్" (ప్రియమైన అమ్మా!)అని పిలిచేవాళ్ళం. నేనామెకు సన్నిహితురాలిని కావ టానికి ఇదే మొదటి రోజు, కాని కొన్ని గంటల్లోనే ఆఖరి రోజుగా కూడ పరిణమించింది. తనకు పరిచర్య చేసిన సిపా యీలను, ఖైదీలను, కారాగారసహవాసులను, అందరినీ ఆమె తన స్వాభావిక ప్రేమనిర్ఝరిలో మునకలు వేయించింది.

కనుకనే ఆమె యెడబాటు అందరికీ సహించరాని దయింది. ఆరోగ్యం చెడటం వల్ల ఆమెను విడుదలచేశారు. అందువల్ల ఆమె ముఖంమీద ఆనందానికి బదులు దుఃఖచిహ్నాలే గోచరించినవి. తన ఆత్మ వీరత్వంతో సర్వం సహించగలిగినప్పుడు శరీరం మాత్రం ఎందుకు సహించలేకపోవాలి ? అన్న భావన వెలిబుచ్చుతున్న ట్లనిపించిం దామె ముఖవైఖరి. కాని దేశంకోసం పోరాడుతున్న ఈవీరాంగన ఈనాడు శారీరకంగా తన ఓటమి నంగీకరించింది. సహచరులందరు జైళ్ళలో పడుండగా అనారోగ్యం చేత విధిలేక బయటికి పోవటం ఆమెకు ఎంతబాధ కలిగించిందో మనం ఊహించుకోవచ్చు. ఈభారతదేశపు స్త్రీరత్నంతో దగ్గర సంబంధంకలిగే మహా భాగ్యం నాకింతకు పూర్వమే కలిగి వున్నట్లైతే ఎంత జ్ఞానం ఆర్జించి ఉండేదాన్నోకదా, అని విచారం కలిగింది నాకు.

3-30 గంటలకు ఆమెను తీసికొని వెళ్ళటానికి అధికార్లు మోటారు తీసికొని వచ్చారు. సరోజినీదేవి అన్నీ సిద్ధం చేసికొని బాకు నమస్కారం చేసింది. ఆత్మీయులు కొన్ని ఏండ్లవరకు తిరిగిరాని ప్రయాణానికి బయలు దేరేటప్పుడు ఇంటివాళ్ళకు కలిగే దుఃఖమే బాకు అప్పుడు కలిగింది. ఆమె చేతులుజోడించి - "మనం తిరిగి కలుసుకొంటామో లేదో, అందుకని ఇదే చివరి నమస్కారం అనుకుందాం" అన్నది సరోజినీదేవి బాను కౌగలించుకొని "బా ! మీరు శీఘ్రాతిశీఘ్రంగా విడుదల కాబోతున్నారు" అని కేవలం ధైర్యం చెప్పే ఉద్దేశంతోనే అన్నది.

నేను నమస్కారం పెట్టటానికి వెళ్లినప్పుడు -"నాస్థితి చూచి నువ్వు అసూయపడ్డావుకదూ! ఇదంతా నీతప్పువల్లనే జరిగింది" అని పరిహాసంగా దెప్పిపొడిచి శక్తిలేక పోయినా చెయ్యెత్తి ఒక చిన్న చెంపదెబ్బవేసింది బా నాపక్షాన మాట్లాడింది "ఇది చాలా వాసిగలపిల్ల, మీదగ్గిరకు వచ్చిందోలేదో వెంటనే మీకు జైలులోనుంచి విముక్తి కలిగింది. బయటికి వెళ్లి మీరు ఇంకా ఎక్కువ పని చేయవచ్చు, శరీరపోషణకూడ చక్కగా చేసికోగలుగుతారు."

కాని, సరోజినీదేవికి ఈ విధంగా విడుదలైపోవటం ఏ మాత్రం ఇష్టం లేదు. ఆమె నిరుత్సాహంతో ఇలా అన్నది- "అలా కాదమ్మా! బాపూజీ జైల్లోఉన్నారు, సహచరులందరు నిర్బంధంలో ఉన్నారు. అనారోగ్యం వల్ల నన్ను మాత్రం వదలివేస్తున్నారు. దీనిలో నా ప్రతాప మేముంది? పైగా ఇది నాకు అప్రతిష్ఠకు కారణం."

ఈ చివరిమాట చెబుతూ ఆమె, బాపూజీకి, తదితరులకు చేతులు జోడించి కండ్లనీళ్ళు పెట్టుకొని సెలవు తీసికొన్నది. బాపూజీ ఆమె చెవులు పిండుతూ "ఇదిగోచూడు! బయటికి వెళ్ళి నీఆరోగ్యం బాగుచేసుకో, లేకపోతే చూడు నిన్నేమిచేస్తానో" అని బెదరించారు.

సరోజినీదేవి మోటారు బయలు దేరింది. మేమందరం తిరిగి వచ్చాము. ఇల్లంతా బావురుమంటున్నది. సరోజినీదేవి ఉన్నగది శుభ్రం చేయటంతో సమయం గడచిపోయింది.

సరోజినిదేవి భోజనాల ఏర్పాటు చేస్తూ ఉండేది. ఆమెకు తాను తినటం, ఒకరికి పెట్టటమంటే చాలాసరదా.

ఆమెస్థానంలో ఇప్పుడు సుశీలక్క ఆపనిని నిర్వహించటం మొదలు పెట్టింది. నేను ఆమెకు సహాయకురాలిని.

సాధారణంగా మా దినచర్య ఇలా ఉండేది. ఉదయం 5-30 గంటలకు నిద్రలేవటం, పళ్ళుతోముకోటం మొదలైనవి ముగించుకొని 6 గంటలవరకు ప్రార్థన చేయటం. బాపూజీ 2 చంచాల తేనె, 8 ఔన్సుల వేడినీళ్ళు, ఒక నిమ్మకాయరసం కలిపి ప్రార్థనానంతరం పుచ్చుకొనేవారు. తరువాత కొంచెంసేపు-ఇంకా 21 దినాల ఉపవాసశ్రమ నివారణకానందున, విశ్రాంతి తీసికొనేవారు. బామ్మ 6-30 గంటలకు నిద్రలేచేది. నేనామెకు పల్లుదోముపుల్లయిచ్చి తులసి ఆకు కషాయం చేసిచ్చేదాన్ని. తరువాత బాపూజీకి బత్తాయి పండ్లరసం తీసేదాన్ని అది అయిన తరువాత బాపూజీ ఉదయం ఉపయోగించిన గిన్నెలు, ఉమ్మిపాత్ర మొదలైనవన్నీ తోమి శుభ్రం చేసేదాన్ని. వీటిలో జైలు వాళ్ళిచ్చిన ఇనుపగిన్నెనే బాపూ జైలులో భోజనానికి ఉపయోగించేవారు. దాన్ని అద్దంవలె ముఖంకనిపించేటంత తెల్లగా తోమవలసివచ్చేది. బాపూజీ దక్షిణాఫ్రికా జైల్లో ఉన్నప్పుడు జైలువాళ్లిచ్చిన గిన్నె తానుస్వయంగా నిత్యం తోమి శుభ్రం చేసేవారట. దాని మెరుగుచూచి జైలరు, జైలు సూపరింటెండెంటు వారిని మెచ్చుకొనే వారట. అక్కడిజైల్లో తోమటానికి ఉపయోగించే నిమ్మకాయ డిప్ప మొదలైనవి దొరికేవికావు. ఇసుకవేసి చేత్తో బలంగారుద్ది తోమవలసిందే ఈసంగతి బాపూజీ నాతో ఎన్నోసార్లు చెప్పారు ఇక్కడనాకు అంతకష్టం ఉండేదికాదు. ఎన్నడైనా

మెరుగుకా_స్త తగ్గిందంటే బాపూజీ నన్ను క్షమించే వారుకారు. ఆగాఖాన్ మహల్లో పనిచేయటానికి యర్వాడా జైలులోంచి 25 మంది ఖైదీలను రోజూ 8 గంటలకు తీసుకొచ్చి సాయంత్రం 6 గంటలకు తిరిగితీసుకొని వెళ్ళుతుండేవారు. కాని మాపని మేమే స్వయంగా చేసుకోనేనియమం పెట్టుకున్నందువల్ల ఖైదీలకు ఆట్టేపని ఉండేదికాదు. "ముఖం చూచుకొని నేను గడ్డం చేసుకునేంతగా మెరుస్తూ ఉండాలి ఈగిన్నె" అని చెప్పారు బాపూజీ.

ఈపని అంతా చేసేటప్పటికి మామూలుగా 8 గంటలయ్యేది. తరువాత 8-30 గంటలవరకు మేమంతా బాపూజీతో తిరగడానికి పోయేవాళ్లం. మహాదేవ కాకాగారి సమాధి మీద పుష్పాలు చల్లి నిత్యం భగవద్గీతలోని 12వ అధ్యాయం పారాయణ చేసేవాళ్ళం.

9 మొదలు 1 గంట మధ్య—షికారుకుపోయి వచ్చిన తరువాత బాకు తలదువ్వటం, మాలిష్‌చేసి స్నానం చేయించటం, ఆమెకూ, బాపూజీకీ భోజనం తయారు చేయటం, గుడ్డలు ఉతికి ఆరవేయటం, భోజనం చేయటం, భోజనపాత్రలు తోమి శుభ్రం చేయటం-ఇవీ పనులు. బాకు బాపూజీకి, మాకు వేరువేరు రకాల వంటలు వండవలసి వచ్చేది.

బాపూజీకి ఉడకబెట్టినకూర, మేకపాలు, మేకపాలలో నుంచి తీసినవెన్న-ఇవి ఆహారం. బాపూజీ 10-30 గంటలకు, బా 11 గంటలకు భోజనంచేస్తారు. బా కోరినప్పుడు

కొంచెము కూర నేతితో తిరుగబోత వేసేదాన్ని. అప్పు డప్పుడు ఒకటో రెండో రొట్టెలు-పూరీలంత చిన్నవి-బా తినేది. ఆవుపాలుగాని ఒకొక్కప్పుడు అంజీర్, ద్రాక్ష లేక జర్దాలూ (ఆప్రికాట్స్) పాలల్లో ఉడకబెట్టి ఇచ్చే దాన్ని. మిగిలిన మాకందరికి సామాన్యమైన భోజనం. ఈపని అంతా సుశీలక్క, ప్యారేలాల్ గారూ, నేనూ ఒకళ్ళ కొకళ్ళం సాయపడుతూ తయారుచేసేవాళ్ళం మీరా బహన్ తనకు కావలసిన రొట్టెలు, కూర స్వయంగా వండు కునేది.

నేను బాకు నూనెరాచే సమయంలో సుశీలక్క, డాక్టరు గిల్డర్ బాపూజీకి మాలిష్ చేసి రక్తపు పోటు పరీ క్షించే వారు. ఈవిధంగా బాకుచేయవలసిన పని ముఖ్యంగా నామీద, బాపూజీపని సుశీలక్క మీద ఉండేవి.

ఒంటిగంటనుండి 2 గంటలవరకు విశ్రాంతి సమయంలో నేను బా, బాపూజీల కాళ్ళకు నెయ్యి రాసి మర్దించేదాన్ని. ఈ లోగా సుశీలక్క బాపూజీదగ్గర సంస్కృత రామాయణానికి అనువాదం చేసి తన సంస్కృత జ్ఞానాన్ని పునరావృత్తి చేసుకునేది. ఈ ఒకగంటసేపు అందరూ తప్పనిసరిగా నిద్ర పోవలసిందే. నేనుగాని, సుశీలక్కగాని ఎన్నడైనా పడు కోకపోతే బాపూజీ మమ్మల్ని కోప్పడేవారు "ఈ మధ్య జరిగిన పరిశోధనలను బట్టి, బాలకులు, యువకులు, వృద్ధులు రోజూ మధ్యాహ్నంవేళ ఒక్క అరగంటసేపు నిద్రపోయి నట్లయితే వారు రెట్టింపుపని చేయగలుగుతారని తేలింది.

నా అనుభవంకూడ అలాగే ఉంది" అని చెప్పారు బాపూజీ ఒకసారి.

2 మొ॥ 3 గంటలవరకు సుశీలక్క నాకు ఇంగ్లీషు నేర్పేంది. బా బాపూజీలు మళ్ళీ వేడినీళ్ళల్లో తేనెతీసుకొనే వారు వార్తా పత్రికలు చదివి ముఖ్యమైన వార్తలను పరిశీలించేవారు

3 మొ॥ 4 గంటలవరకు నేను బాకు వార్తాపత్రిక చదివి వినిపించేదాన్ని. ఆమెకు ఉత్తరాలు చదివి చెప్పినసమాధానాలు వ్రాసిపెట్టేదాన్ని. 4 మొ॥ 4-30 గంటలవరకు బాపూజీ నాకు భగవద్గీత, గుజరాతీ, రేఖాగణితం బోధించేవారు ఈమూడు విషయాలు రోజుకొకటి చొప్పున వంతుల వారీగా నడిచేవి.

4-30 మొ॥ 5 గంటలవరకు-భాగవతంగాని, రామాయణంగాని, లేక ఆమెకు ఇష్టమున్న వేరేదైన గ్రంథంగాని బాకుచదివి వినిపించేదాన్ని. 5-30 మొ॥ 6-30 గంటలవరకు. బాపూజీతోపాటు మాఅందరి భోజనాలు అయిపోయేవి. బామ్మ సాయంకాలం తులసిఆకు కషాయంలో ఒకవైద్యుడిచ్చిన ఏదో చూర్ణం కలిపి పుచ్చుకునేది. వేరేమీ తినేది కాదు.

6-30 మొ॥లు 7-30 గంటలవరకు ఏవైనా చిన్న చిన్న పనులు, బట్టలు మడత పెట్టటం మొదలైనవి లేదా ఏవైన ముందు వెనుక చేయవలసిన పనులు ఉంటే చేసేదాన్ని. 7-30 గంటలుకావటంతోటే బాపూజీ గంట కొట్టేవారు. వెంటనే మేమందరం, ఎన్ని పనులున్నాసరే, వదలి

పెట్టి తప్పనిసరిగా ఆటలు ఆడటానికి పోవలసిందే. ఆయనతో తిరగటానికి వెళ్ళడంతో మాకు తగినంత దేహపరిశ్రమ లభించటంలేదని బాపూజీ అభిప్రాయం. అందుకని రెండోగంట కొట్టేవరకు మేము బాడ్మింటన్, పింగ్ పాంగ్ మొదలైన ఆటలు ఆడేవాళ్ళం. రెండోగంట సాధారణంగా 8-30 కి కొట్టేవారు. 8-30 మొ॥ 11 గంటలవరకు - బాపూజీతో తిరగటానికి వెళ్ళటం, ప్రార్థన, పడకలు వేయటం, బాపూజీ తలకు నూనెమర్దించటం, బా బాపూజీలకు కాళ్లు వత్తటం, మరుసటిరోజుకు కావలసిన పాఠాలు చదవటం, డాక్టరు గిల్డరుగారివద్ద అరగంట వరకు శరీరవిజ్ఞాన పాఠం చదివి తరువాత నిద్రపోవటం- ఇవీ నేను చేసేపనులు. ఈక్రమాన్నను సరించి, బా బాపూజీల అడుపాజ్ఞల్లో పనిచేస్తూ నేను ఒక నూతన జీవితాన్ని నిర్మించుకొనసాగాను సమయాన్ని గమనిస్తూ ప్రతిపనీ కాలాతిక్రమణం కాకుండ చేస్తుండమనీ, రోజూ చేసిన పనులు డైరీలో వ్రాస్తుండమనీ బాపూజీ ఆజ్ఞాపించారు. అదే విధంగా నేను డైరీ వ్రాసి రోజూ రాత్రి పడుకోబోయేటప్పుడు బాపూజీ దగ్గరుంచి వచ్చేదాన్ని ఆయన దానిలో సవరింపులుచేసి 'బాపూ' అని చేవ్రాలు చేసి మరునాడు నాకిచ్చేవారు అదే నాకిప్పుడు మార్గదర్శకమైన ఆదర్శంగా ఉపకరిస్తున్నది. అక్కడ నాకు శిక్షా, దీక్షా రెండూ లభించినవి. నావంటి అల్పవయస్కురాలికి అక్కడ కలిగిన లాభం ఇతరత్ర దుర్లభం అనటానకి సందేహంలేదు. పూజ్యులైన బా, బాపూజీ, డాక్టరు గిల్డర్, మీరాబహన్, ప్యారేలాల్జీ, సుశీల అక్క వీరందరి సాన్నిధ్యంలోను, పర్యవేక్షణలోనూ

పని చేసే సదవకాశం దొరికినందున ఎన్నో సాంఘిక, ధార్మిక రాజనైతిక, ఆధ్యాత్మిక విషయాలు - కొత్త కొత్తవి నేర్చుకో గలిగాను.

## ౧౧
## జైలులో చదువు

ఆగాఖాన్ మహల్, పూనా,
10-4-1943

వెనుక రాసినట్లు, పూజ్యులగు బాపూజీ, మిగిలిన పెద్దలు నా చదువును గురించి శ్రద్ధతీసుకొనేవారు కరాచీలో మా పాఠశాలలో నిర్ణయింపబడిన నా పాఠ్య గ్రంథాలను అడిగి తీసికొని బాపూజీ ఇవ్వాళనుండి తాము స్వయంగా చదవటం మొదలుపెట్టారు ముఖ్యంగా రేఖాగణితం, చరిత్ర, భూగోళం, గుజరాతీవ్యాకరణాలకు సంబంధించిన పుస్తకాలు చదివేశారు. తాము చదువుకొంటున్న గ్రంథాలు వదలివేసి, నా పాఠ్య పుస్తకాలు నాకు ఎలా బోధించవలెనో ఆకరగా ఆలోచించుకొని ఎక్కడెక్కడ నొక్కి చెప్పవలసి ఉంటుందో అక్కడక్కడ పెన్సిల్‌తో గుర్తులు పెట్టుకున్నారు. మధ్యాహ్నం నన్ను పిలిచి రేఖాగణితంలోను త్రైరాశికంలోను రెండు మూడు ప్రశ్నలు రాయించారు. ఆ ప్రశ్నలకు జవాబులు మర్నాడు నేను రాసి చూపించ వలసిఉన్నది. నా దగ్గిర రేఖాగణితానికి కావలసిన నోటుబుక్కు లేనందువల్ల నేను జైలు సూపరింటెండెంటు గారిని అడిగి తెప్పించుకున్నా. దాని వెల రూపాయిన్నర. ఆ నోటు బుక్కు తీసికొని నేను సరా

సరి బాపూజీ దగ్గిరకు వెళ్ళి చూపించాను. 'దీనిఖరీదెంత ? అన్నదే ఆయన మొదటి ప్రశ్న. నాకు తెలియదన్నాను నేను. "ఇది ఎంతకు కొన్నారో వెళ్ళి అడిగివచ్చి నాతో చెప్పు" అన్నారు బాపూజీ. కటేలీగారు బాపూజీ స్వభావం బాగా ఎరుగుదురు అందుకని నాతో "బాపూజీకి చెప్పవలసిన అవసరమేమున్నది దీనిలో ?" అన్నారు "నేను వారిని అడగకుండానే మీతో తెప్పించుకున్నా. ఇప్పుడుఖరీదెంతో చెప్పకుండా దానిలో పారంరాసి తీసుకుపోతే నన్ను కోప్పడతారు" - అన్నానునేను. ఆమాట మీద కటేలీగారు బిల్లు నా చేతిలో పెట్టారు

రూపాయన్నర బిల్లుచూచి బాపూజీ నాకిలా బోధ చేశారు : "మన డబ్బులుకావు ఇంగ్లీషు ప్రభుత్వం వారి డబ్బులుకదా ఖర్చు ఔతున్నవి,- మనకు యిన్ని సౌకర్యాలు ఏర్పడి ఉన్నప్పుడు ఏవస్తువుపడితే ఆవస్తువు తెప్పించుకోవచ్చు- అని అనుకుంటున్నావు నువ్వు. కాని అలా అనుకోటం చాలా పొరపాటు. ఈ డబ్బు ఇంగ్లీషు ప్రభుత్వం వేరే ఎక్కడినుంచో తీసుకురాలేదు. నిజానికిది మన డబ్బే. ఇలా ఖర్చుపెట్టి మనమే తెలివితక్కువగా ప్రవర్తిస్తున్నాము. ఇది గాక 'మనకు లభించిన సౌకర్యాలను దుర్వినియోగం చేయటం' అనే దురభ్యాసం కూడా మనకు అలవడుతున్నది. నాకు చూపించకుండా నువ్వు ఈ నోటు బుక్కుమీద ఏమీ రాయలేదు, అంతవరకు మంచిపనే అయింది నేనంటే ఆ మాత్రం భయం ఉన్నదన్నమాటనీకు. మంచిది. మంచిగట్టి అట్టలతోవున్న నోటుబుక్కు రేఖా గణితానికి వాడవలెననే

పాఠశాల నియమం ఇప్పుడిక్కడ పాటించవలసిన పని లేదుకదా! మన దగ్గర కాలెండర్ల కాగితాలు బోలెడున్నవి, వెనుకవైపు తెల్లగానే ఉన్నవి. వాటిమీద నువ్వు లెక్కలు చెయ్యి, ఈ నోటుబుక్కు వాపసు చేసెయ్యి".

ఆ నోటుబుక్కు నేను వాపసుచేయమని ఇచ్చినప్పుడు కటేలీగారు - "బాపూజీ అన్యాయం చేస్తున్నారు. దీన్ని నా దగ్గర అట్టేపెట్టుకుంటా, నీకు కావలసివచ్చినప్పుడు అడిగి తీసుకుపో" అన్నారు. రెండు గంటలకు కటేలీగారు వార్తా పత్రిక. ఉత్తరాలు అందజేయటానికి బాపూజీ దగ్గరకు వచ్చారు. ఆయన కటేలీగారిని 'మనూ మీకు నోటుబుక్కు వాపసిచ్చిందా లేదా?' అని అడిగారు

అందు కాయన - 'ఔను ఇచ్చింది. కాని, పాపం ఆమెను వాడుకోనివ్వరాదండీ, జాగ్రత్తగా ఉంచుకొంటే తరువాత ఉపయోగపడుతుంది గదా?' అని బదులుచెప్పారు.

దానికి బాపూజీ చెప్పిన సమాధానం ఇది: "మీరా పిల్లను చెడగొట్ట దలచుకొన్నట్టున్నారు. దానికి భద్రంచేసు కొనే జాగ్రత్తే ఉంటే ఈ కాలెండరు కాగితాలు కాపాడుకో లేదంటారామీరు? నోటు బుక్కు వాపసు చేయవలసిందే. దాని ఖరీదు రూపాయన్నర వాపసు తీసుకొచ్చారో లేదో నాకు తెలియజేయండి. సాయంకాలం నేను జమాదారుని అడిగి తెలుసుకొంటాను."

సాయంకాలం మేము బాపూజీతో తిరగటానికి బయలు దేరాం. తిరిగి నోటుబుక్కు ప్రసంగం ఆరంభమైంది : "దీని

వల్ల నువ్వు ఎంత మంచిపాఠం నేర్చుకొన్నావో బోధ పడిందా? (1) ఈ రూపాయిన్నర ఇచ్చేదెవరు? ఎవరిని పీడించి ఈ ఖర్చుకు కావలసిన ధనం వసూలు చేస్తున్నారు? ఈ డబ్బంతా ఇంగ్లాండునుండి రావటంలేదు. ఈ యోచన ద్వారా మన దేశపు చరిత్ర నీకు బోధపడుతుంది. (2) ఎంత అవసరమో అంతేగాని సౌకర్యం ఉన్నదిగదా అని ఎక్కువ తక్కువ ఉపయోగించుకో కూడదు. ఈ గుణం మానవతా లక్షణాల్లో ఒకటి, దీన్ని ఇప్పుడు నువ్వు నేర్చుకున్నావు. (3) ఊరక మూలపడివున్న వస్తువులుకూడ చక్కగా ఉపయోగ పడతవి. ఈ కాలెండరు కాగితాలు మనం సాధారణంగా బయట పారేస్తాం, కాని అవి ఉపయోగపడే ట్లయితే వాటిని జాగ్రత్తచేసి వుంచుకుంటాము. పారవేయవలసినవైనా వాటిని ఉపయోగించుకొన్న తరువాత పారవేస్తే నష్టంలేదు. ఇది అర్థశాస్త్రానికి సంబంధించిన విషయం. (4) నువ్వు జైలు లోంచి బయటికి వెళ్లినప్పుడు పాఠశాలలో చదవటం వీలు పడితే ఇంత మంచి అట్టలతో అందంగా కనిపిస్తూ లెక్కలు చేసివున్న నోటు బుక్కును ఎవరైనా దొంగిలించుకొని పోవచ్చు. మా రోజుల్లో ఇలాంటి దొంగతనాలు జరుగు తుండేవి కాని ఈ కాలెండరు కాగితాన్ని దొంగిలించే బుద్ధి ఎవరికీ పుట్టదు. ఈ విధంగా నీకు ఎన్నో సంగతులు తెలుసు కొనే లాభం కలిగిందా లేదా చెప్పు?"

ఈ సంభాషణ జరుగుతుండగా జమాదారు వచ్చి ఒకటిన్నర రూపాయి వాపసు తెచ్చిన కబురు వినిపించారు.

అప్పటికి కూడ ఈ నోటు బుక్కు ప్రకరణం పూర్తికాలేదు. బాపూజీ తమాషాకు ఇలా అన్నారు :

"ఇంగ్లీషు స్కూలులో చదువుతూ కాలెండరు కాగితాలమీద లెక్కలు చేసుకోటం నువ్వు సిగ్గుచేటుగా భావిస్తే నేనుకూడ ఒక విద్యార్థినే అనుకో. నీకు రేఖా గణితం చెప్పటానికి ఇన్నేళ్ళకు నేను స్వయంగా నేర్చుకుంటున్నా, కనుక మనమిద్దరం విద్యార్థులమే నాపేరు చెప్పి ముసలివాళ్ళకు ఏ వస్తువులైనాసరే పనికి వస్తవని ఇతరులకు సమాధానం చెప్పవచ్చు."

ఇప్పుడైతే ఆ కాలెండరు కాగితాలను నేను నగలూ నాణాలులాగ ఎంతో భద్రంగా దాచివుంచుకుంటున్నా. వాటిలో ఎన్నో లెక్కలూ, రేఖాచిత్రాలూ పూజ్యులైన బాపూజీచేతితో వేసినవే! బాపూజీ అన్నట్టు, మంచి అట్టతో ఆకర్షవంతంగా వున్న నోటుబుక్కయితే ఎవరికైనా దొంగిలించే బుద్ధి పుట్టేది. ఈ విడి కాగితాలు ఎంతో అమూల్యమైనవి అయినప్పటికీ, ఎవరి చేతుల్లోనూ పడకుండ నా దగ్గర భద్రంగా ఉండడానికి వీలు ఏర్పడ్డది

ఆగాఖాన్ మహల్ పూనా,

**13-4-1943**

నేను నిత్యం రాసే డైరీలో రేఖా గణితానికి సంబంధించిన నోటు బుక్కు సంగతి ఏమీ రాయలేదు బాపూజీ అదికూడ రాయమన్నారు. ఏ రోజు రాసిన డైరీ ఆరోజు రాత్రికి తమవద్ద పెట్టి వెళ్ళమని ఆజ్ఞ.

## డైరీ నమూనా

తే. 13-4-'43 :

ఉదయం 5 గంటలు - బాపూజీ నిద్రలేపారు.

5—5-30 గంటలు - దంతధావనము, ప్రార్థన, మొ॥

5-30—6-30 గంటలు- చదువుకోవలసివున్నా, కళ్ళు కూరుకుపోవటంవల్ల నిద్రపోయాను.

7-8 గంటలు - బాపూజీ కొరకు పండ్ల రసంతీశాను; బామ్మకు మందు కలిపి కషాయం చేశాను, పాత్రలన్నీ తోమి శుభ్రం చేశాను.

8—8-30 గంటలు - ఈ వేళ 13 వ ఏప్రిల్ కావటం వల్ల బాపూజీ జెండా వందనం చేయించారు 'ఝండా ఊంచా రహే హమారా'- అన్నపాట పాడాను; బాపూజీ వెంట తిరగటానికి వెళ్ళాను.

8-30—9 గంటలు - బామ్మ తలకు నూనె మర్దించి తల ముడిచాను.

9—10-30 గంటలు - బామ్మకు మాలిష్ చేసి స్నానం చేయించాను, నా గుడ్డలూ, బామ్మ గుడ్డలూ ఉతికి ఆరవేశాను.

10-30—11 గంటలు - బాపూజీకి కరకరలాడే రొట్టెలు, కూర, పాలు సిద్ధం చేశాను. పెరుగుచిలికి వెన్న తీశాను

11—11-30 గంటలు - ఇంగ్లీషు పాఠం రాశాను.

11-30—12-30 గంటలు - బాపూజీకి భోజనం పెట్టి బాతో కలిసి మేమందరం అన్నాలు తిన్నాం.

12-30—1 గంట - బా, బాపూజీల కాళ్లకు నెయ్యి రుద్దాను. నిన్న రాత్రికూడ బా శరీరమంతటా నొప్పి పుట్టి జ్వరం వచ్చినట్లయింది. ఇప్పటికీ అలాగేవుంది. అందు చేత ఆమెకు ఒళ్ళంతా పిసికాను.

మ ధ్యా హ్నం

1—1-30 గంటలు - వార్తా పత్రికలు చదివి బాకు వినిపించాను. 15 నిమిషాల తరువాత నన్ను నిద్ర లేపమని బాపూజీతో చెప్పి నిద్రపోయాను. అలాగే 15 నిమిషాల తరువాత బాపూజీ నిద్రలేపారు.

1-30—2-30 గంటలు - బా, బాపూజీలకు త్రాగడానికి వేడినీళ్ళతో తేనె కలిపి యిచ్చి, రాట్నంమీద నూలు తీశాను. బాపూజీ వడికిన నూలూ, నేను వడికిన నూలూ ఆసుపోశాను. బాపూజీవి 220 పోగులైనవి. తరువాత ఊడ్చి శుభ్రం చేశాను.

2-30—3-30 గంటలు - రేపు గుజరాతీ వ్యాకరణంలో బాపూజీ వ్రాతపరీక్ష పెడతారట, అందుకని ఇవాళ ఈ గంట చదవడానికిచ్చారు. వ్యాకరణం చదివాను.

3-30— 4 గంటలు - సుశీలక్క దగ్గర ఇంగ్లీషు పాఠం నేర్చుకున్నాను.

4—6 గంటలు - మేకపాలు, గేదెపాలు, ఆవుపాలు వచ్చిన వెంటనే వాటిని కాచి వేరువేరు ఏర్పాట్లు చేశాను.

కూరలు ఏరి సాయంకాలపు భోజనం తయారు చేశాను. అందరూ భోజనాలు చేశారు. ఖైదీల కందరికి వడ్డించాను.

సాయంకాలం

6—6-30 గంటలు - గ్రామఫోన్ మీద భజన పాటల రికార్డులు విన్నాం. బామ్మ పడుకొనివుండే విన్నది.

6-30—7 గంటలు - సాయంకాలపు పాత్రలు కడిగి శుభ్రంచేశాను. బా, బాపూజీలు పండ్లు తోముకోటానికి కావలసినకుంచెలు సిద్ధం చేశాను; బట్టలు మడతబెట్టి బామ్మ చీరెకు అంచు కుట్టటం మొదలుపెట్టాను.

7-30—8 గంటలు - బాడ్మింటన్ ఆడి, పది పది హేను నిమిషాలు బాపూజీ వెంట షికారుకు వెళ్ళాను.

8—8-30 గంటలు - ప్రార్థన. ప్రార్థన అయిన తరువాత పక్కలు వేశాను, బాకు మాలిష్ చేశాను; బాపూజీ తలకు నూనెరుద్ది కాళ్ళు వత్తాను రోజూ రాత్రిపూట నాకు ఒక కథ చెప్తుతుండమని బాపూజీని అడిగాను. నా మాటను టలాయించటానికి బాపూజీ పిట్టకథ ఒకటి చెప్పారు. కొంచెం సేపు నాతో పరిహాసాలాడి బాపూజీ 9 గంటలకు నిద్రపోయినారు. బామ్మ ఆరోగ్యం ఇవ్వాళ కూడా ఏమీ బాగాలేదు. వెన్నముకలో పోటుపుట్టింది. ఒక అరగంట ఒళ్ళు పిసికాను. నొప్పి కొంచెం తగ్గినందున ఆమె నిద్రపోయింది. కాని మధ్య మధ్య దగ్గుతుండేది.

10 గంటలు-పారం తయారుచేయటం మొదలుపెట్టి 12 గంటలకు నిద్రపోయా.

నోటు: ఈరోజు 13వ ఏప్రిల్ కావటంవల్ల మేమంద రం ఒక్కపూట ఉపవాసమున్నాము. అందువలన మావంతు ఆహారపదార్థాలు మిగిలిపోయినవి. వాటికి ఇంకా కొంచెం కలిపి జైలులో ఉన్న ఖైదీలకు పెట్టటానికిగాను పొంగలి, కూర, అరటికాయ చట్నీ, హల్వా తయారుచేశాము. ఖైదీలు సుమారు 20 మంది ఉన్నారు. బాపూజీ స్వయంగా తమచేత్తో అందరి పాత్రల్లో పదార్థాలు వడ్డించారు. అది ప్రసాదంలాగ భావించి తింటూ తింటూ కొందరు ఖైదీలు ఇలా అన్నారు. "మేము ఏడేండ్లనుంచి యర్వాడా జైలులో ఉంటున్నాము. కాని మేము చేసిన నేరాలకు ఈనాడు గౌరవం లభించినట్లు తోస్తున్నది. ఎందుకంటే మహాత్మాజీ తమ చేత్తో ప్రేమపూర్వకంగా వడ్డించిన ప్రసాదం తినే భాగ్యం మాకు కలిగింది."

ఈవిధంగా డైరీ రాస్తుండమని బాపూజీ నన్ను ఆదే శించారు. దీనివల్ల ప్రతినిమిషం జాగ్రత్తగా సద్వినియోగం చేయగలుగుతాను ఈవేళ రాసిన డైరీలో బాపూజీ ఈ క్రింది ముఖ్యసూచన చేర్చి దస్కతు చేశారు.

"వడికినసూలు లెక్క రాయాలి. మనస్సులో కలిగిన ఆలోచనలు నమోదుచేయాలి. ఏమేమి చదివింది టిప్పణి రాయాలి మొదలైనవి, వగైరా అనే మాటలు ఉపయో గించకూడదు. డైరీలో 'వగైరా'కు చోటుండదు.

"ఎవరి దగ్గిర ఏయేపాఠం చదివిందీ తెలపాలి. దాని వల్ల చదివిన విషయం ఎంతవరకు అవగహన చేసుకున్నదీ తెలుస్తుంది. జరిగిన సంగతులన్నీ రాసి వుంచాలి."

ఇటువంటి సూచనలు చేస్తూ బాపూజీ రోజూ నా డైరీలో దస్కతు చేస్తుండేవారు.

## ౧౨
## సేవకు నియమాలు

ఆగాఖాన్ మహల్, పూనా

**3-5-43**

గడచిన నాలుగైదు రోజులుగా నాకు జ్వరం వస్తున్నది. ఈవేళ రాత్రి ఇంకా ఎక్కువైంది. బాపూజీ రాత్రి నాదగ్గరకువచ్చి చూచారు. తల పట్టివత్తారు. 'మీరు వెళ్ళి పడుకోం'డని నేను ఆయన్ని బలవంత పెట్టాను అప్పుడాయన "నువ్వు నాకు రెట్టింపుసేవ చేసి ఈపాపం పోగొట్టుకోవచ్చులే. ఉదయాన్నే ఆముదం తాగు, జబ్బునయమౌతుంది. నువ్వు ఆరోగ్యంగా ఉంటే నీకెవరూ సేవచేయవలసిన అవసరం ఉండదు. అందరికీ నీవే చేయవచ్చు. అప్పుడు నీ పుణ్యం కొండంత పెరుగుతుంది."

ఆముదం తాగటాని కేవో సాకులు చెప్పి తప్పించుకుంటూ ఉండేదాన్ని. అందుకని ఈవేళ నా తల ఒత్తుతూ బాపూజీ ఈమాటలు చెప్పి రేపు ఉదయం తప్పకుండా తాగుతానని ఒప్పించుకున్నారు. తెల్లవారుజామున 5-15 గంటలకు ఆముదపుగిన్నె, నీళ్ళలోటా, నిమ్మకాయ తీసికొని బాపూజీ నామంచం దగ్గిరకు వచ్చారు. సోమవారం మౌన దినం, మాట్లాడరు. నన్ను చేత్తో పట్టుకొని బలంగా ఊపి కదిలించారు. దొంగనిద్ర పోయేవాళ్ళెక్కడైనా లేస్తారా?

ఆముదం తాగక తప్పదని తెలిసికూడ మంచి గాఢనిద్రలో ఉన్నదానివలె నటించాను. కాని నన్ను అంతమాత్రానికి వదిలిపెట్టే ఘటంకాదు బాపూజీ. నాముక్కు మూశారు. వెంటనే నోరు తెరుచుకున్నది. నాకు నవ్వు వచ్చింది. చివరకు నాచేత ఆముదం తాగించే వదిలారు. బాపూజీ చేత్తో ఆముదం తాగటానికి నాకిదే మొదటిసారి మౌనం ఉన్నం దున కాగితం మీద ఇలారాసి చూపించారు - "పిల్లలెప్పుడు ముసలివాళ్ళను ఏడిపించాలనే చూస్తారు. కాని ముసలి వాళ్ళు పిల్లలతో సమానం అంటారుకదా! సమానస్థులు పరస్పరం స్నేహంగా ఉండటం సహజమే, అదీగాక, నేను నీకు తాతనౌతా. కనుక నాముందర నీనాటకం ఎలాసాగు తుంది? అయినా అవ్వల్ని, తాతల్ని సతాయించటానికి ఏవేవో పన్నాగాలు పన్నుతూనే ఉంటారు పిల్లలు. ఔనాకాదా? చెప్పు." ఇది రాసి చూపించి పకపకా నవ్వారు బాపూజీ.

ఆగాఖాన్ మహల్, పూనా
4-5-43

జైలులో పదిహేను రోజుల కొకసారి మా అందరి బరువు తూచి చూస్తుంటారు. ఈవేళ బరువు చూచేరోజు. బాపూజీ బరువు 108 పౌన్లు, బామ్మ బరువు 88 పౌన్లు ఉన్నది. బాపూజీబరువు 109 నుండి 108 పౌన్లకు తగ్గటంవల్ల బాకు చాలా విచారం కలిగింది. "బాపూజీ ఒకపౌను ఎలా తగ్గారు?" అని ఆమె చింతాక్రాంతురాలై నన్నడిగింది. "కొన్ని రోజులుగా బాపూజీ ఉదయంపూట పాలు తాగటంలేదు. అందువల్ల బరువు తగ్గిపోయి ఉండవచ్చు" అని సమాధానం

చెప్పానునేను. బామ్మ ఆలోచించి దీని కొక ఉపాయం పన్నింది.

బాపూజీ రోజూ రెండు ఔన్సుల బెల్లం పుచ్చు కొనేవారు. ఆయన శరీరంలో చక్కెర తత్వం తక్కువగా ఉన్నందున తీపివస్తువు తినవలసిందని డాక్టరు ప్రత్యేకమైన సూచన చేశారు. పండ్లరసం తీసుకుంటున్నప్పటికీ అది సరి పోయేదికాదు బెల్లం నీళ్ళలో కరిగించి చెత్త చెదారం లేకుండ వడబోసి మరగకాస్తే నీళ్ళు ఇంకిపోయి స్వచ్ఛమైన బెల్లం అడుగున మిగిలేది.

ఇప్పుడు బామ్మ బెల్లానికి రెండింతలు పాలుపోసి మరగ కాచమని చెప్పింది. నేను అలాగే చేశాను. మామూలుగా బెల్లం ఏర్పడటంతోపాటు దానికి చాక్‌లెట్‌వంటి రుచి కూడ వచ్చింది. బజార్లో కొనిపెట్టే చాక్లెట్ల వల్ల పిల్లల ఆరోగ్యం ఎంత చెడిపోతుందో అందరికీ తెలిసిన విషయమే. కాని బామ్మ యుక్తిగా తయారు చేయించిన యీ దేశీయ చాక్లెటు ఒక్క బాపూజీకి మాత్రమే కాక ఎందరి పిల్లలకో ఆరోగ్యలాభం కలిగించింది. బాపూజీ ఆరోగ్యాన్ని గురించి బామ్మ ఈవిధంగా శ్రద్ధతీసుకుంటుండేది.

ఆగాఖాన్ మహల్ పూనా.

7-5-43

నా కళ్ళు ఎఱ్ఱబారి ఉండేవి. సులోచనాలవల్ల మేలు లేకపోగా తలనొప్పి పుట్టేది. అవి పెట్టుకోకపోతే దూరపు వస్తువులు బాగా కనిపించేవికావు, కళ్ళవెంట నీరు కారేది.

దీనికి బాపూజీ ఒక క్రొత్తప్రక్రియ ఆరంభించేశారు-మాటి మాటికి కళ్ళలో చల్లని నీళ్ళు చల్లుకోవటం. సమయం చిక్కి నప్పుడల్లా కళ్ళు మూసుకొని కళ్ళమీద మట్టికట్టు వేసు కోవటం. నడిచేటప్పుడుకూడ కళ్ళు మూయించేవారు. నా భుజంమీద ఆయన చెయ్యి ఉండేది కనుక నడిచేటప్పుడు ఎదురుదెబ్బ తగిలి పడతానన్న భయం ఉండేదికాదు. కళ్ళ జబ్బు కారణంగా చదువు నిలిపివేయటం మంచిదా, కాదా అని నన్నే ప్రశ్నించారు చదువు మానటం ఆయనకు ఎంత మాత్రం ఇష్టంలేదు. కనుక చదవటానికి కూర్చున్నప్పుడు సంస్కృత శ్లోకం, శబ్ద రూపాలు, సంధి, సంధి నియమాలు అన్నీ ముఖతః అనిపిస్తూ చదివి చెప్పేవారు కళ్ళమీది మట్టికట్టు అలాగే ఉండేది

"స్వయంగా చదువకపోతే వారమెలా జ్ఞాపకం ఉంటుంది?" అన్నాను నేను.

అందుకు బాపూజీ "అలా అయితే తప్పునాదే అవు తుంది. నాకు చదువునేర్పటం చేతకావలసి వుంటుంది" అన్నారు. నేనన్నాను: "అందరి దగ్గర వేరేవేరే విషయాలు ఇలాగే చదివితే నాకవి జ్ఞాపకం ఉండవు. అంతమాత్రానికి వాళ్ళందరు పనికిమాలినవాళ్ళయిపోతారా?"

"ఔను, కాని, పాఠం చదివి చెప్పేటప్పుడు నీమనస్సు దానిమీద లగ్నం కావాలి, అప్పటికీ ఆ పాఠం నీకు రాక పోయిందంటే అది నేర్పేవాళ్ళ తప్పే అంటాను నేను. ఉపా ధ్యాయుడెంత నేర్పరిగా ఉండాలంటే తాను నేర్పిన

పాఠం విద్యార్థికి దానంతటదే జ్ఞాపకం వుండిపోవాలి విద్యార్థి ఆడుతూ పాడుతూ సునాయసంగా నేర్చుకోగలగాలి, కంఠో పాఠం చేయవలసిన అవసరం వుండకూడదు. ఫినిక్స్ ఆశ్ర మంలో ఈ విధంగా నేను ఎందరి పిల్లలకో చదువు నేర్పాను. ఆ అనుభవంమీదనే చెబుతున్నా, విద్యార్థి కచ్చా గావున్నాడంటే దానికి మూడువంతులు జవాబుదారీ శిక్షకు డిదీ, అతను నేర్పిన పాఠానిదీ, ఒకవంతుకు మాత్రమే విద్యార్థి బాధ్యుడవుతాడు. నాకీ ప్రయోగం కొత్తదికాదు. కళ్ళ కోసమని మట్టికట్టువేసి రెండు గంటలు నిన్ను ఊరక పరుండ బెట్టటం నీకే బాగుండదు. నీ కోసం ఇంత సమయం నేను వ్యయపరచలేను. నువ్వు ఇక్కడికి బాకు ఉపచారం చేయ టానికి వచ్చావుగాని కంటి జబ్బు నయంచేసుకోటానికి కాదు. అందరి దగ్గర కలిపి మొత్తంమీద రోజుకు రెండు గంటలు చదువు నేర్చుకుంటున్నావు. కనుక ఇటు కంటిచికిత్స అటు చదువు రెండూ ఒకేసారి జరగటం మంచిది" అని వివరించి చెప్పారు బాపూజీ.

బాపూజీ చేసిన ఈ ప్రయోగం చాల వరకు సఫల మైంది రేపటికి నేను ఇన్ని పాఠాలు చదివి నేర్చుకోవాలనే చింత తొలగిపోయింది ఎవరే పాఠం చెప్పినా మన స్సును నిశ్చలంగా ఉంచి ఏకాగ్రచిత్తంతో వినే అభ్యాసం నాకు ఏర్పడ్డది జ్ఞాపకశక్తి పెరిగింది. ఇంతేగాక, వారం రోజులకల్లా ఆరోగ్యం బాగవటం మొదలుపెట్టినది. మట్టికట్లు కళ్ళలోని వేడిని గుంజివేసినవి. కాని పూర్తిగా నయం కావ

టానికి ఒక నెలపట్టింది. బాపూజీ కళ్ళజోడు పెట్టుకోటం మాన్పించ వలెనని అనుకున్నారుగాని అది సాధ్యపడలేదు.

ఆగాఖాన్ మహల్, పూనా.

9-5-43

బాపూజీ ఈదినం తిరగటానికి పోయేసమయం 8—8-30 నుండి 7-30—8-30 కు మార్చివేశారు. 21 రోజుల ఉప వాసం వల్ల వచ్చిన బలహీనత ఇప్పుడు తగ్గి పోయినందున ఈమార్పు చేశారు.

మధ్యాహ్నం 12 గంటలకు మోగే గంటవినగానే ఎటువంటి పని ఉన్నా సరే, వదలివేసి నిద్రపోవలసిందని ఆదే శించారు. తరువాత బా బాపూజీల కాళ్ళకు నెయ్యి మర్దించే పని ఉండేది. కాని 12 మొదలు ఒకగంట నిద్రపోవటానికి బదులుగా నేను మరొక పనిచేస్తూ కూర్చున్నా. ఒంటిగంట కొట్టిన వెంటనే నేను బాపూజీ దగ్గరకు వెళ్ళాను. సుశీల అక్క నెయ్యి మర్దించటం చూచి నేను నిర్ఘాంత పోయినాను. కొద్ది క్షణాల తరువాత -"ఇవాళ ఇలా ఎందుకు చేశారు?" అని నేను బాపూజీని ప్రశ్నించాను. అందుకాయన ఒక సంగతి తెలియ జెప్పారు. "నీలక్షణాలు సేవచేసేవిగా నాకు కనిపించటంలేదు. ఇతరులకు సేవచేసే ఉత్సాహం ఉన్నవాళ్లు మొదట తమసేవ తాము చేసుకోవలసి ఉంటుంది. శరీరం బలి ష్టంగా ఉండేట్టు చూచుకోవాలి. శరీరంలో బలంలేకపోతే తమ బలహీనతను గుర్తెరిగి శరీరానికి కావలసిన అవసరాలను పూర్తిచేసుకుంటూ శరీరం పడిపోకుండా కాపాడు కోవటా

నికి ప్రయత్నిస్తుండాలి. నువ్వు రాత్రిళ్ళు నిద్రమేల్కొన వలసివస్తున్నదని నాకు తెలుసు. జ్వరంవచ్చి నీ బరువు 95 పౌన్లనుండి 91 పౌన్లకు తగ్గిపోయింది. కళ్ళు సరిగా కనిపించటంలేదు. నేను బాగుచేయటానికి ప్రయత్నించక పోయినట్లయితే ఇంకా ఏమయ్యేదో భగవంతునికే ఎరుక. డాక్టరు గిల్డర్, సుశీలా నన్ను హెచ్చరించారు ఇప్పటి వరకు క్వైనెన్ వల్లనే నువ్వు ప్రాణాలతో ఉన్నావు. లేకపోతే మలేరియా నిన్ను ఇంతకాలం బ్రతకనిస్తుందా? ఇవన్నీ ఆలోచించే నేను నిన్న 12 మొదలు ఒంటిగంటవరకు నిద్రపొమ్మని ఆజ్ఞాపించాను, కాని నువ్వు వినక వేరేపని ఏదోచేస్తున్నావు. "మీారు చెప్పినట్టేచేస్తా"నని నువ్వు ఒప్పందం చేశావు. జ్ఞాపకమున్నదా? కాని నువ్వు నియమంతప్పి నడిచావు, అందుకనే నేను కూడ ఈ మార్పు చేశాను. సేవచేయవలసిన వాళ్ళు తమ శరీరాలను ఉక్కు మొాస్తరు దృఢంగా ఉంచుకోకతప్పదు. ఎటువంటి ఆహారం దొరకినాసరే, నిద్ర ఎంత తక్కువైనా సరే నీశరీరం బలహీనంకాకుండ దృఢంగాను శక్తివంతంగాను ఉన్నట్లయితే నాకేమీా అభ్యంతరం లేదు. అప్పుడు నీకేవిధమైన నియమాలూ, కట్టుబాట్లూ విధించను. రేపటినుంచి, నిద్రవచ్చినాసరే రాకున్నాసరే, కళ్ళు గట్టిగా మూాసుకొని ఇక్కడ నాదగ్గరే పడుకోటానికి నువ్వు ఒప్పుకొనే పక్షాన, నెయ్యి మర్దించే అధికారం తిరిగి నీకు లభిస్తుంది. లేకపోతే నా కేవిధమైన సేవ నువ్వు చెయ్యనక్కరలేదు. పడుకోమని చెప్పిన వెంటనే నాపరుపు మీాద తలానించి నిద్రపోవాలి. నేను నిద్రలేపుతానిన్ను. ఈరోజు నువ్వు చేసిన

తప్పు నేను క్షమించ దలచలేదు. కాని నీ బిక్క మొగంచూచి నాకు జాలి కలుగుతున్నది నీవల్ల ఈతప్పు ఉన్నప్పటికికూడ నేను చెప్పిన ఒప్పందాన్ని నువ్వు అంగీకరిస్తే ఎప్పటివలె నువ్వే నాకాళ్ళకు నెయ్యిరాయి. ఇప్పుడు ఒకకాలుకు సుశీల మర్దన చేయటం అయిపోయింది. రెండోకాలుకు నువ్వు రాయి. బా కాళ్ళకు కూడ మర్దనచేసివచ్చి ఇక్కడే పడు కొని నిద్రపో. నియమాలను ఏర్పాటు చేయటం ఆచరించ టానికిగాని ఉల్లంఘించటానికి కాదు "

నేను నిద్రపోక పోయిన సంగతి ఇంత భయంకర రూపం తాలుస్తుందని స్వప్నంలో కూడ అనుకోలేదు. ఆసమ యాన్ని నేను నా సొంత పనికి దేనికీ ఉపయోగించలేదు. వంటశాలలోని అలమారాలు శుభ్రం చేయటానికి వినియో గించాను. ఈపనికి వేరేసమయం దొరకటంలేదు కనుక ఒక్క రోజు నిద్రమానివేస్తే ప్రమాద మేముంటుందని నేనప్పుడను కున్నాను. కాని ప్రమాదం జరగనేజరిగింది. దీని మూలంగా బాపూజీకి మనస్తాపం కలుగుతుందనీ, అది ఈ రూపంలో వ్యక్త మౌతుందనీ నేనూహించలేదు.

చేయవలసిన పని అంతా అలాగే నిలిచిపోయింది. ఇన్ని మాటలు విన్న తరువాత నిద్ర ఎలా పడుతుంది ? అయినా, కళ్ళమీద మట్టికట్టు వేసికొని ఒకగంట పడుకొని ఉండటం తప్పలేదు. ఈ ఒకగంట ఎంతో కష్టం మీద గడిచి పోయింది. గంట పూర్తికావటానికి ఒక నిమిషం ఉన్నదనగా బాపూజీ ఇలా అన్నారు - "ఇక వెళ్ళు, నీకు నిద్రవచ్చే టట్టులేదు. మనస్సులో రామనామం స్మరించుకుంటే తప్పక

నిద్రపట్టేది ఈఒక్క నిమిషం నీకు వదిలివేస్తున్నా. లేచి వెళ్ళు." నేను వెంటనే లేచి నిలుచున్నా. కాని ఇంత చిన్న తప్పుకే బాపూజీ నన్ను కాదని సుశీలక్కతో నేతి మర్దన చేయించుకున్నారే, అన్నకోపం మనస్సులో ఉండనే ఉన్నది. ఇలా చెయ్యకుండా నన్ను పిలిచి వెంటనే నిద్రపొమ్మంటే ఎంత బాగుండేది? ఒక కాలుకు మాత్రం నెయ్యి తోమించుకొని ఇన్ని చివాట్లు పెట్టటం ఏమీ బాగాలేదు. ఈకోపంతో నేనేమీ మాట్లాడకుండ వచ్చేశాను. ప్రొద్దు కుంగిన తరువాత నేను ఒంటరిగా ఇటూ అటూ తిరుగుతుండటం చూచి బాపూజీ నన్ను దగ్గరకు పిలిచి చెవిపట్టుకొని - "ఏం, మూతిముడుచుకున్నావు? ఎందుకు?" అని అడిగారు.

"ముందుగా నాకు నోటీ సెందుకివ్వలేదు?" అన్నాను నేను. అందుకు బాపూజీ- "నువ్వు ఈప్రశ్న వేస్తావని నాకు తెలుసు ఇక మీాద నువ్వు వెనుకటికంటే ఎక్కువ తెలివి తేటలతో పనిచేస్తావు. నియమపాలనకూడ ఎక్కువౌతుంది. ముందుగానే నీకు నోటీసిచ్చి వున్నట్లైతే ఈ మార్పు నీలో వచ్చేదికాదు. ముందుగా హెచ్చరిక చేయవలసిన వాళ్లు వేశే రకంగా ఉంటారు. కాని ఇతరుల గద్దింపుకు, బెదరింపుకు ఇంతసేపు మూతిముడుచుకొని కూర్చోటం ఇంతవరకు నీలో నేను చూడలేదు. ఇవాళ రెండుగంటలనుంచి నాతో మాట్లాడటం మానివేశావు. ఇప్పుడు ఏడుగంటలైంది. అందుకని నాతోటి విరోధం మానేసి ఇప్పుడైనా తిరిగి స్నేహం కలుపుకోవాలిగదా!" అంటూ నన్ను నవ్వించటం మొదలుపెట్టారు. బాపూజీకీ, నాకూ మళ్ళీ స్నేహం కుదిరింది. ఈ

విధంగా బాపూజీ పిల్లలతో పిల్లవాడిలాగనే వ్యవహరిస్తూ వాళ్ళకు బుద్ధులునేర్పే గురు వైపోతారు.

## ౧౩
## బా-సంతులమ్మ

ఆగాఖాన్ మహల్, పూనా,

11-5-1943

ఆరోగ్యం చెడిపోవటం వల్ల ఇవ్వేళ రాత్రి 3 గంట లకు బామ్మ నన్ను నిద్రలేపింది. వీపు నొప్పి తలనొప్పి భరించలేక పోయింది 3 మొదలు 5-30 గంటల వరకు నేను ఆమె వద్దనే కూర్చొని ఉన్నా. 6 గంటలకు ప్రార్థన తరువాత నేను చేయవలసిన పనులన్నీ సుశీలే స్వయంగా చేస్తానని నన్ను నిద్రపొమ్మని ఆజ్ఞాపించింది. కాని ఆమె మాటను నేను మన్నించకుండ నాపని నేనే చేసుకోవటం మొదలు పెట్టాను. ఆ సంగతి ఆమె బామ్మతో చెప్పింది. "ఔను, పాపం మనూ నాకు పరిచర్య చేసి చేసి అలిసిపోయింది. అందుకనే జైలులోంచి విడుదల కావాలని కోరుకుంటున్న దేమో! నిద్రపోకుండా పనిచేస్తూంటే జబ్బుపడవచ్చు. అప్పుడు ప్రభుత్వమే దాన్ని విడుదల చేస్తుంది. దీంట్లో ఆపిల్ల తప్పేమీలేదు. అక్కచెల్లెళ్ళను కలుసుకోవాలని కోరుకోటం సహజమేకదా!" అని బా నన్ను గురించి మాట్లాడింది. నన్ను నిద్రపుచ్చటానికి బా పన్నిన ఉపాయమిది. బా నన్ను కోప్పడు తుందేమోనని భయపడ్డాను. కాని అలా చేయక, సూటిగా మాట్లాడి నా తప్పు నేనుగ్రహించి; నిద్రపోయేట్టుచేయటానికి.

ప్రయత్నించిందామె. జైలు విడిచిపోవాలన్న కోరిక నాకే కోశానాలేదు అయినా బామ్మ ఇలా ఎందుకనుకుంటున్నదా, అని నాలో నేను వితర్కించుకున్నా. ఆమె మాటలు మన స్సుకు గుచ్చుకోటం వల్ల నాకు కొంత బాధకలిగినా వెంటనే నిద్రపోయాను. తరువాత ఈసంగతి నేను బాపూజీతో చెప్పిన ప్పుడు ఆయనిలాఅన్నారు- "బా స్వభావంలో ఉన్న విశేష మిదే! ప్రత్యక్షంగా నిందించి కోపం తెప్పించటానికి బదు లుగా పరోక్షంగా ఎదుర్కొని యెదుటి వారిని చిత్తు చేయ టంలో ఆమె నేర్పరి. 'కూతురుపేరుపెట్టి కోడలికి బుద్ధి చెప్ప టం'- అనే సామెత ఒకటున్నది తెలివిగల అత్త ఈరోజుల్లో లాగ ఎదటపడి తిట్టేదికాదు. తాను అనవలసిన మాటలు కోడలు వినేటట్టు కూతురికి చెప్పేది కోడలు అదివిని 'నన్నే అంటున్నారుకదా' అని వెంటనే గ్రహించుకొనేది. బాకు కూడ ఇటువంటి నేర్పేఉన్నది. నిన్ను నాలుగు చీవాట్లు పెడితే నువ్వు ఏడ్చివుండేదానివి. సుశీల మాటను పెడచెవిని పెట్టినట్టే బా మాటనుకూడ వినకపోయినప్పుడు బా మంద లింపు వ్యర్థమయ్యేది కదా! అందుకని నీతో వినిపించటానికిది వేరే ఉపాయం. మాకు పరిచర్య చేయటానికి నువ్వెంత కష్ట పడుతున్నదీ, ఎంత ఆతురత చూపిస్తున్నదీ నాకూ, బా కూ తెలియదనుకున్నావా? కాని నిన్ను చావనివ్వకూడదుకదా! జాగరణవల్ల తక్కువయ్యే నిద్ర-వేరే సమయంలో పూర్తి చేసుకోటం నీబోటి పిల్లలకెంతో అవసరం అప్పుడే నీశరీరం పెరగటానికి అవకాశం ఏర్పడుతుంది. అందుకనే యిలా ఉపాయం పన్ని నిన్ను మూడుగంటలు నిద్రపోయేటట్లు

చేసింది. బా ఇటువంటి మనిషి. ఆమె ఇటువంటివే ఎన్నో యుక్తులు పన్ని నన్నింత వరకు కాపాడుతూవచ్చింది. నేనింత వరకు జీవించి ఉండ టానికి బా చేసిన లాలన పాలనే ముఖ్య కారణ మనటానికి సందేహంలేదు ఇలాంటి మాటలంటే నువ్వు నొచ్చుకుంటావనీ, దానివల్ల తప్పక నిద్రపోతావనీ బాకు బాగా తెలుసు. బిడ్డకు జ్వరం తగిలినప్పుడు తల్లి చేదుమందైనాసరే తాగిస్తుంది, ఆమే తిరిగి స్వస్థత కలిగిన తరువాత మిఠాయి పెడుతుంది."

బామ్మమీద బాపూజీకి ఎంత ఆదరభావమున్నదో ఈ ప్రసంగంవల్ల నేను గ్రహించగలిగాను. పగలుకూడ బామ్మ ఆరోగ్యం ఏమంత బాగుండేదికాదు. అయినా నా చదువుకు అంతరాయం కలిగించటం ఆమెకేమాత్రం ఇష్ట మయ్యేదికాదు. అందుకని తనవద్ద కూర్చోబెట్టుకొని ప్యారే లాల్‌జీని నాకు పాఠాలు చెప్పమన్నది. ఆయన భూగోళ శాస్త్రంలో ప్రశ్నలువేస్తూ - 'చీనా దేశస్థులు నీళ్ళనుకాచి తాగేటప్పుడు తేయాకువేసి ఎందుకు మరగపెడతారు?" అని ప్రశ్నించారు. నేను వెంటనే బదులు చెప్పలేక పోయేటప్పటికి బామ్మ యిలా చెప్పింది - "నీకిదికూడా తెలియదా? రోజూ అందరికీ కెటిల్‌లో టీ కాచి యిస్తావుకదా! నీళ్ళు బాగా మసలకముందే ఆకువేస్తే రంగురాదు గదా; నీళ్ళు బాగా మరగ కాగినవో లేదో తెలుసుకోటానికి తేయాకువేసిచూస్తే తెలుస్తుంది. చీనా దేశంలో నీళ్ళు మంచివికావు. అందుకని అక్కడివాళ్ళు నీటిని మరగపెట్టి తాగుతారు. నీళ్ళు కాగ టానికి, మరగటానికి భేదం ఉన్నది. సామాన్యంగా వేడిచేసి

నట్లైతే నీళ్ళలోని క్రిమికీటకాలు చచ్చిపోకపోవచ్చు. ఎన్నో క్రిములు సూక్ష్మదర్శిని యంత్రంలోకూడ కనిపించవు. అటువంటి క్రిములు నీళ్ళను మరగకాస్తేగాని చావవు అందు వల్ల తేయాకు వేసి నీళ్ళు మరిగినవో లేదో తెలుసుకొనే అల వాటు ఏర్పడింది. ఇలాంటి సంగతులు బాపూజీ ఆఫ్రికాలో పిల్లలకు నేర్పుతుండేవారు వాటిని విని నేనుకూడ తెలుసు కున్నాను కాని ఈ సంగతులన్నీ బాపూజీ పిల్లలకు కథల లాగా బోధించేవారు. ఆట పాటలలోనే పిల్లలు చదువు నేర్చుకునేవాళ్లు నీమాదిరిగా పుస్తకాలు చదివి మెదడు పాడు చేసుకునేవాళ్ళు కాదు.''

ఈ విధంగా బాపు జబ్బుతో ఉండికూడా, మంచం మీద పడుకొని దగ్గుతూనే భూగోళ పాఠం నేర్పింది

పగలంతా నేను చదివిన పాఠాన్ని గురించి బాపూజీ సాయంకాలంకాగానే ప్రశ్నలు వేశారు బా నాకు ప్రేమతో చెప్పిన సంగతులన్నీ నేనాయనకు చెప్పాను.

"ఎన్నో ఏళ్ళ కిందట ఈ పాఠం నేను ఫినిక్సు ఆశ్ర మంలో ఉన్నప్పుడు పిల్లలకు చెప్పాను. కాని, బా ఇంత వృద్ధాప్యంలో కూడ ఆ సంగతులు మరచిపోకుండ జ్ఞాపకం ఉంచుకున్నది''- అన్నారు బాపూజీ. "మీ యిద్దరిలో ఎవరి తెలివి గొప్పది ? మరచిపోకుండా జ్ఞాపకం ఉంచుకున్న వాళ్ళ తెలివి గొప్పది కాదా?'' అని నవ్వుతూ అడిగాను నేను.

" ఇలా మాట్లాడి బాకు ఇష్టురాలవు కావాలను కున్నావా? నాకేమీ అభ్యంతరం లేదు''- అని బాపూజీ పకపక నవ్వారు. "కాని నాది తల్లకిందుల పద్ధతని నీకు ఇది

వరకు చెప్పాను. విద్యార్థులకు ఏ విషయమైనా రాకపోతే అందుకు ఉపాధ్యాయులదే తప్పు అంటాను నేను. ఈ విధంగా ఆలోచిస్తే నా తెలివే గొప్పదని రుజువౌతున్నది కదా!''— అన్నారు బాపూజీ

బాపూజీ ఉన్న గదిలోనే బా మంచం వున్నప్పటికి, ఆయన బయటికి తిరగటానికి పోయి అప్పుడే వచ్చారు. ఈలోపల బా ఆరోగ్యంలో ఏమైనా మార్పు వచ్చిందేమో తెలుసుకోవాలనే ఉద్దేశంతో ఆమె మంచం దగ్గరకు వచ్చి విచారించారు.

"ఇవ్వాళ నువ్వీపిల్లకు పాఠం నేర్పావటకదూ! ఇంకేం, ఇప్పుడు నీకు జబ్బుగా వున్నదని ఎవరంటారు? ఫినిక్సులో ఎన్నడో నేను చెప్పిన సంగతులు జ్ఞాపకం పెట్టుకొని ఈ పిల్లకు బోధించావట అందుకనే నీ జ్ఞాపక శక్తిని మెచ్చుకుంటూ ఈమె నీ తెలివి గొప్పదని వాదిస్తున్నది. నేను నా పక్షంగా మాట్లాడుతూ నా తెలివే గొప్పదంటున్నాను ఎందుకంటే నేనానాడు ఆ పిల్లలకు అంత బాగా నేర్పటం వల్లనే నువ్వు విని తెలిసికొన్న సంగతులుకూడా ముసలితనం వచ్చే వరకు జ్ఞాపకముంచకోగలిగావు. ఇక చెప్పు, తెలివి నీదా, నాదా?'' ఈ విధంగా సరసమాడి బాపూజీ బామ్మ బాధను ఒక క్షణంసేపు మరిపించారు బా కూడ సరసంగానే బదులు చెప్పింది- "ఆత్మస్తుతి అంటే ఇష్టంలేనివాళ్లుంటారా?''

ప్రార్థనకు వేళ కావటం వల్ల బాపూజీ లేచివెళ్ళారు. ఆనాటి రాత్రి మళ్ళీ ఈ సంగతే ప్రస్తావించి నాకిలా వివరించి

చెప్పారు - "నా కిది ఎంతో నచ్చింది. నేను ఆఫ్రికాలో బోధించిన సంగతులన్నీ బా ద్వారా నువ్వు నేర్చుకుంటే నీ కెంతో విజ్ఞానం కలుగుతుంది. మేమందరం రోజూ నీకు నేర్పుతున్న దానికంటె ఎక్కువ జ్ఞానమే నీకీ చదువు రాని బా ద్వారా లభిస్తుంది. నేను పిల్లలను బళ్ళోకిపంపించి ఎందుకు చదివించలేదో బామ్మ నేడు నీకు పాఠం నేర్పటం ద్వారా స్పష్టంగా తెలియజెప్పింది. ఫినిక్సులో ఉంటున్న నా పిల్లలను ఇంగ్లాండు పంపించి బారిష్టరీ చదివించకపోయి నప్పటికీ వాళ్ళకు అంతకన్న ఎక్కువ విజ్ఞానం, తెలివితేటలు అబ్బి నందుకు నాకు సంతోషం కలిగింది ఈ విషయంలో నాకు అనుమాన మెన్నడూ లేదు. అయినా, ఈ నాటి సంఘటనవల్ల నాకు మరింత నిశ్చయమేర్పడింది. బా నీకు పాఠం నేర్పటం ఆషామాషీగా జరిగినప్పటికీ, దీనిలో లోతుకుపోయి తెలుసు కోవలసిన అంశాలు చాలా ఉన్నాయి చదువు నేర్పటంలో నాకున్న నేర్పుకూడ ఈ సందర్భంలో పరీక్షకు లోనయింది. ఇంకోవిషయం కూడ ఉన్నది. ఈ విధంగా నీకు పాఠాలు నేర్పటంవల్ల బామ్మ జబ్బు నిస్సందేహంగా సగం నయమై పోతుంది. తల్లి దండ్రులు తమ పిల్లలకు ఈపద్ధతి నవలంబించి చదువు చెప్పే పక్షంలో వారికయ్యే ఖర్చుకూడ చాలా వరకు తగ్గిపోతుంది. అందులోను ముఖ్యంగా స్త్రీలు ఈవిధంగా చదువు నేర్పినట్లయితే మన దేశపు పిల్లలస్థితి త్వరగా బాగు పడుతుంది. ఈ పరిణామం ఎప్పుడు వస్తుందా, అని నేను తహ తహలాడుతున్నాను. అందుకనే స్త్రీలకు నేను చాలా ప్రాముఖ్య మిస్తున్నాను."

పరిహాసంతో కూడిన ఈ సాధారణ సంఘటనను గురించి వేరే దృక్పథంతో ఎలా ఆలోచించ వచ్చునో తెలుపుతూ బాపూజీ నాకు సరికొత్త పాఠం నేర్పారు. దేశ క్షేమానికి సంబంధించిన ప్రశ్నలను ఆయన బుద్ధి ఎంత సూక్ష్మంగా పరిశీలిస్తూ ఉంటుందో ఈ ప్రసంగం ద్వారా నాకు బోధపడింది. పరిహాసానికి మాట్లాడిన మాటల్లో కూడ ఇంత ఆదర్శం ఇమిడి వున్నదనే సంగతి నాబోటి బాలిక ఎలా ఊహించుకో గలుగుతుంది?

ఆగాఖాన్ మహల్, పూనా.
12-5-1943

రోజూ నాకొక కథ చెబుతుండమని నేను బాపూజీని ప్రార్థించాను ఆయన నవ్వులాటకు ఒకపిట్ట కథ మొదలు పెట్టారు- "అనగా అనగా ఒక ఊళ్ళో ఒక పిట్టఉన్నది. అది మగది. దాని దగ్గరకు ఒక ఆడపిట్టవచ్చి చేరింది."

ఇంతలో సుశీలక్క వచ్చి- "ఇదేమికథ? దీనికి బదులు మీరు మీ జీవితాన్ని గురించిన కథ ఏదైనా చెప్పండి" అన్నది

బాపూజీ ఉల్లాసంతో ఒక సంఘటన చెప్పారు. "నేను ఇంగ్లాండు వెళ్ళే స్టీమరెక్కి కూర్చున్నా. అప్పటికి మెట్రిక్యులేషన్ పరీక్ష పాసైనప్పటికీ అందరితో ధారాళంగా మాట్లాడ గలిగినంత ఇంగ్లీషుభాష రాలేదునాకు అదీగాక మాట్లాడే టప్పుడు తప్పులు వచ్చినట్లయితే నలుగురూ నవ్వుతారనే సిగ్గుకూడ ఉండేది. అందువల్ల రోజంతా నా కాబిన్‌లోనే

కూర్చునే వాణ్ణి. తెల్లవాళ్ళను చూచిన కొద్దీ నాశరీరం మరింత నల్లగా ఉన్నట్టు కనిపించేది. స్నానాల గదిలోకి వెళ్లి బాగా సబ్బు పూసి తోమటం మొదలు పెట్టాను. నలుపు కాస్త తగ్గి కొంతవరకైనా అందంగా కనిపించక పోతానా అని అనుకున్నాను. కాని, అసలే సముద్రపు ఉప్పుగాలి, దానిమీాద సబ్బుపూత, ఇంక చెప్పేదేముంది? ఒళ్ళంతా దురద పట్టుకొన్నది. అది నానాటికీ ఎక్కువైందికాని తగ్గు ముఖం పట్టలేదు. నా ప్రాణం విసిగింది లండను చేరుకున్న తరువాత స్టీమర్లో నేను చేసిన ఘనకార్యం డాక్టర్ ప్రాణ జీవన్ మెహతాతో చెప్పటానికి కూడ సిగ్గు వేసింది. చివరకు ఎలాగో వెళ్ళ బెట్టాను. ఆయన మందు ఇవ్వటమైతే ఇచ్చారు గాని మొగం వాచేటట్టు చీవాట్లు పెట్టారు."
ఈకథ విని మేమంతా కడుపుబ్బ నవ్వుకున్నాం.

ఆగాఖాన్ మహల్, పూనా.
**20-5-43**

మాక్స్‌వెల్‌కు వ్రాసిన ఉత్తరాన్ని గురించి సంగతంతా చెప్పారు బాపూజీ. "మన వాళ్ళు ఏం చేసినాసరే, తెల్ల ప్రభుత్వం ఇప్పుడు భారతదేశం వదలి వెళ్ళిపోక తప్పదు. ఇంకా ఎక్కువకాలం ఈదేశాన్ని దాస్యంలో ఉంచటం అసంభవమని నానమ్మకం. మనల్ని నిర్బంధించక పోయినట్లయితే 1942 లోనే రాజీకుదిరేది. 'క్విట్ ఇండియా' ఉపన్యాసమిచ్చి వచ్చిన వెంటనే నేను మహాదేవుతో అన్నాను కూడ: 'ఈసారి లిన్‌లిత్‌గో తెలివిగా ప్రవర్తిస్తే మనల్ని నిర్బంధించటం జరగదు' అని! కాని 'వినాశకాలే విపరీతబుద్ధిః'

అన్నట్టు ఆయన తొందరపడి మనందరినీ నిర్బంధంలో పెట్టాడు. ఇంగ్లీషు ఆధిపత్యాన్ని భారతదేశం ఇంక ఎక్కువ రోజులు సహించబోదని దీనివల్ల సుస్పష్టమౌతున్నది. సత్యాహింసలను భారతీయులు త్రికరణ శుద్ధిగా అవలంబించ లేదని నాకు తెలుసు. కాని ఈవిషయంలో కూడ జనంలోకన్న నాలోనే ఎక్కువ దోషం నాకు కనిపిస్తున్నది నేను స్వయంగా ఈమార్గాన్ని మనోవాక్కాయాలతో అవలంబించలేదని అనుకుంటాను. అందుకనే ఈసారి ఇంత ఎక్కువగా విధ్వంసక చర్య జరిగింది. సత్యాన్ని, అహింసను మనః శుద్ధిగా ఐకమత్యంతో మనం అవలంబించి ఉన్నట్లయితే ఈజైలు తలుపులు వాటంతటవే తెరుచుకొని ఉండేవి! దీనిలో నాకు సందేహమేమీ లేదు.”

ఇవ్వేళ వర్షం మూలాన బయట ఆడుకోటానికి వీలులేక పోయింది. వరండాలోనే ఆడుకున్నాం. తాడుపై నుంచి దూకే ఆట ఆడాను నేను. డాక్టరు గిల్డర్ కూడ ఈ ఆటే ఆడారు. కాని కొంచెంసేపటికే ఆయనకు ఆయాసం వచ్చేసింది. యాభై ఏండ్లకు పైబడిన వయస్సు కావటంచేత మామాదిరిగా తాడుమీద నుంచి దూకటం ఆయనకు సాధ్యం కాలేదు. మేమంతా నవ్వటం చూచి బాపు బయటికి వచ్చింది. డా॥ గిల్డరుకు పరిహాసమంటే ఇష్టం. ఆయన బాతో “చూడండి, బామ్మగారూ! నేను ముసలివాడనని ఈపిల్లలు ఎగతాళి చేసి ఆడిస్తున్నారు” అన్నారు. నవ్వుతూ “మిమ్మల్ని వాళ్ళేమి ఆడిస్తారు? వర్షంవల్లకసరత్తు

చేయటం వీలుపడక తొడుమీదనుంచి దూకి ఆడు కుంటూ న్నారు." అన్నది

దూకి దూకి అలసిపోయిన తరువాత మేము ఒక చోట కూర్చొని ధమాల్‌గోటా (పిల్లిశోక ఆట) ఆడుకొన్నాం. చిన్న పిల్లలు ఆడే ఈఆటలో పెద్దవాళ్ళుకూడ చేరాపు. అది చూచి బామ్మ "జైలులో ఉంచి ప్రభుత్వం మీకు ఎంతో మేలుచేసింది చిన్నప్పటి ఆటలన్నీ మళ్ళీ కులాసాగా ఆడుకో టానికి వీలయింది." అన్నది. బా, బాపూజీలు తప్ప మిగిలిన వాళ్ళందరు ఆటలో చేరారు. వాళ్లిద్దరు చూస్తూ కూర్చు న్నారు.

"బామ్మగారూ! మనూ నాకివ్వేళ 'సంబరాలకాకి' అనే కథల పుస్తకం చదవటానికిచ్చింది బాలసాహిత్యంలోని ఈ కథలు నాకెంతో నచ్చినవి" అన్నారు డాక్టరు గిల్డరు. వీరు పారశీకులస్థులు. వీరికి గుజరాతీ మాట్లాడటం వచ్చినా, రాయటం చదవటం అంత బాగారాదు. అందుకని నాకు దొరికిన చిన్న చిన్న పుస్తకాలు వారికి చదవటాని కిస్తుండేదాన్ని.

బా అన్నది: "మీబోటివారికి ఆనందం కలిగించటానికే ఇటువంటి పుస్తకాలు అచ్చు వేస్తారనుకుంటాను. ఇన్నాళ్ళకు మీకు పిల్లల కథలు చదివే అవకాశం చిక్కింది. మీబోటి డాక్టర్లుకూడా చదివి ఆనందించగలగటం ఈ పుస్తకం చేసు కున్న అదృష్టం"

డాక్టరు: "దీనిలో ఇంగ్లీషు ప్రభుత్వంవారి దయ, నా అదృష్టం రెండూ కలసివచ్చినవి. చిన్ననాటి వరదాలన్నీ

ఇప్పుడు తీర్చుకోగలుగుతున్నా. జైలులో కాకుండ వేరే బయట ఎక్కడైనా వుంటే ఎన్నో చిక్కులు, తంటాలు, అదుర్దాలు నన్ను వెంటాడుతూ ఉండేవి."

ఈ విధంగా జైలులో మా కుటుంబమంతా సరదాగా కాలక్షేపం చేస్తుండేది. నే నందర్లోకి చిన్నదాన్నైనా పెద్ద వాళ్ళంతా నాకు చిన్న చిన్న నేస్తాలై పోయినారు. 'బా, బాపూజీ, డాక్టర్ గిల్డర్, కటేలీగారు, మీరాబహన్, ప్యారేలాల్జీ, సుశీలక్క - వీళ్ళందరు ఇంత గొప్పవాళ్లనీ, విద్వాంసులనీ, నాయకులనీ, దేశ నిర్మాతలనీ నాకు కొంచెం కూడ అప్పుడు స్ఫురించేదేకాదు.

## ౧౪
## ఆత్మకు ఆహారం ప్రార్థన

ఆగాఖాన్ మహల్, పూనా,
26-5-'43

ఈ రోజు షికారు సమయంలో బాపూజీ భగవద్గీతలో ఎనిమిదో అధ్యాయం నాకు చెప్పారు. శ్లోకాలు చదవటం పూర్తి అయ్యేటప్పటికి సుశీలక్కకూడ మమ్మల్ని కలుసుకున్నది. బాపూజీ కథ చెప్పటం మొదలుపెట్టి తాము పోర్టు సయ్యీదు చేరుకొనేవరకు జరిగిన వృత్తాంతం చెప్పి వదలారు.

ఈ ఉదయం జరిగిన ప్రార్థనకు నేను లేవలేదు. షికారుకు వెళ్లివచ్చి కాళ్ళు చేతులు కడుక్కొంటూ వుండగా

బాపూజీ "నిన్ను నేను చెవిపట్టుకొని లేపాను, కాని నువ్వు కదలలేదు మెదలలేదు. గుర్తున్నదా?" అని అడిగారు.

"భజన జరిగేటప్పుడు నాఅంతట నేనే లేచాను. మీరు వచ్చి నన్ను లేపినట్టు నాకు కొంచెంకూడ గుర్తు లేదు" అన్నాను నేను

"నిద్ర పూర్తిగా పొమ్మని నీకెన్నిసార్లు చెప్పేది? రాత్రి ఆలస్యంగా పడుకొంటావు పగలు నిద్రపోతున్నట్టు నటిస్తావు, ఎలాగ? నీ శరీరానికి రోజుకు పది గంటల నిద్ర అవసరం. అది పెరగటానికి ఇంత నిద్ర తప్పనిసరిగా కావలసిందే కాని నువ్వు నీ మంకుతనం వదిలేట్టులేవు" అన్నారు బాపూజీ.

"రాత్రి బాతో కేరమ్సు ఆడుతూ కూర్చున్నా. కాని ఆమె ఆడలేదు. మీరాబహిన్, డాక్టరు గిల్డరు, కటేలీగారు, నేను - నలుగురం ఆడాము. ఒక మనిషి తక్కువయ్యే టప్పటికి బా నన్ను పిల్చి ఆడమన్నది. అందుకనే పడుకొనే సరికి పొద్దుపోయింది." అని సమాధానం చెప్పాను.

"ఎన్ని గంటలైంది?"

"పన్నెండున్నర అయింది"

"అయితే ఆ తక్కువైన నిద్ర ఈ వేళ పగలు పూర్తి చేసుకో, అలా అయితేనే నువ్వు ప్రార్థన సమయానికి లేవ గలవు కునికిపాట్లు పడుతూ బలవంతంగా ప్రార్థన చేయటా నికి వీలులేదు ఈశ్వరచింతనలో తన్మయం కాగల ప్రయ త్నానికి ప్రార్థన సహాయపడుతుంది. ప్రార్థన ఆత్మకు బలం

చేకూర్చే ఆహారంవంటిది. నీకుకూడ ఆ ఆహారం అందించ వలెనని నా కోరిక. కాని రెండు రోజులు భోజనం చేసి నాలుగు రోజులు చెయ్యకుండా ఉన్నందువల్ల శరీరంలో ఏవిధంగా దౌర్బల్యం ఏర్పడుతుందో అదే విధంగా రెండు రోజులు ప్రార్థనచేసి నాలుగు రోజులు చేయకపోవటంవల్ల ఆత్మకు పోషకద్రవ్యం లభించక బలహీనపడుతుంది. రాత్రి పడుకో బోయేటప్పుడు, 'ఏమైనా సరే ప్రార్థన సమయానికి లేచి తీరుతాను' అని మనస్సులో దృఢమైన సంకల్పం చేసుకో వాలి. అందువల్ల నీఅంతట నువ్వే అనాయాసంగా లేవగలుగు తావు. ఈ సంగతి ఉదయాన నువ్వు లేచినవెంటనే నీకు చెప్పాలనుకున్నాను, కాని తరువాత ఆ సంగతే మరచి పోయాను. నాకూ, బాకూ మాలిష్ చేసే సమయంలోంచి అయిదు నిమిషాలు తగ్గించి నీకీ సంగతి బోధించాలనుకొని ఇంత దూరం చెప్పాను."

అప్పటినుంచి రాత్రి పడుకోబోయేటప్పుడు ఉదయాన ప్రార్థన సమయానికి లేవాలనే సంకల్పంతో నిద్రపోయేదాన్ని. దానివల్ల నాఅంతట నేను లేవగలిగేదాన్ని. అలా లేవ నప్పుడు బాపూజీ వచ్చి లేపేవారు. ఈ అలవాటైన తరువాత నే నెన్నడూ ప్రార్థనకు హాజరుకాకుండ ఉండలేదు.

పూజ్యురాలైన బాయమ్మ ఆశ్రమంలో ఉండే కాశీ బహన్‌గాంధీపేర తాను చేవ్రాలుచేసి మొట్టమొదటి ఉత్తరం వ్రాయించింది. కాని దానికి బదులురాలేదు. ఆశ్రమ వాసులను మాత్రమే ఆమె తన స్వీయబంధువులుగా తల చేది. కాని జైలు నిబంధనల ననుసరించి స్వంత బంధువులకు

మాత్రమే ఖైదీలు ఉత్తరాలు వ్రాయవచ్చు. అయినా ఈ నిబంధన నెవరూ పాటించేవారుకారు. బాకూడ ఈ విష యంలో మినహాయింపు చేసింది. నేను నాగపూర్ జైలులో ఉన్నప్పటినుంచి బంధువులకు మాత్రం ఉత్తరాలు రాస్తుండే దాన్ని. బా ఉత్తరం అంతా నా చేత రాయించి, చివరకు తన పేరు, బాపూజీపేరు స్వహస్తంతో రాసేది. దీనివల్ల ఆశ్రమ వాసులకు బాపూజీ ఉత్తరాలు రాయని కొరత తీరిపోయేది. ఇవ్వేళ మధ్యాహ్నం ఒంటి గంటకు కాశీబహన్ గాంధీ పేర బా ఇటువంటి ఉత్తరమే రాయించింది. ఆశ్రమవాసుల విష యంలో ఎంత శ్రద్ధతీసికొని ఎన్ని విషయాలు రాయించేదో ఒక్క ఉత్తరం పరిశీలిస్తే మనకు గోచరిస్తుంది ఈ క్రింది ఉత్తరం, కాశీబహిన్‌కు రాసినదానికి నకలు :

చి॥ కాశీ,

నీవు రాసిన పోస్టుకార్డులు రెండూ అందినవి. చదివి ఆనందించాను. అందరిలోకీ నీఉత్తరాలు మాత్రమే నియ మంగా వస్తూన్నవి. అవి చదవటానికి సంతోషం కలుగు తున్నది. 14-5-43 న రాసిన ఉత్తరం ఈవేళ అందింది. ఉత్తరాలింత ఆలస్యంగా అందుతున్నవి. అక్కడందరు ఖులాసాగా ఉన్నారని తెలిసి ఆనందించాము. కిశోర్‌లాల్ భాయీ ఆరోగ్యం బాగున్నందుకు సంతోషం. ఇంతకు పూర్వం నాదస్కత్తుతో రాయించిన ఉత్తరం నీకు అందిందా లేదా? ఆర్యనాయకంగారు నాగపూరునుండి వచ్చేశారు గనుక వారికీ, ఆశాదేవికీ నాఆశీర్వచనాలు ప్రభుకు, అంబకు నా దీవెనలు రాసి పంపించు. లక్ష్మిరాసిన ఉత్తరం నిన్న

అందింది. అంబదగ్గిరనుంచి అప్పుడప్పుడు ఉత్తరాలు వస్తున్న వని రాసింది. ఇక్కడ అందరు ఉల్లాసంగా ఉన్నారు. నా ఆరోగ్యం బాగానే ఉన్నది. నన్ను గురించి మీరు చింత పడవద్దు. నీ ఆరోగ్యం బాగున్నదను కుంటాను. బచ్చూ సంతోషంగా ఉండవచ్చు. ఇక్కడ ప్రార్థన జరిగేటప్పుడు రోజూ మిమ్మల్నందర్నీ జ్ఞాపకం చేసుకుంటున్నాను. చి॥ కహానా ఏమి చేస్తున్నాడో తెలియదు. కూరలు తరిగేపని అందరూ చేస్తారు కనుక కొంత ఆపనికూడా చెయ్యమని కహానాతో చెప్పు. భణ్సాలీగారి దగ్గర చదువు కుంటు న్నాడా లేదా? వడ్రంగిపనికి పోతున్నాడా? నాకోసం వాడు దిగులు పడ్డాడనుకుంటాను. కాని నేనిక్కడినుండి రావటం ఎలా? అందరితో కలిసిమెలిసి ఉండమని చి॥ కనూతో గట్టిగా చెప్పు. తాను పంపిన సందేశం మాకు అందిందనీ, తన ఇష్ట మైనట్టు నడుచుకోమనీ లీలావతితో చెప్పు. ఆమె కాలేజీలో చేరటమే బాగుంటుందని నాకుతోస్తున్నది. ఇది చాలా డొంక త్రోవ. ఛగన్‌లాల్‌కు ఆశీర్వచనాలు, లీలావతి, గోమతి బహేన్, శారద, ఆనంద్, బచ్చూ మొదలైన ఆశ్రమ వాసులందరికీ నాఆశీస్సులు. వీలైనంత వరకు కహానాను సంతోషపరుస్తుండమని కృష్ణచంద్రజీతో చెప్పు. ఇష్టంలేక పోతే వాణ్ణి పంపించి వేసెయ్యమను. నాగపూరు సోదరీ మణులకు నాఆశీర్వచనాలు రాసి పంపించు.

బా, బాపూల
శుభాశీస్సులు

ఆశ్రమ వాసులుకూ, బాకూ ఎంత దగ్గిర సంబంధం ఉండేదో తెలుసుకోటానికి ఈ ఒక్క ఉత్తరమే చాలు. ఈఉత్తరంలో పేర్కొన్న వ్యక్తు లెవరో వారిపరిచయం తగు మాత్రంగా తెలియజేయటం అవసర మనుకుంటాను.

కాశీబహన్ గాంధీ:- ఈమె బాపూజీ అన్న కుమారుడైన ఛగన్‌లాల్ భాయీ సతీమణి, ఆఫ్రికాలోను భారత దేశంలోను వీరు బా, బాపూజీలతో కలిసి ఉన్నారు. కాశీ బహిన్ చాలా సౌమ్యురాలు. బంధుత్వ దృష్ట్యా నేనామెను 'అమ్మ' అని పిలిచేదాన్ని. కాని, ఆశ్రమంలో ఉండే మిగిలిన పిల్లలంతా ఆమెను 'కాశీబా' అని పిలిచేవారు. బామ్మ ఆమెను 'కాశీబహూ' అని ప్రేమతో సంబోధిస్తుండేది.

ఆర్యనాయకం :- ఈయన నాగపూరుజైలులో శిక్ష అనుభవించి విడుదలై సేవాగ్రామం తిరిగి వచ్చారు. ఆశాదేవి వీరి సతీమణి. వీరిద్దరు సేవాగ్రామంలో తాలీమీ సంఘం అనే సంస్థను సమర్థతతో నడిపిస్తున్నారు.

ప్రభుదాస్‌భాయీ, అంబా బహిన్ :- వీరు కాశీ బహిన్ కుమారుడూ, కోడలూను. ప్రభుదాస్ జైల్లో చాల కష్టాలనుభవించాడు. వీరిద్దరు పడిన యాతనలసంగతి మధ్య మధ్య తెలుసుకొని బా తన ఉత్తరాల ద్వారా వీరిని గురించి విచారిస్తుండేది. ప్రభుదాస్ గాంధీ గుజరాతీలో రచించిన పుస్తకం 'జీవన్ ప్రభాత్' ఇటీవలనే ప్రచురితమైంది.

కహానా :- ఈయన రామదాస్ గాంధీ కుమారుడు. బామ్మకు ముద్దుబిడ్డ. అసలే అల్లరివాడు, దానికి తగినట్టు

నాయనమ్మ చేసిన గారాబం! అయినా తెలివికి లోపంలేదు. "నువ్వు ఇక్కడ లేనందున ఆశ్రమం మేనేజరు కృష్ణ చంద్రజీ నాచేత కూరగాయలు తరిగే పని చేయిస్తున్నారు" అని బామ్మకు ఫిర్యాదు రాసి పంపించాడు. ఒకచోట కూర్చొని చేసేపని అతనికి ఇష్టమయ్యేదికాదు. అందుకనే ఉత్తరంలో బామ్మ అతనికెన్నో సంగతులు రాయించింది.

లీలావతీ బహెన్ :- ఈమె చిన్నతనంలోనే బా, బాపూజీల దగ్గిరకు వచ్చిచేరింది వారిద్దరు ఈమెను కుమార్తె వలె చూచుకొనేవారు. డాక్టరు పరీక్షకు చదువుతూ చదువుతూ 1942 వ సంవత్సరపు ఆందోళన రోజుల్లో మాని వేసింది. తిరిగి చదువు సాగించే విషయంలో బా ఈమెకు తన అభిప్రాయం తెలియపరచింది.

నాగపూరు సోదరీమణులు -: నాగపూరు జైలులో శిక్షననుభవిస్తున్న ఆశ్రమ వాసినులైన మహిళలు.

జైలులో ఉన్నవారు రాసే ఉత్తరాలను అధికారులు చూచుకొని వానిలో కొన్ని వాక్యాలు కొట్టి వేస్తుండేవారు. అందువల్లకొట్టి వేయదగిన వాక్యాలేమీ బా తన ఉత్తరాల్లో రాయించేది కాదు. "నాగపూరు జైలులోనున్న సోదరీమణులకు" అని రాసిన పక్షాన జైలు అధికారులు ఆఉత్తరాన్నే పంపించకుండ నిలిపివేసేవారు. అందుకనే బామ్మ "నాగపూరు సోదరీమణులకు ఆశీర్వచనములు" అని మాత్రం రాయించింది. బా, బాపూజీలు ప్రభుత్వానికి పాతచుట్టాలు కావటం వల్ల జైలు నిబంధనలు, పద్ధతులు వారికి బాగా తెలిసినవే గాని కొత్తవి కావు.

జిన్నా గారు బాపూజీతో సంభాషణలు జరుపగలమని ఇవ్వేళ సాయంకాలం సూచన చేశారు. బాపూజీ ఈవిష యంలో ఆయనకు ఉత్తరం రాస్తే బాగుంటుందని 'డాన్' పత్రిక ప్రకటించింది. బాపూజీ వద్దకు అన్ని పత్రికలూ వచ్చేవి పత్రికలో పైసూచన చదివిన మీదట బాపూజీ జిన్నాగారిపేర ఒక ఉత్తరం రాశారు. కాని, బాపూజీ తన రాజకీయ పద్ధతి మార్చుకుంటేనేగాని ఆయన రాసిన ఉత్తరం జిన్నాగారికి పంపటం జరుగదనీ, అప్పుడే ఆ ఉత్తరాన్ని పత్రికలలో ప్రకటించగలమనీ ప్రభుత్వం వారు తమ అభిప్రాయాన్ని తెలియజేశారు. సాయంకాలం షికారుకు పోయేటప్పుడు ఈవిషయాన్ని గురించి నేను బాపూజీని ప్రశ్నించాను "మీఉత్తరాన్ని ప్రభుత్వం జిన్నాగారికి పంప దని తెలిసికూడా మీరు ఉత్తరం ఎందుకు రాశారు? మీకిప్పుడెంతో అవమానం జరిగింది. అవసరమని తోస్తే జిన్నాగారే మీకు ఉత్తరం రాసి ఉండవచ్చుగదా?"

బాపూజీ ఇలా సమాధానంచెప్పారు. "దీంట్లో నాకు జరిగిన అవమానమేమీలేదు జిన్నాగారు నన్ను ఆహ్వా నించారు. అందుకని నేను ఉత్తరం రాయవలసి వచ్చింది. ఇంత మాత్రానికి నాకేమీ చిన్నతనం కాలేదు. ఒకవేళ చిన్న తనమైతే మాత్రమేమి? మంచి ఫలితం కలగబోతున్న ప్పుడు పని ఎంత చిన్నదైనప్పటికీ దాన్ని చేయటమే మన కర్తవ్యం మనంరోజూ మహాదేవభాయీ సమాధి దగ్గర భగద్గీత 12 వ అధ్యాయం పారాయణ చేస్తున్నాం. దానిలో భగవానుడు ఏమన్నాడో చూచావా?

"యోనహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి,
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యఃసమేప్రియః,
సమః శత్రౌచ మిత్రేచ తథా మానాపమానయోః,
శీతోష్ణ సుఖదుఃఖేషు సమః సంగవివర్జితః,
తుల్యా నిందాస్తుతిర్మౌనీ సంతుష్టోయే నకేనచిత్,
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్ మేప్రియోనరః.

"ఎవనికి హర్ష శోకాలు, రాగ ద్వేషాలు లేవో, ఈ పని ఫలిస్తుందో లేదో అనే చింత కలగదో, కార్యసిద్ధికి ఆశపడడో, అనగా నేనీపనిచేస్తే పెద్ద పదవిగాని, ధనంగాని, పొగడ్త గాని దొరుకుతుందని ఆశపడడో, తన కర్తవ్య నిర్వహణకు ప్రతిఫలం ఆశించడో, ఎవడు శత్రు మిత్రులను, మానాప మానాలను సమానంగా చూచుకొంటాడో - అతడు నాకు ప్రియుడు'. అన్నిటికీ భగవంతునిమీదనే భారంవేసి కూర్చున్నప్పుడే వాడు నిజమైన భక్తుడవుతాడు. మనం రోజూ పాడుతున్న ఈ భజనలోచూడు ఏమున్నదో :

సాధో మనకా మాన్ త్యాగో,
కామ క్రోధ సంగత దుర్జనకీ, తాతే అహనిస భాగో,
సుఖ దుఃఖ దోనోం సమకరి జానై, ఔరమాన
అపమానా,
హర్ష శోకతే రహైఅతీతా, తిన జగతత్త్వ పిఛానా,
అస్తుతినిందా దోఊత్యాగే, ఖోజై పద నిర్వానా,
జననానక్ యహ్ ఖేలకఠినహై, కోఊగురుముఖజానా".

ఈ భజన మొదటినుంచి చివరిదాకా ఒప్పగించి బాపూజీ ఇలా అన్నారు : "ఈ భజన చాలా గొప్పది. ఇది పాడటానికి మటుకేకాదు, భగవద్గీత పన్నెండో అధ్యాయంలో పైన చెప్పిన శ్లోకాలకూ ఈ భజనకూ అర్థం, భావం ఒకటే కాని, దీన్ని ఆచరణలో పెట్టే వాళ్లకు అద్భుతమైన ఆనందం కలుగుతుంది. దీనిలో లోతుగాపోయిన వాడికి గొప్ప సుఖానుభవం కలుగుతుంది. బయటినుంచి చూచేవాళ్ళకు మాత్రం అతని మీాద జాలి కలుగుతుంది. నామటుకు నేను ఈ మార్గంలో నడుచుకోవాలని ప్రయత్నిస్తున్నాను. జిన్నాగారికి రాసిన ఉత్తరం ప్రభుత్వం ఆయనకు అందజేయటం లేదని ఇవ్వేళ విని నేనెంతో ఆనందించాను. నువ్వు ఇదంతా చూస్తున్నావు, అందుకనే నీకు నామీాద జాలి కలిగింది. నీ బాపూజీకి అవమానం జరిగిందని భావించి, నేనా ఉత్తరం రాసిఉండకూడదని నాకు బోధ చేస్తున్నావు. కానీ భక్తుని మార్గం వీరులు నడిచే మార్గం ఒకటే, పిరికివాళ్ళు ఆత్రోవను పోలేరు. భగవంతుడికి ఏది అభీష్టమో అది చేస్తాడు. దాన్ని గురించి చింతపడుతూ మనకు ఆయనమీాదవున్న శ్రద్ధాభక్తుల నెందుకు తగ్గించుకోవాలి ? మన మనస్సును అనవసరంగా చిక్కులో పడవేసికోకూడదు నువ్వు ఇటువంటి ప్రశ్నలు అడుగుతూ వుండటం నాకెంతో ఇష్టం. దీనివల్ల నీకు జ్ఞానం కలగటమే కాకుండ, ఈశ్వరుణ్ణి గుర్తించటానికికూడ వీలుకలుగుతుంది. నేననుకున్న విధంగా నీకు శిక్షణ నీయటంకూడ సాధ్యమౌతుంది. 'బాపూను ఇటువంటి ప్రశ్న ఎందుకు వేశానా' అని

గాని; 'నవ్వుతూ నవ్వుతూ అన్నమాటకు ఇంత గొడవ చెయ్యట మెందుకు?' అనిగాని నువ్వు మనస్సులో భావించు కొని చింతపడవద్దు. నీ మనస్సులో ఏవిధమైన సంకోచమూ కలగకుండ చేయటమే నా ఉద్దేశం."

'జిన్నాగారికి మీరు ఉత్తరం ఎందుకు రాశార'ని బాపూజీని ప్రశ్నించినందుకు నాకు నిజంగానే విచారం కలి గింది. ఇది కొంతవరకు నవ్వుకుంటూ అడిగిన ప్రశ్న అయి నప్పటికీ తరువాత నాకు పశ్చాత్తాపం కలిగింది. బాపూజీ నా భావాన్ని గ్రహించారనుకొంటాను, అందుకనే ఆయన నన్ను ఊరడించి ఎంతో ఆనందం కలిగించారు.

## ౧౫
## బా, బాపూజీల ఆట

ఆగాఖాన్ మహల్, పూనా,
4-6-'43

నా కళ్ళను ఎవరైనా మంచి డాక్టరుకు చూపించటం మంచిదని డాక్టరు గిల్డరు, సుశీలక్క జైలు డాక్టరైన కల్నల్ షాహ్‌కు సలహా చెప్పారు అందువల్ల ఆయన డాక్టరు పట్వర్ధన్ గారిని పిలుచుకొనివచ్చారు. పట్వర్ధన్ గారు నా కండ్లను రెండు రోజులు పరీక్షచేశారు. నెంబరు ఎక్కువై నందున కొత్తకండ్లజోడు తీసికొనవలసిందని చెప్పి కండ్లలో వేసుకోటానికి మందు రాసిచ్చారు. దీనిపైన కల్నల్ భండారీ గారు, కొత్తజోడు కావలసినట్లయితే నా డబ్బుతో తెప్పిం చుకోవచ్చునని బాపూజీకి సూచన పంపించారు.

ఈ సూచన విని బాపూజీ ఇలా అన్నారు - "ఖైదీని భద్రంగా కాపాడటం ప్రభుత్వపు విధి. కండ్లజోడు ఇప్పించ దలచుకుంటే ఇప్పించండి. లేకపోతే కళ్లు చెడిపోతే దానికి జవాబుదారి మీనెత్తిమీదనే ఉంచుకోండి. మనూ తండ్రి బీదవాడుకాడు. ఆమెకు కళ్లజోడు కొనివ్వలేని స్థితిలో లేడు, కాని ఈ పిల్లను గురించిన యావత్తు భారం ఆయన నాకు ఒప్పగించాడు. రోగి జైలులో కాక బయటనే ఉన్న దనుకోండి, ఆమె బీదదైనప్పుడు ధర్మాదాయంలోనుంచికూడ కండ్లజోడు కొనిపించుకొనే అధికారం ఆమెకు ఉంటుంది. ఖైదీల రక్షణ ప్రభుత్వానిది, అందుకనే అది వారికి కూడూ గుడ్డా ఇస్తున్నది. జబ్బున పడితే మందూ మాకూ యిప్పించి నయం చేయిస్తుంది. ప్రభుత్వం అలా చెయ్యని పక్షంలో బంధితుడు చనిపోయినా లేక అతని శరీరం రోగగ్రస్తమయినా దానికి బాధ్యత ప్రభుత్వం మీదనే ఉంటుంది. అప్పుడు ప్రజల దృష్టిలో ప్రభుత్వం అపఖ్యాతి పాలైపోతుంది." దీన్ని గురించి కల్నర్ భండారీ, బాపూజీల మధ్య కొన్ని ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగిన మీదట ప్రభుత్వం నాకు కళ్ళజోడు కొనివ్వటానికి నిశ్చయించుకొన్నది.

ఆగాఖాన్ మహల్, పూనా.

**16-6-43**

ఇంకా వర్షం కురుస్తూనే ఉన్నది. అందువల్ల ఆరు బయట ఆటలాడటానికి వీలుకాలేదు. ఒక పెద్దబల్లమీద అడ్డంగా వలకట్టి పింగ్‌పాంగ్ ఆడదామని కటేలీగారు సూచించారు. దీనికి ప్రత్యేకించి ఖర్చుయేమీ చేయవలసిన

పని లేదు కనుక, సాయంకాలానికల్లా అంతా సిద్ధంచేసి బాపూజీ చేత ప్రారంభోత్సవం చేయించారు. ఒకవైపు బాపూజీ రెండవవైపు బా నిలుచున్నారు. డాక్టరు గిల్డర్, మీరా బహిన్‌తో కూడ మేమందరం తయారైనాము. బాపూజీ బాట్ పట్టుకొని పింగ్‌పాంగ్ బంతిని విసిరికొట్టారు. బావైపు సూటిగా తగలలేదు. బాపూజీ ఈ ఆటనెన్నడూ ఆడినట్టులేదు. సరిగా బంతి కొట్టటం బాపూజీకి చేతకాలేదు. దాన్ని అందుకొని తిరిగి కొట్టటం బాకూ రాలేదు మేమందరం అది చూచి నవ్వు ఆపుకోలేక పోయినాము 75 సంవత్సరాల వృద్ధుడైన బాపూజీ ఆరితేరిన ఆటగాడిలాగ "ఇప్పుడు చూడు నా తడాఖా" అంటూ ధీమాలు కొట్టటం మొదలు పెట్టారు. మేము నవ్వలేక చచ్చాము. షికారుకు పోయేవేళ కూడా మరచిపోయినాము. ఈమధ్య మాకు ఉచితంగా లభించిన వినోద దృశ్యాల్లో బా, బాపూజీల పింగ్‌పాంగ్ ఆట విలక్షణమైనదని చెప్పవచ్చు.

ప్రభుత్వంవారు ఇటీవలనే ప్రచురించిన - 'కాంగ్రెస్ బాధ్యత' అనే పుస్తకంమీద తీవ్రమైన విమర్శ వ్రాయటా నికి బాపూజీ నిర్విరామంగా పనిచేస్తున్నారు. ఇందుకు గాను అంతులేని ఆలోచనలోమునిగి మనఃశక్తిని వ్యయంచేయ వలసివస్తున్నది. సహచరులతో సంప్రతింపులు జరిపి తమ సత్యాహింసల లోతుపాతులను తెలియజెప్పటానికి సుదీర్ఘ మైన చర్చలు సాగిస్తున్నారు ఇటువంటి గంభీరమైన వాతా వరణాన్ని కూడ మధ్యమధ్యన బాపూజీ క్షణంలో వినోద విలాసంగా మార్చివేస్తుంటారు.

ఆగాఖాన్ మహల్, పూనా.
5-7-'43

కొద్దిరోజులుగా నేను బాపూకోసం ఒక చీర మీద ఎంబ్రాయిడరీ పనిచేస్తున్నాను. ఈచీరె జమనాలాల్ జీ బజాజ్ గారి కుమార్తె, శ్రీమన్నారాయణ అగ్రవాల్ గారి భార్యయు అయిన మదాలసాసోదరి తాను స్వయంగా ఎంబ్రాయిడరీ పని చేసి బాపూకోసం పంపించింది. కాని, ఎంబ్రాయిడరీ తీయటం పూర్తికాలేదు. ఆ మిగిలినపని నేను చేయటం మొదలు పెట్టాను. మధ్యాహ్నం బా నావద్దకూర్చొని నేను సూది ఎలాఉపయోగిస్తున్నానో చూచింది. అయిదారు నిమిషా లైన తరువాత "ఏదీ, ఆసూది నాచేతికిచ్చి నాకు నేర్పు, పోగు వేయటం నాకువస్తుందోలేదో చూస్తా" నన్నది. అల్లకానికి ఉపయోగించే నూలు పోగులు చేతితో వడికిన ఖద్దరువి. పురిలేకపోవటం వల్ల మాటిమాటికి తెగిపోతుండేవి. అది చూచి బా అన్నది "మొదట ఈనూలుకు పురిపెట్టు, అప్పుడు దారం తెగిపోదు." పురిపెట్టటమంటే నాకు తగని విసుగు. ఈరహస్యం బాకు తెలియదు, నేను చెప్పనూలేదు. "ఇలాగే నెమ్మదిగా పోగు ఎక్కుస్తాలే, బామ్మా!" అన్నాను నేను. దానికామె వెంటనే అందుకున్నది. "పురిపెట్టటానికి సోమరి తనమెందుకు? కొంచెం శ్రమపడితే ఆపని అయి పోతుంది గదా! మాటిమాటికి పోగులు తెగిపోతుంటే విసుగు పుట్టటంలేదా? పురిపెట్టటానికి ఎంతసేపు పడుతుంది? అయినా, ఇప్పుడు తొందరపని ఏమున్నది? పురిలేకపోవటం వల్ల దారం తెగిపోయి వ్యర్థమౌతున్నది. ఈరెండు గజాల

అల్లకానికి అయిదారు ఏకుల నూలు పాడుచేస్తున్నావు. ఇటువంటి చీరె నెలాకట్టుకోనేది? తనచేతి నూలుతో నేసిన చీరె నేను కట్టుకోవలెనని మదాలస ఎన్నాళ్ళనుండో కోరుతున్నది. అందుకోసం పాపం ఆమె ఎంతో శ్రమపడి ఈచీరె పంపించింది. నేను కట్టుకుంటున్నానని విని ఆమె, ఆమెభర్త శ్రీమన్నారాయణ చాలసంతోషపడతారు.'' నాసోమరితనం ఈపనికి అడ్డు తగిలింది. చీవాట్లుకూడ తిన వలసివచ్చింది. చివరకు పురిపెట్టిన తరువాతనే బా దారం అల్లటం ఉత్సాహంతో నేర్చుకున్నది. అయిదారు నిమిషాల లోనే ఆమె ఈపని నేర్చుకోగలిగింది. "నువ్వు బయట వరం డాలో ఏంచేస్తున్నావో చూద్దామని నేను బయటికి వచ్చే సరికి నువ్వుదారంతీస్తున్నావు. నేను బయటికి రాకపోయి నట్లయితే నువ్వు ఎంతదారం తెంపిపాడుచేసి ఉండేదానివో! నేను రావటంవల్ల ఆ దారం అంతా మిగిలిపోయింది. నాకు ఎంబ్రాయిడరీ పనికూడ వచ్చేసింది.'' అన్నది బాపు.

ఆ వయస్సులో కొత్త చేతిపని నేర్చుకోవలెనన్న ఉత్సాహం, నూలుదారం వ్యర్థంకాకుండా చేయగలిగానన్న ఆనందం ఆమె ముఖంలో స్పష్టంగా అంకితమై వున్నాయి.

ఆగాఖాన్ మహల్, పూనా,
8-8-'43

'ఆంగ్లేయులారా! హిందూదేశం విడిచిపోండి' అనే చరిత్రాత్మకమైన తీర్మానంచేసి నేటికి సరిగా ఒక సంవత్సరం గడిచిపోయింది. మేము ఈ రోజు ఇక్కడ పతాకోత్సవం

చేశాము. డాక్టరు గిల్డరు జెండా వందనం చేయించారు. 'ఝండా ఊంచారహే హమారా', 'సారేజహాంసే అచ్ఛా, హిందోస్తాం హమారా', 'వందేమాతరం' అనే గీతాలు మేమందరం పాడాము. ఈ ఉత్సవంలో బా, బాపూజీలతో పాటు జైలు సూపరింటెండెంటుకూడ పాల్గొన్నారు. జమా దారు, సిపాయీలు కూడ మాలో చేరిపోయినారు. అందరం కలిసి గీతాలు పాడాము. తరువాత ఖైదీలకు భోజనం పెట్టాము.

ఆగాఖాన్ మహల్, పూనా,
9-8-'43

ఉదయాన్నే యరవాడా జైలునుంచి జయ జయ ధ్వానాలు వినవచ్చినవి బాపూజీ ఆగాఖాన్ మహల్‌కువచ్చి ఒక సంవత్సరం పూర్తిఅయింది షికారుకు పోతుండగా బాపూజీ ఇలా అన్నారు- "ఈసారి ప్రభుత్వం అరెస్టు చేస్తుం దని మహాదేవ్ అన్నాడు. అలా ఎందుకు అన్నాడో తెలి యదు అరెస్టు వారంటు తీసుకొని పోలీసులు వచ్చినప్పటికీ నాకు నమ్మకం కుదరలేదు. చివరకు మహాదేవ్ పోలీసు అధి కారిని నాదగ్గరకు తీసికొనివచ్చినప్పుడు నమ్మక తప్పలేదు. 'అరగంటసేపు వ్యవధికావాలి' అని అడిగాను మహాదేవ్ మాత్రం రెండునెలల ముందునుంచే వెంటతీసికొనిపోవలసిన సామగ్రినంతా సిద్ధంచేసి పెట్టాడు."

బాపూజీ ఇవ్వేళ అకస్మాత్తుగా మహాదేవ్ కాకాను స్మరించటం చూచి మా గుండెలు నీరైనవి.

బరువు తూనికవేసి చూచేరోజిది. బాపూజీ 112 పౌన్లు, బా 90 పౌన్లు బరువు తేలారు. ఒక్కరూ తగ్గనూలేదు, హెచ్చనూలేదు.

ఆగాఖాన్ మహల్, పూనా,
11-3-'43

"మహాదేవ్ గతించిన పుణ్యతిథి 15వ తారీఖున అవుతుంది. ఆరోజు నువ్వుకూడ అందరితోపాటు గీతాపారాయణ చేయాలి. సుశీలా ప్యారేలాల్‌తో కలిసి, వాళ్ళతో సమానంగా 18 అధ్యాయాల శ్లోకాలు ఉచ్చరించాలి. ఇంకా నాలుగైదు రోజుల వ్యవధి మాత్రమే వున్నది కనుక నాకు గాని సుశీలా, ప్యారేలాల్‌కు గాని తీరిక వున్నప్పుడల్లా నువ్వు మిగిలిన పనులన్నీ వదలి మా దగ్గరకువచ్చి కూర్చొని శ్లోకాలు ఉచ్చరించటం నేర్చుకో" అని బాపూజీ ఆజ్ఞాపించారు. ఈ కారణంగా మొత్తంమీద రోజంతా శ్లోకాలు నేర్చుకోనటానికే వినియోగించాను.

వార్తాపత్రిక చదివి వినిపించటానికి మధ్యాహ్నం బా దగ్గరకువెళ్ళలేదు. కాని, మర్వాడాలోని ఉపలేటా ప్రాంతానికి అతివృష్టివల్ల కలిగిన నష్టాన్ని గురించి వార్తా పత్రికలో వచ్చిన వార్తలు బా పైపైనచదివి చూచుకొన్నది. వెంటనే ఆమె నన్ను పిలిచి - "పూర్తి వివరాలు నాకు చదివిచెప్పు. తరువాత నీపని చేసుకో"- అన్నది ఇరవై వేలమంది వరదల్లో కొట్టుకొనిపోయినారు, ఇండ్లు కూలిపోయినవి, పశువులు అపారంగా నష్టమయిపోయినవి, ఉపలేటా గ్రామం ఎలాగో

కొట్టుకుపోకుండా మిగిలివున్నది ఈ వివరాలన్నీ ఆమెకు నేను చదివి వినిపించాను.

ఈ ఘోర వార్తలు విని బా నిర్ఘాంతపోయింది "ఒక వైపు బెంగాల్లో క్షామం, రెండవవైపు మన యీ పోరాటంలో ఎందరో యువకులు ప్రాణాలు అర్పించివుంటారు, ఎందరో పిల్లలు బలిఅయివుంటారు, ఇవన్నీ చాలనట్టు మార్వాడాలో ఈ ప్రకృతి ప్రకోపం, అతివృష్టివల్ల నాశనం? ఇదేనా మనదేశపు సౌభాగ్యం?" - అంటూ ఆమె నిట్టూర్పు విడిచింది. బామ్మ ఆరోగ్యం ఈ రోజు సరిగాలేదు. మంచంమీద దిండు ఒత్తుపెట్టుకొని కూర్చొని నిట్టూరుస్తూ సంతాపం వెలిబుచ్చింది: "బాపూజీ చేపట్టిన సత్యాహింసలను ఈశ్వరుడు ఇంకా ఎంతకాలం పరీక్షిస్తాడో తెలియదు".

ఆగాఖాన్ మహల్, పూనా,
14-8-'43

గడచిన రెండు మూడు రోజులుగా బామ్మ ఆరోగ్యం ఏమీ బాగాలేదు. మనస్సుకుకూడా ఉల్లాసం లేదు పత్రికలో వచ్చిన వార్తల వివరాలు విన్నకొద్దీ ఆమెకు ఆవేదన ఎక్కువౌతున్నది. బాపూజీ, డాక్టరు గిల్డరు, మీరాబహన్, ప్యారేలాల్‌జీ, సుశీలక్క వీళ్లందరూ ప్రభుత్వం బాపూజీ మీద చేసిన దోషారోపణలకు సమాధానం తయారుచేస్తూ బాపూజీ కూర్చునేచోట చేరి చర్చలు జరుపుతున్నారు బామ్మ మంచం వారికి ఎదురుగానే వేసి ఉన్నది ఈ చర్చలు విన్నందువల్ల ఆమె ఉద్వేగం మరింత హెచ్చుతుండేది. ఆమె తనలోతాను ఇలా తలపోసేది -

"బాపూజీ అలా అనలేదు. అలా చెయ్యలేదు, అయినప్పటికి ప్రభుత్వం ఆయనమీద అబద్ధాలు ఎందుకు చెప్పాలి? ఈ లేనిపోని ఆరోపణలు ఎందుకు చేస్తున్నది? 'సత్యమే జయం' అంటారు. కాని అలాజరగటంలేదు ప్రత్యక్షంగా చూస్తున్న నిజాన్ని కూడ లెక్కచేయకుండ ప్రభుత్వం అబద్ధపు నేరాలు మోపుతుంటే ఇంకేమనాలి?" బాపూజీ సత్యవర్తనమీద ఆమెకు అమితమైన విశ్వాసం. తన ఎదుట జరుగుతున్న చర్చల సందర్భంలో ఆమె విని తెలిసికొన్న సంగతులను గురించి లోలోపల ఎంతో దుఃఖపడి తరువాత నాతో చెప్పేది బాకు ఇంత మనోవేదన కలుగుతున్నదని ఎవరూ ఊహించుకోలేకపోయారు. ఆ చర్చలలో నాకు రవంతైనా అభిరుచి కలుగలేదు ఎన్నో సంగతులు నాకు అసలు అర్థమయ్యేవే కావు నాపని నేను చేసుకొనేటప్పుడుగాని లేక బొమ్మ మంచం మీద కూర్చొని ఆమెకు పరిచర్య చేసేటప్పుడు గాని వారి మాటలు నా చెవిని పడుతుండేవి కాని పూజ్యులైన బా, బాపూజీల పరిచర్య చెయ్యటం, చదువుకోవటం, తిండితినటం— వీటిలోనే మునిగివుండే నాకు, ఆ పదమూడు పద్నాలుగేండ్ల చిన్న వయస్సులో గంభీరమైన రాజకీయ సమస్యలు అర్థం కావటం ఎలాగ? అందువల్లనే ఆచర్చలు నాకు రుచించలేదు. ఇప్పుడు ఆసంగతి తలచుకొంటే పశ్చాత్తాపమూ, విచారమూ కలుగుతున్నది. 1942-43 లో జరిగిన హింసాకాండకు కాంగ్రెసుదే బాధ్యత అంటూ ప్రభుత్వం చేసిన ఆరోపణకు తగిన సమాధానం పంపటానికి సుమారు రెండునెలలు పట్టింది. అంతవరకు తమ అనుచరులతో బాపూజీ జరుపుతూ వచ్చిన

చర్చలను, ఆసందర్భంలో ఆయన వ్యక్తపరచిన మనోవ్యథను అవగతం చేసుకొనే భాగ్యం నాకుకలగలేదు. అయినప్పటికీ ఈవిషయంలో బాపు వెలిబుచ్చిన భావోద్వేగాన్ని నా డైరీలో వీలైనంత వరకు రాసి ఉంచుకున్నాను. ఇప్పుడు ఆ రాతలు చదువుకొని ఆనాడు బాపూజీకి కలిగిన మానసిక తాపం కొంతవరకు ఊహించుకో గలుతున్నా.

౧౬

## మహాదేవ్ కాకా సంవత్సరీకం

ఆగాఖాన్ మహల్, పూనా.
**15-8-'43**

మహాదేవ్ కాకా ఈలోకాన్ని విడిచిపోయి నేటికి సరిగా ఒక్క సంవత్సర మయింది

నిన్న బాపుకు గుండెపోటు వచ్చింది. శ్వాసతీసు కోటంకూడ కష్టమైంది దానికి తోడుదగ్గు. వీటివల్లరాత్రి నిద్ర పోలేదు. నేనూ, సుశీలక్క వంతులు వేసికొని ఆమె దగ్గిర కూర్చున్నాము. ప్రభుత్వం కాంగ్రెసు మీాద మోపిన నేరాలకు బాపూజీ సమాధానం తయారుచేస్తున్నందున సుశీ లక్కకు పగలుకూడ చేతినిండా పనిఉండేది. అందుకని బాపు "అవసరమయితే నిన్ను తప్పకుండ పిలిపిస్తా, అంత వరకు మనూ నాదగ్గిర ఉంటుందిలే" అని ఆమెతో చెప్పింది. గుండెల్లో బరువుగా ఉండటంవల్ల బా వెల్లికిల పడుకోలేక పోయేది. సుశీలక్క మధ్యమధ్య వచ్చి చూచి పోతుండేది.

ఒకసారి మందుకూడ తాగించిపోయింది. డా॥ గిల్డరు కూడ రాత్రి రెండుసార్లు వచ్చి చూచారు. బా వీరినిగురించి చింత పడుతుండేది. "మీరు నాకోసం నిద్రపోగొట్టుకొని ఎందుకు వచ్చిపోతున్నారు? మీరు పగలంతా పనిచేయవలసిన వాళ్లు రాత్రిజాగరణచేస్తే ఎలా?" అని వాళ్ళను మందలించింది. బాపూజీ కూడ ఒకటి రెండుసార్లు లేచివచ్చి చూచారు. అదికూడ బాకు ఇష్టంలేదు. తనజబ్బు మూలంగా ఇంతమంది కష్టపడుతున్నారని ఆమెకు దుఃఖంకలిగింది

కొంచెమునేపు నిద్రపోతూ, కొంచెమునేపు జాగరణ చేస్తూ ఆమె రాత్రి అంతా వెళ్ళబుచ్చింది. ఉదయం ప్రార్థనకు సమయమయింది నేను బా మంచంమీదనే కూర్చొని ఉన్నా. నాతో బామ్మ ఇలా అన్నది "ఇక నువ్వు ప్రార్థనకు వెళ్ళు, రాత్రి అంతా నిన్ను బాధపెట్టాను. ఇవ్వాళ మహాదేవ్ భాయీ సంవత్సరీకంకదా! అరేరే! ఎంత త్వరగా ఏడాది నిండింది? చావదగినదాన్ని నేనుండగా, పాపం, మహాదేవుకు చావు వచ్చింది. బ్రతికి ఉండి నేను చేయగల పని ఏమున్నది? పాపం! దుర్గా, బాబ్‌లాలను భగవంతుడెంత కఠినపరీక్షకు లోనుచేశాడో చూడు! ఈ సమయంలో బాపూజీ బయట ఉన్నట్లయితే వాళ్ళకెంతో ధైర్యం చిక్కేది. దైవేచ్ఛకు మనం ఏమి చేయగలం? మహాదేవు ఆబ్దికం కనుక నువ్వు తప్పకుండా వెళ్లి ప్రార్థనకు కూర్చో."
"నీ దగ్గిరే కూర్చుంటాను." అన్నాను నేను "మనూ ఇక్కడ కూర్చొనే ప్రార్థన చేస్తుంది. నువ్వేమీ చింతపడకు"

అన్నారు బాపూజీకూడ. ఆయాసంగా ఉండటంవల్ల బొమ్మ నన్ను ఆనుకొని కూర్చున్నది. నేను ఆమె గుండెలమీద చేతితో నెమ్మదిగా రుద్దుతూ కూర్చున్నా. ఎగరొప్పూ, బాధా ఎక్కువగా ఉన్నప్పటికీ ఆమె ప్రార్థనలో పాల్గొనటానికి ప్రయత్నించింది.

బా బాపూజీలకు మహాదేవ్ కాకా కొడుకులాగ నడుచుకోటం అంద రెరిగినసంగతే ప్రార్థన అయినతరువాత కొంచెంనెమ్మది చిక్కినందున బా నిద్రపోయింది. ఆమె తలను నెమ్మదిగా దిండు మీద ఆనించి దోమతెర వేసి నేను నాపనిమీద వెళ్ళాను

సుమారు ఒక గంటసేపు ఆమె బాగానిద్రపోయింది. లేచినవెంటనే "ఇవ్వేళ ఖైదీలకు భోజనంపెట్టాలిగదా?" అన్నది. "అవును, సుశీలక్క అందుకుకావలసిన సామగ్రి ఏర్పాటు చేస్తున్నది"అన్నాను

ఆత్మీయుల తద్దినంనాడు బ్రాహ్మణులకు భోజనం పెట్టటం మాలో ఆచారం. కాని బా దృష్టిలో పాపం ఈ ఖైదీలు బ్రాహ్మల కన్న ఎక్కువవాళ్ళు; అందుకనే వీళ్ళకు భోజనం ఏర్పాటు చేయటంలేదా' అని నిద్రలేవటంతోనే అడిగింది. పాతకాలపు ఆచారాలమీదా, శాస్త్రాలమీదా బాకు ఎంత గట్టి నమ్మకమున్నదో ఆమె మాటలవల్ల విశద మవుతున్నది.

ఇవ్వేళ మేమందరం ఉపవాసమున్నాము. బాపూజీ ప్రార్థన అయిన తరువాత రెండు చెంచాల తేనె, కొంచెం

సోడావేసికొని వేడినీళ్ళు మాత్రం తాగారు. పళ్లరసం తీసికో లేదు. అందువల్ల నాకు ఆత్రుతపనితగ్గలేదు. సుశీలక్క, మీరా బహెన్ 'మహాదేవ్ కాకా సమాధి'ని పూలతో అలంకరించ టానికి ముందుగానే వెళ్ళారు. నేనుమాత్రం బామ్మకు పళ్ళు తోమించటానికీ, కషాయంచేసి ఇవ్వటానికీ ఉండిపోయినాను.

సరిగా 7-30 గంటలకు బాపూజీ రోజుమాదిరిగానే సమాధి దగ్గరకు చేరుకున్నారు. నేను వెళ్ళకపోవటం చూచి బామ్మ-"నువ్వు ఈరోజు పోకపోవటం నాకేమీ బాగాలేదు, వెళ్ళు, పూలువేసి నమస్కరించి, గీత (12. వ అధ్యాయం) చదివి వచ్చేసెయ్యి ఇంతట్లోకే నాకేమీ కాదులే. కషాయం నాదగ్గిరుంచి వెళ్ళు, నేను తాగ గలను" అని చెప్పింది.

"వంతుల ప్రకారం ఎవరైనా ఒకరు బా దగ్గర విడవ కుండా ఉండటం అవసరమని డాక్టరు గిల్డరూ, సుశీలక్క ఇద్దరూ చెప్పారు. అందుకని వాళ్ళు వచ్చిన తరువాత నేను వెళ్ళి సమాధిమీద పూలుంచి వస్తాను" అన్నాను నేను.

"బామే నన్ను పంపించిందని చెప్పునువ్వు" అన్నది మళ్ళీని.

నేను సమాధి దగ్గిరకి వెళ్ళేటప్పటికి అందరూ కళ్ళు మూసుకొని శ్లోకాలు చదువుతున్నారు. నాకంఠస్వరం దానిలో కలిసి వినబడేటప్పటికి బాపూజీ కొద్దిగా కళ్ళు తెరిచి చూచి తిరిగి మూసివేసుకున్నారు. అగరు కడ్డీల సువాసన నాలుగు దిక్కులా వ్యాపిస్తూ ఉన్నది. మీరాబహెన్, సుశీలక్క,

ఇద్దరూ కళాప్రియులవటంచేత రకరకాల పూలతో సమాధిని చక్కగా అలంకరించారు. మహాదేవ్ కాకా ఏవిధంగా భక్తి భావంతో బాపూజీ ఎదుట నిల్చొని ఉండేవారో అదే విధంగా ఈనాడు బాపూజీ, చేతులు రెండూ జోడించి ప్రాభాత సూర్యుని స్వర్ణకాంతి ముఖంమీద పడుతూ ఉండగా, కండ్లుమూసికొని గంభీర ముఖముద్రతో సమాధి ఎదుట నిల్చొని ఉన్నారు. భగవద్గీత 12 వ అధ్యాయంలో ఉన్న భక్తియోగ శ్లోకాలు అందరూ చదువుతున్నారు. అదిచూచి నాలోనేను అనుకున్నా "ఇప్పుడు ఎవరిని ఎవరి భక్తులనాలి? మహాదేవ్ కాకా బాపూజీ భక్తుడా లేక బాపూజీయే మహాదేవకాకా భక్తుడా?"

శ్లోకాలు చదవటం పూర్తి అయిందోలేదో వెంటనే నన్నుచూచి బాపూజీ ప్రశ్నించారు "ఏం, నువ్వు వచ్చేశావా? బా నిన్ను వెళ్ళమనిఉంటుంది, ఆమె స్వభావమే అటువంటిది. ఇవ్వేళ మహాదేవుని ఆబ్దీకంగదా? నువ్విక్కడికి రాకపోవటం బా సహిస్తుందా? మహాదేవుని మరణంవల్ల ఆమె హృదయంలో ఏర్పడినగాయం ఇంకా ఆరలేదని స్పష్టమవుతున్నది."

నేను తిన్నగా బా దగ్గిరకు వచ్చేశాను. బాపూజీతో కలిసి సుశీలక్క కూడ తిరిగివచ్చింది. మహాదేవ్ కాకా చనిపోయినప్పుడు ఆయనశవానికి స్నానంచేయించి ఏగదిలో పరుండ పెట్టి గీతాపఠనం, ప్రార్థనా జరిపించారో అదేగదిలో ఈరోజు గీతాపారాయణ జరుగ వలసిఉన్నది. మీరా

బహీన్ ఆగదిని అలంకరించటానికి వచ్చింది. గదిలో ఉన్న కుర్చీలు, బల్లలు మొదలైన వాటినన్నిటిని బయటపెట్టారు. శుభ్రంచేసి ఒక జైలుజంపకానా పరిచారు. ఏడాది ముందర కాకా మృతదేహాన్ని ఏచోట పరుండపెట్టారో అదేచోట తలవైపు ఓంకారాన్ని, కాళ్ళవైపు క్రాస్ (+)ను పూలతో అందంగా పేర్చి అలంకరించారు. అగరువత్తుల సువాసనతో వాతావరణమంతా పవిత్రం చేశారు. ఈలోపల బాపూజీ, మేమందరము స్నానాలు ముగించుకొన్నాము. చెంచాతో పళ్ళెంవాయించి గంటమోగించాము. గీతాపారాయణ జరుగుతున్నంత వరకు నేతితో దీపం వెలిగించి ఉంచ మని బా ఆజ్ఞాపించింది. అలాగే దీపారాధన చేశాను నేను. అందరం ప్రార్థనకు కూర్చున్నాము. సూపరింటెండెంటు కటేలీ గారుకూడ వచ్చి కూర్చున్నారు. ముందు మామూలుగా చదివే శ్లోకాలతో ప్రార్థన ఆరంభమైంది.

మొట్టమొదట జాపానీ ప్రార్థన - 'నమ్యో-హో-రేంగేక్యో' చదివాము (దీనిలో బుద్ధభగవానునకు నమస్కారము చెప్పబడింది). తరువాత ఈ క్రింది శ్లోకం ,

ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్,
తేన త్యక్తేన భుంజీథాః మాగృధః కస్యస్విద్ధనం.

ఈశ్లోకం తరువాత కురాన్‌షరీఫ్ నుండి సూక్తి, దాని తరువాత జరథుస్తుని గాథ గిల్డరుగారు చదివారు (నమ్యో - ఈశావాస్య-కురాన్ సూక్తి-జరథుస్త గాథ - ఇవి నిత్యం ఉదయం, సాయంకాలం చేసే ప్రార్థనలో చదువబడుతుంటవి.

వీటన్నిటి భావార్థం - ఆశ్రమ భజనావళి - కొత్త సంస్కరణలో చూచి తెలుసుకోవచ్చు.)

పైనజెప్పిన శ్లోక పఠనమయిన తరువాత సుశీలక్కా, నేనూ కలిసి 'వైష్ణవజనతో తేనే కహియే' అన్న భజన కీర్తన ప్రారంభించాం కాని మొదటి చరణం పూర్తిఅయ్యే సరికి కన్నులు అశ్రుపూరితాలై, డగ్గుత్తికపడ్డది. ప్యారేలాల్ జీ స్వరం అందుకొన్నారు. ఎలాగో ఆ కీర్తన పూర్తి చేశాము.

కీర్తన అయిన తరువాత, మీరాబహెన్ గదిలో ఒక మూల కూర్చొని తంబూరా మీటుతూ తన కొండజాతివారి కంఠంతో 'రామధున్' పలికించింది.

నేతి దీపం ఒక ప్రక్కన శాంతిపూర్ణమైన కాంతితో వెలుగుతున్నది, ఓంకార, క్రాస్ ఆకారములలో తీర్చిదిద్దిన రంగు రంగుల పువ్వులు వింతశోభ వెదజల్లుతున్నవి, అగరు ధూపాల సుగంధంతో వాయుమండలం ఘుమ ఘుమలాడుతున్నది, వాతావరణంలో పవిత్రత వ్యాపించియున్నది. బా బాపూజీ లిద్దరు తమ బలహీనతను లక్ష్యపెట్టక పద్మాసనం వేసికొని, చేతులు జోడించి, కండ్లు మూసికొని ధ్యాన మగ్నులై కూర్చున్నారు. ఇది హృదయాన్ని కరగించి నీరుచేసే దృశ్యం

రామధున్ ముగించి మీరా బహెన్, మహదేవ్ కాకాకు ప్రియమైన ఆంగ్ల ప్రార్థనగీతం పాడింది.

When I survey the wondrous cross,
On which the prince of Glory died,
My richest gain I count but loss,
And pour contempt on all my pride,
See from His head, His hands, His feet,
Sorrow and love flow mingling down,
Did e'er such love and sorrow meet.
Or thorns compose so rich a crown ?

ఈ పాట అయిన తరువాత భగవద్గీత పారాయణ ఆరంభమైంది. గీత సాంతం పఠించటానికి ఒక గంటమీాద పది నిమిషాలు పట్టింది. అది అయిన తరువాత ఈ శ్లోకం చదివాము.

విపదో నైవ విపదః సంపదో నైవ సంపదః,
విపద్విస్మరణం విష్ణోస్సంపన్నారాయణస్మృతిః.

దీనితో పని అంతా పూర్తయింది. బా నిట్టూరుస్తూ ఇలా అన్నది "క్రిందటి సంవత్సరం ఈ సమయానికి మహాదేవ్‌ని దహన సంస్కారం జరుగుతూ ఉన్నది, ఈనాడు లోకంలో అతనిపేరు మాత్రమే నిలిచిపోయింది"

ప్రార్థన అయిపోయిన తరువాత సుశీలక్క బాపూజీకి వేడినీళ్ళలో తేనెకలిపిచ్చింది. తరువాత మేమిద్దరం ఖైదీల నిమిత్తం తయారవుతున్న వంట చూడటానికి వెళ్ళాము. మేము కూడ వంటలో కొంతసాయపడ్డాము

వంట సిద్ధమయిన తరువాత. ఒంటిగంటకు ముప్పై మంది ఖైదీలను భోజనానికి కూర్చో పెట్టాము. బ్రాహ్మణ

స్వరూపులైన యీఖైదీలకు విందు ఆరగింప జేయటానికి బా స్వయంగా కుర్చీవేసికొని కూర్చున్నది. పొంగలి (కిచడీ) పులుసు, కూర, హలువ, పకోడీలు-ఇవీతయారైన వంట కాలు. ఒక్కొక్క ఖైదీ తాను తెల్లగాతోముకొని సిద్ధంగా ఉంచుకున్న ఇనుపబొచ్చెలో మొట్టమొదట బాపూజీ వణుకుతున్న చేతులతో గరిటె పట్టుకొని హలువావడ్డించారు. మిగిలిన పదార్థాలు డా॥ గిల్డరు, మీరాబహేన్, ప్యారేలాల్జీ, సుశీలక్క; నేనూకలిసి వంతులవారీగా వడ్డించాము.

బామ్మ మావడ్డన గమనించి చూస్తున్నది మొట్ట మొదటి ఖైదీకి పకోడీలు వడ్డించటం మరచి నేను రెండవ ఖైదీకి వడ్డిస్తుండగా బామ్మ నన్ను గద్దించింది "చూడు, మొదటి వానికి వడ్డించకుండ రెండోఅతనికి ఎలావడ్డిస్తు న్నావు? అందరికీ వడ్డన కలిసిందా లేదా అని జాగ్రత్తగా చూడవద్దా? నీకు జాగ్రత్త ఎందుకులేదు?"

దగ్గువల్లనూ, హృద్రోగంవల్లనూ బలహీనంగా ఉన్న బామ్మ అంతగమనంతో ఉండటం, వడ్డనకు ఒప్పుకున్న నేను ఇంత అజాగ్రత్తగా ఉండటం తలచుకొని నాలోనేను సిగు పడ్డాను.

ఖైదీలలో కొందరు ఇరవైఏండ్ల శిక్షపడ్డవాళ్ళు కూడ ఉన్నారు. వాళ్లు అన్నారు "మేం పాపకర్మలు చేసేటప్పుడు కొద్దిగా మంచి కూడాకలిపి చేసిఉంటాము అందువల్లనే దైవ పురుషులైన యీబా, బాపూజీల చేతి ప్రసాదం పుచ్చుకొని పవిత్రం కాగలిగాము" ఈ ఖైదీలకు బా, బాపూజీలతో

స్వేచ్ఛగా కలిసిమెలిసి ఉండే అదృష్టమబ్బింది. జైలుకు వెలుపలున్న వాళ్ళెందరో బాపూజీ చరణస్పర్శకు తహతహ లాడుతున్నప్పటికీ అది వాళ్ళకు లభ్యంకాలేదు. ఖైదీలు బా బాపూజీలకు నమస్కరించినప్పుడు వీరు తమ పవిత్ర హస్తంతో ఖైదీలవీపుతట్టి ఆశీర్వదిస్తారు. అప్పుడు ఖైదీల ముఖంమీద తాండవించే ఆనందం, 'ధన్యత చెందాముగదా' అన్న సంతృప్తి చూచి తీరవలసిందేకాని మాటలతో చెప్ప టానికి అలవికాదు. నేనాఅద్భుత దృశ్యాన్ని ప్రత్యక్షంగా చూచాను గనుక వీలైనంత వరకు చిత్రించటానికి ప్రయత్నిం చాను. ఈదివ్యపురుషులు నేడు దివంగతులైనారు. కాని ఆ ఖైదీలకు వీరానాడు తమ చేతులతో వడ్డించి, వీపులు తట్టి ఆశీర్వదించి అపారమైన ఆత్మానందాన్ని ప్రసా దించారు. హత్యలుచేసి శిక్షననుభవిస్తున్న అపరాధులకు మహాత్ముల సహవాసం, ప్రేమపూర్వకమైన ఆశీర్వచనం పొందగలిగే భాగ్యం సాధారణంగా లభించేదికాదు కాని మహాపురుషుల మూలంగా లోకంలో దుర్లభమైనవి కూడ సులభము అవుతుంటవని మనకు నమ్మకం ఏర్పడుతున్నది.

ఖైదీలకు విందుచేసిన తరువాత బా బాపూజీలు కొంచెంసేపు విశ్రమించారు. ఇద్దరి కాళ్ళకు నేను నెయ్యి మర్దన చేశాను అప్పటికి మధ్యాహ్నం 3-15 గంటలయింది. సరిగా 3-30 మొదలు 4-30 వరకు ఒకగంటసేపు నూలు వడికే సూత్రయజ్ఞం ఏర్పాటు చేశారు ఉదయాన ప్రార్థనకు వచ్చినట్లుగానే ఈసూత్రయజ్ఞానికి కూడ అందరు వచ్చి మౌనంగా నూలు వడికారు.

సరిగా 5-30 గంటలకు బాపూజీ ఉపవాసం విరమించారు. కొందరు 24 గంటలు ఉపవాస మున్నారు. బాపూజీ భోజనం చేసిన తరువాత మేముకూడ భోజనం చేశాము. షికారుకుపోయినాము, రోజూ చేసినట్టే ప్రార్థన చేశాము. మర్నాడు సోమవారం కావటంవల్ల బాపూజీ 24 గంటల మౌనవ్రతం ఆరంభమయింది

మౌనవ్రతం బాపూజీ ఎప్పుడూ చేసే వ్రతాల్లో ఒకటి. అదికూడ ఇవ్వేళే వచ్చింది. పగలంతా భక్తితో పెట్టిన శ్రాద్ధకర్మకు రాత్రిపూట ఈమౌనం పరిసమాప్తిగా ఏర్పడిపోయింది.

## ౧౭
## నా విడుదల ఉత్తరువు

ఆగాఖాన్ మహల్, పూనా.
3-9-'43

కొద్ది రోజులనుంచి నాకు జ్వరం తగులుతున్నది. అందువల్ల బరువుకూడ తగ్గిపోయింది. ఇవ్వేళ బరువుతూచే దినం. నాలుగుపౌన్లు తగ్గినందున ప్రభుత్వం నన్ను విడుదల చేస్తుందని అందరూ ఎగతాళిచేయటం మొదలుపెట్టారు. కటేలీగారు ఒకకాగితం టైపుచేసి దానిమీద దొంగ సంతకం పెట్టించి నన్ను వదలి పెడుతున్నట్టు ఉత్తరువు కూడ పట్టుకొచ్చారు. డా॥ గిల్డర్, కటేలీగారు, సుశీలక్క అందరు ఏకమైనారు. నేను ఒంటరిదాన్నైనాను. అది నిజమైన ఉత్త

రువే నని నమ్మి ఏమీచెయ్యలేని పిల్లలు ఏడ్పుసాగించినట్లు, ఒకమూలకూర్చొని ఏడవటం మొదలుపెట్టాను. మొదట నేను ధైర్యంగానేఉన్నా, కాని అందరూ నన్నుచూచి "ఏడుస్తుంది, ఏడుస్తుంది" అనేటప్పటికి నాకు నిజంగానే ఏడ్పు వచ్చింది. ఈవిధంగా అందరు కలిసి నన్ను అరగంట వరకు ఏడ్పించారు. తరువాత నవ్వుతూ అందరూ బాపూజీ దగ్గరకు వెళ్ళారు. ఆయన " ఏడ్చేవాళ్ళను ఇంకా ఏడిపిస్తారు. ఇది దొంగ కాగితం. నిన్ను అందరూ ఎగతాళి పట్టిస్తున్నారు. నువ్వు ఏడుస్తుంటే వాళ్ళకు వినోదంగా ఉంటుంది" అన్నారు.

ఆరో తరగతి పాఠ్యాంశమైన ఇంగ్లాండుదేశపు చరిత్ర, భూగోళం కొద్ది రోజులనుంచి సుశీలక్క నాకు సాయంకాలం ఆరు యిరవై గంటలవరకు పాఠం చెపుతున్నది. ఈవేళ నాకు ఆరు పదిహేను వరకు పనితోనే సరిపోయింది. పది నిమిషాల్లో చదివేదేమిటి అని ఆమెదగ్గరకు పోకుండ వేరే ఒక పనిచేస్తూ కూర్చున్నా. ఆరూ ముప్పైకి మామూలుగా బాపూజీతో షికారుకు పోయాను. అప్పుడాయన నాకు ఇలా బోధించారు - "ఒకసారి మనస్సులో నిశ్చయించుకున్నదాన్ని మనం వదలిపెట్టకూడదు, అప్పుడే జీవితంలో మనం ముందుకు పోగలము. నువ్వు పని పూర్తి చేయలేక పోయినా, అథవా ఎన్నడైనా నియమభంగం చేయవలసి వచ్చినా ఆరోజు వచ్చి నాతో చెబుతూవుండు. ట్లాఅచేయటం వల్ల నువ్వు నియమపాలన నేర్చుకుంటావు, వేళతప్పక పనిచేయటంకూడ అలవడుతుంది. నువ్వు భోజనానికికూడ సరిగా 5-30 గంటలకు పోవటం లేదనీ, అయిదారు

నిమిషాల్లోనే ఆదరాబాదరాగా తినివేస్తావనీ ఫిర్యాదులు వస్తున్నవి. అయిదారు నిమిషాల్లో చేసే భోజనం ఏం భోజనం? తొందర తొందరగా ముద్దలు మింగుతావేమో? నిన్ను మలేరియా ఎందుకు వదలటంలేదా అని నేను ఆలోచించాను. ఇప్పుడు నాకు కారణం తెలిసింది. నువ్వు నమలకుండానే ఆహారం మింగుతుంటావు, అందుకే జబ్బు చేస్తున్నది. భోజనానికి సరిగా అరగంట సమయం వినియోగించాలి. భగవంతుడు నీకు పళ్లు ఎందుకిచ్చాడు? ఆహారం చక్కగా నమలి మింగటానికి దానివల్ల శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. ఆరోగ్యం లేకపోతే ఈశ్వరాజ్ఞను మనం పాటించలేము ఇతరులకు సేవచేయటంకూడ మనకు వీలుపడదు. 'ఈశ్వరాజ్ఞ పాలించటానికే నేను పని చేస్తున్నాను' అనే భావనతో మనం ప్రతిపనీ చేస్తుండాలి. కొత్త వస్త్రం ఉపయోగించక దాచిపెట్టివుంచితే అది పుచుగుపట్టి చెడిపోయినట్టుగానే పళ్ళను నమలటానికి ఉపయోగించక పోయినట్లయితే అవికూడ కొంతకాలానికి చెడిపోయి రాలిపోతవి నువ్వు పండ్లను ఉపయోగించకుండా ఉన్నట్టే నేనుకూడ ఈ శరీరాన్ని నడిపించి దీనితో వ్యాయామం చేయించకపోతే శీఘ్రంగా శుష్కించిపోతుంది నేను చావురాని చావు చచ్చిపోతాను. అలా అకాలమరణం పొందటంకూడ పాపహేతువే. ఎందుకంటే, ఆ మరణం స్వాభావికమైనదికాక, మన ఉపేక్షవల్లనే కలిగేది గనుక దోషం మనదే అవుతుంది మానసికమైన జాగ్రత్త ఎంత ముఖ్యమో శారీరకమైన జాగ్రత్తకూడ నా దృష్టిలో అంతేముఖ్యం. మానవ సేవకు

యోగ్యంకాకుండ పోవటం పాపపుపనే కదా! భోజనానికి విస్తరిముందు కూర్చొని మొదటిముద్ద నోట్లో వేసుకోక మునుపే దైవ ప్రార్థన చేయటం అవసరం. ఇటువంటి నియమాలను నువ్వు పాటిస్తూవుంటే క్వినైన్ మాత్రలు గాని, ఆముదం గాని వాడవలసిన అవసరం ఉండదు. శరీరంకూడ బలంగా ఉంటుంది. ఇవ్వేళ కటేలీగారు తెచ్చింది దొంగ ఉత్తరువైనా, నీ జబ్బు ఎక్కువైనదంటే నిజమైన ఉత్తరువే వస్తుందని జ్ఞాపకంపెట్టుకో "

ఈ హితబోధ జరిగిన రెండోవారానికల్లా నిజమైన ఉత్తరువు రానేవచ్చింది.

ఆగాఖాన్ మహల్, పూనా,
**5-9-'43**

ఈరోజు పార్సీల సంవత్సరాది. అందువల్ల ప్రార్థన ముగిసినవెంటనే సుశీలక్క డాక్టరు గిల్డర్ గదివద్ద, లోపల బయట ముగ్గులుపెట్టి అలంకరించింది. 6-30 గంటలకు కటేలీగారు పూలమాల, యితర బహుమతులు తీసికొని డాక్టరుగారి కివ్వటానికి కిందికి దిగివచ్చారు. బామ్మ, సుశీలక్క, నేను ఒకరి తరువాత ఒకరుగా, వాళ్లిద్దరికి బొట్టుపెట్టి నూలు హారం వేశాం. తరువాత వాళ్ళిద్దరు బా, బాపూజీల కాళ్ళకు మొక్కారు. టీ తాగి మేమందరం బాడ్మింటన్ ఆడటానికి కిందికి దిగేటప్పుడు బామ్మ నన్ను పిలిచి 'వాళ్లిద్దరికి ఇవ్వేళ ఏదైన మిఠాయి చెయ్యాలి' అని చెప్పింది. 'ఎన్నో రకాల మిఠాయీలు వచ్చినందున వేరే ఏమీ చెయ్యవద్దు' అన్నారు వాళ్ళిద్దరు. కాని - "మీకేమి తెలుసు ? శాస్త్రానికి

ఏదైనా తప్పక చేయవలసిందే" నన్నది బామ్మ. అందుకు వాళ్ళిద్దరు ఏమీ మాట్లాడలేదు పూర్ణపు బూరెలు చెయ్యమని నన్ను ఆజ్ఞాపించింది బామ్మ.

ఆట అయిన తరువాత నేను బామ్మ తలకు నూనె రుద్దేటప్పుడు ఆమె మళ్ళీ "చూడు, మనూ! పాపం కటేలీ గారికి సంవత్సరాదినాడుకూడ భార్యా పిల్లల్ని వదలి మనతో పాటు జైలులో ఉండటం తప్పలేదు. ఆయనా, గిల్డరూ బయట ఉండివుంటే అందరివలెనే ఆనందంగా యుగాది పండుగ చేసికొని ఉండేవాళ్ళే. అందువల్ల మనం ఏమీ చేసి పెట్టకపోతే బాగుండదు. వంటి గంటకు భోజనానికి కూర్చునే టప్పటికల్లా నువ్వు వేడివేడిగా పూర్ణపుబూరెలు వండిపెట్టు" అని చెప్పింది.

బా అశక్తురాలై వుండికూడ ఒంటిగంటకు భోజ నాల బల్ల దగ్గరకు వచ్చి కూర్చొని వాళ్ళిద్దరిని బలవంతపెట్టి విందు తినిపించింది.

బా, బాపూజీలు తమ జీవితవిధానాన్ని మార్చుకున్న ప్పటినుంచి యేడాదిలో అన్ని రోజులూ ఒకేతీరున సమా నంగా గడుపుకుంటున్నారు. అయినా బామ్మ ఇతరుల విషయంలో పండుగలను, పర్వాలను అక్కరగా మన్నిస్తూనే ఉండేది.

ఆగాఖాన్ మహల్, పూనా,
16-9-'43

ఈరోజు మధ్యాహ్నం నేను బాపూజీ కాళ్ళకు నెయ్యి రాస్తున్నప్పుడు కటేలీగారువచ్చి "ఈసారి నిజంగానే నిన్ను

విడిచి పెట్టమని ఉత్తరువు వచ్చింది” అని నాతో చెప్పారు. “మీకందరికి వేరేపనేమీ లేనట్టున్నది. నన్ను ఏడిపించటం ఒక్కటే మీకువచ్చు. మీరెంత గేలిచేసినాసరే వెనకటి వలె నేను ఏడ్చేదిలేదు” అన్నాను నేను.

ఈమాటలు జరుగుతుండగానే నన్ను ఆటపట్టించే జట్టుజమకూడింది. కటేలీగారు ఆకాగితం బాపూజీ చేతిలో పెట్టారు. అదిచూచి, అది ఎగతాళికాదనీ, దొంగకాగితం బాపూజీ చేతి కివ్వరనీ, నిజంగా నన్ను విడుదల చేయ బోతున్నారనీ నాకు నిశ్చయమేర్పడ్డది. విడుదలైతే ఇక్కడి నుండి వెళ్ళిపోవలసివస్తుందని మనస్సులో వ్యాకులం తల యెత్తింది.

“ఇప్పుడు మనూకు వీడ్కోలు ఇవ్వాలి” అన్నా రందరు. బొమ్మకూడ మంచందిగి బాపూజీ పడుకొని ఉన్న చోటుకు వచ్చి అన్నది “అయితే ఇక మనూబాయి వెళ్ళి పోతుందన్నమాట! నాకు ఉత్తరాలు రాస్తుండు. నేరుగా కరాచీపోయి చదువుకో. పాపం! మీ అక్కలు నిన్ను చూడ టానికి తహతహలాడుతుంటారు. ఒకసారి పోయి అందరినీ కలుసుకో. వాళ్ళకు సంతోషం కలుగుతుంది. నువ్వు మాకు చాలా పరిచర్యచేశావు కాని ప్రభుత్వం ముందర మామాట ఏం సాగుతుంది, చెప్పు”

బా చివరికి అన్నమాట వినగానే బాపూజీ అన్నారు “కాని, ఉత్తరువులో ఏమున్నదో చూడు. సి. పి. ప్రభుత్వం నిన్ను విడుదలచేస్తున్నది. నువ్వు సి పి. ప్రభుత్వపుఖైదీవి. ఇతర

స్త్రీలను నాగపూరునుండి విడుదలచేస్తుండవచ్చు. అందుకని నీ ఉత్తరువు ఇక్కడికి పంపించారు అయితే, నువ్విక్కడ ఉండదలచుకుంటే ప్రస్తుతం నీమీదున్న నిర్బంధాలు అలాగే ఉంటాయి. లేక విడుదల కాదలచుకుంటే ఎప్పుడైనా విడుదల కావచ్చు."

నేను పోదలచుకోలేదని బదులు చెప్పాను నా ఆనందానికి మేరలేదు. ఉత్తరువు నాకీ వీలుకలుగజేస్తుందని అనుకోలేదు. బా బాపూజీల సేవచేసే భాగ్యం నాకు లేకుండా పోతుందేమో నని లోలోపల భయంకలిగింది. కొంత సేపటికి సాహసం చేసి నేనిలా అన్నాను "మీరు నన్ను ఎగతాళి పట్టించినా ఫరవాలేదు ఆగాఖాన్ మహల్లో ఉండే వీలు కలుగుతుందని మొదట నేను స్వప్నంలోకూడ ఊహించుకోలేదు నాపూర్వపుణ్యం వల్లనూ, బా బాపూజీల ప్రేమ ఆకర్షించినందువల్లనూ నేనిక్కడికి రాగలిగాను వీరి పవిత్ర సేవచేసే సదవకాశం నాకిచ్చి వెంటనే దాన్ని భగ్నంచేసేంత నిర్దయుడు కాడనుకుంటాను భగవంతుడు! అలాకాకపోతే భగవంతునిమీద నాకు రవంతైనా శ్రద్ధకలిగేదికాదు. ఈ వచ్చిన ఉత్తరువుకూడ ఎంత అనుకూలంగా ఉన్నదో చూడండి. ఒకరి అదృష్టాన్ని ఒకరు తొలగించగలరా?"

"నువ్వు ఏడ్చిపోతావని నీకీసదుపాయం కల్పించాము" అని కటేలీగారు పరిహాసానికి అన్నమాటకు అందరూ నవ్వారు

కొంచెంసేపు అయిన తరువాత బా మళ్ళీ అన్నది - "నువ్వు ఇంత చిన్నవయస్సులో మాకోసం ఎందుకు యాతన

పడుతున్నావు? విడుదలై బయటికి వెళ్ళినట్లయితే గొప్ప చదువు చదువుకోగలుగుతావు.''

"నా కిక్కడ అబ్బుతున్న చదువు ప్రపంచంలో వేరే ఎక్కడా అబ్బదు. నేను మిమ్మల్ని వదలిపోను'' అని స్పష్టంగా బదులు చెప్పేశాను

" నీమనస్సులో ఏమున్నదో తెలుసుకోవలెనని నీతో తర్కించాను అంతేకాని దీనిలో దుఃఖించవలసిన పనేమీ లేదు.'' అన్నది బొమ్మ.

"మనూ తండ్రిగారిని అడిగి తెలుసుకోవలసి వుంటుం దేమో ?'' అని కళేలీగారు బాపూజీని ప్రశ్నించారు

అందుకు బాపూజీ "ఈ పిల్లతండ్రి నా అన్నకుమా రుడు. అన్నకొడుకూ నాకొడుకూ ఒకటే. అతనికి నామీద ప్రగాఢమైన విశ్వాసమున్నది ఈ పిల్ల విషయంలో నాకోరికే అతని కోరికకూడాను. ఈ సంగతి నాకు బాగా తెలుసు. కూతుళ్ళకు స్వాతంత్ర్యం యిచ్చే తండ్రులలో అతనొకడు చిన్నవయస్సు పిల్లయినా మనూను జైలుకు పోవద్దని ఆయన నిలుపుదల చేయలేదు నేనెరిగినంతవరకు మనూకుగాని దాని అక్కలకుగాని తల్లిదండ్రులు ఏవిధమైన లోటూ కలిగించ లేదు. కనుక ఈమెతండ్రి విషయంలో నాకూ, మనూకూ ఏవిధమైన శంకలేదు.''

'విడుదల కావాలని నీకు ఏ స్వల్ప అభిలాషవున్నా నాతో స్పష్టంగాచెప్పు' అని బాపూజీ నన్ను మళ్ళీ అడి గారు. 'అంత స్పష్టంగా చెప్పిన తరువాతకూడ ఇంకా

యింకా అడిగారంటే నేను బదులు మాట్లాడేదిలేదు.’ అన్నాను నేను.

ఈ సంభాషణల మూలాన బాపూజీకి పడుకోటానికి రెండు గంటలైంది. రెండున్నరకు లేచి ఒక చిత్తుకాగితం మీద పెన్సిలుతో కటేలీగారికివ్వమని ఈ కింద రాసిన ఉత్తరం మసౌదా రాసి నాచేతికిచ్చారు. ఆ చిత్తు మసౌదా ఉత్తరం చరిత్రాత్మకమైన వస్తువుగా ఇప్పటికీ నాదగ్గర భద్రంగా ఉంది.

“ఆదరణీయులైన కటేలీగారికి,

సి. పి. ప్రభుత్వంవారి ఖైదులోవున్న నన్ను ఆ ప్రభుత్వం విడిచిపెట్టదలచిందనీ, అయినా నేను నా ఇష్ట ప్రకారం ఇక్కడ ఉండదలచుకొనే పక్షంలో ఇప్పుడున్న నిబంధనలకు లోబడివుండవచ్చుననీ మీరు నాకు వర్తమానం పంపారు. దానికి నన్ను సమాధానం ఇవ్వమని కోరారు. నేనిచ్చే సమాధానం ఇది: పూజ్యురాలైన కస్తూరిబాకు పరిచర్య చేయటానికే నేను ఇక్కడికి రావటం జరిగింది. కనుక ఆమె కోరుతున్నంతవరకు నేనిక్కడే ఉండ దలచాను నాపైన ఇప్పుడున్న నిబంధనలకుకూడ నేను అంగీకారం తెలుపుతున్నాను. విడుదల కావలెననే కోరిక పుట్టి నప్పుడు విడుదలై వెళ్ళిపోయే స్వాతంత్ర్యం నాకున్నదని అనుకుంటాను. అందువల్ల మా తండ్రిగారి అభిప్రాయం తెలుసుకోటంతో పనిలేదు. అయినప్పటికి ఈమారు నేను వారికి వ్రాయబోయే ఉత్తరంలో “ఇక్కడే ఉండటం నా కిష్ట”మని తెలియజేస్తాను.

బాపూజీ ఇచ్చిన మసౌదా ప్రకారం ఈ ఉత్తరం నా చేత్తో రాసి కటేలీగారి కిచ్చివచ్చాను. ఈ ఉత్తరంలో ఉన్న చివరి వాక్యానికి ఒక ఉద్దేశమున్నది. బొంబాయిలోని గృహవిభాగపు అధికారి అయ్యంగారు మా ఉత్తరాలు సరియైనవని అనుమతిస్తేనేకాని అవి పంపబడవు. ఇష్టమైన చోట ఆ అధికారి కొట్టివేతలుకూడ వేస్తాడు. అందుకనే ఆ చివరివాక్యంలో అనుకూలమైన సూచన చెయ్యటం జరిగింది. నాకైతే గొప్ప ఆపదనుండి తప్పించుకొన్నంత ఆనందం కలిగింది మనస్సులోనే భగవంతునికి ధన్యవాదం చెప్పుకున్నా ఈఉత్తరం మసౌదా కాగితం నాదగ్గరే ఉంచుకోటానికి అనుమతించి దాని నకలు డైరీలో రాసుకోమని బాపూజీ సలహా చెప్పారు.

ఈ పనిలో ఉండిపోవటంవల్ల మధ్యాహ్నం సుశీలక్క దగ్గర ఇంగ్లీషు పాఠం చదువలేకపోయాను బాపూజీ దగ్గర 4-30 మొదలు 5 గం. వరకు చదువుకొనవలసిన అరగంటలో నుంచి 15 నిమిషాలు తగ్గించి ఆ సమయంలో సుశీలక్క దగ్గర ఇంగ్లీషు పాఠం చదువుకొని రమ్మని బాపూజీ ఏర్పాటు చేశారు. ఈనాటికిమాత్రం చేసిన ఈ మార్పువల్ల ఇంగ్లీషు పాఠానికి నాగాలేకుండా వుండేందుకు వీలు ఏర్పడింది. బాపూజీ దగ్గర చెప్పించుకోనే సంస్కృత పాఠంకూడ తప్పిపోలేదు 5 నుండి 5-30 వరకు బామ్మకు భాగవతం చదివి వినిపించే కార్యక్రమంకూడ నిర్విఘ్నంగా కొనసాగింది. "ఏపని మిగిలిపోయినాసరే, బాకు భాగవతం వినిపించే సమయంలోనుంచి ఒక్క నిమిషంకూడ నువ్వు ఎవరికీ ఇవ్వ

కూడదు. ఇంకొకరు తీసికొనకూడదు; ఎందుకంటే బాకు అది ఆహారంవంటిది. రామాయణం, భాగవతం శ్రవణం చేయటంవల్లనే ఆమెకు ఆనందం కలుగుతున్నది." అని చెప్పారు బాపూజీ.

## ౧౮
## బా అంటే ఇటువంటిది

ఆగాఖాన్‌మహల్, పూనా,
17-9-'43

రెండవ కుమారుడైన మణిలాల్‌గాంధీకి బొమ్మ ఈ రోజు టెలిగ్రామ్ యిచ్చింది. దక్షిణాఫ్రికానుంచి మణిలాల్ కాకా ఉత్తరం రాక చాల కాలమైంది. అక్కడ ఏదో కారణంగా అప్పుడప్పుడు యుద్ధాలు జరుగుతూనే వుంటవి. అందువల్ల బాకు చింత కలిగింది దక్షిణాఫ్రికా పంపించమని టెలిగ్రామును నేను కటేలీగారి చేతి కందించాను. కాని ఆయన సాయంకాలం బాపూజీ దగ్గరకువచ్చి టెలిగ్రాం పంపించటానికయే ఖర్చు కస్తూరిబా నుండి వసూలు చేయవలసిందనే ఉత్తర్వు చూపించారు.

"పాపం, ఆమెదగ్గర ఒక్కదమ్మిడీకూడలేదు, కావాలంటే ఒకటో రెండో ఖద్దరు చీరెలు అమ్మివేసెయ్యండి, మూడు నాలుగు రూపాయలకు తక్కువలేకుండ వస్తాయి" అన్నారు బాపూజీ. అందరు పకపకా నవ్వారు. కటేలీగారు తిరిగి వెళ్లిపోయి ఈ సంగతి ప్రభుత్వానికి రాసి పంపించారు.

ఆగాఖాన్ మహల్‌కు అయ్యే ఖర్చులో పద్దు రాసుకో వచ్చని బదులువచ్చింది. బాపూజీ నవ్వుతూ "రాతిలోంచి నీళ్ళు వస్తేరావచ్చునేమోకాని నాదగ్గరనుంచి మాత్రం డబ్బు రాదని పాపం, ప్రభుత్వానికి తెలియదేమో? ఇటువంటు దానికి వాస్తవంగా నన్ను అడగనేకూడదు" అన్నారు.

పైన చెప్పిన సందర్భంలో బాపూజీ బాతో పరిహా సంగా: "నీవి ఒకటో రెండో చీరెలు అమ్మవలసివస్తుం దనుకున్నాను నేను. కాని ఆ పరిస్థితి రాలేదు. నాకోల్లాయి (రెండున్నర గజముల పొడవు, ఒక గజం వెడల్పు గలది) అమ్మితే ఒలిగ్రాంకు కావలసిన డబ్బు ఎవడూ ఇవ్వడు, చీరెకు తప్పకుండ కావలసిన డబ్బు వస్తుంది" అంటూ బామ్మను కొంచెంసేపు నవ్వించారు.

కాంగ్రెస్‌మీద మోపిన నేరాలకు బాపూజీ సమా ధానం పంపించారు. అది అందినట్లు తెలియజేస్తూ సర్ టాటెన్‌హామ్ తరఫున-'మీరు పంపిన జవాబు అందింది. దానికి ప్రత్యుత్తరం పంపించే ఆలోచన జరుగుతున్నది' - అని మాత్రం సూచన వచ్చింది.

ఆ ఉత్తరం వచ్చినప్పుడు బామ్మ అక్కడనే ఉన్నది. "మీరందరు రాత్రిళ్ళు జాగరణచేసి అంత పెద్ద జవాబు రాసి పంపించారు సత్యాసత్యాలతో పనిలేని ప్రభుత్వం మీద మీరిచ్చిన జవాబు ఏంపనిచేస్తుంది? మీరీ పోరాటం లేవదీశారు, అందుకని ప్రభుత్వ మెందరో్ని చంపివేసింది. వ్యర్థంగా ఉత్తరాలు రాసి ప్రభుత్వంద్వారా అవమానం పొందుతున్నారు." అన్నది బామ్మ విచారంతో.

బాపూజీ : దీనిలో మనకు అవమానం రవంతైనా లేదు. సత్యానికెన్నడూ అవమానం జరగదు.

బా :- సత్యానికి అవమానం లేకపోవటం నిజమే. ఉపవాసంరోజుల్లో ప్రభుత్వం ఎటువంటి ఉత్తరాలు రాసిందో! కాని ఇప్పటివరకు తమవల్ల తప్పు జరిగిందని ప్రభుత్వం ఒప్పుకున్నదేమో చూడండి.

బాపూ :- (నవ్వుతూ) ఒక ఉపాయమున్నది. నువ్వూ నేనూ ప్రభుత్వానికి క్షమాపణపత్రం రాసిపంపించుదాం ఇవ్వేళ.

బా :- చాలులెండి, క్షమాపణ నేనెందుకు కోరతాను? నేను తప్పుచేశానని ఒప్పుకుంటేకదా?

బాపూ :- అలా అయితే నేను కోరనా?

బా :- (చిరాకుతో) ఈ మనూ, సుశీలావంటి పిల్లలూ, ఇంకా వీళ్లకన్న చిన్నవాళ్ళయిన సుకుమార బాలబాలికలూ ఎందరో జైళ్ళల్లోపడి మగ్గుతూంటే మీరు క్షమాపణ వేడుకుంటారా?

బాపూజీ గంభీరమైన ముఖముద్రతో బామ్మ చెప్పిన మాటలు వింటుంటే - 'ఈయన నిజంగానే క్షమాపణ కోరుతాడేమో' అన్న శంక నాకు కలిగింది. ఏదేమైనాసరే బాపూజీ ఆత్మగౌరవానికి, సత్యనిరతికి దెబ్బతగలకూడదని బామ్మ సంకల్పం. 'క్షమాపణే కోరేపక్షాన అపయశస్సు

తప్పదు; ఆ అపకీర్తి నాకు సహించరానిది' - అని బాపు
క్షుభపరచుకొన్నది.

ఆమె చిరాకుతో బిగ్గరగా మాట్లాడింది అందువల్ల దగ్గు వచ్చింది అదిచూచి నేను బాపూజీతో - "మీరు బామ్మ నెందుకు రెచ్చగొట్టారు? చూడండి, ఎలా దగ్గుతో బాధపడుతున్నదో!" అన్నాను.

బాపూజీ: "నిజమే నువ్వు చెప్పింది. కాని బా ఎంత అమాయకురాలో ఎంత నిర్దోషో చూడు. నేను నవ్వుతూ అన్నమాటను ఈమె నిజమనుకున్నది తన ప్రాణంపోయినా ఆమె నన్ను జారవిడువదు. నన్ను వెంబడిస్తూ నడిచే మహా మంత్రం ఈమె సాధన చేసింది. నన్ను అనుసరించి నడచుకొనే విషయంలో ఈమె ఎల్లప్పుడు తన బుద్ధినే ఉపయోగించిందని చెప్పటానికి వీలులేదు. అయినా ఆమె చేసిందంతా నామీద శ్రద్ధవుంచే చేసింది బుద్ధి ఎంత తీవ్రంగా ఉన్నప్పటికీ హృదయం పాషాణంవలె ఉన్నట్లయితే ఆ బుద్ధి ఏమీ పని చేయదు. బుద్ధి హృదయాన్ని అనుసరిస్తూ పోవలసిన వస్తువు. నువ్వు చూస్తున్నావు గదా! నేను క్షమాపణమాట ఉచ్చరించగానే ఆమెకు అందులో మా ఇద్దరికి అవమానం గోచరించింది. కోపంతో మండిపడింది. ఆమె నన్ను ఎంతో గొప్పగా భావిస్తుంది. బా హృదయంలోని పవిత్రత నాకు శోభను తెచ్చిపెట్టింది ప్రజలు నాకు 'మహాత్మా' బిరుదాన్నిచ్చారు. కాని ఆ గౌరవానికి బాయే కారణమని నా నమ్మకం. ఆమె తోడ్పాటు నాకు లేకపోతే నేనేపనీ

చేయగలిగివుండేవాణ్ణికాదు. బండికుండే రెండు చక్రాలలో ఒకటి పనిచేయకపోతే బండి కదలనే కదలలేదు. ఒకచక్రంలో ఏదైనా లోపమున్నా లేక విరిగిపోయివున్నా ఆ బండి నడక సరిగా వుండదు. భార్యాభర్తల జీవితంకూడ అంతే. బా ఎక్కువ చదువుకున్నది కాకపోయినా హిందూ(స్త్రీ) అన్ని ధర్మాల్లోకి శ్రేష్ఠమని నమ్ముతున్న పాతివ్రత్య ధర్మాన్ని చక్కగా అలవరచుకున్నది. ఎన్నోసార్లు నావల్ల తప్పు జరుగబోయే సమయానికి నన్ను మేల్కొలిపి ఒప్పేదో తెలియజెప్పింది. పాతివ్రత్య ధర్మం ఆమె విషయంలో కేవలం పుస్తకాలలో రాసిన ధర్మంగా వుండిపోలేదని నీకు వివరించి చెబుతున్నా. మేము దక్షిణాఫ్రికాలో ఉన్నప్పుడు పంచమ జాతి తల్లిదండ్రులకు పుట్టిన ఒకక్రైస్తవ కుఱ్ఱవాడు నాదగ్గర గుమాస్తాపని చేస్తుండేవాడు. అక్కడి ఇండ్లలో మన ఇండ్లలోలాగ పాకీదొడ్లు, ఉచ్చలదొడ్లు విడిగా వుండేవికావు. ఇంట్లోనే ఒక కుండో లేక మూకుడో పెట్టివుండేది అతిథులుగా వున్నవారి మూకుడు నేనన్నా, బా అన్నా తీస్తుండేవాళ్ళం. ఈ క్రిస్టియన్ కుఱ్ఱవాడు ఇంకా అతిథిగానే ఉండేవాడు. అతడుపయోగించిన మూకుడు బా మూతిముడుచుకొని నిరసన భావంతో తీసివేసింది, నవ్వుతూకాదు. అందుకు నాకు కోపంవచ్చింది. బా కూడ ధుమధుమలాడింది ఆమెను చెయ్యిపట్టుకొని బయటికి తీసికొనిపోయేటప్పుడు ఏడుస్తూనే నన్ను చీవాట్లుపెట్టింది! "మీకు సిగ్గూయెగ్గూ లేకపోతేనాకు లేదనుకున్నారా? ఎవరైనా చూచినా, విన్నా ఏమంటారు? మనిద్దరిలో ఎవరికీ మర్యాద వుండదు!" అన్నది. ఈ ఉదంతం

నేను 'ఆత్మ కథ'లో గూడ వివరించాను. పాతివ్రత్యంతో పాటు బాలో నిర్భయత్వంకూడ ఉన్నది. నీకివ్వేళటి కథ ఇప్పుడే వినిపించాను. ఇక రాత్రికి చెప్పను.'' అన్నారు.

బాపూజీ తమ జీవిత గాథను రోజుకొక కథకింద నాకు చెప్పేవారని వెనక రాశాను. ఈ కథకూడ దానికిందికే వస్తుంది

ఈవేళ మూడో ఘటనకూడ ఇలాగే జరిగింది. సుశీలక్క స్నానాల గదిలో కాలు మడతపడి కిందపడింది. గట్టి దెబ్బతగిలి దానివల్ల జ్వరంకూడ వచ్చింది. ఈ కారణంగా సాయంకాలం బాపూజీకి పాలు ఇవ్వటానికి అయిదు నిమిషాలు ఆలస్యం జరిగింది. ఆయనకు ఆహారం ఇచ్చేపనంతా సుశీలక్క స్వయంగా చేస్తుండేది ఉదయంపూట ఆమెకు వేరేపని ఉండేది అందువల్ల బా, బాపూజీల కిద్దరికి పొద్దుటి భోజనం నేనే తయారుచేసి పెడుతుండేదాన్ని. నాకు సాయంకాలం 5 గంటలకు బాకు రామాయణం చదివిచెప్పే పని ఉన్నందువల్ల సుశీలక్క బాపూజీకి ఆహార మిస్తుండేది. బామ్మ ఆరోగ్యంకూడ ఎగుడుదిగుడుగానే ఉంటుండేది. నేను పాలు పొంగిస్తుండగా మెల్లగా నడుస్తూ, దగ్గుకుంటూ బామ్మ భోజనశాలలోకి వచ్చి "ఇంకా ఇంతవరకు బాపూజీకి పాలు ఇచ్చిరాలేదా?'' అని అడిగింది.

"ఇదిగో తీసికువెళుతున్నా. నువ్వెందుకు వచ్చావమ్మా ఇక్కడికి ? బాపూజీ, సుశీలక్క కోప్పడతారుగదా?'' అన్నాను

బా "సుశీలకు ఒళ్ళు బాగలేదని నీకు తెలుసుగదా, ఈ సమయానికి ఈపని చెయ్యాలని నువ్వు అక్కరగా గమ నించవద్దా? ముందుపని ముందు, వెనకపని వెనక. రామా యణం చదవటం అయిదు నిమిషాలు ముందుగా ముగించి ఉండవచ్చును గదా?"

బాపూజీకి పాలు అందించేటప్పుడు అయిదు నిమిషాలు ఆలస్యం జరిగిందని ఆయనతో అన్నానునేను. 'మునిగిపోయిం దేమీలేదులే' అన్నారు బాపూజీ. 'కాని బామ్మ నన్ను కోప్పడుతున్నది' అన్నానునేను. ఇంతలోకే బా అక్కడికి వచ్చి బాపూజీతో - "ఈ పిల్ల అయిదు నిమిషాలు ఆలస్యం చేసింది. ఇవేళ తానే పాలూ, ఖర్జూరం ఇవ్వాలని దీనికి తెలుసు. అటువంటప్పుడు గడియారం దగ్గరపెట్టుకొని రామా యణం చదువవలసివుంది' అన్నది.

బాపూజీ :- ఏం పరవాలేదులే, బయటవున్నప్పుడు కలుసుకోటానికి వచ్చేవారికి సమయం ఇచ్చినట్లుగా ఇక్క డెవరికీ సమయం నిర్ధారణ చేయలేదుగా ?

బా :- కానీ, వేళ తప్పక పనిచేయటం మీకెంతో ఇష్టమని నాకు తెలుసుగదా? ఇక్కడకూడ మీరు మీ పను లన్నీ వేళ తప్పకుండా చేసుకుంటున్నప్పుడు ఈవేళమాత్రం ఆలస్య మెందుకుకావాలి?

నేనూ, బాపూజీ బదులు చెప్పలేకపోయాం. నావల్ల తప్పు జరిగింది. కాదని ఎలా అనగలను. బా చెప్పింది యుక్తి యుక్తంగా ఉన్నప్పుడు బాపూజీ మాత్రం ఏమనగలరు?

కొయ్య గరిటెతో పాలు చప్పరిస్తూ బాపూజీ ఒకే ఒకమాట అన్నారు - "బా అంటే ఇటువంటిది."

## ౧౯

# వెన్న తీశాను!

ఆగాఖాన్ మహల్, పూనా
18-9-'43

శ్రావణ మాసపు మొదటి ఆదివారం మాకు చాలా ముఖ్యమైనరోజు. దాన్ని 'వీరపసలీదినం' అంటాం. ఆనాడు అన్నదమ్ములు తమ అక్కచెల్లెండ్రను ఏదైన కానుకతో సత్కరించటం ఆచారం. ఈ ఆచారాన్ని పాటించే ఉద్దేశంతోనే బాపూజీకి అక్కగారైన గోకీబాయికీ, ఆమెకుమార్తె ఫూలీబాయికీ చెరొక చీరె, రెవికెలగుడ్డ తన తరపున పంపించవలసినదని బామ్మ ఆశ్రమానికి ఉత్తరం రాయించింది. దానికి జవాబీరోజు వచ్చింది. ఆ ఉత్తరం రాసిన వాళ్ళు చీరెలేపెట్టెలో ఉన్నవో, ఆపెట్టె ఎక్కడున్నదో తెలియజేయవలసిందని అడిగారు. శ్రావణ మాసపు మొదటి ఆదివారం గడిచిపోయి నెలరోజులైంది. పైనచెప్పిన ఉత్తరం నాపేర ఒక చుట్టం రాశాడు, అది ఈవేళ చేరింది. నేను బామ్మకు చదివి వినిపించాను.

బామ్మ అన్నది : "వీళ్ళేం మనుష్యులు? 'వీరపసలీ' గడచిపోయి ఎన్నో రోజులైంది! ఇంతవరకు వీళ్ళకు నల్లంచు చీరెలే కనిపించలేదు. నా గదిలో పెద్దభోషాణం ఉన్నట్లు,

దానిలో ఏవస్తువు ఏమూలనో కనిపించకుండ దాచివుంచినట్టు! వీళ్ళకు మతిపోయిందేమో? గొళ్ళెం, తాళం రెండూలేని పెట్టెలో నా చీరెలు పైనే పెట్టివున్నాయిగదా! వీళ్ళ కెందుకు కనిపించలేదు? నేను బ్రతికి వున్నంతవరకు ఆడ బిడ్డలకి కట్నాలిస్తాను, తరువాత బాపూజీ ఎవరికేమిస్తారు? 'నాదగ్గర ఇవ్వటానికేముంది' అంటారు ఆ రెండు చీరెలు నేను గోకీబాయికి, ఫూలీబాయికీ యివ్వటానికి ప్రత్యేకంగా దాచి పెట్టాను. కొంచెం ముతకగా వున్నాయి, అయినా చలికాలం కట్టుకోవచ్చు. కాని ఎప్పుడు చెయ్యాల్సింది అప్పుడుచేస్తేనే అందం ఈసారి పాపం గోకీబాయి ఏమనుకొన్నదో? సంవత్స రానికి ఒక్క-చీరేకదా ఆమె ఆశించేది? ఇప్పుడు అన్ని సంగ తులు తెలియజేస్తూ వివరంగా ఉత్తరంరాయి వెనుకటి ఉత్తరం నువ్వు సరిగా రాశావో లేదో? చీరెలెందుకు కని పించలేదు? అవి కనిపించకపోతే వేరే ఏవైనా తెల్లచీరలు పంపించమని ఇవ్వేళే ఉత్తరంరాయి. బాపూజీ పుట్టినరోజు వస్తున్నది. అప్పటికైనా అందితే చాలు."

బాపూజీ, మహాత్ముడుకదా' ఆయనకు అన్నిరోజులూ సమానమే. కాని సోదరునిద్వారా సోదరికి జరుగవలసిన మర్యాదలు వదినెగారు ఎంత మంచిమనస్సుతో జరిపిస్తు న్నదో! 'వీరపసలీ' నాటికి సోదరుని దగ్గిరనుండి బహుమాన మేమీ రాకపోయేసరికి ఆడబిడ్డ ఎంత నొచ్చుకున్నదో నని బాకు విచారం కలిగింది. ఇటువంటి వ్యావహారికమైన లాంఛ నాలను, ఆచారాలను పాటించటం బామ్మ మరచిపోలేదు.

ఈవేళ జరిగినదానికి బాకు దుఃఖంవచ్చింది. మన స్సుకు కష్టం కలిగినప్పుడల్లా ఆమె 'భజనావళి' తీసికొని కూర్చుంటుంది. ఆ వాడుకచొప్పున ఇవ్వేళకూడ పది గంటలకు స్నానంచేసి సోఫాలో కూర్చొని శ్లోకం, దానికి అర్థం చదవటం మొదలుపెట్టింది :

గోవింద ! ద్వారకావాసిన్ ! కృష్ణ ! గోపీజనప్రియ !
కౌరవైః పరిభూతాం మాం కిం నజానాసి కేశవ ?

'భజనావళి' లో ఈ శ్లోకం స్త్రీల ప్రార్థనల కింద ఉన్నది. బా తన మనోవ్యథను తగ్గించుకోటానికి సాధారణంగా ఈ శ్లోకంచదువుకుంటూ ఉంటుంది. కాని దీనికి తన కిష్టంవచ్చిన అర్థం చెబుతూ అందరూ వినేటట్టు బిగ్గరగా ఉచ్చరిస్తుంది , "ఓ ప్రభూ! ఓ ఈశ్వరా! ద్రౌపదివలె నేను కూడ నిన్ను ప్రార్థిస్తున్నాను. 'కౌరవులు' - అనగా ఆంగ్లేయులచే ఆక్రమింపబడిన యీ దేశాన్ని రక్షించు. ఎందరో నిరపరాధులు జైళ్ళలో బాధలు పడుతున్నారు. వారిని విడిపించు, బంధించదలచుకుంటే, మా యిద్దరినే బంధించివుంచు, నేనిక ధైర్యం వహించలేను."

ప్రార్థన రూపంలో ఈ మాటలు ఆమె పలుకుతూ వుంటుంది. చాటున దాగివుండి ఈ మాటల్ని నేనెన్నోసార్లు విన్నాను పూజ్యురాలైన బామ్మ మిక్కిలి దీన స్వరంతో - "నీవు బంధించదలచుకొంటే మా యిద్దరినే బంధించుగాని ఇతరుల నెవర్నీ బంధించకు, విడిచిపెట్టు"అని ప్రార్థించినప్పుడు ఆమె భావన స్వార్థరాహిత్యపు శిఖరాల నంటుకొంటుంది.

బా సోఫాలో ఆనుకొని కూర్చొని ప్రార్థన చేస్తున్నప్పుడు నేను బాపూజీ కోసం వెన్న తీయటానికి పెరుగు చిలుకుతున్నాను. ఆమె ప్రార్థన అయిపోయింది, కాని నాపని పూర్తి కాలేదు.

"కవ్వం సమానంగా తిరగాలి, అప్పుడే వెన్న చక్కగా వస్తుంది" అన్నది బా.

"ఇదుగో ఇప్పుడే తీసేస్తున్నా, వెన్న" - అని బదులు చెప్పి వెంటనే ఆ చిలికిన పెరుగు ఒక గుడ్డలో వడబోశాను. నీళ్లు పోయనందువల్ల పెరుగుపల్చబడి అలాగేఉండిపోయింది. దానిలోవున్న నీళ్ళను పిండి తీసివేశాను. గుడ్డమీద పేరుకొని ఉన్న గట్టి పెరుగుముద్ద ఒక గిన్నెలో నింపి సంతోషపడుతూ బా దగ్గరికిపోయి: "చూడు బామ్మా, నేను వెన్న ఎంత త్వరగా తీశానో! బాగున్నదికదూ?" అన్నాను. నేనది నిజంగా వెన్నే అనుకున్నా. గుడ్డతో వడగట్టి తీస్తే వెన్న ఇంత చక్కగా, ఇంత ఎక్కువగా వస్తుందికదా, అని సంతోష పడుతూ నేను కనిపెట్టిన ఈ కొత్తపద్ధతికి మురిసిపోయాను.

కాని, బామ్మ నాపరాక్రమానికి మోసపోయే మనిషి కాదు రెండు శేర్ల మేకపాలలోనుండి గిన్నెనిండా వెన్న ఎలా వచ్చిందా అని ఆమెకు ఆశ్చర్యం కలిగింది.

"నేను నమ్మను, నువ్వు పొరపాటున బట్టె పెరుగు చిలికావేమో"- అంటూ ఆమె బయటి వరండాలోకి వచ్చి, నేను వడగట్టిన గుడ్డ, నీళ్ళు వగైరా చూచి వెన్న తీయటానికి నేను కనిపెట్టిన కొత్త పద్ధతికి - అనగా నా మూర్ఖత్వా

నికి - నవ్వటం మొదలుపెట్టింది. ఆమె నవ్విన నవ్వుకు పది నిమిషాలవరకు ఆగకుండ దగ్గువచ్చింది.

నేను నిర్ఘాంతపోయి చూస్తున్నా. ఆమె అంతగా ఎందుకు నవ్విందో నాకు బోధపడలేదు దగ్గుఆగి, ఆయాసం తగ్గిన తరువాత నాతో అన్నది - "నువ్వు వెన్న తీయలేదు. శ్రీఖండం తయారుచేశావు ఈ సంగతి బాపూజీతో చెప్పా, ఎంత తెలివితక్కువదానవే నువ్వు! మేము మాచిన్నతనంలో కుండనిండా మజ్జిగ చిలకటానికి పెందలకడనే లేచి ఆయాసం వచ్చేవరకు చిలికేవాళ్ళం. నీమాదిరిగా గుడ్డతో వడగట్టి పెరుగునే వెన్నఅని యిచ్చినట్లయితే మాగతి ఏమైవుండేదో! దీనిలోంచి వెన్న ఎలా తియ్యాలో చూపిస్తా, పద."

ఈ విధంగా నన్ను చీవాట్లుపెట్టి బా'మ్మ ఆ పెరుగును, దానిలోవచ్చిన నీళ్ళకుకలిపి మళ్ళీచిలికించింది. రోజుమాదిరిగా చిలకటానికి సరిగా అరగంట పట్టింది ఇంతకుపూర్వం నేను రోజూ వెన్న తీస్తుండేదాన్నే, కాని ఇవ్వేళ చిలకటానికి చాలాసేపు పట్టింది. పైగా బా'మ్మ 'కవ్వం ఒకే రీతిగా తిప్పాలి సుమా' అని గద్దించింది అంతటితో నాకో కొత్త ఉపాయం తోచింది. రోజూ మజ్జిగ చిలికి వెన్నతీయటానికి అరగంట పడుతున్నది. ఈ విధంగా వడబోసితీస్తే అయిదారు నిమిషాల్లోనే పని అయిపోతుందికదా, ఇలా ఎందుకు చేయ కూడదు- అని ఆలోచించి నేనిలా చేశాను. చివరకు బా'మ్మ నానెత్తిమీద కూర్చొని రోజూ చేసినట్టు అరగంటసేపు చిలి కించి వెన్నతీయించింది.

తరువాత బాపూజీ దగ్గరకువెళ్లి "ఇవ్వేళ మనూకు మీామీద ప్రేమ పొంగివచ్చింది, తినటానికి శ్రీఖండం తయారుచేసింది" అని చెప్పి నా ప్రతాపమంతా వివరించింది. బాపూజీకి భోజనం వడ్డించి నా తెలివితక్కువ తనానికి సిగ్గుపడుతూ నేను అక్కడ ఉండకుండా వచ్చేశాను. కాని నేను పోయిన కొత్తపోకడకు వారందరు నవ్విన నవ్వుతో గది అంతా ప్రతిధ్వనించింది నా ఆత్మగౌరవం దెబ్బతిన్నది. నేను నా తెలివితేటలు ఉపయోగించి పనిచేస్తే వీళ్ళు నన్నెందుకు ఎగతాళి చెయ్యాలి? ఈ ప్రశ్న నా మనస్సులో ఉదయించింది. కాని దీనికి సమాధానం నాకప్పుడు తెలియలేదు. అందుకనే కోపంవచ్చి ఆరోజు డైరీలో 'నా ఆత్మగౌరవానికి భంగం కలిగింది' అని రాసుకున్నాను.

కాని, నేను ఆలోచించుకుంటే నాటి నా చిన్నతనపు చేష్టకు నవ్వువస్తున్నది బా రెండోసారి నాచేత చిలికించి వెన్న తీయటం స్వయంగా నేర్పింది. ఆమె ప్రేమను పూజ్యభావంతో స్మరించకుండా ఉండలేను. ఆరోజుల్లో పనిచేయటానికి నాకు కొంచెం సోమరితనంకూడ వుండేదని ఇప్పుడు అర్థమాతున్నది. ఆ సోమరితనంవల్లనే పని తప్పించుకోటానికి ఏదైనా ఆలోచిస్తుండేదాన్ని. కాని బా, బాపూజీల సాన్నిధ్యంలో ఉన్నందువల్లను, వారి నిశితదృష్టి నామీాద ఎప్పుడూ వుంటూ వున్నందువల్లను ఈ దుర్గుణం క్రమంగా నశించి పోయింది

కుమ్మరి కుండను ఆవంలో కాల్చి అందంగా తయారు చేసినందువల్లనే దానికి ఒక విలువ, ప్రయోజనం ఏర్పడి

నట్టుగా ఆగాఖాన్ మహల్‌ల్లో ఆనాడు చిన్నతనంలో నా కబ్బిన తర్ఫీదువల్లనే నా జీవితానికి ప్రయోజనమూ, విలువ ఏర్పడ్డాయి. ఈమేలును మాటలతో వర్ణించటంసాధ్యంకాదు.

## ౨౦
## నిజమైన స్వదేశీ

ఆగాఖాన్ మహల్, పూనా,
19-9-'43

బాపూజీకి సంబంధించిన పనులమీాద - ముఖ్యంగా ఆయన ఆహారం విషయంలో - బామ్మ స్వయంగా జాగ్రత్త తీసికొని తనిఖీచేస్తుంటుందని వెనుకటి అధ్యాయంలో రాశాను. జబ్బుగావున్నటికీ ఆమె పడుకొనో, కుర్చీలో కూర్చొనో ఇటూ అటూ చూస్తూనే పరీక్షిస్తూ ఉంటుంది.

రోజూ సాయంకాలం వచ్చే మేకపాలను మీారాబహినే వడబోస్తుంది. ఇవ్వేళ ఆమె ఆరోగ్యం బాగాలేనందున ఆ పని నేను చెయ్యాల్సివచ్చింది ఆమె రోజూ వడబోసే గుడ్డ నాకు కనిపించలేదు. ఆమె నిద్రపోతున్నందున అడగటానికి వీలులేకపోయింది. ఏదో ఒక సన్నగుడ్డ నాకు దొరికింది. బయటినుంచి వచ్చిన పండ్లు ఆగుడ్డలో కట్టివచ్చినవి అది శుభ్రంగానూ, సన్నగానూ ఉన్నందున ఎందుకైనా పనికి వస్తుందని నేను భద్రంచేశాను ఇవ్వేళ దాన్ని బయటికి తీసి ఉతికి, పాలు వడపోస్తుండగా బామ్మ వచ్చింది. పాలు సాధారణంగా నాలుగు లేక నాలుగున్నర గంటలకు వచ్చేవి.

అదే సమయానికి డా॥ గిల్డరు, కటేలీగారు, బొమ్మ సాయం కాలం టీ తాగటానికి బల్లదగ్గరికి వచ్చేవారు. బొమ్మ వేడి నీళ్ళు, తేనె తాగి, వీళ్ళకు టీ యిచ్చి, ఏదైనా ఫలహారం కూడ పెట్టించేది.

నేను పాలు వడబోస్తుండగా "మీరాకు ఒంట్లో ఎలా వున్నది?" అని అడిగింది బొమ్మ.

"నాకు వడబోసే గుడ్డ కనిపించకపోతే అడగటానికి వెళ్ళాను ఆమె నిద్రపోతున్నది; నేను లేపలేదు" అన్నాను నేను.

బా "అయితే ఈ గుడ్డ ఎక్కడిది? దేనిలోంచి చింపావు? ఉతికావా లేదా?" అని అడిగింది.

"కరాచీనుంచి ఖర్జూరం కట్టివచ్చిన గుడ్డయిది; కొత్తది, ఉతికి దాచివుంచాను, ఇప్పుడు మళ్ళీ బాగా వుతికి పాలు వడబోస్తున్నా" నన్నాను నేను.

బొమ్మ ఆగుడ్డను చేతబట్టుకొని ఇటుఅటు తిప్పిచూచి ఇలా అన్నది- "ఈ మిల్లుగుడ్డతోనా బాపూజీకి పాలు వడ బోసేది? ఇది మిల్లులో తయారైంది. ఇవి మిల్లుగుడ్డతో వడ బోసిన పాలని తెలిస్తే బాపూజీ మనస్సుకు కష్టంకలుగుతుంది. మనదగ్గర ఖద్దరు గుడ్డలకు కరువువచ్చిందా? మనమే మిల్లు గుడ్డలు ఉపయోగిస్తే ఏమి బాగుంటుంది? మిల్లుగుడ్డతోనే మనపని జరిగేట్టుగావుంటే ఆపనే వదలుకోవటం మంచిది. మిల్లు గుడ్డల్ని, విదేశపుగుడ్డల్ని మనమసలు ఉపయోగించ కూడదు. మిల్లుగుడ్డ చూడటానికి సన్నగా వుంటుంది. అందుకని వడబోయటానికి బాగుంటుందనుకుంటాం. కాని

అది నిజంకాదు. ఖద్దరు ముతకగా వుంటుంది. దానినేత దూరదూరంగా వున్నందువల్ల మిల్లుగుడ్డకంటే అదే పనికి వస్తుంది మిల్లు గుడ్డతో కాగా వడబోయవచ్చు నను కున్నావు. అదీగాక మిల్లుగుడ్డ కట్టుకుంటే తప్పుగాని వడ బోయటానికి వుపయోగిస్తే ఏంపరవాలేదని నువ్వు భావించి వుండవచ్చు కాని అది చాలా పొరపాటు. ఇవ్వేళ దీనితో పాలు వడబోశావు, రేపు ఇది మెత్తగాను, సన్నగాను వున్నది గనుక కట్టుకోటానికి బాగుంటుంది - అని బుద్ధి పుడు తుంది. ఈవిధంగా మనస్సు చలించిపోతుంది. మిల్లుగుడ్డతో వడబోసిన పాలు పొట్టలోకిపోతే ఒక విధంగా పాపమే పొట్ట లోకి పోయిందని అనుకోవలసి వస్తుంది. మనం స్వదేశీని గురించి ప్రతిజ్ఞ చేశాము. బాపూజీ ఎంత ఖచ్చితంగా ప్రతిజ్ఞా పాలన చేస్తారో నీకు తెలియదు. భవిష్యత్తులో నువ్వు జాగ్ర త్తగా వుండటాని కిన్నిమాటలు చెబుతున్నాను. ప్రతిజ్ఞను పాలించేవాళ్ళు వున్నట్టుగానే, పాలింపజేసేవాళ్ళు కూడా ఉండాలి. నువ్విప్పుడు నాతోనూ, బాపూజీతోనూ ప్రతిజ్ఞ పాలింపజేసేదానివి. నువ్వు ఎప్పుడైనా మేకపాలకు బదులుగా బాపూజీకి గేదె పాలిచ్చినట్లయితే ఆ దోషం బాపూజీది కాదు, నీదే అవుతుంది. కనుక మీరిద్దరు ప్రతిజ్ఞను పాలించ వలసినవాళ్ళే! అలావుంటేనే చేసిన ప్రతిజ్ఞ నిజమనిపించు కొంటుంది, కాకపోతే పీలువెంట నడుచుకొనే ధర్మం మాదిరి కేవలం ఆడంబరమౌతుంది. ఇప్పుడు ఖద్దరు గుడ్డతో రెండో సారి వడబొయ్యి. దీన్నిబట్టి ఇకమీద జాగ్రత్తగా వుండటం నేర్చుకో."

నేను ఆ పాలను మళ్ళీ ఖద్దరు గుడ్డతో వడబోశాను. ఈ దెబ్బతో నాకు ప్రతిజ్ఞను పాలించటంలోవున్న సూక్ష్మాలు బాగా తెలిసిపోయాయి. మిల్లుగుడ్డతో వడబోసిన పాలను మళ్ళీ రెండవసారి ఖద్దరుగుడ్డలో వడబోయించి ఖద్దరు ప్రాముఖ్యాన్నేవిధంగా బా నొక్కి వక్కాణించిందో, ఆ సంగతంతా నేను బాపూజీకి చెప్పాను.

అంతావిని బాపూజీ ఇలా అన్నారు; "బా చదువు రానిదైనా తాను గ్రహించి తెలుసుకొన్న విషయాన్ని చక్కగా విడమర్చి సూక్ష్మాతి సూక్ష్మంగా విమర్శించేనేర్పు ఆమెకున్నది. కాలేజీలో ప్రొఫెసరు ఏదైన విషయాన్ని నిశితంగా విమర్శిస్తూ విద్యార్థులకు ఉపన్యసించినట్టుగానే బా తాను జీర్ణించుకున్నంతవరకు ఖద్దరు తత్వానికి జ్ఞానమూ, శ్రద్ధా జోడించి ఇవ్వేళ నీకు బోధించింది. ప్రతి ఏకాదశి నాడు ఏకాదశీ మహాత్మ్యం బా నీచేత చదివించుకొని వింటున్నదిగదా! ఆవిధమైనదే ఈ పవిత్రమైన ఖద్దరు మహాత్మ్యం కూడ! ప్రతి యింటా తల్లులు తమ పిల్లలకీ విధమైన శిక్షణ గరపటం మొదలుపెడితే నాకు సంపూర్ణమైన సంతోషం కలుగుతుంది. దీనికి రేఖాగణితాలు, బీజగణితాలు నేర్చుకోవలసిన అవసరం లేదు. కేవలం జ్ఞానంతో కూడిన శ్రద్ధ కావాలి. గీతామాత ఏమి చెబుతున్నదో చూడు :

> శ్రద్ధావాన్‌లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః
> జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతిమచిరేణాధి గచ్ఛతి,
> అజ్ఞశ్చా శ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి
> నాయం లోకోస్తి న పరో న సుఖం సంశయాత్మనః.

ఈ విధమైన శ్రద్ధతోనే బా నన్ను అనుగమిస్తూ తన జీవితాన్ని నడిపించుకొని వచ్చింది. శ్రద్ధా, పరిశుద్ధమైన భావనా వున్నప్పుడే జ్ఞానం స్వయంగా ఉదయిస్తుంది. శంకతో కూడినదైతే జ్ఞానోదయం కానేకాదు. కనుక సంశయం గల వారికి ఎక్కడా సుఖముండదు. ఖద్దరు ఆరంభించినప్పుడు బాకు దాన్ని గురించిన తత్వమేమీ తెలియదు. చర్ఖా చరిత్ర కూడ ఆమె యెరుగదు. చర్ఖావల్ల దేశాని కెంతలాభం కలుగుతుందో ఆ లెక్కలుకూడా ఆమెకు తెలియనే తెలియవు. కాని ఆమె కేవలం శ్రద్ధతోనే నా కోరికను మన్నించింది. దీన్ని గురించి ఆమెకిప్పుడు కలిగిన జ్ఞానమంతా స్వయంగా కలిగిందే! ఖద్దరును గురించి నీకు యెంత చక్కని పాఠం నేర్పిందో చూడు.

"నిజమైన ప్రతిజ్ఞ ఏమిటో, దాన్ని పాలించటంలో ఉన్న సత్యమెటువంటిదో తెలియజేయటమే ఈపాఠంలోని ముఖ్య విషయం. ఇవ్వేళ పాలువడబోయటానికి మిల్లుగుడ్డ ఉపయోగించిన దానివి రేపు వేరే ఏపనికైనా ఉపయోగించటానికి పూనుకోవచ్చు. అది క్రమంగా కౌపీన సంరక్షణకోసం తంటాలు పడిన సన్యాసి చివరికి గృహస్థుగా మారిపోయిన కథ లాగ పరిణమించవచ్చు. కనుక ఆ మోహంలో పడనే కూడదు. ఖద్దరు గుడ్డతో తిరిగి వడబోయించి నాకు పాలు ఇప్పించటంలో ఖద్దరు మీద బాకున్న పవిత్రభావన, నా మీద ఉన్న భక్తి శ్రద్ధలు వ్యక్తమవుతున్నవి. ఈ సంఘటన వల్ల అధ్యాత్మం, మతం, సంఘం, రాజకీయం-వీటికి సంబంధించిన పాఠం నేర్చుకొనే అవకాశం నీకు కలిగింది.

"దీనిని ధార్మిక అధ్యాత్మిక తత్వాలు, మిల్లుల వల్ల ఎందరి మనుష్యులరక్తం చెమటగా మారిపోతున్నదో నీకు బోధిస్తున్నవి. ఆ మిల్లులో తయారైన గుడ్డపేలికకూడ మనమేపనికీ ఉపయోగించ కూడదు. ఖద్దరు బీదజనాలకు జీవనోపాధి కలిగిస్తుంది. ఇంట్లోకూర్చొని శ్రమలేకుండ నూలు వడికి ఎవరైనా పొట్టపోసుకోవచ్చు. బీదసాదలు మొదలు కొని మహారాజులవరకు నూలు వడికే వీలున్నది. దీనిలో ఎంతో పుణ్యం మిమిడివున్నది

"భర్త చేసిన పవిత్ర ప్రతిజ్ఞను అతనిచేపాలింప జేసే విషయంలో సూక్ష్మం తెలుసుకొని తోడ్పడటం సామాజికంగా చాలా గొప్ప విషయమని నా అభిప్రాయం. రాజకీయంగా, ఇంగ్లీషువారి ప్రభుత్వంలో ఖద్దరు ధరించటమే అపరాధంగా ఉన్నది. నూలు వడకటం వల్ల స్వరాజ్యం సంపాదించ వచ్చుననటంలో నాకు రవంతైనా సందేహం లేదు కాని దానికి షరతు ఏమిటంటే 40 కోట్ల భారతీయుల చేతుల్లో రాట్నంగాని, తక్లీగాని తిరుగుతుండాలి. ఈదృష్టితో చూస్తే నువ్వు ఇవ్వేళ చాల గొప్ప జ్ఞానం సంపాదించుకున్నావని చెప్పవలసి ఉంటుంది."

పాలు తాగుతూ తాగుతూ బాపూజీ నాకు ఈరోజు మామూలుగా చెప్పేకొత్తపాఠం చెప్పటానికి బదులు బామ్మ అన్న మాటలకు స్పష్టమైన వ్యాఖ్యానం చేసి అద్భుతమయిన జ్ఞానబోధచేశారు.

## ౨౧

# బాప్మా రాజకీయ బాషాపరిజ్ఞానం

ఆగాఖాల్ మహల్, పూనా,

20-9-43

బాప్మా రోజు కొకసారి అంజీర్, అఖరోట్, పెద్ద ద్రాక్ష, ఆప్రికాట్స్ మొదలైన ఎండుపండ్లలో ఏదుంటె దాన్ని పాలలో ఉడకపెట్టి తాగుతుండేది. ఇది ఆమెకు మందు గాను, ఆహారంగాను పనిచేసేది. వేరే ఆహారమేదీ ఆమెకు ఇమిడేదికాదు. ఈవిధంగానే బాపూజీ ఖర్జూరాన్ని ఆహారం గాను, ఔషధంగాను వాడుతుండేవారు. ఆయన పాలలో ఉడికించిన ఖర్జూరాన్ని సాయంకాలంపూట పుచ్చుకొనేవారు. ఈ వివరాలన్నీ కరాచీలో ఉన్న నాబంధువులు కొందరు బాగా ఎరుగుదురు. కరాచీలో దొరికే ఎండుపండ్లు ప్రసిద్ధి కెక్కినవి. బాపూజీ బయట ఉన్నప్పుడు కావలసినప్పుడల్లా నేను వాళ్ళకి వ్రాసి ఈపండ్లు తెప్పించి పెడుతుండేదాన్ని. కాని ఇప్పుడు జైలు నిబంధనల ననుసరించి ఆవిధంగా తెప్పించుకోటా నికి వీలులేకపోయింది. అందువల్లనా కరాచీ బంధువులు బాపూ జీకి ఈపండ్లు లభ్యంకావని తెలుసుకొని శాంతికుమార్ భాయిద్వారా మాకు పంపించారు. ఆపార్సెలు ఇవ్వాళే వచ్చింది. ఇలాగే బాపూజీ జయంతి వచ్చినప్పుడల్లా చేతి నూలుతో నేయించి ధోవతులు, రుమాళ్ళు మొదలైన వాటిని ఆయనకెందరో కానుకగా పంపేవాళ్లు. కాని ఇప్పుడు బాపూజీ జైలులో ఉన్నందుల ఆ వస్త్రాలు ఆయనకు ఎలా

పంపితే చేరగలవో వాళ్ళకు తెలియలేదు. శాంతికుమార్ భాయీ ద్వారా ఇటువంటి వస్తువులు బాపూజీకి చేరుతూ ఉంటవని ఆశ్రమవాసులకు తెలుసు. అందుచేత ప్రేమా బహన్ కంటక్, అమ్‌తుస్సలాం, దిల్‌ఖుష్ దీవాన్‌జీలు రాబోయే జయంతినాడు బాపూజీకి సమర్పించటానికి కొన్ని వస్త్రాలు శాంతికుమార్ భాయీద్వారా పంపించారు. ఆ పార్సెలుకూడ ఈవేళే ఆపండ్లతోపాటు మాకు అందింది. దానిలో ఖాదీతాను, ధోవతులు, రుమాళ్ళూ ఉన్నవి.

పార్సెలు విప్పటంతోనే మొదట ఖర్జూరపు పండ్లు కనిపించినవి. అవి ఎంతో స్వచ్ఛంగా, అందంగా ఉన్నవి. వెంటనే బా, బాపూజీలకు చూపించటానికి తీసుకువెళ్ళాను. అంతమంచి ఖర్జురాలను నేనెన్నడూ చూడలేదు వాటి రకమే ప్రత్యేకమైనది. గింజ చాలాచిన్నదిగానూ, కండలావుగానూ ఉన్నది. ఒక్కొక్క కాయ విడివిడిగా బటర్ పేపర్ లో చుట్టి ఉన్నది

ఇంత శ్రేష్ఠమైన ఖర్జూరాలు చూచి బామ్మ "చూడు శాంతికుమార్ ఎంతశ్రద్ధతో ప్రతివస్తువూ సేకరించి పంపుతుంటాడో! కాని అతనికీ, సుమతికీ ఆశీర్వచనాలు తెలుపుతూ ఉత్తరమైనా రాయటానికి వీలులేకుండా ఉన్నది. 'గాంధీ' ఇంటిపేరుగలవాళ్ళు మాత్రమే మా కుటుంబీకులుగా భావింప బడుతున్నందున ఆ పేరులేనివాళ్ళకు మేము రాసిన ఉత్తరాలను ప్రభుత్వం పంపించదు. ప్రభుత్వంవారి పనులిలా ఉంటాయి." అన్నది.

ఎవరెవరు ఏయేవస్తువులు పంపించారో తెలిసికొన్న తరువాత బాపూజీ బాతో ఇలా అన్నారు. "శాంతికుమార్ 'సింధియా' కంపెనీకి మేనేజింగ్ డైరెక్టరని నీకు తెలుసుగదా! ఇప్పు డతను మనకు ఏజెంటు అయినట్టున్నాడు. మనకోసం తంటాలుపడి కావలసిన వస్తువులన్నీ పోగుచేసి పంపించటం అతనికి కష్టంగా తోచటంలేదు, ఎంతో ఆనందంగా ఉన్నట్టున్నది. రామదాసు, దేవదాసులమాదిరిగా మనకోసం ఎంతకష్టమైనా పడటానికి సిద్ధంగా ఉంటాడు. సుమతి, శాంతికుమారులు మనకోసం ప్రాణాలను కూడ అర్పించే దంపతులు. సింధియా కంపెనీనుండి జీతం తీసికొని పనిచేస్తే, జీతం భత్యంలేకుండా మనకు ఏజంటుగా పనిచేస్తున్నాడు శాంతి కుమారుకు తనకు ఇష్టమైన పనిదొరికింది." (శాంతికుమార్ భాయీ బాపూజీకి పుత్రతుల్యుడు, బాపూ జైలులోంచి విడుదలయిన తరువాత జుహూతీరాన ఉన్న శాంతికుమారుని ఇంట్లోనే బసచేసి విశ్రాంతి తీసికొన్నారు. ఆయన పరిచయం విశేషించి రాయటం అనవసరం.)

మీ నాయనగారికి పండ్లపార్సెలు అందినట్లు ఉత్తరం రాయమని బామ్మ నాతోచెప్పింది నేను నాఉత్తరంలో పేర్లుకూడ ఉదహరిస్తూ మీరు శాంతికుమార్ భాయీ ద్వారా పంపించిన పండ్లు వగైరాలు ముట్టినవి" అని స్పష్టంగా రాశాను. ఆ ఉత్తరం నేను బాకు చదివి విని పించాను. ఆమె చాలా అద్భుతమైన మనిషి. రాజకీయ భాషను ఎలా ప్రయోగించాలో ఆమెకు బాగా తెలుసు. నా ఉత్తరాన్ని ఆమె ఒప్పుకోలేదు.

"ఇలాస్పష్టంగా పేర్లతోసహా రాస్తే నీ ఉత్తరాన్ని పంపించేదెవరు? ఒకవేళ జయసుఖలాల్‌కు ఉత్తరం అందినా అది ఉన్నదున్నట్టుగా అందదు. దానిలో అక్కడక్కడ కొట్టి వేతలుంటవి. వాటిని చూచి ఇక్కడెవరికైనా జబ్బుగా ఉన్న దేమోనని అక్కడి వాళ్ళకు భయంకలుగుతుంది. నేను ఉత్తరం మళ్ళీ రాయిస్తా, ఇలారా" అని నన్ను దగ్గిర కూర్చో బెట్టుకొని తిరుగులేని ఉత్తరం రాయించింది.

చి॥ జయసుఖలాల్,

చి॥ మనూనీకు అప్పుడప్పుడు ఉత్తరాలు రాస్తూనే ఉన్నది. అందువల్ల ప్రత్యేకించి నేను రాయలేదు. మీరు రాసే ఉత్తరాలన్నీ మాకు అందుతూనే ఉన్నవి, మాకు సంతోషం కలుగుతున్నది. మనూ చదువుకు చేసిన ఏర్పాటు సక్రమంగా జరుగుతున్నది. నాకు పరిచర్యకూడ బాగా చేస్తు న్నది. బాపూజీ, డా॥ గిల్డర్, ప్యారేలాల్, సుశీల దగ్గిర మనూ వంతుల ప్రకారం పాఠాలు చెప్పించుకుంటున్నది. మా అందరి ఆరోగ్యం బాగానే ఉన్నది. చి॥ సంయుక్త, ఉమియ, చి॥ వినోద్‌లకు మాఆశీర్వచనాలు.

మీ ఏజెంటు క్షేమసమాచారాలు మాకు తెలిసినవి. అవి అవసరమైనవి సమయానికి వచ్చి చేరినవి. అందరికీ వేర్వేరుగా మాఆశీర్వాదాలు రాసి పంపించు. నీకు నా ఆశీర్వచనం.

20-9-'43 బా బాపూజీల ఆశీర్వాదం.

పరీక్షచేసిచూడవలెనని బాప్మ రాయించిన ఉత్త
రమూ, నేను రాసిన ఉత్తరమూ రెండూ పంపించాను నేను.

నెల రోజులైన తరువాత, నేను రాసిన ఉత్తరం అంద
లేదని తెలిసింది. బాప్మ రాసిన ఉత్తరానికి 15 రోజులలోనే
మానాయనగారి దగ్గిరనుండి జవాబుకూడ వచ్చి చేరింది.
బాప్మ అప్పుడప్పుడు అవసరాన్ని బట్టి రెండర్థాలువచ్చే
భాషలో ఉత్తరాలు రాయిస్తుంది. వాటిని అర్థంచేసుకోటానికి
మేధావులుగూడ తలక్రిందు లౌతుంటారు. అటువంటప్పుడు
బాప్మకు చదువురాదని ఎవరనగలరు? నేనీ రెండుత్తరాలూ
పోస్టులో పంపించమని కలేలీగారికిచ్చాను. ఆయన బాప్మ
ఉత్తరం చదివి మడిచి జేబులో పెట్టుకున్నారు. తరువాత నా
ఉత్తరం చదివి "దీనిలో కొట్టివేతలు పడతవి. అయినా ఇక్కడి
నుంచి పంపించటానికి మాకేమీ అభ్యంతరం లేదు" అన్నారు.

నేనేమీ బదులు పలకలేదుకానీ నవ్వు ఆపుకోలేక
పోయినాను. ఆయన నన్ను కారణం అడిగారు. సాయంకాలం
టపాలో ఆరెండుత్తరాలు పోయిన తరువాత నేను ఆయనకు
సంగతంతా చెప్పాను. ఆయనవిని ఇలా అన్నారు "మీ
కుటుంబానికి సంబంధించిన సంగతేదో వుండవచ్చు, దాన్ని
గురించే బా రాసిందని నేననుకున్నాను. కాని, అయ్యంగారు
ఎంత మంచి గుజరాతీ తెలిసిన పండితుల చేత తర్జుమా
చేయించినప్పటికీ బా రాసిన భాషలోనిగూఢార్థం బోధ
పడేది కాదు."

అలాగే జరిగింది. మానాయనగారిపేర బా రాయిం చిన ఉత్తరం ఇప్పటికీ నాదగ్గిరున్నది, కాని నేను రాసిన ఉత్తరం ఎక్కడికి పోయిందో ఎవరికీ తెలియదు.

## ౨౨
## నా పరీక్ష

ఆగాఖాన్ మహల్, పూనా,
23-9-'43

మధ్యాహ్నం సుశీలక్క ఇంగ్లీషులో నాకు పరీక్ష పెడతానన్నది దానికి సిద్ధపడుతూ నేను కొన్ని మాటలు కంఠతాపడుతూ కూర్చున్నా ప్రశ్నపత్రం నా చేతిలోకి వచ్చేవరకు అనగా చివరిక్షణంవరకు ఈ కంఠతా పట్టటం సాగుతూనే వున్నది. ప్రశ్నలుకూడ మామూలుగా పాఠశాలలో ఉండేవిధంగానే ఉన్నవి నాలుగు కాగితాలతో విడిగా పుస్తకంకుట్టి దానిమీద సిరాతో జవాబులు రాయవలసివున్నది సమయం ఒక గంట యిచ్చారు సుశీలక్క స్వయంగా ఎం డి పాస్ అయిన మనిషి. విద్యార్థులకు కలిగే అనుభవాలు, నమ్మకాలు ఆమెకు తెలిసేవుండాలి. నేను చదువుతున్నది అయిదవ తరగతి పుస్తకం పాఠాలు బాగా కంఠోపాఠం చేశాను. కనుక వాటిలోనుంచి యే పాఠం చదివి వినిపించమన్నా లేక ఒప్పగించమన్నా నిరాఘాటంగా చెప్పివేయగలనన్న నమ్మకం నాకున్నది. పరీక్షలో ఊరికే నెగ్గటమే కాకుండా నూటికి ఎనభై మార్కులు సులభంగా

తెచ్చుకోగలననుకున్నాను. కాని ఆమె పాఠాల్లోని వాక్యాలు అడుగుతుందనీ, నాలుగో తరగతి పుస్తకంలో చదివిన పాఠాల్లోనుంచి మాటలు అడుగుతుందనీ లేకపోతే అనువాదం రాయమంటుందనీ నేను ఊహించుకోలేకపోయాను. 'రేపు ఇంగ్లీషులో పరీక్ష పెడతా' నని మాత్రమే ఆమె నాతో చెప్పింది. ఎప్పుడు పెట్టినాసరే, పర్వాలేదని నేను నిబ్బరంగా ఊరుకున్నా. అయితే నాలుగవ తరగతి పుస్తకంలోనుంచి కూడ ప్రశ్నలు అడగవచ్చునని ఆమె సూచన మాత్రం చేయకపోలేదు. కాని దానిలోనుంచి ఒకటో రెండో ప్రశ్నలుమాత్రమే ఉంటాయనుకున్నాను. చివరకు నేను అనుకున్నదంతా పొరపాటని తేలింది. ప్రశ్నలు ఎక్కువ భాగం నాలుగో తరగతి పుస్తకంలోంచే వచ్చినవి. ఈ విధంగా ఇవ్వేళ అనుకోని ప్రశ్నలున్న ప్రశ్నపత్రంచూచి నేను దిగ్భ్రమచెందాను.

బాపు పడక కుర్చీలో కాళ్ళుచాచి పడుకొని చూస్తున్నది - "బాగా చదువుకున్నావు నిన్న ఆటకుకూడపోలేదు. ఒక గంటకంటే ముందే జవాబులు రాసేస్తావనుకుంటాను. కాని, చూడు, బాగా ఆలోచించి జవాబులురాయి. రాసిన దాన్ని తిరిగి ఇంకొకసారి చదివిచూచుకో, తప్పులు లేకుండా రాసి పరీక్ష నెగ్గాలి." అన్నది నాతో.

ప్రశ్నపత్రం చదివిచూచుకొని సుశీలక్కను అడిగాను నేను : "మీరు నాలుగో పుస్తకంలోనుంచీ, పాఠమాలా మొదటి భాగంలోనుంచీ ప్రశ్నలు అడిగారు. అయిదో తరగతి పుస్తకంలో ఇప్పటికిరవై పాఠాలైనవి, వాటిలోనుంచి

గానీ, పారమూలా రెండో భాగంలో నుంచిగానీ ఒక్క ప్రశ్న అయినా అడగలేదు ”

సుశీలక్క నా ప్రశ్నకు బదులు బామ్మకు చెప్పింది - “చూడండి, బామ్మ, నేనెంత ఉదారంగా ఉన్నానో! మనూకు నూటికి నూరు మార్కులు తెచ్చుకునే వీలు కలిగించాను ఆమె చదువుతున్నది అయిదవ తరగతి పుస్తకాలు; నేను అడిగిన ప్రశ్నలు నాలుగో తరగతి పుస్తకాల్లోంచి! కనుక మనూ నూటికి నూరు మార్కులు తెచ్చుకుంటుందను కొంటాను ”

నాస్థితి ఇప్పుడెంత అధ్వాన్నంగా వున్నదో బా కేమి తెలుసు? ఆమె “అయితే, సుశీలా! నువ్వు పొరపాటు చేశావు. అయిదో తరగతి పాఠాల్లోనుంచికూడా ప్రశ్నలు అడిగివుండాల్సింది కింది తరగతి పాఠాలప్రశ్నలకు నాబోటిది కూడ జవాబులు రాస్తుంది. దానిలో ఏముంది?”అన్నది

బా మాట విన్నతరువాతైనా సుశీలక్క నేను చదివి కంఠస్థంచేసిన పాఠాల్లోంచి ఒకటో, రెండో ప్రశ్నలిస్తే బాగుండునని తోచిందినాకు. కాని ఆమె నాఅవస్థను క్షణంలో కనిపెట్టింది. “ఇవ్వేళకి అయిందేమో అయింది, ఈ మాటు పరీక్షలో అలాగే చేస్తాలే” అని ఆమె బామ్మకు సమాధానం చెప్పింది.

నాకు జ్ఞాపక మున్నంతవరకు జవాబులు రాశాను. గంట పూర్తిఅయింది. నా పేపరును సుశీలక్క అప్పుడే దిద్దటం మొదలుపెట్టింది. అన్నీకలిపి మొత్తంమీద నూటికి

45 మార్కులు మాత్రమే వచ్చినవి. అప్పుడు నేను సుశీలక్కతో అన్నాను: "నేను కిందటి సంవత్సరపు పాఠాలు చదవలేదు అవికూడా చదవమని మీరు చెప్పారు కాని, నేనంత కష్టపడలేదు. నాలుగవ తరగతిలో చివరి పరీక్ష భణ్‌సాలీగారు పెట్టారు అప్పుడు నాకు నూటికి తొంభై మార్కులు వచ్చినవి ముగ్గురు పిల్లలలో నాదే మొదటి స్థానమయింది" (1942లో నేను సేవాగ్రామం వెళ్ళినప్పుడు భణ్‌సాలీగారు నాకు పరీక్ష పెట్టారు. ఈసంగతి నాకు బాగా జ్ఞాపకం వున్నది)

ఈ మాటలు నేను నా తెలివితేటలు కొద్దిగా చెప్పుకొనే ఉద్దేశంతో సుశీలక్కతో అన్నాను. కాని బాకు కోపం వచ్చింది "చదివింది మరచిపోవటానికేనా? అందుకనే నువ్వు ప్రశ్నపత్రం చూడడంతోనే 'నాలుగో పుస్తకంలోంచి ప్రశ్నలు ఎందుకిచ్చారు? అయిదోదానిలో నుంచి ఎందుకివ్వలేదు ?' అని అడిగావు దాని అర్థం బాగా చదవలేదన్న మాట! అందుకే ఆ ప్రశ్న వేశావు. యూనివర్సిటీ పరీక్షలో ఈ విధంగా ప్రశ్న అడిగారేమో సుశీల నడుగు. బట్టీ పెట్టవద్దని అందరూ చెబుతారు, అయినా మీరా పద్ధతి వదలటం లేదు అర్థం చేసుకొంటూ ఒకసారి చదివితేచాలు. ఎప్పటికైనా జ్ఞాపకముంటుంది

"ఇప్పుడు దీనికి నాలుగో పుస్తకమే నేర్పించు. ఒక ఏడాది ఎక్కువయితే అయింది. చదివిందేదో క్షుణ్ణంగా ఉండాలిగదా" అని సుశీలక్కకు సలహా చెప్పింది.

నా కళ్ళల్లోంచి బొటబొట నీళ్ళు కారినవి. నాలుగో తరగతి పుస్తకంలోంచి ప్రశ్న లడిగినందుకు నాకు సుశీలక్క మీద కోపం వచ్చింది పగలంతా ఆమెతో మాట్లాడలేదు. బాతో కూడా ప్రసంగించలేదు నన్ను మళ్ళీ నాలుగో తరగతికి దింపటం యెంత అమర్యాద! నేను బళ్ళోనే చదువు కుంటూవుండి ఈ విధంగా క్రింది తరగతికి దింపబడినట్లయితే నేనసలు చదువే వదలిపెట్టేసేదాన్ని. అంతేగాని పైతరగతిలోంచి కింది తరగతికి దింపటానికి వీలులేదు. దీనితో ఈ రోజంతా వ్యర్థమైపోయింది. సాయంకాలం షికారుకు పోవటానికి కూడా మనస్కరించలేదు. కాని బాపూజీ నా చెయ్యి పట్టుకొని బలవంతంగా వెంటతీసికొని పోయినారు. సుశీలక్క అప్పుడాయనవెంట లేదు. మిగిలినవారు ఆటలో ఉన్నారు.

నేనూ, బాపూజీ ఇద్దరమే నడుస్తూ పోతున్నాము. "పరీక్షలో మార్కులు తక్కువ వచ్చినందుకు నువ్వు ఏడ్చావనీ, ఆడుకోటానికికూడా పోలేదనీ విన్నాను బా నిన్నేమైనా అన్నదా?" అని నన్నడిగారు.

నేను "కాదు బాపూజీ! నా పుస్తకంలో వున్న పాఠాలూ, పదాలూ నేనెన్నోసార్లు చదివాను మీరు యే పాఠం చెప్పమంటే ఆ పాఠం ఒప్పగిస్తా. అయినా బా మ్మ నన్ను నాలుగో తరగతి పుస్తకాలే మళ్ళీ చదవమని చెప్పింది. ఇవ్వేళ పరీక్షలో ప్రశ్నలన్నీ నాలుగో తరగతి పుస్తకం లోంచే వుంటవని నాకు తెలియదు" అన్నాను. దీన్నిగురించి బాపూజీ నాకెన్నో సంగతులు వివరించి చెప్పారు

"నువ్వు నా కళాశాలలో చదివి నెగ్గవలసినదానివి, లోకంలోవున్న కళాశాలల్లోకాదు నువ్వు పాఠాలు బట్టీపెట్టటం నాకేమీనచ్చలేదు నిన్నరాత్రి నిద్రలోకూడా నువ్వు ఇంగ్లీషు మాటల స్పెల్లింగులు వల్లిస్తున్నావు ఎన్నిసార్లు వద్దనిచెప్పినా బడిలో నీకు అలవాటయిన ఈ దురభ్యాసం పోవటంలేదని సుశీలకూడ నాతో చెప్పింది. ఆమె డాక్టరుకదా! అందుకని నీ జాడ్యం పోగొట్టటానికి మందుపయోగించింది బా నిన్ను బెదిరించింది. అంతేగాని, కింది తరగతికి పంపటం జరగదు వేరు పాతుకొనిపోయిన నీ దురభ్యాసం వదలిపోవటం అవసరం. చాలామంది విద్యార్థుల కిదే అలవాటయింది నేను కూడా చిన్నప్పుడు పంతులుగారు విషయాన్ని సరిగా చెప్ప లేకపోయినప్పుడుగాని, నేను శ్రద్ధగా విననప్పుడుగాని పాఠం బట్టీపెట్టేవాణ్ణి ఈ అలవాటు ముందుముందు చాలా చేటు కలిగిస్తుంది. దీనివల్ల నీ నిద్రకుకూడా భంగం కలుగుతుంది. నిన్న రాత్రి నువ్వు నిద్రలో కలవరించావు ఇటువంటి కలవరింత నీకు కలగటం నేను మొదటిసారి చూచాను మాటల స్పెల్లింగులు బట్టీపెట్టటంవల్ల నీకీ కలవరింత మొదలయింది బట్టీపెట్టి నేర్చుకున్న పాఠం స్థిరంగా వుండదు పరీక్ష అనే భూతం కలిగించిన భయంవల్ల నీకు నిద్రాభంగం కలిగింది. ఇదిచూచి భారతదేశపు విద్యార్థుల దుస్థితిని నేనూహించుకో గలిగాను. నాకు చాలా విచారం కలిగింది భారతదేశపు బాలబాలికలు ఆడుతూ, పాడుతూ, ఉల్లాసంగా చదువుకో వటంలేదు. కేవలం పరీక్షలకోసమే చదువుకుంటున్నారు. దీన్నిగురించి నామనస్సులో ఎన్నో ఆలోచనలు కలిగినవి.

అసలు మన దేశపు విద్యా విధానమే దోషభూయిష్టమైనదని నా అభిప్రాయం. ఈ సంగతి నేనెన్నోసార్లు బహిరంగంగా చెప్పాను. సుశీలమీద నువ్వు కోపం తెచ్చుకోవటం తగని పని నువ్వు ఎవ్వరిమీదా మూతిముడుచుకోవని నేననుకున్నా. కాని మూడు గంటలసేపు నువ్వు ఇవ్వేళ ఎవరితోను మాట్లాడక మౌనం వహించావు భోజనమూ చేయలేదు, ఆడటానికీ పోలేదు ఇలా అయితే యూనివర్సిటీ పరీక్షలో ఒకవేళ నెగ్గకపోయినట్లయితే సముద్రంలో దూకి చచ్చిపోతావను కుంటాను. చాలామంచి విద్యార్థులు అపనే చేశారు, ఇప్పటికీ చేస్తున్నారు నీకు కోపం వచ్చిందన్న సంగతి విన్నప్పుడే నీకు తెలియచెబుదామని అనుకున్నాను; కాని షికారుకు పోయేటప్పుడు వివరంగా చెప్పవచ్చుకదా, అని ఊరు కున్నాను. డాక్టరు ఇంజక్షన్ ఇచ్చినట్టుగా సుశీల నీకీ పరీక్ష పెట్టిందనుకుంటాను. బట్టీ పెట్టవద్దని ఆమె నీకెన్నోసార్లు చెప్పింది కాని నువ్వామెమాట వినటానికి ప్రయత్నించనే లేదు. కనుక నీకేర్పడిన బట్టీపెట్టే దురభ్యాసం ఈపాఠశాలలో దానంతటదే నశించిపోవాలి" అన్నారు. పాఠాలు బట్టీపెట్టటం వల్లనే నాకీ చెడ్డపేరు వచ్చింది ఇందుకు నేను చాలా సిగ్గు పడ్డాను కాని ఆగాఖాన్ మహల్‌నుండి విడుదలై తిరిగీ కరాచీ శారదా మందిరంలో విద్యాభ్యాసం సాగించేటప్పుడు నాకీ సంగతి అనుభవంలోకి వచ్చింది. అంతవరకూ జాగ్రత్త పడి ఎవరైనా చూస్తున్నప్పుడు బట్టీ పెట్టటం మానేశాను. కాని ఎవరూ లేనప్పుడుమాత్రం బట్టీపెడుతూనే ఉండేదాన్ని.

## ౨౩
# చర్ఖా ద్వాదశి

ఆగాఖాన్ మహల్, పూనా.
25-9-'43

ఇవ్వేళ మధ్యాహ్నం 3 గంటల తరువాత డాక్టరు గారు, మీరాబహిన్, ప్యారేలాల్జీ, సుశీలక్క — వీరందరు రేపటి కార్యక్రమాన్ని గురించి ఆలోచించటానికి సమావేశ మైనారు. నన్ను ఆసమావేశానికి పిలవలేదు. ఎందుకంటే, మాటమీద మాటవచ్చి నేనేదైనా తెలివితక్కువగా మాట్లాడినట్లయితే వాళ్ళ ఉత్సాహమంతా భంగమై పోతుంది. కాని ఏదైనా పని రహస్యంగా జరిగేటప్పుడే దాన్ని తెలుసుకోవాలనే జిజ్ఞాసపుడుతుంది. రేపటికేదో కార్య క్రమం ఆలోచిస్తున్నారని మాత్రం ఆచూకీ తెలిసింది. నేను సహించలేకపోయినా నాకెప్పుడు కోపంవచ్చినా, అన్నం తినకపోవటం, ఆటలకు పోకపోవటం మూతిముడుచుకొని కూర్చోటం నాకుఅలవాటై పోయింది. అది మంత్రంగా కూడ ఉపయోగించేది నాకు. నాకోపంచూచి కారణం తెలుసుకోటానికందరూ ప్రయత్నించేవాళ్ళు, తద్వారా నాపని నేను సాధించేదాన్ని.

సాయంకాలం ఆటలకు గంట కొట్టినప్పుడు నేనే ఆటకూ రానని చెప్పాను. సుశీలక్కకు అలిగినవాళ్ళను బుజ్జ గించి సమాధానపరచేనేర్పున్నది. ఆమె నాతోమాట్లాడుతూ రేపటి కార్యక్రమాన్నంతా వివరించి చెప్పింది. దాంతో నాకు సంతోషం వచ్చింది. చర్ఖాద్వాదశిని గురించిన వివరా

లన్నీ నాకు చెప్పకపోయినా సుశీలక్క అయిదు నిమిషాల్లో నన్ను సమాధాన పరచింది. నేను ఆడటానికి ఒప్పుకుని వెళ్ళాను.

నేను కిందికి దిగిరావటం చూచి, ప్యారేలాల్జీ డా॥గిల్డర్‌తో "మనూను ఇక్కడి ఆస్పత్రిలో చేర్చాలి; ఆమెకు అప్పుడప్పుడూ 'స్క్రూ' వదులు అవుతూ ఉంటుంది" అన్నారు. అందుకు నేను పిల్లల్లాగ బొటనవేలు చూపించి "మీరేమన్నా అనుకోండి, నాకేం. సుశీలక్క నాకు అంతా చెప్పేసిందిగా!" అన్నాను అందరూ పకాపకా నవ్వారు. కాని ఆనవ్వటానికి కారణం నేడు ఇన్నేండ్ల తరువాత నోటు బుక్కు చూచినప్పుడుగాని నాకు బోధపడలేదు

ఈ రీతిగా తిరిగి సంతోషం కలిగిన తరువాత నాపను లన్నీ పూర్తి చేసుకొన్నాను ప్రార్థన అయిన తరువాత బాపూజీకి కొన్ని తియ్యని అప్పడాలు చేసిపెట్టాను. సుశీలక్క కూడ ఖైదీలకు పెట్టటానికి మిఠాయి తయారుచేసింది. బా, బాపూజీలు నిద్రపోయిన తరువాత సుశీలక్క, మీరాబహిన్ కలిసి సిపాయిల సహాయంతో లేత అశోకచెట్టు ఆకులతో తోరణాలు కట్టారు. నేను వారికి రాత్రి 12 గంటలవరకు మాత్రమే సహాయంచేసి తరువాత నిద్రపోయినాను.

కాని మీరాబహిన్‌కు, సుశీలక్కకు కళాప్రియత్వం ఎక్కువ. వాళ్లిద్దరు రాత్రంతా మేల్కొని రకరకాలుగా భవనాన్ని అలంకరించి తమ కళానైపుణ్యాన్నంతా ప్రదర్శించారు మీరాబహిన్, సుశీలక్క ప్యారేలాల్జీ — వీరు ముగ్గురూ రాత్రి రెండు గంటలకు నిద్రపోయిన్నట్టున్నారు.

దీపావళికి మర్నాడు వచ్చే నూతన వర్షారంభంనాడు వేకువ జామునే లేచి పనిపాటలకు సిద్ధపడేట్టుగా, బా బాపూజీలు తప్ప, మిగిలిన మేమందరం చాల చీకటితో లేచి నాలుగున్నరకల్లా స్నానాలు ముగించుకొని తయారైనాం

చక్రాద్వాదశి
26-9-'43

వేకువజామునే లేచి, అందరికన్న ముందు బామ్మ బాపూజీకి నమస్కారంచేస్తూ "ఇదిగో, ఇదే చివరిజయంతి ప్రణామం. రాబోయే ద్వాదశికి నేను ఉండేదిలేదు" అన్నది.

తరువాత మేమందరం ఒకరి వెనుక ఒకరుగా బాపూజీకి నమస్కరించాం. రాత్రంతా చేసిన అలంకారాల వలన, వరండాలో వేర్వేరు రంగులతో గీసిన అక్షరాలు, సంస్కృత శ్లోకాలూ, సూక్తులూ, అందంగా వేసిన ముగ్గులు, పూలదండలు-ఇవన్నీ ఎంతో ఆకర్షణీయంగా కనిపించినవి. వీటితో పాటు బామ్మ ఉత్సవంలో పాల్గొనటం దానిశోభను ఇనుమడింప చేసింది ఈరోజుచేసిన ప్రార్థనలో ఈ కింది భజనపాట ప్రధానంగా పాడాము.

'ఔర్ నహీఁ కఛు కామకే,
మైఁ భరోసే అప్ నే రామకే
దోఊ అక్షర సబకుల తారే,
వారీ జాఊఁ ఉస నామపై
తులసీదాస ప్రభురామ దయాధన్,
ఔర దేవ సబ్ దామకే.

బాపూజీ 21 రోజుల ఉపవాస సమయంలో ఒక సోదరీమణి ఈ భజన పాటను తంతిద్వారా అందచేసింది. ఇది ఆయనకు ప్రియమైన భజనల్లో ఒకటి.

ప్రార్థన తరువాత నిత్యకార్యక్రమం నడిచింది. బామ్మకు పళ్ళతో ముఖ్యుల్లు, నీళ్ళిచ్చి ఆమెకు 'చా' తయారు చేశాను ఇంతలో సుశీలక్క నన్ను డాక్టరుగారి గదికి రమ్మని పిలిచించి. వెళ్ళి చూడగా, అందరూ వేషాలు వేసుకొని కూర్చున్నారు. మీరాబహన్ గడ్డం తగిలించుకొని సిక్కుల మాదిరిగా తెల్లనాఫా చుట్టుకున్నది. డాక్టరుగారి కోటూ, పాంటూ తొడుక్కొని ఒక చేతికి సిక్కులు పెట్టు కొనే కడియం ధరించింది ఒడ్డూపొడవయిన మనిషి గనుక ఈ వేషంలో అచ్చం సర్దార్జీలాగ తయారైంది. డాక్టరుగారు పఠాన్ వేషం వేశారు మీరాబహిన్ తొడుక్కునే కుచ్చుల షల్వార్, తలపైన పించంకనిపించేటట్టు చుట్టుకున్న తల పాగాతో ఆయన పఠాన్ వేషం అందంగా అతికినట్టున్నది. సుశీలక్క మెడలో క్రాస్ వేలాడవేసుకొని ఫాదరీ వేషంలో తయారైంది ప్యారేలాల్జీ దక్షిణ దేశపు సాధువు వేషం వేశారు. నేను ఫ్రాక్ తొడిగి, ఎత్తు మడమల బూట్లు వేసుకొని పారసీటోపీ పెట్టుకున్నాను. ఈ వస్తువులన్నీ కటేలీగారు సేకరించారు మేము వేషాలు వేసేటప్పుడు మధ్యలో ఒకసారి బామ్మ నెమ్మదిగా వచ్చి తొంగిచూచి పోయింది ఆమె బాపూజీతో చూచాయగా చెప్పినట్టున్నది.

కటేలీగారు బాపూజీ దగ్గిరకువెళ్ళి "ఇవ్వేళ మీరు పుట్టినరోజు. చూడటానికి ఎవరైనారావచ్చు" అని సూచించారు. కాని బాపూజీ అలా మోసపోయేమనిషికాదు

మమ్మల్నందర్నీ మీరాబహెన్ గదిలో కూర్చోబెట్టి కటేలీగారు బాపూజీ దగ్గిరకువెళ్ళి "మీదర్శనానికి కొందరు పెద్ద మనుష్యులు వచ్చి కూర్చున్నారు ప్రభుత్వంవారి అనుమతి కూడ తెచ్చుకున్నారట" అని చెప్పి పిలిచారు. బాపూజీ ఉదయం నడకకువెళ్ళే సమయం 7-30 అయినందున ఆయన నేరుగా మాగదిలోకే వచ్చారు. ఆయన గదిలో కాలు పెట్టటంతోటే నేను అందరికన్నా ముందు ఎదుటకువెళ్ళి "మహాత్మాజీ! నూతన వర్షపు అభినందనలు; నాపేరు జర్ భాయీ జరీవాలా; ఖుదా మీకు దీర్ఘాయువు యివ్వాలి" అని పార్సీలు మాట్లాడే భాషలో పలికాను.

బా, బాపూజీలు పకపకనవ్వారు. బాపూజీ నాచెవి మెలియబెట్టి గట్టిగా ఒక చెంపకాయ వేశారు. తరువాత మీరాబహెన్ వచ్చి పంజాబీహాల్వా బహూకరించింది. తన ఊరూ పేరూ చెప్పి, తాను తెచ్చిన హాల్వాను ప్రశంసించింది. బాపూజీ ఆమెను కూడ గట్టిగా ఒకటి అంటించారు. తరువాత డాక్టరు గిల్డరుగారు పఠాన్ దేశపు ఖర్జూరాన్ని, ఇతర ఎండుపళ్ళను సమర్పించారు చివరికి ఖాదరీగారు, బ్రాహ్మణసాధువు నమస్కార పూర్వకమైన ఆశీర్వచనాలు అందజేస్తూ వింతగా నిలబడ్డారు

మేమందరం కడుపుబ్బేలాగ నవ్వాము అక్కడి నుంచి మహాదేవ్ కాకాగారి సమాధివైపు వెళ్ళాము. కాని,

మేముమైదానంలో అడుగు పెట్టటంతోటే కశేలీగారు జమా దారును బెదరకొట్టే ఉద్దేశంతో "అరే, వీళ్ళెవరు? ఇక్కడి కెలా వచ్చారు? పరుగెత్తు, పరుగెత్తు!" అని బిగ్గరగా గద్దించారు. పాపం, జమాందారు రఘునాథ్ అధికారి హుంక రింపుకు భయపడి పరుగుతీశాడు గేటుదగ్గర కావలి కాస్తున్న తెల్ల సార్జెంట్లుకూడ దిగ్భ్రమచెంది నిండుతుపాకులు చేత బట్టుకున్నారు. రఘునాథ్ మాదగ్గిరకు వచ్చి బాగా తేరి పారజూచి "అరే, వీళ్ళు మన సుశీలాబాయీ, మహా బాయీలే!" అని అరచాడు. పాపం అతనికి పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. మిగిలిన వాళ్ళనంత సులభంగా గుర్తించ లేకపోయినాడు.

నడకకు వెళ్లి తిరిగి వచ్చిన తరువాత ఎవరి పనిమీద వారు వెళ్ళారు. బాపూజీ స్నానానికి లేచారు. ఈలోపల మేము, బాపూజీ కూర్చోబోయే గదిలో ఆయనకు, భక్తులు స్వయంగా వడికి నేయించిపంపిన ఖాదీవస్త్రాలు విడివిడిగా ప్రదర్శించి, పూలూ నూలూ కలిపి తోరణాలుకట్టి ఉంచాము. ఆయన కూర్చునే మెత్తకెదురుగా పుష్పాలతో ఓంకారం కూర్చి పెట్టాము పూలమాల లెక్కువగా గుచ్చవద్దనీ, నూలుహారాలుకూడ తరువాత నేతకుపయోగించే విధంగా చేర్చిపెట్టమనీ బాపూజీ ఎన్నోసార్లు చెప్పారు.

లేడీ ప్రేమలీలా ఠాకర్సీగారి వద్దనుండి కొబ్బరికాయ, కుంకుమ కానుకవచ్చింది. ఇదికాక, కశేలీగారు పంచదార, గోధుమలు, బెల్లం మూడు కొత్త గిన్నెల్లో నింపి, ఒక చెప్పుల

జత, బా, బాపూజీలకు మాలలు మొదలైనవి పళ్ళాల్లో పెట్టి మేడమీది నుంచి కిందికి తీసికొని వచ్చారు

స్నానం ముగించుకొని బాపూజీ తన మెత్తమీదికి వచ్చి కూర్చున్నారు. మేమందరం వడికిన నూలుతో చేసిన, 75 పోగులున్న నూలుహారానికి 75 కుంకుమబొట్లు పెట్టాము. బామ్మ మొదట బాపూజీకి తిలకం దిద్ది నూలు హారాన్ని మెడలో వేసింది. ఆమె నమస్కరించిన తరువాత మేమందరం కూడ ఒక్కొక్కరమే తిలకం పెట్టి, నూలు హారంవేసి నమస్కారం చేశాము

బాపూజీ చేతి నూలుతో నేయించిన ఎర్రంచు చీర బామ్మ ఇవ్వేళ ధరించింది. ఈ చీరెను గురించే బామ్మ నన్ను ప్రత్యేకంగా ఆదేశించింది "బాపూచేతితో వడకినసూలుచీరె ఇదొక్కటే నాదగ్గరున్నది. నేను చనిపోయినప్పుడు నువ్వు దీన్ని నామీద కప్పు" అని చెప్పిందామె. నేను పంజాబీ దుస్తులు వేసుకొంటుండేదాన్ని, కాని, బామ్మ ఇవ్వేళ నాచేత ఎర్రంచుచీరె కట్టించింది

సుశీలక్క కూడ యెర్రంచుచీరె కట్టింది. "ఈ రోజు చర్ఖా ద్వాదశికదా, బ్రతికి వుండగానే బాపూజీ చేతినూలు చీరె చివరిసారిగా ఇవ్వేళ కట్టుకుంటాను మళ్ళీ కట్టుకునే అవకాశం నాకు చిక్కటం అసంభవం" అన్నది బామ్మ.

[ఆమె అన్నట్టుగానే ఆచీరె నా చేతుల్తో ఆమె మృత దేహంమీద కప్పటం తటస్థించింది. ఆమె ప్రాణాలతో ఉండగా ఆ చీరె ఆగాఖాన్‌మహల్‌లో తిరిగి కట్టుకోలేదు.]

తరువాత మేమందరం ఒక చిన్న ప్రార్థనచేసి, "వైష్ణవ జనతో" గానం చేశాము. ఆ వెనక బాపూజీకి భోజనం తీసుకొచ్చి పెట్టాను. రోజూ బాపూజీ భోజనం చేసిన తరువాతనే బా్మ ఆహారం తీసుకొనేది. కాని ఇవ్వేళ చాలా ప్రొద్దుపోవటంచూచి బాపూజీ- "బాకుకూడ వడ్డించు, ఆమే నేనూ ఒకరినొకరం చూచుకొంటూ భోజనం చేస్తాం. ఈ లోపల మీరుకూడ భోజనం చెయ్యవచ్చు" అని ఆదేశించారు.

బామ్మ బలవంతాన బాపూజీకి తీపి అప్పడం వేయించింది. తరువాత వారిద్దరు భోజనం చేశారు. బామ్మ జీవితంలో ఇది చివరి చర్ఖాద్వాదశి. మేము ఆనందంగా ఈ పండుగ చేసుకున్నాము. ఆనాటి దృశ్యాలు నేటికీ నా కన్నులకు కట్టినట్లు గోచరిస్తున్నవి. చిత్రించటానికి నాకు చిత్రలేఖనం రాదు. కాని బామ్మ జీవితానికిదే చివరి పండుగ అవుతుందని అప్పుడు మాకెవరికీ అనుమానంకూడ కలగలేదు

బా, బాపూజీల భోజనమైన తరువాత ఖైదీలందరు నమస్కారం చెయ్యటానికి వచ్చారు. లేడీ ఠాకర్సీ పంపించిన కమలాపండ్లు, బత్తాయి నారింజపండ్లు బాపూజీ చేతితో పంచిపెట్టించటానికి బామ్మ బయటికి తెప్పించింది ఖైదీలు ఒక్కొక్కరే నమస్కారం చేస్తుంటే బాపూజీ పండ్లు పంచిపెట్టారు. వచ్చిన పండ్లన్నీ పంచిపెట్టిన తరువాత బాపూజీ విశ్రాంతి తీసికొన్నారు.

నేను బాపూజీ కాళ్ళకు ఆదరాబాదరగా నెయ్యి మర్దించాను. ఇంతలో 2-30 మొదలు 3-30 వరకు చేసే

సూత్రయజ్ఞానికి సమయమయింది. ఈ గంటసేపు అందరూ మౌనంగా నూలు వడికారు.

4-30 గంటలకు ఖైదీలకందరికి మిఠాయీ, అటుకులూ, చక్కిలాలూ పంచిపెట్టాము. ఈ పదార్థాలన్నీ ఖైదీల తోడ్పాటుతో ఇక్కడే తయారుచేశాము.

మీరాబహెన్ నాలుగు గంటలనుంచే ఏదో పనిలేని పని పెట్టుకున్నది. ఆమె మట్టితో దేవాలయం, మసీదు, చర్చి మూడు ఆకారాలు ఒకే కట్టడంలో కనిపించేటట్టు తయారు చేసింది. ఈ పని ఆరు గంటలకు పూర్తి అయింది బాపూజీ ఆరు గంటలకు నడకకు పోయినప్పుడు మీరాబహెన్ ఆయన గదిలో పూలతొట్లుపెట్టి అడవిదృశ్యం కల్పించింది. రాళ్ళు తెచ్చిపెట్టి కొండలు అమర్చింది. వాటి మధ్యన ఆ దేవాలయం ప్రతిష్ఠించింది. చుట్టూ పదహారు మైనపువత్తులదీపాలు వెలిగించింది. దేవాలయానికి మధ్య శివలింగానికి బదులు మెరుస్తూవున్న ఒక చిన్నరాయిని నిలబెట్టింది.

బాపూజీ నడక ముగించి తిరిగి వచ్చేటప్పటికి గదిలో దృశ్యం అడవిలా తయారయింది. నేనీ పనిలో మీరాబహెన్‌కు సాయం చేశాను. విద్యుద్దీపాలన్నీ ఆర్పివేశాము. క్రొవ్వొత్తుల వెలుగులో అరణ్యదృశ్యం మనోహరంగా కనిపించింది.

బామ్మ చాల భక్తిశ్రద్ధలు గలమనిషి. ఆమె ఆమెరుపు రాయిని శివలింగంగానే భావించి దాన్ని తన తులసిమొక్క తొట్టిలో పెట్టించి రోజూ ప్రొద్దున, సాయంకాలం నేతితో

దీపం వెలిగించి పూజచేసేది. ఈ విధంగా ఆమె అక్కడ శాంతి పొందుతూ ఉండేది.

[మీరాబహన్ నిర్మించిన ఆ మట్టిదేవాలయమందిరం, శివలింగమనే భావనతో బాపు పూజిస్తూవచ్చిన ఆ తలుకు రాయి- రెండూ ఆనాటి చర్ఖా జయంతికి స్మారక చిహ్నాలుగా ఇప్పటికీ నావద్దనే ఉన్నవి. అవి నాకులభించటం నాఅదృష్టం]

సాయంకాలపు ప్రార్థనలో బాకు ప్రియమైన-"హరినే భజతాం హజీ కోఈనీ లాజ్ జతీ నధీ జాణీరే" - అన్న పాటపాడి భజన చేశాము ఈ పాట ఆశ్రమ భజనావళిలో కూడ ఉన్నది.

ప్రార్థనానంతరం బాపూజీ సోమవారపు మౌనవ్రతం ఆరంభించారు. మీరాబహిన్ కల్పించిన ఈ పర్వతారణ్య దృశ్యాన్ని చూచి ఎవరికీ తనివితీరలేదు. సందు చిక్కినప్పు డల్లా అక్కడికిపోయి నిల్చొని చూస్తుండేవారు. మౌనం ఆరంభించటానికి ముందు బాపూజీ దీన్నిగురించి - "మీరా బహిన్ ప్రకృతి ఆరాధకురాలు, అందువల్ల ప్రకృతి సౌంద ర్యాన్ని అవలోకించి దాన్ని ప్రత్యక్ష జీవితంలో అనుభవిం చటం ఆమెకు చాలా సులువైనపని" అన్నారు. సుశీలక్క ఈ దృశ్యాన్ని రమ్యమైన బొమ్మగా చిత్రీకరించింది.

తొమ్మిది గంటలకు బాపూజీ పడుకున్నారు. నేను ఆయనకు కాళ్ళొత్తి, నమస్కారంచేసి ఈ శుభదినాన్ని ఆనందంతో ముగించాను.

౨౪

# రెండు జన్మ దినాలు

ఆగాఖాన్ మహల్, పూనా,
26-9-'43

లార్డ్ లిన్‌లిత్‌గో భారతదేశపు వైస్రాయ్ పదవి నుంచి తిరిగి ఇంటికి వెళ్ళబోతున్నారు. అప్పుడు బాపూజీ ఆయనకు మిత్రుని హోదాలో ఒక ఉత్తరం రాసి పంపించారు. దాని సారాంశమిది :

"మీరు భారతదేశంనుంచి సెలవు పుచ్చుకుంటున్న సందర్భంలో రెండుముక్కలు రాయాలని కోరిక కలిగింది. మీ హృదయంలో భగవంతుడు నివసించుగాక ! మీరింత పెద్ద సామ్రాజ్యానికి రాజప్రతినిధిగా వుండి ఈ విశాల దేశంలో అంతులేని అసత్యాన్ని వ్యాపింపజేశారు. మీరు చేసిన తప్పు అసాధారణమైనదని గ్రహించగల సద్బుద్ధి ఈశ్వరుడు మీకు ప్రసాదించుగాక.

ఆగాఖాన్ మహల్, పూనా,
29-9-'43

బొంబాయి ప్రభుత్వం తరఫున నాకు మళ్ళీ ఇవ్వాళ ఇంకొక ఉత్తరం వచ్చింది : "నువ్వు విడుదల కాదలచుకుంటే ఇప్పుడే కావచ్చు. తరువాత నీ కిష్టమైనప్పుడు విడుదల కావటానికి వీలులేదు" అని అందులో వున్నది. నేను దీనికి బదులు రాస్తూ "నేనిక్కడకు ఒక సేవకురాలిగా వచ్చాను;

సేవ చేస్తున్నాను. కనుక మీరు పెట్టిన నిబంధనల నన్నిటిని నేనంగీకరిస్తున్నా" నని తెలియజేశాను.

ఆగాఖాన్ మహల్, పూనా,
22-10-'43

నేడు డాక్టర్ గిల్డర్‌గారి 62వ జన్మదిన మైనందున ఉదయం హడావిడిగా ఉన్నది. నమస్కారం చెయ్యటానికి వచ్చినప్పుడు బాపూజీ తన చేతితో వడికిన 62 పోగులుగల నూలుహారం డాక్టరుగారి మెళ్ళోవేశారు బామ్మా, మేమూ ఆయన ముఖాన కుంకుమ తిలకం పెట్టి మెళ్ళో హారాలు వేశాము బా అందరికీ పంచదార పంచిపెట్టింది

కటేలీగారు భోజనంచేసే బల్లమీద, చక్కగా ప్యాక్ (Pack) చేసి, పైన లేబిల్ అంటించిన పొట్లాలు కొన్ని అమర్చారు. అవి డాక్టరుగారి జన్మదిన సందర్భంలో బయటి నుంచి మిత్రులు పంపించిన బహుమానాలనే భ్రమను కలిగిస్తున్నవి ఒక పార్సిల్ మీద "స్మోక్-లెస్-సిగార్" (Smoke-less-Sigar) అని వ్రాసివుంది. దానిలోపల వేరు సెనగ నూక, పాలు, కోకో, బెల్లం కలిపి చుట్టఆకారం వచ్చేట్టు కట్టి మామూలు చుట్టలపైనుండే బంగారు తళుకు కాగితం పైనచుట్టి, విదేశపుచుట్టలు పెట్టుకునే కొయ్యపెట్టెలో జాగ్రత్తగా పేర్చిఉన్నవి దానిపైన వాటిని తయారుచేసిన కంపెనీపేరుతో లేబిల్‌కూడ ఉన్నది. డాక్టరుగారు చుట్టలు కాల్చివేసిన తరువాత ఖాళీ కొయ్య పెట్టెలను కావలసినప్పుడల్లా మేము తెచ్చుకునేవాళ్ళం ఆ పెట్టెలనే ఇప్పుడు

ప్యాకింగ్ చెయ్యటానికి ఉపయోగించాం. ప్యారేలాల్‌జీ శ్రమ పడి చుట్టల ఆకారంలో చాక్లెట్లు తయారుచేశారు.

రెండవ పార్సెల్లో లేసు అల్లిన ఒక టేబుల్ క్లాత్ ఉన్నది దాన్ని సుశీలక్క తయారుచేసింది ఇంకో పార్సెల్లో మీరాబహన్ తయారుచేసిన మేక, ఎద్దు, ఆవు ఆకారపు మట్టిబొమ్మలున్నవి. డాక్టరుగారు ఉదయాన టీ తాగటానికి వచ్చినప్పుడు కటేలీగారు ఈప్యాకెట్ల నెంతో భక్తిభావంతో ఆయన కర్పించి, ఒక్కొక్కటి విప్పి చూపించారు. ఈ విధంగా ప్రాతఃకాలమంతా వినోదాలతో గడచిపోయింది. ప్రొద్దుటిపూట బాడ్‌మింటన్ ఆడేందుకు 15 నిమిషాలకన్నా ఎక్కువ సమయం చిక్కలేదు

మేము ఆటకు కిందికి దిగాము. ఇవ్వాళ డాక్టరుగారే ఆటలో గెలవాలని బాకు అభిలాషా, పట్టుదలా కలిగింది. అందుకు తగినట్టుగా రెండు జట్లు ఏర్పాటు చేశాము. ఒక దానిలో కటేలీగారు, డాక్టరుగారు, ప్యారేలాల్జీగారు ఉన్నారు, రెండవదానిలో మీరాబహన్, సుశీలక్క, నేను ఉన్నాము. మా జట్టు ఓడిపోయింది. డాక్టరుగారి జట్టు గెలిచింది. దీనికి బామ్మ ఎంతో సంతోషించింది

ఆగాఖాన్ మహల్, పూనా,
29-10-'43

దీపావళి పండుగ మేమెంతో ఆడంబరంగా చేసు కుంటాము. కాని బాపూజీకి అన్నిరోజులూ ఒకేతీరుగా ఉంటాయి. అదీగాక, అందరం జైల్లోవున్నాం, దేశానికింకా

దాస్య విముక్తి కలగలేదు. అటువంటప్పుడు ఆనందం ఎక్కడి నుండి వస్తుంది? కాని బామ్మ మాత్రం పండుగ పబ్బాలనేదో విధంగా పాటించకుండా ఉండలేదు. రోజూ నేను 9 గంట లప్పుడు ఆమెకు నూనెరాచి తలదువ్వేదాన్ని ఇవ్వేళ ఆమె నాతో "ఈరోజు దీపావళికదా ? నాకునూనెరాచి కందిపప్పు పొయ్యిమీదికెక్కించు తరువాత బొబ్బట్లు చెయ్యి" అని చెప్పింది. ఆమెనాతో దక్షిణాఫ్రికా సంగతులు చెబుతూ "బాపూజీకి బొబ్బట్లంటే ఎక్కువ యిష్టం. ప్రతి ఆదివారం నాచేత చేయించుకొని తినేవారు" అన్నది.

"పంచదారకు బదులు బెల్లంవేసి, మేకనెయ్యితో బొబ్బట్లు చేస్తే తినటానికి బాపూజీకి అభ్యంతర మఃంటుందా ?" అని బామ్మ నడిగాను "బాపూజీని నువ్వే అడుగు" అన్నదామె.

నేను బాపూజీని అడిగితే ఆయన నవ్వుతూ "బా రుచి కూడ చూడకుండ ఉండే పక్షంలో బొబ్బట్లు తినటానికి నాకభ్యంతరంలేదు" అన్నారు. ఈ నిబంధన ఎందుకు పెట్టారో నాకర్థంకాలేదు. అందుకు సుశీలక్క "బాకు పప్పుసరిపడదు, ఆమెకు గుండెదడ ఎక్కువౌతుంది. అందుకనే బాపూజీ ఈ షరతు పెట్టి వుండవచ్చు" అని సమాధానం చెప్పింది. బాపూజీ చెప్పినమాట నేను బామ్మకు చెప్పాను. ఆమె మరేమీ ఆలోచించకుండా "బాపూజీ తినే పక్షంలో నేను వాటిని రుచికూడాచూడను." అని బదులు చెప్పింది. తరువాత అదేవిధంగా ఆమె మాదగ్గిర కూర్చొని తాను తినకుండా బాపూజీకీ, మాకూ బొబ్బట్లు పెట్టింది.

ఆగాఖాన్ మహల్, పూనా,
నూతన వర్షారంభం. 30-10-'43

ఈరోజు చీకటితో నేలేచి నేనూ, సుశీలక్క, ప్యారే లాల్జీ, బాయమ్మ ప్రార్థనవేళకు ముందుగానే బాపూజీకి నమస్కరించాము. ప్రార్థన అయినతర్వాత స్నానం చేసి నేనందరికీ దణ్ణాలు పెట్టేటప్పుడు బాపూజీకి మళ్ళీ రెండోసారి దణ్ణం పెట్టాను. అప్పుడాయన తమాషాగా "నువ్వందరిలోకి చిన్న దానివి. ఇవ్వాళ నీకు అందరి దగ్గరా ఆశీర్వాదాలు దొరుకుతాయి. కానీ నాకెవ్వరి దీవెనా దొరకదు" అన్నారు.

ఇంతలో డాక్టరుగారు కూడా వచ్చి నమస్కారం చేశారు. అప్పుడు బాపూ యిలాఅన్నారు "ఇది మనకు నిజంగా ఉగాదికాదు, నిజమైన ఉగాది పండుగ భారత దేశం స్వతంత్ర మయిన రోజున చేసుకుందాం. దీపావళి, హోలీ మొదలైన పండుగలన్నీ స్వతంత్ర భారత దేశంలోనే జరగాలి. అప్పుడే అందరికీ కడుపునిండా ఆహారం, వంటినిండా వస్త్రం, ఉండడానికి ఇల్లు లభిస్తాయి. ఈరోజు దేశ మంతటా హోలీ మంటలు మండుతున్నవి. కాని ఇటువంటి ఉగాదులు, దీపావళులు ఇప్పటికెన్నో వచ్చి పోయినవి. ఇంకెన్నో వచ్చి పోతూ ఉంటాయి. ఇంతవరకు జరిగిందీ, ఇప్పుడు జరుగుతున్నదీ మన దేశాభ్యుదయానికేనని నానమ్మకం. మీరు బహేరాజ్జీ మల్బారీ రాసిన ఈపద్యం చదివే ఉంటారు

"సగాం దీఠాం మేపాహా ఆలంనాం భీకమాంగతాం షేరిప ?"

(షాహ్ ఆలం యొక్క ఆప్తబాంధవులు వీధుల్లో బిచ్చమెత్తుకోటం నేను చూచాను.)

"మనం వాళ్ళ వారసులమే కదా! వాళ్ళకు బంధువులమే నన్నా తప్పలేదు. మనమింకా ఎంతకాలం బిచ్చమెత్తుకోవలసివుంటుందో భగవంతునికే తెలియాలి!"

ఆగాఖాన్ మహల్, పూనా.

**7-11-43**

ఇవ్వాళ మీరాబహన్ పుట్టినరోజు. పుట్టిన రోజు పండుగలెన్నో జరగుతూ ఉంటాయి కాని మీరాబహిన్ జన్మదినం విలక్షణమైనదని చెప్పాలి.

ఉదయాన్నే బాపూజీకి నమస్కారం చేయటానికి మీరాబహిన్ వచ్చింది. అప్పుడు బాపూజీ నన్ను పిలిచి తాను వడికిన నూలులోంచి 18 పోగులు తెమ్మన్నారు.

ఆమె అక్కడే కూర్చున్నది. నూలు పోగులు 18 ఎందుకా, అని నాకు ఆశ్చర్యం కలిగింది. కాని అడిగి తెలుసుకోటానికి తగిన సమయంకానందున 18 పోగుల మాల తెచ్చిచ్చాను. ఆవు, మేక మొదలైన పశువులు, పక్షులూ అంటే మీరాబహన్ కెంతో యిష్టం. అందుకని కటేలీగారు మట్టితో చేసిన జంతువుల ఆటబొమ్మలు పార్సెలుకట్టి బాపూజీ ద్వారా ఆమెకు కానుకగా యిప్పించారు. ఇందంతా అయిన తరువాత మీరాబహన్ బల్లదగ్గర కూర్చొని పాలుతాగేటప్పుడు నేనామెను "మీకివ్వాళ బాపూజీ 18 పోగుల మాల ఎందుకు వేశారు? సాధారణంగా పుట్టిన రోజుకు

ఎన్నేండ్లు వస్తే అన్ని పోగులున్నమాల వేయటం ఆ నారం కదా ? " అని అడిగాను.

"బాపూజీ చరణసన్నిధికి చేరుకున్న రోజునుంచే నేను నాపుట్టుక లెక్క పెట్టుకుంటున్నా ఆయన సమక్షంలో జీవించటం నాకు గొప్ప అదృష్టం. కాని బాపూజీకి ప్రియమైన భారతదేశపు ప్రజల్లో కలిసిమెలిసి జీవించటం అంతకన్నా గొప్పవిషయం. 7 నవంబరు 1925 నాడు నేను మొదటి సారిగా బాపూజీ పవిత్ర చరణాలకు నమస్కరించి శరణుజొచ్చాను ఆనాడే నాకు నిజమైనజన్మ లభించింది. ఈనాటికి నాకు 18 ఏండ్లు నిండి 19 ఆరంభమయింది. నీకు నేను పెద్దగా కనిపిస్తున్నప్పటికీ బాపూజీ సమక్షంలో 18 ఏండ్ల బాలికగానే నన్ను నేను భావించుకుంటూ ఉంటాను. " అని మీరాబహన్ సమాధానం చెప్పింది.

ఉత్థాన ఏకాదశీ

9-11-'43

ఉత్థాన ఏకాదశినాడు తులసికి వివాహం జరుగుతుంది. తులసి మీాద బామ్మకు అపారమైన భక్తి. ఉదయం, సాయంకాలం ఆమె తులసి మొక్క దగ్గర నేతితో దీపారాధన చేస్తుంది. అక్కడే కూర్చొని ప్రార్థన, స్తోత్రపఠనం చేసుకుంటుంది

బామ్మ నాలుగు చెరకు గడలు కట్టి ఒక మండపం తయారు చేయించింది. సుశీలక్క రంగు రంగుల పిండితో పెద్ద పూలముగ్గు వేసింది. దాని మీాద తులసిమొక్క

తొట్టె పెట్టి, దానికి ముందు 'ఓంకారం' గీసి తులసి మొక్కను పూలతో అలంకరింపించింది. రకరకాల పండ్లు నైవేద్యం పెట్టారు. సాయంకాలం బాపూజీ కూడ చూడ టానికి వచ్చారు. ప్రార్థనకు వేళైనందున హారతి వెలిగించి, ప్రార్థనకు కూర్చున్నాము. నిత్యప్రార్థన ముగించి రామాయణ కీర్తనలు పాడుతున్నంత వరకూ ఆ తులసి దగ్గర ధూప దీపాలు వెలుగుతూనే ఉన్నవి. ప్రార్థన సమయంలో దీపాలు తీసివేయటం అలవాటు. ఈరోజుకూడ అగరువత్తుల ధూపం, నేతి దీపారాధన తప్ప మిగిలిన దీపాలు తీసివేశారు. తులసి తొట్టె దగ్గర చేసిన అలంకారం అప్పుడెంతో ఇంపుగా కని పించింది. నిత్యప్రార్థన అయినతర్వాత సుశీలక్క వాయిం చిన తాళంతోనూ, మీరాబహన్ వేసిన తంబూరా శృతి తోనూ రామనామ స్మరణ భజన పాటలు, రామాయణ చౌపాయీలు పాడాము. నిత్యప్రార్థన కంటే ఈనాటి ప్రార్థన ఎంతో విలక్షణంగా శోభించింది.

సోమవారం, శుక్రవారం - వారానికి రెండు రోజులూ భజన పాట పాడటం నావంతు. ఇవ్వాళ సోమవారం. ఈ క్రింది భజనపాట పాడమని బాపు నాకు సూచించింది.

> దిల్ మాం దీవో కరో రే, దీవో కరో
> కూడా కామ్ క్రోధనే పరహారో రే — దిల్ మాం
> దయా దివేల్ ప్రేమ పరణాయుం లావో,
> మాంహీ సురతానీ దివేట్ బనావో,
> మాంహీ బ్రహ్మ అగ్నినే చేతావో రే — దిల్ మాం

నాచా దిల్‌నో దీవో జ్యారే ధాశే,
త్యారే అంధారుం మటీ జాశే,
పఛీ బ్రహ్మలోక్‌తో ఓళ్‌ఖాశే — దిల్‌మాం

దీవో ఆఛే ప్రగటే ఏవో,
టాళే తిమిర్నా జేవో,
ఏనే నేణేతో సీరక్షినే లేవో — దిల్‌మాం

దాస రణఛోడ్ ఘర్ సం భాళ్యుం,
జడీ కూంచీ నే ఊఘడ్యుం తాళుం,
థయుం భోమండళమాం అజవాళుం — దిల్‌మాం.

[తాత్పర్యం : హృదయంలో దీపం వెలిగించు. కామ క్రోధాలనే మురికిని తీసివేయి. దయ అనే నూనెతో ప్రేమ జ్యోతిని వెలిగించు. అంతర్ధ్యానమనే వత్తి వేసు. బ్రహ్మ మనే అగ్ని రగుల్కొలుపు. సత్యముగల హృదయజ్యోతి వెలిగిన వెంటనే చీకటి నశించిపోతుంది. తరువాత బ్రహ్మ లోకం సాక్షాత్కరిస్తుంది. చీకట్లు తొలగిపోయేటట్లు హృద యాకాశంలో దీపం వెలిగించు, ఆ జ్యోతిని నేత్రాలతో పరి కించు, జ్ఞానమనే తాళపుచెవి దొరికింది. దానితో తాళం తెరుచుకున్నది, మాకు ఆత్మజ్ఞానం గోచరించింది. అప్పుడు భూమండలమంతా ప్రకాశంతో నిండిపోయింది''- అని రణ ఛోడ్‌దాసు వక్కాణిస్తున్నాడు.]

నేటి పరిస్థితికి సరిపోయే యీ భజనపాట పాడమని బాపు కోరుకున్నది.

ఆగాఖాన్ మహల్, పూనా.

25-11-43

సుశీలక్క వదినెగారు బిడ్డనుకన్న రెండవ రోజునే గతించిపోయినట్టు యిచ్చిన తంతివార్త పది దినాల తరువాత ఇవ్వేళ ఆమె చేతికి అందింది. దీన్నిగురించి హోమ్ డిపార్టు మెంటుకు ఉత్తరం రాయటమయిందిగాని, బామ్మ - సుశీలక్కను ఢిల్లీలో ఉన్న ఆమె తల్లివద్దకు పంపవలసిందని కోరుతూ ప్రభుత్వానికొక ఉత్తరంకూడ రాయమని బాపూజీని ఒత్తిడిచేసింది కాని అది జరగలేదు. ఎందుకంటే, బాపూజీ దగ్గిరున్నవాళ్ళలో ఎవరినీ ప్రభుత్వం బయటికి పంపించదలచుకోలేదు. సుశీలక్క ఇంతవరకు తన బంధువుల్లో ఎవరికీ ఒక్క ఉత్తరమైనా రాయలేదు. కాని ఈ సమయంలో ఆ పట్టుదల వదిలివేసి తన తల్లికి ఉత్తరం రాయవలసిందని బామ్మ బలవంతంచేసింది కాని - "నేనెవరికీ ఉత్తరాలు రాయనని ఒకసారి ప్రభుత్వానికి లిఖితపూర్వకంగా తెలియ జేసిన తరువాత ఆ మాటకు భంగంకలిగిస్తూ ఇప్పుడు ఉత్తరం రాయటం బాగుండ"దని సుశీలక్క వాదించింది. అప్పుడు బామ్మ, బాపూజీ దగ్గిరకు వెళ్ళి ఆయనతో ప్యారేలాల్, సుశీల - అన్నా చెల్లెలూ - ఇద్దరూ ఈ తరుణంలో ఇంటికి ఉత్తరాలు రాయక తప్పదని గట్టిగా నొక్కిచెప్పింది. అందు మీదట బాపూజీ వాళ్ళిద్దరికి నచ్చజెప్పి వాళ్ళచేత ఇంటికి ఉత్తరాలు రాయించారు. సుశీలక్క తల్లి ఢిల్లీలో ఉండేది. అందువల్ల దేవదాసుకాకా అప్పుడప్పుడు వెళ్ళి ఆమెను కలుసుకుంటూండేవారు. ఆమె అవస్థచూచి ఆయన బామ్మకు

రాసిన ఉత్తరంలో - 'సుశీలాబహెన్ విడుదలవటానికి నిరాకరించటం ఏమీ బాగాలేదు, ఆమె అలాచేసి ఉండకూడదు' అని రాశారు. నిజానికి, ప్రభుత్వంవారు సుశీలక్కను విడుదల చేయదలచనూలేదు, ఆమె నిరాకరించనూలేదు. దేవదాసు కాకాకు బొమ్మ రాయించిన ఉత్తరంవల్ల భ్రమకలిగింది. మధ్యప్రదేశ ప్రభుత్వం నన్ను విడుదలచేసినట్లు ఆ ఉత్తరంలో దేవదాసు కాకాకు తెలియపరచటం జరిగింది.

బొమ్మకు ఉత్తరాలు రాసిపెట్టేది నేనేకనుక దేవదాసు కాకాకు కలిగిన భ్రమకు నా రాతే కారణమని భావించి బొమ్మ నన్ను చీవాట్లు పెట్టింది. కాని నేను రాసిన సంగతులు స్వయంగా చదివి చూచుకున్న తరువాతనే బొమ్మ ఉత్తరాల మీాద దస్కత్తు చేస్తుండేది. విపత్కాలంలోకూడ నా కూతురు నాకు సహాయపడటంలేదన్న దుర్భావన సుశీలక్క తల్లికి ఏర్పడిపోతుందేమోనని బొమ్మకు చాలా విచారం కలిగింది. ఈ కారణంచేత ఆమె బాపూజీద్వారా - 'ప్రభుత్వం జైలునుంచి విడుదల చేయదలచింది సుశీలను కాదు, మనూ గాంధీని' - అని స్పష్టంచేసే తంతి నిప్పించింది.

సుశీలక్క వద్దన్నప్పటికీ బొమ్మ ఈ టెలిగ్రాం పంపించింది. ఆమెది మాతృహృదయం. పిల్లలు తమ తల్లియెడల ఏవిధంగా ప్రవర్తించవలెనో ఆమెకు బాగా తెలుసు, పిల్లల దుష్ప్రవర్తనవల్ల తల్లి దండ్రులకుగాని, పెద్దలకుగాని కలిగే మనస్తాపం బొమ్మకు అనుభవమే! అందువల్ల సుశీలక్క మాటను తోసిపుచ్చి ఆమె ఈ విధమైన తంతివార్త ఆమె తల్లికి పంపించింది.

౨౫

# జైలులో - బంధుదర్శనాలు

ఆగాఖాన్ మహల్, పూనా.

27-11-'43

బాపూజీ భారత ప్రభుత్వానికి ఈ క్రింది అభిప్రాయాన్ని తెలియజేసే ఉత్తరమొకటి పంపించారు: "కార్యకారిణి సమితి సభ్యులను కలుసుకొనే విషయంలో తిరిగి సరికొత్తగా ఆలోచన జరగాలి. నేడు బెంగాలులో క్షామం వ్యాపించి ఉన్నది వేలకొలది ప్రజలు తిండిలేక చనిపోతున్నారు. వాళ్ళకు సేవ చేసి తోడ్పడగల దేశసేవకులు జైళ్ళలో మగ్గుతున్నారు. కనుక కార్యవర్గ సభ్యులతో సంప్రదింపులు జరిగిన పక్షాన ఈ సమస్యకు ఏదైనా పరిష్కార మార్గం ఏర్పడవచ్చు." ఈ ఉత్తరానికి భారత ప్రభుత్వపు మంత్రియైన రిఛర్డ్ టాటన్‌హామ్ దగ్గిరనుండి ఈవిధమైన బదులు వచ్చింది

"8 ఆగస్టు 1942 తేదీన చేసిన తీర్మానాన్ని గురించి మీ అభిప్రాయంలో మార్పువచ్చినట్టు కనిపించటంలేదు. అదేవిధంగా కార్యవర్గ సభ్యులలో ఏ ఒక్కరికైనా మీ అభిప్రాయానికి భిన్నమైన అభిప్రాయం ఏర్పడిన సూచన ఇంతవరకు కనిపించలేదు. కనుక ఏ పరిస్థితిలో ఏ షరతుల ననుసరించి మీ సూచనలను సానుభూతితో విచారించటం సాధ్యపడుతుందో మన ఉభయులకు బాగా తెలుసు."

ఇదిగాక ఇంకొక ఉత్తరం కూడ బాపూజీ రాశారు. డాక్టరు గిల్డరుగారి భార్యకు జబ్బుచేసింది కాని ఆయనకుగాని, బాపూజీతోపాటున్న వారికిగాని, మామూలు ఖైదీలకు బంధువులను చూడటానికి దొరకవలసిన సదుపాయాలుకూడ లభించకపోవటంవల్ల బాపూజీ ఈ ఉత్తరం రాయవలసి వచ్చింది

"తలిగ్రాం ఆలస్యంగా అందటం, విపత్సమయంలో మార్గాంతరంలేక కష్టాలను అనుభవించడం అనేది నా అను చరులలో ఒక్క సుశీలానయ్యర్ కు మాత్రమే సంబంధించింది కాదు. డాక్టరు గిల్డర్ గారికికూడ నా వెంటనున్న కారణం చేత తన భార్యనుగాని. కుమార్తెనుగాని కలిసి మాట్లాడే వీలు కలగలేదు. పిన్నవయస్కురాలైన మనూగాంధీకూడా తన తండ్రినిగాని, అక్కలను గాని కలుసుకోటానికి వీలులేక పోతున్నది. అదేవిధంగా కస్తూర్బాకు కూడా తన కొడుకు లనుగాని, మనుమలు మనుమరాళ్ళనుగాని చూచే అవకాశం కలగలేదు.

"నిజానికి ప్రతిబంధాలు, ఆటంకాలు నా అనుయా యులకు అంత కష్టంగా తోచటంలేదని నాకు తెలుసు. ఏ మాత్రం కష్టంగా తోచినా మనూగాంధీ మమ్మల్ని విడిచి వెళ్ళిపోయేది. నామీద ప్రతిబంధకాలు విధించటం నా కర్థ మౌతున్నది. కాని వీరందరి విషయంలో ఈ ఆటంకాలు ఎందుకో నా కర్థంకావటంలేదు"

పైన రాసిన ఉత్తరానికి ఈవిధంగా జవాబు వచ్చింది:

"డాక్టరుగారి కుమార్తె కూడా తన తల్లికి జబ్బుగా వున్న కారణంచేత డాక్టరుగారిని కలుసుకోవలెనని కోరుతూ ప్రభుత్వానికి దరఖాస్తు పెటుకొన్నది, దాన్ని గురించి ప్రభుత్వం ఆలోచిస్తున్నది."

రేపటి రోజు అనగా 28-11-'43 వ తేదీన డాక్టరు గారికి బంధువులను కలుసుకొనే వీలుకలుగుతుందని సాయంకాలానికి కబురువచ్చింది. అందరికీ సంతోషం కలిగింది.*

ఆగాఖాన్ మహల్, పూనా,
28-11-'43

మధ్యాహ్నం 12-30 గంటలకు కర్నల్ భండారీ, డాక్టర్ గిల్డర్ గారిని ఇంటర్వ్యూకు తీసికొని పోవటానికి వచ్చారు. భండారీగారి గదిలోనే సమావేశమేర్పాటయింది. తమవారిని కలుసుకొని డాక్టర్ గారు సాయంకాలం 4 గంటలకు తిరిగివచ్చారు.

---

* పైన చెప్పిన ఉత్తరాలకు సరియైన నకళ్ళు నా దగ్గరలేవు. వాటిని చదివి సారాంశం మాత్రమే నాడైరీలో రాసుకున్నాను. ప్రభుత్వంతో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలకు ఇవి సరియైన నకళ్ళని ఎవరూ భావించ కూడదు. అసలు ఉత్తరాలు ఇంగ్లీషులో నడచినవి. నాకు ఇంగ్లీషు భాషా జ్ఞానం కలిగించటానికీ, ఉత్తర ప్రత్యుత్తరాలు ఎలా ఉండవలెనో నేర్పటానికీ సుశీలక్క వాటిని నాకు పారంలాగ నేర్పింది. నేను రోజూ ఏమి చదివిందీ, ఎంత చదివిందీ డైరీలో నోటుచేసుకోవలసి వున్నందున ఈ విషయాలను నేను తెలుసుకో గలిగాను.

బామ్మ ఆరోగ్యం ఈ వేళ ఏమి బాగాలేదు. రాత్రి నిద్రపోవటం కష్టమైనందున ఆక్సిజన్ తెప్పించవలసి వచ్చింది.

ఆగాఖాన్ మహల్, పూనా,
30-11-'43

బామ్మ ఆరోగ్యం ఏమీ బాగుపడలేదు. డాక్టరు గిల్డర్, సుశీలక్క- ఇద్దరూ ఆలోచన చేసుకొని, బాపూజీతో మాట్లాడారు. ఆమెకు మానసికంగా ఉపశమనం కలగాలంటే అప్పుడప్పుడూ తన వాళ్ళతో కలిసి మాట్లాడే సదుపాయం కల్పిస్తూండటం ఉపయోగకరంగా ఉండవచ్చునని అభిప్రాయ పడ్డారు. ఈ విషయాన్ని గురించి సాయంకాలం ఒక ఉత్తరం కూడా రాయటం జరిగింది

ఆగాఖాన్ మహల్, పూనా,
2-12-'43

బంధువుల పేర్లు సూచిస్తూ ఒక జాబితా తయారు చేసి ప్రభుత్వానికి పంపించినట్లయితే వారిని కలుసుకొని మాట్లాడే ఏర్పాట్లు క్రమశః జరుగుతాయని కటేలీగారు వర్తమానం తీసికొచ్చారు.

మధ్యాహ్నం బామ్మ, బాపూజీ, నేనూ కూర్చొని గాంధీ కుటుంబీకుల నందరినీ వాళ్ళ పిల్లలతో సహా జ్ఞాపకం చేసుకొని వాళ్ళ పేర్ల జాబితా ఒకటి తయారు చేశాం. వాళ్ళలో సగంమంది ఆఫ్రికాలో ఉంటున్నారు. స్త్రీలు, పురుషులు అందరూ కలసి 500 మంది అయినారు. ఇంకా చాలామంది మిగిలిపోయినారు.

ఇంత పెద్ద పేర్ల జాబితా చూచిన తర్వాత గాంధీ కుటుంబ మెంతపెద్దదో యివ్వాళే నాకు తెలిసింది. బాపూజీతో నేను ఈ విషయం ప్రస్తావించినప్పుడు ఆయన "నీ కుటుంబానికంటే నా కుటుంబం నూరురెట్లు పెద్దది" అన్నారు. ఆ మాట నిజమే. 'గాంధి' ఇంటిపేరు ఉన్నవాళ్ళను మాత్రమే ఆయన తన కుటుంబీకులుగా భావించుకోలేదు. జగత్తులోని మనుష్యులందరినీ ఆయన తన బంధువులుగానే లెక్క వేసుకొనేవారు.

ఆగాఖాన్ మహల్, పూనా,
4-12-'43

ఇష్టముంటే కస్తూర్బాను కలుసుకోటానికి రావచ్చునని రామదాస్‌గాంధీకి టెలిగ్రామ్ పంపించమని కర్నల్ భండారీగారు ఉదయాన్నే వచ్చిచెప్పారు.

ఆయన మాట్లాడుతూండగానే నాగపూర్ నుండి రామదాస్ గాంధీ భార్య అయిన నిర్మలాగాంధీని పంపుతున్నట్లు టెలిఫోన్ వార్త అందింది. ఆమె యివ్వాళే వచ్చినట్లయితే ఇవ్వాళే కలుసుకోటానికేర్పాటు జరుగుతుందని, ఆ ఇంటర్‌వ్యూ సమయాన బా, బాపూజీలు తప్ప వేరెవ్వరూ ఉండటానికి వీలులేదనీ భండారీగారు చెప్పారు.

సాయంకాలం 4 గంటలకు నిర్మలపిన్ని నాగపూర్ నుంచి వచ్చింది. నేనామెతో మాట్లాడటానికి వీల్లేదు కనక నమస్కారం మాత్రం చేశాను. ఆమె సుమారు రెండుగంటల సేపు బా దగ్గర కూర్చుని మాట్లాడింది. కుటుంబంలోని

అందరి క్షేమ సమాచారాలను బా అడిగి తెలుసుకున్నది. ఆశ్రమాన్ని గురించిన చిన్న చిన్న విషయాలు, ఆశ్రమ వాసుల ఆరోగ్యం, అక్కడ నిత్యం జరిగే కార్యక్రమాలు - అన్నీ వివరంగా తెలుసుకున్న తర్వాత బామ్మ మనస్సుకు కొంచెం ఉపశాంతి కలిగిందని నాకు తోచింది. ఆమె కొంచెం ఉల్లాసంగా కనిపించింది.

రేపు దేవదాస్ కాకా వస్తున్నారని రాత్రి వార్త అందింది రాత్రి చాలా నెమ్మదిగా గడిచిందనిపించింది. ఒంటి గంటన్నరకు ఆయాసం వస్తున్నట్టు అనిపించేటప్పటికి బామ్మ నన్ను లేపింది. వేడినీళ్ళు, తేనె తాగింది. చేత్తో వీపు సవరించాను. వెంటనే నిద్రపోయింది. కిందటి మూడు రాత్రిళ్ళ కంటె ఆమెకీరాత్రి బాగా నిద్రపట్టింది.

ఆగాఖాన్ మహల్, పూనా,

**5-12-'43**

ఈవేళ బాపూజీకి మౌనదినం. అంతా శాంతంగా కనిపించింది. నాకు రేఖాగణితం చెప్పే ఉద్దేశంతో బాపూజీ గడచిన రెండువారాలునుంచీ నా పాఠ్య పుస్తకం తీసికొని చదువుతున్నారు. ఈ వేళ అది పూర్తిఅయిన తర్వాత నాకు చీటీమీద రాసి చూపించారు. - "కొన్నేండ్ల తర్వాత రేఖా గణితం మళ్ళీ నేను చదివాను - ఎంతో బాగున్నది. నీకు చెప్పే టప్పుడు ఈ పాఠాలన్నీ మళ్ళీ నాకు గట్టిపడతాయి. రేపటి నుంచి మనం 'బిందు'లోని పాఠాలు ఆరంభిస్తాం. దీనిలోని ఇంగ్లీషు పేర్లకు గుజరాతీ పేర్లు తయారు చేయాలి."

"మనం ఈ జైల్లో ఏడేళ్ళు గడపాలికదా, అందుకని గుజరాతీలో ఒక పుస్తకమే తయారు చేయవచ్చు" అని నేనన్నమాటకు బాపూజీ నవ్వారు.

ఇవ్వేళ దేవదాస్ కాకా రాబోతున్నారు. కాని బా "నిర్మల నిన్నవచ్చింది, అందుకని దేవదాస్ ఇవ్వాళ రాకుండా రేపువస్తే బాగుండదు?" నన్నది. అందుకు బాపూజీ కాగితం మీద రాశారు "రాత్రికేమాతుందో ఎవరికి తెలుసు? ఇవ్వేళ పని ఇప్పుడే చెయ్యాలి, రేపటి పని ఇవ్వేళ చెయ్యాలని, మనం భజన పాటలో కూడా చదవటంలేదా?"

మళ్ళీ నిర్మలపిన్నికూడ 'చూడటానికి వచ్చింది కాని ఇద్దర్నీ ఒకేసారి కలిసి రానివ్వలేదు. ఒకరి తర్వాత ఒకరిని రానిచ్చారు. దీనివల్ల కటేలీగారికి 'చూడటానికి వచ్చిన వాళ్ళ డైరీ' రాసుకోటం సులభమయింది. బాకు ఆరోగ్యం పగలంతా బాగానేవున్నా, రాత్రి కాగానే మళ్ళీ తిరగ బెట్టింది. ఇవ్వేళనుంచీ నేనూ, బామ్మా వేరేవేరే గదుల్లో పడుకోటం మొదలుపెట్టాం. బాపూజీ, మిగిలిన వాళ్లు బయట వరండాలో పడుకుంటున్నారు. నిద్ర పట్టకపోవటం వల్ల రాత్రి వేళ అలసట కలిగేది. అందువల్ల బాపూజీకి నిద్రాభంగమాతుందని బామ్మ తనపడక గదిలోకి మార్చింది.

ఆగాఖాన్ మహల్, పూనా,
**7-12-'43**

నేను బామ్మని కనిపెట్టుకొని ఉండటం వల్లనూ, మధ్యాహ్నంపూట ఇంటర్వ్యూల మూలాన బాపూజీకి తీరికలేక

పోవటంవల్లనూ ఆయన నాకు తృప్తిగా పాఠం చెప్పటానికి వీలుపడటంలేదు. అందువల్ల పాఠంచెప్పేవేళ ఉదయానికి మార్చారు.

మధ్యాహ్నం 3 గంటలకు దేవదాస్ కాకా, నిర్మల పిన్ని చూడటానికి వచ్చారు నిర్మల పిన్నికది చివరిరోజు, దేవదాస్ కాకా ఇంకా రెండు రోజులుండవచ్చు.

సాయంకాలం మేము నడకకు బయలుదేరేటప్పటికి ఉన్నట్టుండి బామ్మకు సుస్తీచేసింది అందుకని అందరంపైకి వెళ్ళాం. సుశీలక్క, డా॥ గిల్డర్ గారు ఆమెను పరీక్ష చేశారు. కొంచెం స్వస్థత చిక్కిన తర్వాత ప్రార్థన చేశాం

సుశీలక్క రాత్రి 10 గంటలవరకు నిల్చున్నది నిల్చున్నట్టే ఉన్నది. ఒళ్ళు నొక్కటం, అవసరమైన వస్తువులు తెచ్చి పెట్టటం-యిటువంటి పనులతోనే నాకు సరిపోయింది. కాని సుశీలక్క డాక్టరు కావటంవల్ల మూడు నాలుగు గంటలవరకు కాచుకొని ఉండవలసివచ్చింది. పదిగంటలప్పుడు బాపూజీవచ్చి కొంచెంసేపు కూర్చున్నారు సుశీలక్కను, నన్ను వెళ్లి విశ్రాంతి తీసికోమన్నారు. నేనక్కరలేదని చెప్పినప్పటికి ఆయన నన్ను "నేను చెప్పినట్టు చేస్తేనే నువ్వు చివరిదాకా నిర్వహించుకొనిరాగలవు. బాకు సేవ చేసే అదృష్టం కోరేవాళ్ళు ముందు తమను తాము కాపాడుకోవాలి" అని మళ్ళీ మందలించారు.

నేను గుప్‌చుప్‌గా నామంచంమీదికి పోయి పడుకున్నా. నేను వెళ్ళిన అరగంటకే బామ్మ బాపూజీని కూడా

వెళ్ళి పడుకోమని బలవంత పెట్టింది. బాపూజీ లేచి వెళ్లిన తరువాత ప్యారేలాల్జీ ఆమెచెంత కూర్చున్నారు. ఆయన రెండు గంటలవరకున్నారు. మధ్యలో ఒకటి రెండు సార్లు సుశీలక్క, డాక్టరుగారు వచ్చి బాను పరీక్ష చేశారు. 3-30 గంటలకు బాపూజీ వచ్చి నన్ను లేపి తీసికువెళ్ళారు. బాకు దగ్గూ, ఆయాసం ఎక్కువైంది ఒళ్ళంతా నొప్పులు! 3-30 మొదలు 7-30 గంటలలోపల అరగంట కొకసారి ఆమెకు బాగా నిద్ర పట్టింది. వెల్లికిల పడుకోలేక పోయింది. తెల్లవారిన తరువాత ముఖం కడుక్కొని వేడినీళ్ళు, తేనె పుచ్చుకొని మళ్ళీ 8 మొదలు 9½ గంటలవరకు బాగా నిద్రపోయింది.

ఆగాఖాన్‌మహల్, పూనా,
8-12-'43

సుశీలక్క బామ్మకు మాలిష్ చేయవద్దని చెప్పింది. స్నానంకూడా వద్దన్నది. స్పాంజ్‌తో తుడిపించింది. 10 గంటలకు బామ్మ ఒక కప్పు కషాయం త్రాగింది. సగం నీళ్ళు కలిపిన పాలలో అత్తిపండ్లు ఉడకబెట్టి మధ్యాహ్నం ఆహారంగా యిచ్చాం. ఆమెకు బలహీన మెక్కువయింది.

మధ్యాహ్నం ఇంటర్వ్యూ సమయంలో హరిలాల్ కాకాగారి కుమార్తెలిద్దరూ వచ్చారు బామ్మను చూడటానికి మాధవదాస్ మామగారిని లోపలికి రానివ్వలేదని రామి అక్క చెప్పింది. మాధవదాసుగారు బామ్మకు సోదరులు.

ఊర్మి వయస్సులో చిన్నదైనా చక్కగా నృత్యం చేసి చూపించింది. ఆ ఏడేళ్ళ బాలిక చూపించిన నృత్యకళకు బామ్మ

ఆనందించింది. మనుమల, మనుమరాళ్ళ చాతుర్యం చూచి తాతలకు, అవ్వలకు ఆనందం కలగటం సహజమేకదా!

వీళ్ళందరు వెళ్ళిపోయిన తరువాత మాధవదాసు మామగారి వంతువచ్చింది. బాకు ఆయనొక్కడే అన్న. ఆయనకు ఆమె ఒక్కతే సోదరి. ఇటువంటి సోదరీ సోదరులు జైలు వాతావరణంలో ఒకరినొకరు కలుసుకోటం ఒక విచిత్రమైన సంఘటన! బాబావదిన-అనగా మాధవదాసు మామ భార్య కాలంచేసినందున ఆయన మనస్సూ, శరీరమూ దుర్బలమైపోయాయి. ఒకరినొకరు చూచిన వెంటనే హార్దాతిరేకంవల్ల ఇద్దరికీ నోటివెంట మాటరాలేదు. రెండునిమిషాలు నిశ్శబ్దంగా వుండిపోయినారు మామగారినిదర్శించికొన్నేండ్లు గడిచినవి. నేనాయనకు నమస్కారం చేశాను.

"ఇంతగా చిక్కిపోయా వెందుకని?" అని ఉన్నట్టుండి బా ప్రశ్నించింది. "రామనామం స్మరించుకో, చింతలన్నీ వదిలిపెట్టు, వ్యర్థంగా చింతపడటం దేనికి?" అన్నదామె.

బా మామగారికి టీ తెప్పించి యిచ్చింది. నిర్మల పిన్ని నాగపూర్ నుంచి చలికాలానికి బాగుంటుందని మెంతి పాకం (ఒక లేహ్యం) తయారుచేసి తెచ్చింది, దాన్నంతా అన్నగారి చేతిలోపెట్టి: "ఇది నిర్మల చేసితెచ్చింది. నీ కిస్తున్నా. అంతా తిను, వ్యర్థమైన చింతవదిలెయ్యి. ఈశ్వర ధ్యానంచేస్తూ గడపాల్సిన రోజులివి వీలైనంతసేపు రామ నామ స్మరణ చేసుకో!"అని ఆయనకు ధైర్యంచెప్పింది.

సెలవు తీసుకునే వేళయేటప్పటికి ఇద్దరికి గద్గద స్వరం పడ్డది.

మూడోవంతు దేవదాస్ కాకాది. ఆయనవచ్చి నాగపూర్ జైల్లో కిశోర్‌లాల్ చాలా జబ్బుగా ఉన్నారనీ, బరువు 75 పౌన్లదాకా తగ్గిపోయిందనీ, ఆయాసం వస్తున్నదనీ చెప్పారు. ఆయన్ను పెరోల్ మీాద విడిపించే సంగతి ఎత్తేటప్పటికి బాపూజీ ఆ ప్రయత్నం చేయవద్దని చెప్పి, యిలా అన్నారు. "కిశోర్‌లాల్ ఇక నాకు దక్కడు. ఆయన సంగతి నాకు బాగా తెలుసు. అస్వస్థత కారణంగా పెరోల్‌మీాద విడుదల కావటానికి బదులుగా జైల్లో మరణించటానికే ఆయ నిష్టపడతాడు. మహాదేవ్ లాగ ఆయనకూడా జైల్లోనే మరణించాడని వింటే నాకేమీా ఆశ్చర్యం కలగదు. ఇటువంటి పురుషులు తమ ప్రాణాలను బలిస్తేనే స్వారాజ్యం సిద్ధిస్తుందేమో! ఎవరు చెప్పగలరు?"

## ౨౬

## ప్రభుత్వ ప్రవర్తన

ఆగాఖాన్ మహల్, పూనా,
28-12-'43

బా ఆరోగ్యం ఎగుడుదిగుడుగా ఉంటున్నది. ఇవ్వేళ శ్యామల్‌దాస్ కాకా, దేవదాస్ కాకాతోను, జమ్నాదాస్ కాకాతోను కలిసి కుటుంబంగా మధ్యాహ్నం 3 గంటలకు కలుసుకోటానికి వస్తారని కర్నలు అద్వానీ చెప్పివెళ్ళారు. వీరందరూ ఒకరి తరువాత ఒకరుగా వంతుల ప్రకారం వచ్చారు. పిల్లాజెల్లతో సకుటుంబంగా వచ్చినందున గోల ఎక్కువైంది. బాపూజీ పిల్లలకు ఎండిన పండ్లు పెడుతూ

శ్యామల్ దాస్ కాకాతో "పట్టు, నువ్వుకూడా పిల్లల్లోనే జత" అని ఆయనకుకూడా ప్రసాదం పెట్టారు.

రెండోవంతు దేవదాస్ కాకాది. లక్ష్మీపిన్ని, తార, మోహన్, రామూ అందరూ వచ్చారు. అందరికీ ఎండిన పండ్ల ప్రసాద మిచ్చారు బాపూజీ. వాళ్ళందరితో ఆనందంగా ఆడుకొనే అవకాశం నాకు కలిగింది నేను, తార, మోహన్ ఇంకో గదిలో ఆడుకుంటూ కూర్చున్నాము. అందువల్ల నా పని మరచిపోయినాను, కాని నాకు పాఠం చెప్పటానికి బాపూజీకి సమయం చిక్కనందున నేను తప్పించుకున్నా. తిరిగి వెళ్ళవలసిన వేళయ్యేటప్పటికి లక్ష్మీపిన్ని బామ్మకు నమస్కారం చేయించటానికి పిల్లల్ని తీసుకువెళ్ళింది

"జైసుఖ్ లాల్ను, మనూ అక్కలనూ వీలుంటే ఒక సారి వచ్చి చూచివెళ్ళమని చెప్పు." అని బామ్మ దేవదాస్ కాకాతో అన్నది. ఆ మాటలు నా చెవిలో పడ్డవి. నాకు సంతోషం కలిగింది. వెడుతూ వెడుతూ దేవదాస్ కాకా "నేను కరాచీకి సమాచారం పంపించాను" అని చెప్పారు. నేను మావాళ్లనుచూచి సంవత్సరమున్నరయింది, వాళ్లు కూడ వస్తారని విని నాకు అంతులేని ఆనందం కలిగింది. ఇంత లోకే బా నాతో అన్నదికదా "మనం చట్టాన్ని ధిక్కరించ కుండా బంధువులను చూడాలి. అందుకని నువ్వేమీ మాట్లాడ కుండా వీళ్ళను చూడవచ్చు."

బా తన అనారోగ్యాన్ని లక్ష్యం చేయకుండా వాళ్ళ సంగతినే యెక్కువగా గమనించింది చూడటానికి వచ్చిన

వాళ్ళందరు ఆమెతో మాటలు పెట్టుకోరు. నమస్కారం చేస్తారు. మాట్లాడితే ఆమెకు ఆయాసం వస్తుందని వాళ్ళకు తెలుసు. కాని బామాత్రం అందరిక్షేమం విచారిస్తుంది. అందరూ బాపూజీతో మాట్లాడి వెడతారు. జైలుకు బైట బా, బాపూజీల యోగక్షేమం తెలుసుకోటానికి తహతహ లాడుతూ జనసమూహం కాచుకొని ఉండేది. ఈ బంధువుల ద్వారా సంగతులు తెలుసుకొని వాళ్ళకెంతో ధైర్యం కలిగేది. ఈరోజు ఇంటర్వ్యూ 6 గంటలవరకూ నడిచింది. బా ఆరోగ్యం కొంతవరకు సరిగానే ఉన్నది. కాని బాపూజీకి రక్తపుపోటు ఎక్కువైంది.

ఆగాఖాన్ మహల్, పూనా,
29-12-'43

ఉదయాన్నే 8-30 గంటలకు కటేలీగారు వచ్చి బాతో ఈవేళ మనూబాయి కుటుంబీకులు వస్తున్నారని చెప్పారు. బాకు చాల సంతోషమైంది "పాపం, ఈ చిన్నపిల్ల ఇన్నాళ్లిక్కడే పడున్నది. అక్కలను, నాయన్ను చూచి సంతోష పడుతుంది" అని, నాతో "ఇదిగో, ఇవ్వేళ మీ నాయనా, మీఅక్క సంయుక్తా వస్తున్నారట. నువ్వు వాళ్ళతో ఏమైనా చెప్ప దలచుకుంటే నాతో చెప్పు" అన్నది.

ఇవ్వేళ అందరినీ ఒకేసారి రానిచ్చారు. కనూభాయీ, మామేనత్తా కూడా వచ్చారు. కనూభాయీ భజన పాట పాడి వినిపించాడు. మాఅక్కకూడా పాడింది. మామేనత్త బా తలకు నూనె రాచింది. వాళ్ళతో మాట్లాడాలని నాకు ఎంతో కుతూహలం కలిగింది. కానీ ఎలా?

మాఅక్క తన చిన్నపిల్లలు-అరుణ, హంసలను వెంట తీసుకొని వచ్చింది. నాకు తెలియకుండానే నేను అరుణను ఎత్తుకున్నాను. కొంచెం ఇటూయిటూ తిప్పి ఆడిస్తూండగా నియమభంగం చేస్తున్నానని తోచి, ఆ పిల్లను క్రిందికి దింపాను. అదిచూచి కటేలీగారు "చిన్నపిల్లలను ఎత్తుకొని ఆడించ వద్దని ప్రభుత్వం ఆజ్ఞాపించటంలేదు" అన్నారు నాతో రెండు గంటల తర్వాత అందరూ వెళ్లిపోయినారు.

ఆగాఖాన్‌మహల్, పూనా,
2-1-'44

ఇంటర్వ్యూ జరిగేటప్పుడు ఒక్క నర్సుమాత్రమే ఉండ వలెననీ, బాగా అవసరమైతే ఒకడాక్టరుకూడ ఉండవచ్చుననీ కటేలీగారు ప్రభుత్వపు ఆజ్ఞాపత్రాన్ని తీసుకొచ్చారు. డాక్టరు దిన్‌షా మెహతాగారి చికిత్స కావాలని బామ్మ తహతహలాడుతుండేది. అంతేగాక దేశీయవైద్యంవల్ల ఉప శమనం కలగవచ్చును గనుక ఒక మంచివైద్యుడికి చూపించ మని ఎన్నోసార్లు అడుగుతుండేది. కర్నల్ భండారీగాని, కర్నల్‌షాగాని వచ్చినప్పుడు బామ్మ సమక్షంలో వాళ్లతో మాట్లాడి తన కోరిక తెలియజేస్తుండేది కాని దానివల్ల ఫలితం లేకపోయేటప్పటికి బాపూజీ స్వయంగా టాటన్‌హామ్ పేర ఒక ఉత్తరం రాశారు. అందులో ఆయన, ఇంటర్వ్యూల సమయంలో ఉపచారం చేసేవాళ్ళను గురించిన ప్రతిబంధక మేమీ ఉండరాదనీ, రోగిమిక్కిలి బలహీనురాలైనందున కనీసం ఇద్దరు ముగ్గురు పరిచారకులైనా కావలసి ఉంటా రనీ, కనూభాయికి మూడునాళ్ళ కొకసారివచ్చి కలుసు

కోసేందుకు అనుమతివ్వటం కంటే ఆయన్ను ఆగాఖాన్ మహల్లోనే ఉండనివ్వవలసిందనీ ప్రభుత్వాన్ని కోరారు.

ఆ ఉత్తరంలో యింకా కొన్నిసంగతులు కూడా స్పష్టంగా తెలియపరచారు. "కస్తూర్ బాకు బంధువులను కలిసికొని మాట్లాడే సదుపాయమిచ్చారుగాని, ఆమెకు పరిచర్య చేసేవాళ్ళేవరూ ఆ సమయంలో అక్కడుండ కూడదని నిషేధించటంలో వివేకమేమీ కనిపించటంలేదు. అదిగాక, హరిలాల్ గాంధీ ఇక్కడ హాజరుగా ఉన్నప్పటికీ ఆయన బాను కలిసి మాట్లాడవచ్చుననే అనుమతి పత్రం కర్నల్ భండారీగారికి పంపకపోవటంవల్ల హరిలాల్ ఆమెను కలుసుకోటానికి వీలుపడలేదు. ఈసంగతి బాకు తెలిసి ఆమె చాలా దుఃఖించింది. ప్రతి ఒక్కరికి బొంబాయిఆఫీసునుండే అనుమతి రావాలంటే బంధువులకు ఆలస్యంకావటం, వారామెను కలుసుకోలేక తిరిగి వెళ్ళిపోవటం జరుగుతున్నది" ఈ విషయంకూడ ఉత్తరంలో స్పష్టంగా రాశారు బాపూజీ.

ఈ ఉత్తరంలోని చివరిభాగం చాలా జాలికలిగించేదిగా ఉన్నది సుశీలక్క దగ్గర దాన్ని నేను చదువుతున్నప్పుడు ఆమె కళ్ళనుండి కన్నీరు బొటబొటకారింది. అందులో ఇలా ఉన్నది.

"శ్రీమతి కస్తూర్ బా ప్రభుత్వంవారి రోగి. ఆమెకు భర్తననే హోదాను పురస్కరించుకొని నేను చెప్పవలసిందేమీలేదు. ఆమెను వదలివేయడానికి బదులుగా ప్రభుత్వం తనమంచికోసమే నాదగ్గిర ఉండనిచ్చింది కానీ ఆమె రోగం నయమయినాసరే, లేక చావసిద్ధమైనాసరే మేము చేయవల

సిందేమీ లేదని ఉపేక్షిస్తున్నది. ఆమెకు కనీసం మానసిక శాంతినైనా చేకూర్చటం అటు ప్రభుత్వానికీ, ఇటు నాకూ కర్తవ్యం. ఆమె మానసిన భావనలకు ఆఘాతం కలిగించటం, ఉత్సాహభంగం చేయటం ఆమెరోగాన్ని మరింత తీవ్రం చేయటమే అవుతుంది."

ఈవారంలో బాపూజీ బరువు రెండుపౌన్లు తగ్గిపోయింది. ఆయనకు మొత్తంమీద ప్రతిరోజూ జాగరణే అవుతున్నది. తినే ఆహారం కూడ వెనుకటి కన్న తక్కువై పోయింది.

ఆగాఖాన్‌మహల్, పూనా,
8-1-'44

బంధువులను కలుసుకొనే కార్యక్రమం మొత్తంమీద రోజూ వుంటుండేది. ప్రభుత్వంవారు ఒక ఆయాను పంపించారు. ఆమె తన పిల్లలను వదిలివచ్చి రాత్రింబవళ్లు మాతో పాటే జైలులోవుండి సేవచేసింది. కానీ ఆమె కీపని అంటే విసుగు కలిగింది. అందుకని ఇవ్వేళ ఇంటికి వెళ్ళిపోయింది.

తీగెలతో కట్టిన ఆవరణం వెంబడి 30 అడుగుల వెడల్పుగల ఖాళీ స్థలమున్నది అక్కడ ఎండ బాగా తగులుతుంది. అందువల్ల బాపూజీ ఉదయంపూట అక్కడ తిరుగుతుంటారు. అక్కడ నడువవలదని ఇవ్వేళ ఉత్తర్వు వచ్చింది. నాకు కోపంవచ్చి అన్నాను :

"మీరిక్కడ నడిస్తే ప్రభుత్వానికి వచ్చిన నష్టమేమిటి ?"

"విరోధమున్నప్పుడు ఔనన్నది కాదంటారుగదా ? బాకు ఇంటర్వ్యూలకు అనుమతించటం తప్పనిసరి అయింది గనుక యిచ్చారు"

"బామ్మను వదలివేయటానికి అభ్యంతర మేమిటి?"

"వదలివేసిన తరువాత ఆమె చనిపోయిందనుకో, అప్పుడామె అపరకర్మలకు నన్నుకూడా విడిచిపెట్టవలసి వస్తుంది. అదీ ప్రభుత్వానికి భయం. నన్ను విడిచిపెట్టకపోతే లోకంలో అపకీర్తివస్తుంది. ఈమధ్యనే మౌలానాగారి బేగమ్ చనిపోయింది, అయినా ప్రభుత్వం ఆయన్ని వదలిపెట్టలేదు. కాని, బా చనిపోతే నన్ను విముదల చేయటం తప్పనిసరి అవుతుంది"

బామ్మకు పరిచర్య చేయటానికి నేనూ, సుశీలక్కా మిగిలాము, నర్సుకూడా వెళ్ళిపోయింది. మా ఇద్దరివల్లా పని తెమలటంలేదు అందువల్ల బామ్మ ప్రభావతిని పంపమని కోరింది. డాక్టరు గిల్డరు, సుశీలక్క ఈ విషయంలో ఉత్తరాలు కూడా రాశారు. రెండుమూడు రోజుల్లో ప్రభావతిని పంపిస్తున్నామని జవాబు వచ్చింది.

ఆగాఖాన్ మహల్, పూనా,
9-1-'44

ఈ రోజునుంచి బాపూజీ మౌనం ఆరంభించారు. కాని నాకు చదువు చెప్పటానికీ, సుశీలక్కతోనూ, చూడటానికి వచ్చిన బంధువులతోనూ, అత్యవసర పరిస్థితిలో అధి

కారులతోనూ మాత్రం మాట్లాడటానికి వీలుంచుకొన్నారు. ఈ నియమమెప్పటివరకు పాటిస్తారో నిర్ధారణ చేయలేదు.

ఆగాఖాన్ మహల్, పూనా,
12-1-'44

సాయంకాలానికి భాగల్పూరునుంచి ప్రభావతివచ్చింది. ఆమె వెంట యూరపియన్ సార్జెంటు వచ్చాడు. ఉఫ్ అంటే పడిపోయే ప్రభావతి కింత బందోబస్తు ఎందుకో! ఆమె వచ్చి నప్పుడు మేము నడకకు బయల్దేరుతున్నాము, బాపూజీ దగ్గర ప్యారేలాల్జీ కూర్చున్నారు.

బక్కచిక్కిన ప్రభావతి వెంట తుపాకి పట్టుకున్న సార్జెంటును చూచి నాకు నవ్వొచ్చింది "నాగపూర్ నుండి నా వెంటవచ్చిన ఇద్దరు జవాన్లకు పూనా వచ్చే దారే తెలి యలేదు ప్రభుత్వదృష్టిలో నేను చాలా నమ్మకస్తురాలిని అయినానా, లేదా?" అని అడిగాను నేను.

"నిజమే ప్రభుత్వ దృష్టిలో నువ్వు నమ్మకస్తురాలివే, కాని నా దృష్టిలో ప్రభావతే విశ్వాసపాత్రురాలు. నువ్వు పారిపోయేదానివి, కాని ప్రభావతి ఎన్నటికీ అలా చెయ్యదు" అన్నారు బాపూజీ.

ప్రభావతిని స్నానంచేయమనీ, నన్ను ఆమెకు భోజనం పెట్టమనీ చెప్పి మమ్మల్నిద్దర్నీ బామ్మదగ్గరకు పంపించారు.

ప్రభావతి బామ్మ దగ్గరకు వెళ్ళగానే ఆమె మొట్ట మొదట జయప్రకాశ్ నారాయణ్ గారి క్షేమం విచారిం

చింది. "ఆయన ఆరోగ్యం బాగుండటంలేదు; జైల్లోనుంచి పారిపోతూ పట్టుబడ్డారు. అప్పటినుంచి ప్రభుత్వం ఆయన్ను చాలా బాధపెడుతున్నది" అని చెప్పి, తానుపడ్డ కష్టాలన్నీ వివరించింది ప్రభావతి.

పాపం, ప్రభావతి ఎన్నో కష్టాలు సహించింది. కలుపుగోలుతనం, ఆపేక్షా గల మనిషి. వచ్చీరావటంతోటే తనపని అందుకున్నది.

"ప్రయాణపుబడలిక తీరనీయండి" అన్నాను నేను.

"కాని మీ అసట తీర్చాలిగదా నేను! బా, బాపూజీల సేవ చేయటంతో నా అలసట దానంతటదే పోతుంది" అన్నదామె.

మేమిద్దరం పనులు పంచుకున్నాం. ఉదయం నుండి 1 గంటవరకు నేనూ, ఒంటిగంట నుండి 6 గంటలవరకు ప్రభావతీ బాప్మదగ్గరుంటాం. సుశీలక్కనుగాని, ప్యారేలాల్జీని గాని అవసరమైతేతప్ప పిలవకూడదు. వాళ్లిద్దరు బాపూజీకి ఉపచారం చేస్తుంటారు. ఎవ్వరిమీదా ఎక్కువ బరువుపడకుండా ఉండేట్టు సర్దుబాటు చేసుకున్నాం.

తరువాత మేము చేసింది ఒకే ఒక ప్రార్థన. మా అందరి సపర్యలతో బాప్మ కోలుకొని తిరిగీ ఆరోగ్యం పొందేటట్టు, ఆమె అండదండలు మాకు ఇతోధికంగా లభించేటట్టు చేయమని భగవంతుణ్ణి వేడుకొన్నాము.

## ౨౭

# బా చివరి రోజులు

ఆగాఖాన్ మహల్, పూనా,

14-1-'44

బాయమ్మ రోజూ సాయంకాలం నాలుగు గంటలకు గుజరాతీ భాషలో వ్రాయబడిన వాల్మీకి రామాయణం చదువుతుండేది. అది పూర్తయిన తరువాత భాగవతం చదివించుకొని వింటుండేది. భాగవతమంతా ఒకసారి పూర్తయింది. కాని గూఢార్థంగల కొన్ని ఘట్టాలను నేనామెకు వివరించి చెప్పలేకపోయాను. అందుచేత సుశీలక్క ఆ భాగాలను మళ్ళీ చదివి చెప్పటం మొదలుపెట్టింది.

నాలుగైదు రోజులుగా బంధువుల సమావేశాలవల్ల భాగవత పారాయణ నిలిచిపోయింది. అది ఆమెకు కష్టంగా తోచి, "రెండు గంటలకు నాకు భాగవతం చదివి చెప్పమని సుశీలక్కతో చెప్పు" అని నన్నాదేశించింది. కాని, రాత్రి జాగరణ చేసినందున సుశీలక్క రెండు గంటలప్పుడు నిద్రపోతున్నది. అందువల్ల నేనే మళ్ళీ చదివి చెప్పటం మొదలుపెట్టాను. సుశీలక్క చదివి చెప్పటంలో బాయమ్మకు ఎక్కువ స్వారస్యం తోచినప్పటికీ ఇప్పుడామె నాతోనే చదివించుకొని వింటానన్నది.

"నాడి చూడటం మొదలైన డాక్టర్ల పనులు నువ్వు చెయ్యలేవు కాని భాగవతం చదవటం నీకు సులభమే. కనుక నువ్వుగాని, ప్రభావతిగాని చేయగలిగిన పనులు సుశీలను

చెయ్యమనటం ఆమె నెత్తిన ఇంకా ఎక్కువభారం పెట్టి నట్టే!" అన్నది బా‌మ్మ.

తనను నిద్రలేపకపోవటంవల్ల బామ్మకు ఈ కొంచెం సేవచేసే అవకాశం పోయిందని సుశీలక్కకు విచారంకలిగింది, కాని సుశీలక్కమీద బరువు వేయటం తప్పిందిగదా, అని బామ్మ సంతోషించింది. భాగవతం చదవటమయిన తరువాత బామ్మ "ఇవ్వేళ మకర సంక్రాంతిగదా!" అని అడిగింది

నాకీ పండుగ సంగతి జ్ఞాపకం లేదు "ఇటువంటి పండుగలను గురించి నాకు జ్ఞాపకంచెయ్యటం నీపని ఇవ్వేళ గోవులకు గడ్డి వెయ్యాలి కథియవాడ్‌లో దీన్ని పుణ్య కార్యంగా భావిస్తారు. ఇక్కడ మహారాష్ట్రంలో నువ్వులు, బెల్లం పంచిపెట్టే ఆచారమున్నది. ఈసంగతులన్నీ నువ్వె ప్పుడు తెలుసుకుంటావు? లేచి వెళ్లి వెంటనే నువ్వుండలు కట్టు" అని బామ్మ నన్నాజ్ఞాపించింది.

నేను వెంటనే వెళ్ళి నువ్వుండలు చెయ్యటం మొదలు పెట్టాను. బాపూజీ ఇటువంటిఖర్చులు చెయ్య వద్దంటారు. కాని ఈసారి బామ్మ నొచ్చుకుంటుందేమోనని ఆయన అడ్డు చెప్పలేదు. సాయంకాలం ఖైదీలకు, సిపాయీలకు తలా ఒక నువ్వుండచొప్పున తనచేత్తో యిచ్చి "ఈమాటు సంక్రాంతికి నేను జీవించివుండను. ఇదే చివరి పండుగ. తీసికోండి" అని చెప్పింది.

ఆమె ఆరోగ్యం బొత్తిగా క్షీణించింది. పడక దగ్గిర అహర్నిశలూ యిద్దరు మనుష్యులు కాచుకొని ఉండవలసిన

పరిస్థితి ఏర్పడింది. రాత్రులు మేల్కొని ఉండవలసిన వాళ్ళకు వంతు లేర్పాటుచేశారు. ఒకరోజు రాత్రి 9 నుండి 2 గంటలవరకు సుశీలక్క, 2 నుండి ఉదయం 7 గంటలవరకు నేను; మళ్ళీ రెండోరోజు రాత్రి 9 నుండి 2 గంటలవరకు ప్యారేలాల్జీ - 2 నుండి ఉదయం 7 గంటలవరకు ప్రభావతి - ఈవిధంగా ఎవరికీ కష్టమెక్కువ కలగకుండ వంతు లేర్పాటు చేశారు.

ఆగాఖాన్‌మహల్, పూనా,
26-1-'44

బామ్మ పరిస్థితిలో మార్పేమీ రాలేదు. చూడటానికి వచ్చే బంధువులు తమతమ వంతులప్రకారం ఆయా సమయాల్లో వచ్చి పోతున్నారు.

ఇవ్వేళ స్వాతంత్ర్యదినం కావటంవల్ల మేమందరం ఉపవాసముండి మా ఆహారం యధాప్రకారం ఖైదీలకు పంచి పెట్టాము.

సాయంకాలం జెండావందనం జరిగింది. డాక్టరు గిల్డరుగారు వందనం చేయించారు. "ఝండా ఊంచా రహే హమారా", "సారెజహాంసే అచ్ఛా హిందూస్తాం హమారా", 'వందేమాతరం' అనే మూడు గీతాలు పాడాము. తరువాత బాపూజీ తీసికొన్న ప్రతిజ్ఞ డా॥ గిల్డరు గారు చదివి వినిపించారు.

"హిందూదేశం సత్యాహింసల ద్వారా, నిజమైన అర్థంలో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని పొందాలి.

ఇది నాజీవిత లక్ష్యం. ఇంతకుముందుకూడ నాలక్ష్యమిదే. దీన్ని సాధించే సంకల్పంతో, 14వ స్వాతంత్ర్యదినమైన నేడు, నేను తిరిగీ ప్రతిజ్ఞచేస్తున్నాను. అది లభించ నంత వరకు నేను స్వయంగా విశ్రాంతి తీసుకోను. నా చెప్పుచేతల్లో వున్న వాళ్ళను కూడ విశ్రాంతితీసుకో నివ్వను. 'గాడ్, అల్లా, పరమాత్మా' అనే మామూలు పేర్లతో పిలువబడే ఆ అగోచరమైన ఈశ్వరశక్తిని ప్రార్థిస్తున్నాను. నా ఈప్రతిజ్ఞ సఫలీకృత మయేటట్లు ఆ పరాశక్తి నాకు తోడ్పడుగాక!"

రాత్రి 2 మొదలు ఉదయం 6 గంటలవరకు నేను నావంతు జాగరణ చేశాను గనుక బాపూజీ నన్ను నిద్ర పొమ్మన్నారు నేను 6 నుండి 8 గంటలవరకు ఆయన మాట ప్రకారం నిద్రపోయినాను. రాత్రి మేల్కొనేవాళ్ళు ఎప్పు డైనా సరే వెనకాముందుగా వీలుచేసికొని నిద్రపోవలసిందే, లేకపోతే వాళ్ళు పరిచర్య చేయలేరని బాపూజీ గట్టిగా చెప్పారు.

ఆగాఖాన్ మహల్, పూనా.

30-1-'44

ఈదినం బామ్మ ఆరోగ్యం చాలా క్షీణించింది. ఆయాస మెక్కువయింది. బాపూజీ కీవ్వేళ మౌనం.

మధ్యాహ్నం కనూగాంధీ వచ్చి సాయంకాలం 7 గంటల వరకు ఉన్నారు. రాత్రి నేనూ, సుశీలక్క ఒకరి తరు వాత ఒకరం మేల్కొని వున్నాము. మేమిద్దరం భజనగీతాలు

పాడి వినిపించాము. రాత్రంతా భజనా, నామస్మరణా చేయమని బా చాలాసార్లు అడిగింది. ఇప్పటి వరకు ఏ రాత్రీ ఇంత ప్రమాదకరంగా గడవలేదు. బాపూజీకికూడ రక్తపుపోటు ఎక్కువైంది.

దిన్‌షామెహతాను పిలిపించమని బా చాలాసార్లు అడిగింది. ఆ విషయంలో బాపూజీ ప్రభుత్వాని కిదివరకే ఒక ఉత్తరం రాశారు దానికి బదులు రాకపోవటంవల్ల మరొక ఉత్తరం ద్వారా జ్ఞాపకంచేశారు దానిసారాంశమిది:

"రోగి పరిస్థితి ప్రమాదకరంగా ఉన్నది ఆమెకు పరిచర్యచేసేవారు నలుగురే అయినారు. మూడునాళ్ళ కొకసారి రాత్రంతా ఇద్దరు మనుష్యులు మేల్కొని సేవ చెయ్యవలసి వస్తున్నది పగలైతే నలుగురికి పని పడుతున్నది. రోగికికూడ ధైర్యం పోయింది 'డాక్టరు దిన్‌షా ఎప్పుడు వస్తా'రని ఆమె మాటిమాటికి అడుగుతున్నది.

1. తాత్కాలికంగానైనా డాక్టరు దిన్‌షామెహతా గారిని పంపించటం జరుగుతుందా, లేదా?

2. బంధువులను కలుసుకొనే సమయంలో పరిచర్య చేసేవారి సంఖ్యను గురించిన ప్రతిబంధకం తొలగిస్తారా, లేదా ?

3 కనూగాంధీకి పూర్తిగా ఇక్కడే ఉండిపోవటానికి అనుమతి లభిస్తుందా, లేదా ?

రోగికి సౌకర్యాలు ఆలస్యంగా అందినవనే మాట రాకుండా మాత్రం చూచుకోమనీ, పైన అడిగిన విషయాలకు శీఘ్రంగా సమాధానం పంపమనీ కోరుతున్నాను."

ఈ మధ్య ఎవరికీ ఒక్క నిమిషమైనా తీరిక చిక్కటం లేదు. అందరం యంత్రాల్లాగ పనిచేస్తున్నాం. బాపు అనారోగ్య మధికం కావటంవల్ల ఈ విషమపరిస్థితి ఏర్పడింది.

ఆగాఖాన్ మహల్, పూనా,

**1-2-'44**

బాపుకు సేవచేయటానికి ఇవ్వేళ కనూభాయీకి అనుమతి దొరికింది. ఆయన గతరాత్రే వచ్చేశారు డాక్టరు గిల్డరు, సుశీలక్క అందరికీ డ్యూటీ తగిలించారు. నాకు రాత్రిపూట జాగరణ చేసే డ్యూటీ సాంతం తొలగించి బా, బాపూజీలకు చేయవలసిన చిల్లరపనులు ఒప్పగించారు. ఈ మార్పును ముఖ్యంగా నా కళ్ళను కాపాడటానికే చేసినట్లు తెలిసింది. పైకి మాత్రం "అందరూ రాత్రిపూట మేల్కొని ఉంటామని పట్టుపడితే పగలు మాకు వండిపెట్టే దెవరు?" అన్నారు. డాక్టరు గిల్డరుగారు నాకీ విషయం తెలియజెప్పి సమాధానపరచారు.

ఈ విధంగా నా 'డ్యూటీ' ఉదయం 5 నుండి 9, మధ్యాహ్నం 1 నుండి 3, సాయంకాలం 6 నుండి 9 గంటల వరకు మార్పుచేయటం జరిగింది. రాత్రిపూట ఒకరోజు సుశీలక్క, కనూభాయీలకు, రెండవరోజు ప్రభావతి, ప్యారేలాల్జీలకు వంతులు ఏర్పడ్డవి. డా. జీవరాజ మెహతాను యర్వాడా జైలునుంచి కర్నల్ భండారీ, పిల్చుకొనివచ్చి బాపును పరీక్షచేయించారు కాని వారిని బాపూజీతో కలిసి మాట్లాడనివ్వలేదు.

మీరెరిగిన మంచి వైద్యు డెవరైనావుంటే సూచించ మని అధికారులు బాపూజీని అడిగారు. ఆయన వెంటనే, దేవదాస్‌కాకా సిఫారసు చేసివెళ్లిన శివశర్మ అనే వైద్యుని పేరు సూచించి ఆయనచేత రోగిని పరీక్షచేయించటానికి అను మతించవలసిందని బదులు రాశారు.

బామ్మ ఆరోగ్యం నానాటికి క్షీణిస్తున్నది.

ఆగాఖాన్ మహల్, పూనా,
4-2-'44

ఇవ్వేళ పగటిపూట బామ్మ ఆరోగ్యం మరీదిగజారింది. రోజంతా భజనలతోనూ, రామధున్‌తోనూ, జ్యోతికారే పాడిన మీరాభాయి కీర్తనల రికార్డులతోనూ గడిపాము. ఈ పాటలు బామ్మకు కొంత ఉపశాంతి నిచ్చినవి.

రాత్రి 2-30 గంటలకు బామ్మ నన్ను లేపింది 2 నిమి షాలకొకసారి తీవ్రంగాదగ్గువచ్చేది. ఒళ్ళంతానొప్పులుపుట్టటం వల్ల నన్నుచూచి - "అమ్మా, గట్టిగా పట్టుకొని నొక్కు, నాకు చివరి ఘడియలు వచ్చినవి .." అన్నది. నా కళ్ళవెంట కన్నీళ్ళు ధారగా కారుతుండటం చూచి ఆమె అన్నది-"దీనికి ఏడవటమెందుకే పిచ్చిదానా ? ఏదో ఒకరోజు అందరం పోవలసిందే! మీ అమ్మకూడ వెళ్ళిపోయిందికదా? ఆత్రోవనే అందరూ పోవాలి. జీవితంమీద ఈ పిచ్చిమోహమెందుకు ? నువ్వు లోకంలో ఇంకా చాలాచూచి అనుభవించవలసి ఉన్నది. బాపూజీని జాగ్రత్తగా చూచుకో, చక్కగా చదు వుకో, చేతనైనంత సేవచెయ్యి..."

ఉపదేశంతో కూడిన ఈ మాటలెంతో కష్టంమీద నెమ్మదినెమ్మదిగా బామ్మ పలుకుతుంటే నాకు దుఃఖం ఆపు కోటం కష్టమైపోయింది. అప్పటికి 2 గం. 40 నిమిషాలైంది. బాపూజీ లేచివచ్చారు. నేనులేచి యివతలికి వచ్చాను. బాపూజీ నేను కూర్చున్నచోట కూర్చొని బామ్మతల తన ఒళ్ళో పెట్టుకున్నారు. నేను స్నానాల గదిలోకి వెళ్ళి ముఖం కడుక్కొని వచ్చాను. బామ్మ "ఇక నేను వెళ్ళిపోతున్నా" అన్నది. బాపూజీ "వెళ్ళు, కాని శాంతిగా ఉన్నదికదా?" అని అడిగారు

భగవద్గీత 12వ అధ్యాయంలోని శ్లోకాలు వినిపించ మని అడిగింది బా. బాపూజీ అధ్యాయమంతా వినిపించారు. కాని, బాపూజీకి నిద్రాభంగం కలుగుతున్నందుకు నొచ్చుకొని ఆయన్ను వెళ్లి పడుకోమనిచెప్పింది. నన్నుతనదగ్గరే కూర్చో మన్నది. డాక్టరు గిల్డరు, సుశీలక్క బామ్మకు ఉపశాంతిని కలిగించే ఉపాయమాలోచిస్తున్నారు. కనూభాయీ ముఖతః గీతలోని 11వ అధ్యాయం, 9వ అధ్యాయం, ఇంకా కొన్ని భజనపాటలు విన్నతరువాత ఆయన్నుకూడ వెళ్ళి పడుకో మన్నది.

మళ్ళీ ఒకసారి ఈ క్రింది భజనపాట రికార్డు వేయ మని విన్నది. కాని రికార్డు మోతకు బాపూజీకి నిద్రాభంగం కలుగుతుందని దాన్ని మూయించి నన్నే నెమ్మదిగా పాడు తుండమని ఉదయమయ్యేవరకు విన్నది :

జాఊం కహాం తజి చరన తిహారే
జిస్‌కా నామ పతిత పావన హై
జిసే దీన అతి ప్యారే ...జాఊం.

తన దే డారా. మన దే డారా,
దే డారా జో కుఛ్ థా సారా ...జాఊం.

ఇన్ చరన నకా లియా సహారా,
కహదే తూ హోగయా హమారా ...జాఊం.

* * * * *

ఆయా ద్వార్ తుమ్‌హారే, రామా,
ఆయా ద్వార్ తుమ్‌హారే,
జబ్ జబ్ భీర్ పరీ భక్తనపర్,
తుమ్‌నేహీ దుఖటారే, రామా
తుమ్‌నేహీ దుఖటారే! ...ఆయా.

మనమేం ఛాయా గహన అంధేరా,
దీపక కౌన్ ఉజారే? రామా,
దీపక్ కౌన్ ఉజారే? ...ఆయా.

నైయా మోరీ బీచ భం వరమేం,
తూహీ పార ఉతారే, రామా
తూహీ పార ఉతారే! ..ఆయా.

ఈ రెండవ భజనపాటను స్మరించుకుంటూ ఆమె ఇలా అన్నది : "భగవంతుడా! ఈ పాటలో చెప్పినట్టు నువ్వు నా పడవను ఒడ్డుకుచేర్చు. నేనెవరికీ సేవ చేయలేకపోయినాను;

ప్రభో! నాదొక్కటే ప్రార్థన; మహాదేవ్‌లాగ నన్నుకూడ బాపూజీ ఒడిలోనే పరుండబెట్టు."

ఈ విధంగా బామ్మ రెండుమూడు గంటల రాత్రి సమయంలో, నిశ్శబ్ద వాతావరణంలో ప్రార్థన చేస్తున్నప్పటి దృశ్యం దయనీయంగా ఉన్నది. ఆయాసంవల్ల నిద్రపోలేక నా ఒడిలో తలపెట్టుకొని పరున్నది. నేను గుండెలమీద చెయ్యివేసి నవరిస్తూ కూర్చున్నాను. గుండె దడదడ కొట్టు కుంటున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు గురగుర ధ్వనితో నడిచినవి

ఇంత ఎగరొప్పు, ఆయాసంలోకూడ ఆమె ఉన్నట్టుండి భగ్నస్వరంతో పాడటం మొదలుపెట్టింది :

"హే గోవింద్, హే గోపాల్, హే గోవింద్ రాఖో శరణ్
అబ్ తో జీవన్ హారే.

నీర పివనహేతు గయోసింధుకే కినారే
సింధు బీచ బసత గ్రాహ, చరన ధరి పఛారే,
చార్ ప్రహార్ యుద్ధభయో, లేగయో మఝ్‌ధారే,
నాక్ కాన్ డూబనలాగే, కృష్ణకో పుకారే,
ద్వారకామేఁ శబ్ద భయో, శోర్ హుఆ భారే,
శంఖ, చక్ర, గదా, పద్మ, గరుడలే సిధారే.
సూర కహే శ్యామ సునో, శరనహైఁ తిహారే,
అబకిబార పార కరో, నందకే దులారే!

ఈ పాటను బామ్మ ఒకప్రక్క రోగంతో యుద్ధంచేస్తూ, ధీరతతో తనకు వచ్చినవిధంగా పాడుకుంటున్నది. ఇంతలో

సుశీలక్క వచ్చి బా మ్మచేతినాడి పరీక్షించింది. ఆమెకు నాడి సరిగానే నడుస్తున్నట్లు కనిపించింది. బా ఆమెతో -"సుశీలా! నువ్వు ఈ రాత్రి కొంచెంసేపైనా నిద్రపోలేదు. నీకు జబ్బు చేస్తుందమ్మా, పోయి నిద్రపో! నాకోసం శ్రమపడవద్దు. ఇప్పుడు నా ప్రాణం కొంచెం కుదుటపడ్డది." అన్నది.

"బామ్మా ! మాతో చెబితే ఆ భజనపాటలూ మేము పాడి వినిపిస్తాము కదా! మీరెందుకు మాట్లాడి ఆయాస పడుతున్నారు?" అన్నది సుశీలక్క.

"దీనికేమీ బాధలేదు. భగవన్నామంవల్లకూడ ఎక్కడైనా ఆయాసం కలుగుతుందా? పాపం, మీరు పాడమన్నప్పుడల్లా పాడుతూనే ఉన్నారు. మనూ, కనూ ఇద్దరూ ఒకరి తరువాత ఒకరుగా ఇంతవరకు భజనపాటలు పాడుతూనే ఉన్నారు. కాని ఇప్పుడు నాకే కాస్త బాగున్నట్లనిపించింది, అందుకనే పాడుకొంటున్నాను." అని సమాధానం చెప్పింది బామ్మ.

నాలుగు గంటలయింది. బాపూజీలేచి బామ్మదగ్గరే కూర్చొని ప్రార్థనచేశారు. కాని గీతాశ్లోకాలు చదివేటప్పుడు ఆయనకు కొంచెము కునుకువచ్చినట్టుంది. అందుకని శ్లోకాలు మెల్లగా చదివాము. రాత్రి మొత్తంమీద నాలుగున్నర తరువాతనే బామ్మకు కొంచెం శాంతించింది.

అయిదుంబావు వరకుండి, ప్రభావతి ఒడిలో నెమ్మదిగా ఆమెతల ఒరిగించి నేనులేచాను. ఆమె నిద్రలోనేఉంది.

5-15 నుండి 6-30 గంటలవరకు నేను నిద్రపోయాను. ఆరున్నరకు నడకకు పోతూ బాపూజీ నన్ను నిద్రలేపారు.

బొమ్మతో పాటు ఆయన మాఅందరి విషయంలో కూడ ఎంతో శ్రద్ధతీసికొంటారు భోజనం చేయటం, నిద్రపోవటం, నిద్ర లేవటం మొదలైన స్వల్పవిషయాలను కూడ ఆయన గమనిస్తూ ఉంటారు. "మీలో ఎవరైనా జబ్బుపడ్డట్లయితే మీరు సేవ చేయటానికి తగరనే భావిస్తాను నేను" - అని ఆయన మాతో ఎన్నోసార్లు చెప్పారు. అందువల్ల ఆయన చెప్పిన మాటను తూ చా తప్పకుండా వెంటనే ఆచరించి తీరవలసిందే. ఆయన మాటకు విరుద్ధంగాచేసిన వాదనంతా అసంగతమే అవుతుంది.

ఈ రాత్రి గడవటం గండం తప్పినట్లే అనిపించింది. ఏమౌతుందోనని అందరం భయపడ్డాము. కాని ఈశ్వర కృప వల్ల బా కొంచెం తెప్పరిల్లింది.

బాపూజీ తన భోజనాన్ని చాలా తగ్గించేశారు. ఉడికించిన కూర, నూరిన బాదాంపప్పులు అయిదు, ఒక ఔన్సు వెన్న, పాలు అన్నీకలిపి కలగాపులగంచేసి పల్చగావుండేటట్లు చేయటంవల్ల తినటానికి - అనగా తాగటానికి - పది నిమిషాలకన్న ఎక్కువ సమయం పట్టలేదు. ఇదివరకు మూడు ఫలాలు ఒలిపించుకొని తినేవారు. కాని ఇప్పుడు ఒలిచి పెట్టటంలో మాకు ఆలస్యమౌతుందని రెండురోజులనుంచి మధ్యాహ్నంపూట రసంమాత్రం పిండించుకొని తాగుతున్నారు. సాయంకాలం ఎనిమిది ఔన్సుల పాలు, ఒక ఔన్సు బెల్లం మాత్రమే పుచ్చుకుంటున్నారు.

ఆగాఖాన్ మహల్, పూనా,
12-2-'44

కొంతకాలంగా బామ్మ దేశీవైద్య చికిత్స కావలెనని కోరుతుండటంవల్ల బాపూజీ దీన్నిగురించి ప్రభుత్వానికి ఉత్తరాలు రాశారు. కాని వాటికి బదులురాకపోవటంవల్ల ఇవ్వేళ చాలా తీవ్రమైన భాషలో మళ్ళీ ఒక ఉత్తరం రాశారు. కాని సాయంకాలానికల్లా ఈ ఉత్తరం రవాణా కావటానికి ముందే, వైద్యుణ్ణో, హకీమ్‌నో లేక డాక్టర్నో అవసరాన్ని బట్టి పిలిపించి చికిత్స చేయించవచ్చుననీ, ఈ విషయంలో జైలు డాక్టరైన కర్నల్ షాహ్‌గారికి పూర్తి అధికారం ఇవ్వబడుతున్నదనీ బదులువచ్చింది. అందువల్ల డాక్టరు షాహ్‌గారు ఫోన్‌చేసి పూనాలో ఉన్న వైద్యులు శ్రీ జోషీగారిని పిలిపించారు.

ఆయన బామ్మను పరీక్షచేసి మందైతే ఇచ్చారుగాని రాత్రికి మళ్ళీ దడా-అశాంతీ ఎక్కువైంది. "నన్ను నా గదిలోకి తీసికొనిపోయి నా మంచంమీద పడుకోబెట్టండి" అని ఒకే ధోరణి మొదలుపెట్టింది. ఈ విధంగా ఇంతకుముందు ఎప్పుడూ అనలేదు బాపూజీ, సుశీలక్క, ఇతరులు ఎవరు దగ్గిరకు వెళ్ళినప్పటికీ వాళ్ళతో ఇదేమాట. చివరకు ఎలాగో 5 గంటలప్పుడు నిద్రపోయింది.

9 గంటలకు డాక్టరు గిల్డరు ఆమెదగ్గరకు వచ్చారు. ఆయనతో ఆమె "నాకు ఆవేదన ఎక్కువైంది, వైద్యుని మందు నాకు వద్దు" అని చెప్పింది. అందుకు సుశీలక్క "ఇంక రెండు మూడు రోజులు ఆయనమందు వాడిచూచి

లాభంలేకపోతే మానివేస్తాము" అని బదులు చెప్పింది. కస్తూర్‌బాకు వైద్యంచేసే అవకాశం లభించినందుకు వైద్యుడు తాను ధన్యత చెందినట్లు భావించి జాగరూకతతో వైద్యంచేస్తూ పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవలెనని విశ్వ ప్రయత్నం చేశాడు. కాని, పాపం, ఆయన పడిన శ్రమ ఫలించలేదు.

ఆగాఖాన్ మహల్, పూనా,
**13-2-'44**

ఇవ్వాళ లాహోరునుండి వచ్చిన వైద్యులు శివశర్మగారి వైద్యం ఆరంభమయింది పగలంతా ఆమె ఆరోగ్యం బాగానే ఉన్నది ఈ వైద్య శిఖామణికి తప్పకుండ కీర్తి రావచ్చునని మాకు తోచింది సాయంకాలం కాగానే బామ్మ - "నన్ను బాలకృష్ణ దగ్గిరకు తీసికొనిపోండి" - అని అనటం మొదలుపెట్టింది. మీరాబహీన్ తన గదిలో బాల కృష్ణుని ప్రతిమ పెట్టుకున్నది. ఆరోగ్యం బాగా ఉన్నప్పుడు బా అక్కడికి రోజూ వెడుతూ ఉండేది. చక్రాలకుర్చీమీద కూర్చోబెట్టి నే నామెను బాలకృష్ణుని ప్రతిమ దగ్గిరకు తీసి కొని వెళ్ళాను. బాపూజీతో సుశీలక్క, ప్రభావతి నడకకు వెళ్ళారు. బామ్మ బాలకృష్ణుని ధ్యానంలో తన్మయం చెందింది. ఇంతలోకే బాపూ నడక మాని బామ్మ ఉన్న గదిలోకి వచ్చారు. ఆయన్నుచూచి ఆమె చిరునవ్వుతో - "మీరు షికారుకు వెళ్ళండి. నడక మాని ఇక్కడి కెందుకు వచ్చారు?" అన్నది. బాపూజీ నవ్వుకుంటూ - "నువ్వు సింహానివా? నక్కవా? ఇప్పుడు చెప్పు" అన్నారు. ('రోగాన్ని

సింహంలాగ ధైర్యంతో ఎదుర్కొంటావా? లేక నక్కలాగ భయపడి ఓడిపోతావా?' - అని బాపూజీ అభిప్రాయం.)

కొంచెంసేపు వినోదంగా మాట్లాడి, బాపూజీ అక్కడే పచార్లు చెయ్యటం మొదలుపెట్టారు ప్రార్థనకు ముందు బా మ్మ తులసిదగ్గర దీపారాధన చేయించింది. ప్రార్థన కూడ ఇవ్వాళ బాగానే చేసింది.

రాత్రికి మళ్ళీ బాధ ఎక్కువైంది. ఒంటిగంటకు సుశీలక్క కటేలీగారిని లేపి శివశర్మ వైద్యునికి ఫోనుచేయించింది. ఆయన వచ్చి ఒక మాత్ర ఇచ్చారు ప్రభుత్వంవారు ఆయనకు రాత్రిపూట ఆగాఖాన్ మహల్‌లో ఉండటానికి అనుమతి ఇవ్వలేదు. ఆయన వైద్యం జరుగుతున్నప్పుడు ఆయన వచ్చి రోగిని చూడవలసిన అవసర మెప్పుడు, ఏ రాత్రి వస్తుందో ఎవరికి తెలుసు? అందుకని పాపం ఆ వైద్యుడు అవసరమైనప్పుడు వెంటనే వచ్చి చూడటానికి వీలుండేలాగ జైలుగేటుకు బయట మోటారుకారులోనే పడుకొని ఉన్నారు.

ఆగాఖాన్ మహల్, పూనా,
16-2-'44

బామ్మ ఆరోగ్యంలో మొన్న కనిపించిన మంచిమార్పు ఇవ్వేళ లేకపోయినప్పటికీ వరుసగా కనీసం మూడురోజులైనా శివశర్మగారి ఆయుర్వేద చికిత్స జరగాలని అందరూ అభిప్రాయపడ్డారు. ఇవ్వేళ మూడోరోజు. పాపం, వైద్యుడు చలిబాధకు ఓర్చుకొని రాత్రులు బయట కారులోనే పడుకొని, పగళ్లుమాత్రం మాతోపాటు మహలులో ఉండేవారు.

ఏదైనా ఔషధం కావలసినప్పుడుమాత్రం ఊళ్ళోకి వెళ్ళే వారు. చలిలో ఉండటంవల్ల ఆయనకుకూడ కొంచెము జలుబు చేసింది.

బయట పడుకోటానికి ఆయనకిది మూడోరాత్రి, ఆయన్ను లేపటానికి మరో నలుగురు మనుష్యులకుకూడ నిద్రా భంగం చేయవలసివచ్చేది. మొదట ఒక సిపాయిలేచి జమా దారును లేపుతాడు, జమాదారు కటేలీగారిని లేపి ఆయన దగ్గరనుంచి తాళంచేతులు తీసికొనివస్తాడు, గేటు దగ్గిర కావలి కాసే సార్జెంటు కునికిపాట్లు పడుతుంటే అతన్నికూడ లేపాలి. అప్పుడుగాని శివశర్మగారు లోపలికి రావటానికి వీలుపడదు. ఈ రాత్రికూడ 12-30 గంటలకు బాపూ స్థితి తారు మారయ్యేసరికి పైన చెప్పిన విధంగా శివశర్మగారిని పిలు చుకురావలసి వచ్చింది. ఆయన వచ్చి ఒక మాత్ర ఇచ్చారు. దానితో కొంచెం గుణం కనిపించింది. అప్పుడాయన ఒంటి గంటకు పడుకోటానికి గేటు బయటికి వెళ్ళారు. ఆయన బయట అడుగుపెట్టటంతోటే సిపాయి గేటుమూసి తాళంవేశాడు. జమాదారు తాళపుచెవి కటేలీగారికిచ్చిన తరువాత ఆయన పైకి వెళ్లి పడుకున్నారు.

ఈ సందడిలో బాపూజీకి నిద్రపట్టలేదు. ఆయన రెండు గంటలకు లేచి ప్యారేలాల్జీని పిలిచారు. ఆయన అవసరమైన కాగితాలు అందించి బాపూజీతో - "మీరు పరుండే చెప్పండి, నేను రాస్తాను" అన్నారు. కాని బాపూ ఒప్పుకో లేదు. ఆయనే స్వయంగా ఒక ఘాటైన ఉత్తరం రాసి,

దానిలో పైన చెప్పినవిధంగా ఎవరికెంత కష్టం కలుగతున్నదో వర్ణించారు :

"ఈ పరిస్థితిని మార్పు చేయగల ఉపాయ మున్నదని నాకు తెలుసు. నా భార్యకోసం ఇంతమంది మనుష్యులు నిద్ర చెడగొట్టుకొని జాగరణ చెయ్యటం - అదికూడ ఒకరోజూ, రెండురోజులు కాక నిత్యం ఇలాగే ఉండటం నాకెంతో అస హ్యంగాఉన్నది. సుశీలానయ్యార్, డాక్టర్ గిల్డర్ పాశ్చాత్య వైద్యంచేసే డాక్టర్లు, దేశీయమైన ఆయుర్వేద చికిత్స దానికి భిన్నంగావుంటుంది. అందువల్ల వాళ్లు ఈచికిత్సలో తోడ్పాటు చేయలేరు. చేసినా, రోగికీ, రోగానికీ, చికిత్సచేస్తున్న వైద్యు నికీ ఈ డాక్టర్లవల్ల తమకు తెలియకుండానే అన్యాయం జరిగే అవకాశమున్నది. ఈ కారణంచేత రోగిమేలు కోసం ఈ ఆయుర్వేద వైద్యుణ్ణి ఇక్కడే, మాతోపాటు రాత్రింబగళ్ళు ఉండనివ్వటం తప్పదు. ప్రభుత్వం అలా చెయ్యలేకపోతే, రోగిని పెరోల్ మీాద విడుదలచేయటం మంచిది. అదికూడ యిష్టంలేకపోతే, రోగికి భర్తనైన నేను ఆమెకు ప్రభుత్వం ద్వారా అవసరమైన ఏర్పాట్లూ, చికిత్సా సదుపాయాలు చేయించలేని స్థితిలోవున్నందున నన్నిక్కడినుంచి వేరేచోటు కైనా పంపించివేయమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. రోగి పడుతున్న వేదనచూస్తూ నిస్సహాయుడైన ప్రేక్షకుడిలాగ ఉండటం నాకిష్టంలేదు.

"ఈ ఉత్తరం, రాత్రి రెండుగంటలప్పుడు కస్తూరిబా పడక దగ్గిర కూర్చొని రాస్తున్నాను. ఆమె చావు బ్రతుకుల మధ్య పెనగులాడుతున్నది. రేపు-అనగా 27 ఫిబ్రవరి, రాత్రి

లోపల వైద్యుణ్ణిగురించి తృప్తికరమైన జవాబు రాకపోయిన పక్షంలో అసలు చికిత్సే మానివేయటం జరుగుతుంది."

రాత్రి మూడున్నర గంటలకు ప్యారేలాల్జీ ఈ ఉత్తరం టైపుచేశారు. తరువాత ప్రార్థనజరిగింది. బాపూజీ రాత్రి అంతా మేల్కొనే ఉన్నారు బామ్మ జీవితనౌక నడియేట్లో ఊగిసలాడుతూ ఉన్నది. 'ఓ ప్రభూ! ఈమె పడే వేదన చూడలేకుండ ఉన్నాము, నువ్వేమి చేయదలచుకున్నావో త్వరగా చెయ్యి. అంతా నీచేతిలోనే ఉన్నది' అని లోలోపల నేను దేవుని ప్రార్థించాను

ఆగాఖాన్ మహల్, పూనా,
17-2-'44

నిన్నటి ఘాటైన ఉత్తరానికి అనుకూలమైన ప్రత్యుత్తరం వచ్చింది నేటినుండి అవసరమున్నన్నినాళ్ళు వైద్యుడు లోపలే ఉండటానికి అనుమతి నిచ్చింది ప్రభుత్వం.

నిద్రపట్టటానికిచ్చిన మందుప్రభావంవల్ల బామ్మ పగలు శాంతంగా పడుకున్నది. కన్ను తెరచి చూడలేనంత మత్తు. ఒకసారి సుశీలక్క బలవంతాన లేపి గ్లూకోజునీళ్ళు ఇచ్చింది. రెండు చెంచాలు మాత్రం తాగి "నన్ను శాంతంగాపడుకో నివ్వు" అన్నది. కాని పరిస్థితి ఏమీ బాగులేనట్లే తోచింది. కాళ్ళమీద వాపు కనిపించింది. ఒంట్లో బొత్తిగా ప్రాణ లేనప్పుడు దగ్గటానికి మాత్రం వీలవుతుందా? ఈ మత్తు లక్షణాలు మంచివికావని డాక్టరు గిల్డర్, సుశీలక్క, శివశర్మ గారు మాట్లాడుకొంటుండగా నా చెవినిపడ్డవి. నన్నుచూచి వాళ్ళు మాట్లాడటం మానివేశారు.

"బామ్మ కెలావున్నదో నాకు చెప్పరా?" అని డాక్టర్ గిల్డరుగారిని దీనంగా అడిగాను.

"చూస్తున్నావు కదా, బా ఇదివరకు నిద్రపోయేదే కాదు, ఇప్పుడు ప్రశాంతంగా నిద్రపోతున్నది. దీనికి యేడవటమెందుకు?" అని ప్రేమతో నా తలదువ్వుతూ డాక్టరు గారు నన్ను బయటికి పంపించారు.

కాని, నాతో చెప్పకుండ దాచిపెడుతున్నారని మాత్రం నేనూహించుకోగలిగాను రోగికి ఎంతబాగా నిద్రపడితే అంత మంచిదికదా, అని మళ్ళీ ఆలోచించుకొని మనస్సు కుదట పరచుకొన్నాను. నాకు అనుమానం తోచిందిగనుక, నా పనికి విఘ్నమాతుందేమోనని భావించి, నాకు ధైర్యం చెప్పటానికి వాళ్ళిద్దరూ నన్ను చేరదీసి విడివిడిగా "అమ్మాయీ! మీ బామ్మకేమీ పరవాలేదు. కొంచెం నయంగానే ఉన్నది, త్వరలో కోలుకుంటుందిలే" అని బుజ్జగించటం మొదలుపెట్టారు. నాకు కలిగిన అనుభవం ఇంకెందరికో కలిగివుండవచ్చు. ప్రాణంపోయేవరకూ రోగి చచ్చిపోతాడని డాక్టర్లు చెప్పకపోవటం అందరెరిగిన విషయమే! కాని అప్పుడు నాకీ సంగతి తెలియదు.

ఆగాఖాన్ మహల్, పూనా,
18-2-'44

పాపం వైద్యుడుగారు ఇవ్వేళ పూనా పట్టణమంతా శోధించి కషాయానికి దినుసులు తీసుకువచ్చారు. కాని ఆయనకుకూడ నిరాశకలిగింది. అప్పుడు బాపూజీ దగ్గరకువెళ్ళి "చేతనైనంతవరకు చికిత్స జరిపించాను, కాని ఏమీగుణం కని

పించలేదు. సుశీలగారికిగాని, గిల్డరుగారికిగాని కొత్త ఉపాయ మేదైనా తోస్తే చెయ్యవచ్చు" నన్నారు.

ఈ మాట చెబుతుంటే పాపం, ఆయనకు డగ్గుత్తిక పడ్డది కాని బాపూజీ "మీరేంచేస్తారు? మీ ప్రయత్న లోపంలేకుండా చేశారు, ఎంతో కష్టపడ్డారు. శక్తివంచన లేకుండ ప్రయత్నించటమే మనిషి చేయగలిగింది, ఫలితం ఈశ్వరాధీనం" అని ఆయన్ను శాంతపరచారు.

ఇప్పుడు బాకుకు కేవలం రామనామమే శరణ్యమని బాపూజీ భావించారు. కాని ఈ డాక్టర్లిద్దరూ ఒప్పుకోలేదు. మధ్యాహ్నం "సెలిగ్రేన్" అనే ఇంజక్షన్ యిచ్చారు. దాని వల్ల కొంచెం గుణం కనిపించింది జ్వరంలో దోషించినట్లు తోచింది. మొదటిసారి కొంచెం గుణాం కనిపించినందున రాత్రికి మళ్ళీ రెండో ఇంజెక్ష నిచ్చారు కాని దీనివల్ల ఏమంత లాభం కలుగలేదని సుశీలక్క చెప్పింది వైద్యుడు గారు ఇంకా యిక్కడే ఉన్నారు. ఆయన మందుకూడ వాడు తున్నారు. ఇంతవరకు ఆయన మందొక్కటే యిస్తుండేవారు. ఇప్పుడు డాక్టర్లిద్దరూ, ఈయన ముగ్గురూ చికిత్సచేయటం మొదలుపెట్టారు.

ఆగాఖాన్ మహల్, పూనా,
20-2-'44

ఈ రోజు రాత్రంతా బాకు 'ఆక్సిజన్' గొట్టం పెట్టుకొని నిద్రపోయింది కాని ఉదయాన్నే "ఓ రామా!

ఓ రామా! ఇప్పుడెక్కడికి పోను నేను?" అని పిలవటం మొదలుపెట్టింది. బాపూజీ లేచివచ్చి ఆమె తలమీద చేయి వేసి దువ్వారు. అప్పుడామె శాంతించింది తరువాత "శ్రీరామ్ భజో దుఃఖ మే సుఖ మే" అనే ఛటోపాధ్యాయ గారి రికార్డు విన్నది

సుశీలక్క మత్తుమందిచ్చింది దాంతో 9 గంటలవరకు నిద్రపోయింది. తరువాత లేచి పండ్లు తోముకొని, నన్ను కషాయం తీసుకొని రమ్మన్నది. ఫీడింగ్ కప్పులో పోశాను. ఆమె కషాయం తాగింది.

కాని ఉదయాన వచ్చినట్లు తిరిగి దుఃఖం వచ్చింది. భజన, గీతా పఠనం, రామ్‌ధున్ నిర్విరామంగా సాగుతూనే ఉన్నాయి. ఇప్పుడు బా మ్మకూడా మందు వద్దనటం మొదలు పెట్టింది.

"ఇప్పుడీమెకు రామనామమేమందు. అదితప్ప మిగిలిన వేవీ వద్దు. స్వయంగా ఆమెకుకూడా దానివల్లనే శాంతి కని పిస్తున్నది" అన్నారు బాపూజీ ఆయన తన పనంతా ఆపేసి బా మ్మ పరిచర్య చేయటానికి సిద్ధపడ్డారు. ఎక్కువ సమయం ఆమె దగ్గరే కూర్చొని గడుపుతున్నారు. ఆమెకళ్ళూ, ముఖం తుడవటానికి చిన్నచిన్న రుమాళ్ళెన్నో మురికై పోతు న్నవి. మేమెవ్వరం లేనప్పుడు బాపూజీయే వాటిని స్వయంగా ఉతికి శుభ్రంచేస్తున్నారు.

## ౨౮

# బామ్మ మరణం

ఆగాఖాన్ మహల్, పూనా,
**22-2-'44**

నిన్న దేవదాస్‌కాకా వచ్చారు. ఈ రోజు గడవటం మహాకష్టమని అందరికీ మనస్సులో భయంగానే వున్నది. అందరం రాత్రంతా మేలుకొనే ఉన్నాము ఉదయాన సుశీలక్క ఒడిలో తలపెట్టుకొని పడుకున్నది బామ్మ. బాపూజీ తన భోజనంలో ఉండవలసిన 'కాలరీస్' రాస్తున్నారు. నేను బామ్మ కాళ్ళొత్తుతూ కూర్చున్నాను

"నన్ను బాపూజీ ఉన్న గదిలోకి తీసికుపో" అని సుశీలక్కతో అన్నది బామ్మ. ఆమె నాకు సైగచేసి బామ్మ తిరగటానికి వీలుగా దుప్పటి మొదలైనవి తీసుకురమ్మన్నది.

బాపూజీ రాయటం అయిపోయింది. ఇంతలో కటేలీ గారు ఏదో కాగితం తీసుకొని వచ్చారు. అదిచూచి బాపూజీ ఇలా అన్నారు. "చర్చిల్ నన్ను తనకు గొప్ప శత్రువుగా భావిస్తాడు నన్నుగాని, ప్రజలవిశ్వాసం చూరగొన్న యితర నాయకులనుగాని జైల్లో ఉంచి అతడు దేశాన్ని అణచివేయ లేడు. జనులు మనఃపూర్వకంగా నామీద విశ్వాసముంచి పనిచేస్తే నేను నా ప్రాణాల నిక్కడే అర్పిస్తా. దాంతో నాపని పూర్తవుతుంది. కాని స్వరాజ్యం సంపాదించటానికిగాను నేను ప్రాణాలతో ఉండటం అవసరం అందుకనే నేను ప్రాణాలు కాపాడుకోటానికి ప్రయత్నిస్తున్నాను. ఆహారంలో ఉండ

వలసిన కాలరీల లెక్క రాయటంకూడా ప్రాణరక్షణకు నేను చేసే ప్రయత్నాల్లో ఒక భాగం. బా వ్యాధి మూలాన నేను మిగిలిన పనులన్నీ వదలివేశాను. కాని ఇదొక్కటి మాత్రం వదలలేదు."

ఈ మాటలని బాపూజీ ముఖం కడుక్కొని బామ్మ దగ్గరికి వెళ్ళారు. సుశీలక్క లేచింది నే నామె చోటులో కూర్చున్నాను.

"నే నిప్పుడు నడకకు వెళ్ళనా?" అని బాపూజీ అడిగారు. బా వద్దన్నది. ఇంతకుముందు ఎన్నడూ తనకెంత కష్టంగా ఉన్నప్పటికి బాపూజీని షికారుకు పోవద్దని చెప్ప లేదు. కాని ఇవ్వేళ వారించింది.

నన్ను లెమ్మని అక్కడ బాపూజీ కూర్చున్నారు. రామధున్ జరుగుతున్నది. బాపూజీ ఒడిలో ఆమెకు కొంచెం శాంతి దొరికింది. అరగంట తర్వాత బాపూజీ మళ్ళీ "ఇక నేను వెళ్ళనా?" అని అడిగారు

"హరే రామా, ఇప్పుడు నేనెక్కడికి పోయేది?" అన్నదామె

"ఇంకెక్కడికి పోతావు, రాము డెక్కడికి తీసుకుపోతే అక్కడికే" అన్నారు బాపూజీ.

పది నిమిషాల తరువాత ఆమె రెండున్నర ఔన్సుల తేనె కలిపిన వేడినీళ్ళు తాగింది.

సుమారు 10 గంటలకు బాపూజీకి తీరిక కలిగింది. అప్పుడాయన : "తిరగటం బొత్తిగామానేస్తే నేను జబ్బున

పడతాను. అందుకని కొంచెం నడవటం అవసరం" అన్నారు.
సుశీలక్కను అక్కడ కూర్చోబెట్టి ఆయన నడవటానికి వెళ్ళారు. కొంచెం దూరం నడచిన తరువాత ఆయన "బా ఇంక ఎక్కువసేపు జీవించదు. కష్టంమీద 24 గంటలు గడవ వచ్చు. ఎవరిఒళ్ళో ఆమె ప్రాణం పోతుందో చూడాలి" అన్నారు. ఐదు చుట్లు తిరిగి ఆయన పైకివచ్చారు. ప్రతి ఐదు నిమిషాలకు డాక్టర్ గిల్డర్‌గారు వచ్చి చూచి పోతు న్నారు. బాపూజీ త్వరత్వరగా తన మాలిష్, స్నానం ముగిం చుకున్నారు. గడిచిన రెండు దినాలుగా జాగరణ చేయటం వల్ల నూరిన బాదం తినటంకూడా మానేశారు. "ఇవ్వాళ కూడా బాదంపప్పులు తినరా?" అని నేనడిగాను.

దానికి ఆయన "బాకు జబ్బు నయమయితే అప్పుడు తింటా, లేదా ఆమె రాముని సన్నిధికి చేరుకుంటే అప్పుడు తీసుకుంటా నమలటానికి కొంతసేపు పడుతుంది. తినకపోతే ఏమి ఫరవాలేదు. కాని కచ్చాపచ్చాగా కడుపులో వేసు కుంటే మంచాన పడవలసి వస్తుంది" అన్నారు. అందువల్ల నేను వండిన కూరలో పాలు కలిపి పల్చగా చేసిచ్చాను. దాన్ని ఆయన తాగేశారు.

మధ్యాహ్నం 12-30 గంటలకు బా దగ్గరకు బాపూజీ వచ్చారు. ఆమె ఏక్షణాన్నయినా చనిపోవచ్చునని అందరూ భావించారు. దేవదాస్‌కాకా, మా నాయనగారు, హరిలాల్ కాకా గారి కుమార్తెలు చూడవచ్చారు. బాపూజీ కొంచెం సేపు విశ్రాంతికోసం పడుకున్నారు. నేనాయన కాళ్ళకు నెయ్యి రాస్తుంటే ఆయన 20 నిమిషాలు విశ్రమించారు.

1-30 గంటలకు కనూభాయీ కొన్ని ఫోటోలు తీసుకున్నారు. దేవదాస్‌కాకా గీతా పఠనం పూర్తిచేసి బా దగ్గర కూర్చు న్నారు. బా ఆయనతో "నాయనా, నువ్వు నాకోసం చాలా ధక్కా-మొక్కీలు తిన్నావు. రామదాసుని రావొద్దను. పాపం జబ్బుతో ఉన్నాడు. అతన్ని ఇక్కడికి పరుగెత్తించట మెందుకు? మీరందరూ సుఖంగా ఉండండి" అని చెప్పింది.

3-30 గంటలకు దేవదాస్‌కాకా గంగోదకం, తులసీ దళాలు తీసుకొచ్చారు. బా నోరు తెరిచింది. దేవదాస్‌కాకా తులసితీర్థం కొంచెం ఆమె నోట్లో పోశారు. దానిని తాగి బా శాంతంగా పడుకొన్నది. 4-30 గంటలకు బాపూజీ వైపు చూచి "నా పేరుతో మీరు లడ్డూలు తినాలి. దుఃఖ మెందుకు? ఈశ్వరుడా! నన్ను క్షమించు. నాకు నీ భక్తి ప్రసాదించు" అని అనేక విధాలుగా మాట్లాడటం మొదలుపెట్టింది. ఇతర బంధువులు కూడా వచ్చారు వాళ్ళందరితోనూ ఆమె 'నా కోసం మీరెవ్వరూ దుఃఖ పడవ'ద్దనిచెప్పింది. 5 గంటలయిన తర్వాత నాతో బామ్మ "బాపూజీ సీసాలో బెల్లం అయిపో వొచ్చింది. నువ్వు మళ్ళీ తయారుచేశావా?"అని ప్రశ్నించింది.

"ఔను బామ్మా! బెల్లం పొయ్యిమీద పెట్టాను. ఇప్పుడే తయారవుతుంది" అన్నాను నేను.

"చూడమ్మా! నా దగ్గర చాలా మంది ఉన్నారు. నువ్వు వెళ్ళి బాపూజీకి పాలు, బెల్లం ఏర్పాటుచేసి, నువ్వు కూడా భోజనం చెయ్యి"అని చెప్పింది.

ప్రాణమున్నంతవరకూ బామ్మ బాపూజీకి ఎన్నివిధాల సేవ చెయ్యాలో అన్ని విధాలుగా సేవ చేసింది ముఖ్యంగా

రెండుపూటలా ఆయన తీసుకొనే ఆహారం విషయంలో అవ సరమైన సూక్ష్మ పరిశీలన, జాగ్రత్త ఆమె ఎన్నడూ వదలి పెట్టలేదు. ఈ చివరిరోజునకూడ రోగంతోనూ, మృత్యువు తోనూ పెనుగులాడుతూకూడ, నాకీవిషయంలో హెచ్చరిక చేసింది. అప్పుడామె మా నాయనగారి ఒడిలో తలపెట్టి పడు కొని ఉన్నది. అందువల్ల "జయసుఖలాల్ ఇక్కడున్నాడు- నువ్వు వెళ్ళి ఆ పనిచూడు", అని నన్ను పంపింది.

పెన్సిలిన్ ఇంజెక్షన్‌మందు ప్రత్యేకమైన విమానంలో వచ్చిచేరింది అందువల్ల బాపూజీ, దేవదాస్ కాకా, డా- గిల్డర్, సుశీలక్క, ప్యారేలాల్జీ, కర్నల్‌షాహ్, భండారీ, కటేలీ - వీరందరూ ఇప్పుడా ఇంజెక్షన్ ఇవ్వవలెనా, వద్దా అని చర్చ జరిపారు.

నేను భోజనశాలకువెళ్ళి బెల్లం తయారుచేసి, నీళ్ళల్లో చల్లారబెట్టాను. పాపం, సుశీలక్క పొద్దటినుంచి భోజనమే చెయ్యలేదు అందుకని ఆమె వీలుచూచుకొని తినటానికి వచ్చింది. ఇంకా తినవలసినవాళ్ళు చాలామంది ఉండటంవల్ల, కిచిడీ, పులుసు, రొట్టెలు వగైరా తయారుచేశాను. ఇద్దరు ముగ్గురు శివరాత్రి ఉపవాసం ఉన్నవాళ్ళకు ప్రత్యేకంగా బల్లమీద ఫలహారం సిద్ధంచేసిపెట్టాను. అన్నీ ఏర్పాటుచేసి 5-30 గంటలకు అందరినీ భోజనానికి రమ్మని పిలిచాను. భోజనాలై లేచేటప్పటికి 6-30 గంటలయింది. మామూలు రోజుల్లోకూడ మేము ఈ సమయానికే రాత్రి భోజనం చేసేవాళ్ళం.

పెన్సిలిన్ ఇంజెక్షన్ ఇచ్చే విషయంలో చర్చ యింకా పూర్తికాలేదు. భోజనం చేసేటప్పుడుకూడ పెన్సిలిన్‌వల్ల లాభం ఉంటుందనే మాట్లాడుకున్నారు.

చివరకు 7 గంటలప్పుడు ఇంజెక్షన్ సూదులు మరగ బెట్టమని సుశీలక్క నాకిచ్చింది. 'ఎలెక్ట్రిక్ స్టౌ' మీద సూదుల గిన్నె పెట్టి, సాయంకాలమైనందున తులసిమొక్కదగ్గర దీపారాధన చేయటానికి వెళ్ళాను.

బాపూజీ పాలుతాగి, ముఖం కడుక్కొని, నడకకు వెళ్ళటానికి బదులుగా ప్యారేలాల్జీ గదిలో ఉన్న దేవదాస్ కాకాతో మాట్లాడుతూ నిల్చున్నారు నేను టేబుల్ డ్రాయరులోనుంచి నిప్పుపెట్టె తీసుకోటానికి గదిలోకి వెళ్ళే సరికి అక్కడ ఇంజెక్షన్‌నుగురించిన చర్చ జరుగుతున్నది. నేను సుశీలక్కనుచూచి - "మీరిచ్చిన ఇంజెక్షన్ సూదు లెంతసేపటినుంచో మరిగిపోతున్నవి. పొయ్యిమీదినుంచి దింపటం మరచిపోయినాను" అన్నాను నేను. "బాపూజీ ఇంజెక్షన్ వద్దన్నారు. అందుకని స్టౌ ఆర్పేశాను నేను" - అన్నది సుశీలక్క.

"చనిపోతున్న నీ తల్లి శరీరంలో సూదిపొడిచి ఆమెకు నొప్పి కలిగించటమెందుకు ?..." బాపూజీ నోట్లోనుంచి వచ్చిన ఈ మాటలుమాత్రం నా చెవినిపడ్డవి. ఆయన మాటలు పూర్తిగా వినకుండానే, దీపం వెలిగించే తొందరలో నేనక్కడనుంచి వెళ్లిపోయినాను. దీపారాధన చేయగానే బామ్మ అందరితోనూ "జయ్ శ్రీకృష్ణ"అని చెప్పింది.

మా నాయనగారు, ప్రభావతి ఆమె దగ్గిరే ఉన్నారు. ఇంతలో బామ్మ తమ్ముడు మాధవదాస్ మామగారు వచ్చారు. బామ్మ ఆయనకు ఏదో చెప్పదలచుకొన్నది కాబోలు, కాని చెప్పలేకపోయింది.

ఉన్నట్టుండి - "బాపూజీ!" - అని పిలిచింది. సుశీలక్క విని వెంటనే పరుగెత్తి బాపూజీని పిలుచుకొచ్చింది.

ఆయన నవ్వుతూ వచ్చి - "ఇంతమంది బంధువులు రావటంవల్ల నేను నిన్ను విడిచిపెట్టి పోయినానని అను కున్నావుకదూ నువ్వు?" అని అడిగారు.

మా నాయనగారు కూర్చున్నచోట కూర్చుని, బాపూజీ బామ్మ తలను చేత్తో నెమ్మదిగా దువ్వసాగారు. ఆమె బాపూజీని చూచి అన్నది "ఇక నేను వెళ్లిపోతున్నా. మనం ఎన్నో సుఖాలు - కష్టాలు అనుభవించాము, నాకోసం ఎవరూ ఏడవవద్దు, ఇప్పుడు నాకు శాంతిగా ఉన్నది." ఈ మాట పలికిందో లేదో శ్వాస ఆడటం నిల్చిపోయింది...

కనూభాయి ఫోటోతీస్తుంటే బాపూజీ ఆయన్ను వారించి రామధున్ పాడమన్నారు. మేమందరం - "రాజా రామ రామ రామ, సీతా రామ, రామ, రామ్." అని పాడటం మొదలుపెట్టాము.

"రామ, రా..." అనే చివరి స్వరం వినీ వినకముందే రెండు నిమిషాల్లో బామ్మ బాపూజీ భుజంమీద తలవుంచి శాశ్వతంగా నిద్రపోయింది.

బాపూజీ కనులవెంట రెండు కన్నీటి బిందువులు రాలి నవి. ఆయన కండ్లజోడు తీసి చేత బట్టుకున్నారు. నేను

విమూఢురాలినై చూస్తూ నిలబడ్డాను. ఒక్క క్షణంముందు వినిపించిన బామ్మ ప్రేమపూరిత వాక్కు... ఇక ఎన్నటికీ వినిపించదా? మనిషి ఈ విధంగా క్షణకాలంలో సర్వమూ వదలివేసి వెళ్ళిపోవటాన్ని నా జీవితంలో కండ్లార చూడట మిదే మొదటిసారి.

బాపూజీ రెండునిమిషాల్లో తిరిగి స్వస్థచిత్తులైనారు, కాని దేవదాసుకాకాగారి రోదనం చూడలేక పోయినాము. తల్లినుండి విడదీసిన పసిబిడ్డలాగ బామ్మ కాళ్ళుపట్టుకొని గుండెనీరయ్యేట్టు ఏడవటం మొదలుపెట్టారు. ఈ స్థితిలో ఎవరికేమి ధైర్యం ఉంటుంది? ఆ దుఃఖమయమైన భయం కర పరిస్థితిని మాటలతో వర్ణించటం నాకు సాధ్యంకాదు.

అది మహాశివరాత్రి నాటి సంధ్యాసమయం 7 గం 35 నిమిషాలైనది. దేవాలయాల్లో ఆరతి గంటలు మ్రోగు తున్నవి. ఆ సమయంలో మేమందరం ఏడుస్తూ, మొత్తు కుంటూ ఉండగా భగవంతుడు బామ్మను తన సన్నిధికి చేర్చు కున్నాడు.

అయిదారు నిమిషాలయిన తరువాత బామ్మ తలను దిండుమీదకు జరిపి, బాపూజీ లేచారు. దేవదాసు కాకాను ఓదార్చారు. నా ఏడుపు చూచి ఇలా అన్నారు – "నువ్వు చేయవలసిన సేవ ఇంకా పూర్తికాలేదు, ఇలా ఏడిస్తే బా మనస్సుకు క్షోభ కలుగుతుంది. తన చివరి కోరికను ఆమె నీకు వివరించి చెప్పిందికదా! నువ్వు ఏడుస్తూ కూర్చుంటే ఆమె కోరిన కోరిక నెరవేరదు. అప్పుడామె ఆత్మకు శాంతి ఉండదు." ఈ మాటలతో ఓదార్చి నన్ను లేవదీశారు.

జైలు గేటుకు వెలుపలకూడ చాలామంది బంధువులు వచ్చి కూర్చొని ఉన్నారు. కాని ప్రభుత్వానుమతి లేకుండ లోపలికి రావటానికి వీలులేదుకదా!

బామ్మ శవాన్ని స్నానాల గదిలోకి చేర్చారు. ఆగాఖాన్ మహల్లోకి వచ్చినప్పటినుంచీ ఆమె తలరుద్దటం, దువ్వి జడ వెయ్యటం నేనే చేస్తూ వచ్చాను. ఈ రోజుకూడా నేనే చివరిసారి ఆమె తల సీకాయతో రుద్ది స్నానం చేయించాను. ఇతరులుకూడ నాకు తోడున్నారు. ఆమె ప్రాణం పోయిన గది నేనూ, కనూభాయీ కలసి శుభ్రంచేశాము. గోమయంతోనూ, గోమూత్రంతోనూ అలికి ఆ ప్రదేశాన్ని పవిత్రం చేశాము. శవాన్ని ఉంచే చోట్లో మీరా బహన్ ముగ్గుతో చౌకంవేసి తలవైపు పువ్వులతో ఓంకారం అలంకరించింది. కాళ్ళవైపు స్వస్తిక్ చిహ్నం తయారుచేసింది.

1942 లో బాపూజీ చేతితో వడికిన నూలుచీర కట్టుకొని, తన దహనంకూడా అదే చీరెతో కావలెనన్న తన అభీష్టాన్ని బామ్మ నాతో చెప్పి ఆ చీరె నాకు ఒప్పగించింది. ఇప్పుడా చీరెనే చేతులు వణుకుతుండగా ఆమె శవంమీద కప్పాను. ఈ పని నా చేత్తోనే జరుగనున్నట్టు ఆమెకు ముందుగానే భవిష్యత్తు గోచరించి ఉండవచ్చు! అందుకనే ఆ పని నాకు ఒప్పగించిందేమో, ఎవరికి తెలుసు!

లేడీ ప్రేమలీలా ఠాకర్సీ గంగాజలంలో తడిపి పిండిన చీరె ఒకటి పంపించింది దానినికూడా శవంమీద కప్పాము.

మగన్‌లాల్ గాంధీ భార్యయైన సంతోక్ కాకీ - బా మెడలోని తులసిమాలను, బంగారు రేకు తొడిగిన చేతి గాజు లను ఊడదీసింది. మెడలో కొత్త పూసలమాల వేసింది. చేతికి గాజులకు బదులుగా బాపూజీ వడకిన నూలుదారం చుట్టింది. తరువాత గోమయంతో పవిత్రం చేసిన స్థలంలో శవాన్ని పరుండబెట్టాము.

ఎఱ్ఱంచు తెల్లచీరె పైపైన కట్టి తలముడిచి, పూలు పెట్టాము. పాపటలో చందనం, కుంకుమకలిపి రేఖతీర్చాము. తలవైపు నేతితో దీపం వెలిగించి, అగరువత్తులు పెట్టాము. బామ్మ ముఖంమీద అపూర్వమైన జ్యోతి ప్రకాశిస్తున్నది. సాక్షాత్తు 'జగన్మాత' అనిపించింది.

కర్నల్ భండారీగారు వచ్చి దహనక్రియను గురించి బాపూజీ అభిప్రాయాన్ని అడిగాను "శవాన్ని ఆమె కొడు కులకూ, బంధువులకూ ఒప్పగించవచ్చు ఆ పరిస్థితిలో అగ్ని సంస్కారానికి ప్రజలెందరైనా హాజరుకావచ్చు. దానిలో ప్రభుత్వం జోక్యం కలిగించుకోకూడదు అలాకాక ఇక్కడే దహన సంస్కారం జరిగేట్టయితే దగ్గరి సంబంధీకులు పాల్గొ నటానికి ప్రభుత్వం అనుమతించాలి ఒకవేళ దగ్గరి బంధువు లకుకూడా అనుమతి ఇవ్వదలచకపోతే ఇక్కడున్న మేమూరు గురం మాత్రమే ఈ సంస్కారాన్ని నడిపిస్తాం"అని బాపూజీ తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. చివరకు జైల్లోనే దహనం జరగాలనీ, వచ్చిన స్నేహితులను, బంధువులను లోనికి రానివ్వాలనీ నిర్ణయం జరిగింది.

బా శవం దగ్గర "వైష్ణవ జనతో" పాటతో భజన ఆరంభమయింది. భగవద్గీత సంపూర్ణంగా పారాయణ జరిగింది. 18 మంది మనుష్యులు గీతా పారాయణలో పాల్గొన్నారు. శవానికి తలవైపున బాపూజీ నిటారుగా కూర్చొని, కనులు మూసికొని ధ్యానమగ్నులైనారు. రాత్రి 11 గంటలకు ప్రార్థన పూర్తయింది. వందమంది మనుష్యులవరకు లోపలికి రావటానికి ప్రభుత్వం అనుమతించిందని 11-30 గంటలకు వార్త వచ్చింది. బొంబాయిలో ఉన్నవారికి విడివిడిగా టెలిఫోన్లు చేయటం ఖర్చుతో కూడిన పనిగనుక ఒక్క శ్యామల్ దాస్ కాకాకు మాత్రం కబురు పంపవలసిందని బాపూజీ సూచించారు. 12 గంటల తరువాత బయటినుంచి వచ్చిన మనుష్యులను బయటనేఉండమనీ, మర్నాటి ఉదయం పెందలకడనే రమ్మనమని కోరారు.

బాపూజీ తన పడకమీద పడుకున్నారు. రాత్రంతా ప్రార్థనలతోనూ, రామాయణ, గీతా పారాయణలతోనూ గడపటానికి నిర్ణయం జరిగింది. నేను బాపూజీ తలకు నూనె రాచాను. సుశీలక్క, ప్యారేలాల్జీ కాళ్ళు పిసికారు. బాపూజీ నన్ను నిద్రపొమ్మన్నారు. కాని నాకు మేల్కొని ఉండాలనే కోరిక కలిగింది. 'ఇప్పుడుపోయి పడుకొని ఉదయం శీఘ్రంగా లెమ్మని బాపూజీ మళ్ళీ చెప్పారు.

బామ్మ ప్రాణం పోయినప్పుడు నేను కొంచెంసేపు ఏడ్చాను. కాని వస్తువులందించే పనిలో మునిగిపోయి, ఆమె చనిపోయిన సంగతే నేను మరచిపోయాను. ఆమె యింకా నిద్రపోతున్నదనే నా భావన! కాని మంచంమీద పడుకో

టానికి వెళ్ళేటప్పటికి బా చనిపోయిందన్న సత్యం నాకు ప్రత్య క్షానుభవానికి వచ్చింది. ఎన్నో రోజులనుంచీ రాత్రిపూట నేను బా దగ్గరే పడుకునేదాన్ని. ఇవ్వాళ ఒంటరిగా పడుకో వాల్సివచ్చింది. సుశీలక్క నాదగ్గరికి వచ్చింది మా ఇద్దరిదీ ఒకేవిధమైన దుఃఖం! ఐనా ఆమె నన్ను ప్రేమతో బుజ్జగిం చింది. ఆమె నన్ను ఓదార్చినకొద్దీ నాకుదుఃఖం ఎక్కువైంది. సుశీలక్కా, నేనూ చాలాసేపు ఒకరినొకరం కౌగలించుకొని ఏడ్చాము. 2-30 గంటలకు బాపూజీ లేచారు. నన్ను దగ్గరికి పిలిచి ప్రేమతో ఇలా అన్నారు. "బా ఎన్నోసార్లు నాతో నిన్నుగురించి చెప్పింది ఇప్పుడామె ఎక్కడికీ పోలేదు నువ్విలా ఏడుస్తూవుంటే నా దగ్గర గీత చదవటంవల్ల ప్రయో జనమేమీ లేనట్టే. నువ్వు చాలా యోగ్యురాలవౌతావని బా ఆశించింది. నీకు తల్లిలేనిలోటు బా తీర్చింది. ఇప్పుడు బా లేనిలోటు నేను తీరుస్తాను. నన్నే నువ్వు తల్లిగాభావించుకో. తెల్లవారిన తరువాత ఎన్నో పనులు చెయ్యాలి. అవన్నీ నీ కిప్పుడే వివరించి చెప్పాలంటే జాగరణ చెయ్యవలసివస్తుంది. కనుక, రామనామ స్మరించుకొని శాంతిగా నిద్రపో. నువ్వు నిద్ర పోతే నేనుకూడా నిద్రపోగలుగుతాను, లేకపోతే నాకుకూడ నిద్రరాదు."

బాపూజీదగ్గిర పరుండి నేనెప్పుడు నిద్రపోయినానో నాకు గుర్తులేదు. సరిగా నాలుగు గంటలకు ప్రార్థనకు లేపి నపుడు నేను లేచాను.

## ౨౯

# అంత్యేష్టి

ఆగాఖాన్ మహల్, పూనా,
23-2-'44

ఉదయం ప్రార్థనకు బాపూజీ నన్ను నిద్రలేపారు. రోజూవలెనే ప్రార్థన జరిగింది. ప్రార్థన అయిన తరువాత 5-30 గంటలకు బాపూజీ వేడినీళ్ళూ, తేనె పుచ్చుకున్నారు. 7-30 గంటలకు పండ్లరసం తీసికొన్నారు.

సుమారు 7-30 గంటలనుండే జనుల రాక ఆరంభ మయింది. పూనా పట్టణప్రజలు జైలుగేటు వద్ద గుంపులు కూడారు. 9-30 గంటలకు బొంబాయినుంచి స్నేహితులు, బంధువులు పూలమాలలతో వచ్చారు. రంగురంగుల సుగంధ పుష్పాలతో శవం పూర్తిగా కప్పబడిపోయింది. ముఖం మాత్రం కనబడేటట్లు ఉంచారు.

9-30 గంటలకు ప్రార్థన, 'వైష్ణవజనతో' భజన, గీత 12 వ అధ్యాయం పారాయణ ముగించిన తరువాత మేమందరం బామ్మకు చివరిసారి ప్రణామంచేసి, శవాన్ని బయటి వరండాలోకి తీసికొని వచ్చాము.

అక్కడ పురోహితుడు కొద్దిపాటి కర్మకాండ నడి పించాడు మృతదేహంమీద అంతిమయాత్రకు కావలసిన సామగ్రి తెచ్చిపెట్టారు. దీనిలో యవలు, తిలలు, కొబ్బరి కాయలు, సౌభాగ్య చిహ్నాలైన అయిదు పచ్చరంగు గాజులు ఉన్నవి. శవాన్ని రామనామ స్మరణ పూర్వకంగా దహనం

చేసే ప్రదేశానికి తీసికొని వచ్చారు. మొట్టమొదట బాపూజీ శవ వాహనాన్ని తమ చేతితో స్పృశించారు. తరువాత మేమందరం ఒకరి తరువాత ఒకరుగా శవాన్ని భుజాలమీద మోసే పుణ్యాన్ని సంపాదించుకొన్నాము. పురోహితుడు పసుపు కుంకుమలున్న పళ్ళెం నా చేతికిచ్చి శవం వెంట వెద జల్లుతూ నడవ మన్నాడు. అలాగే చేశాను నేను.

శాంతికుమార్ భాయి చందనపుకట్టె తెప్పించమని బాపూజీని ఒత్తిడిచేశాడు. కాని ఆయన యిలా అన్నారు: "బా ఒక పేదవాని భార్య; పేదవాడు తన భార్యకుగాను చందనపుకట్టె ఎలా తెప్పించగలడు? నువ్వు తెప్పించటానికి సిద్ధంగానే ఉన్నావు. కాని నా కది యిష్టంలేదు ప్రభుత్వ మిస్తే తీసికోటానికి అభ్యంతరంలేదు. బా ప్రభుత్వపు ఖైదీ. ఆమె సేవా పరిచర్యనిమిత్తం ప్రభుత్వం చేసిన సహాయ సదు పాయాలను స్వీకరించినట్టుగానే చందనపుకట్టెకూడ స్వీకరించ వచ్చు. సేవాగ్రామంలో మట్టితో కట్టిన పాకలో నివసిస్తున్న ప్పటికీ ప్రభుత్వమిచ్చిన మహల్‌లో ఇక్కడుండటానికి అంగీక రించినట్టుగా ప్రభుత్వం ఏదిస్తే అదే నాకు స్వీకరించదగినది."

ఈ మాటలు కటేలీగారు విన్నారు. 'నాదగ్గర చంద నపుకట్టె ఉన్న'దని ఆయన చెప్పారు. ఆగాఖాన్ మహల్ తోటలో చందనపు చెట్టుండేది. అది ఎండిపోయినప్పుడు దాన్ని నరికించి ఆ కట్టె భద్రంచేశారాయన. దాని నుపయో గించటానికి ఒప్పుకున్నారు బాపూజీ.

శవాన్ని ఆ కట్టెల చితిమీద పరుండబెట్టారు. ఆ దృశ్యం హృదయాన్ని ద్రవింపజేసింది. మహాదేవ్ కాకాగారి

సమాధికి సమీపంలోనే చితిపేర్చబడింది. 'ఇక నేను మహాదేవ్ ప్రక్కనే పడుకోవలసి ఉన్నది' - అని బా అనేక సార్లు అంటూ ఉండేది. ఇప్పుడామెకు అదే సిద్ధించింది.

మరొకసారి హిందూ, పారసీ, ముస్లిమ్ ప్రార్థనలు, గీత 12 వ అధ్యాయ పఠనం - ఇవన్నీ చిన్నమొత్తున జరిగినవి. 'మంగళ మందిర్ ఖోలో దయామయ' - అన్న భజన పూర్తికావటంతోనే వేదమంత్రోచ్చారణ జరిగింది, శవంచుట్టూ దేవదాస్ కాకా ప్రదక్షిణచేసి చితి వెలిగించారు. క్షణంలో జ్వాలలు వ్యాపించినవి. బామ్మ శాశ్వతంగా పంచత్వం పొందింది.

బాపూజీ చింతచెట్టుకింద కుర్చీ వేసుకొని కూర్చున్నారు. ఆయన్ను వెళ్ళి విశ్రమించమని కొందరన్నారు.

"ఇక విశ్రాంతి తీసికోటమేకదా మిగిలింది? చితి రాజుకోటంతోనే వెళ్లిపోతే బా నన్ను క్షమించదు నిన్నటి మట్టుకు నిన్న, షికారుకు వెళ్ళబోతూ ఒక్కక్షణం దేవదాసుతో మాట్లాడుతూ నిల్చున్నా. ఇంతలోకే బా నన్ను చివరిసారిగా పిలిచింది. నేను మేడదిగిపోయి ఉంటే ఆమె దగ్గరకు చేరుకోటం సంభవమయ్యేదే కాదు. నన్ను పిలిచిన అయిదు నిమిషాలకే ఆమె ప్రాణంపోయింది. కనుక, ఇప్పుడు నేను దహనం పూర్తికాకముందే మధ్యలో లేచి వెళ్లితే బాకు నామీద కోపం వస్తుంది." అని బదులు చెప్పారు. ఈ మాటలను ఆయన నవ్వుకుంటూ చెప్పినప్పటికీ ఆయన లోలోపల పడుతున్న మనోవేదన స్పష్టమవుతూనే ఉన్నది.

మేము ఆడపిల్లలం ఏడ్చి ఏడ్చి హృదయభారం తగ్గించుకుంటున్నాము. బాపూజీ మమ్ములను ఓదార్చి శాంత పరుస్తున్నారు. రామదాసు కాకా ఇంతవరకు చేరుకోలేక పోయినారు. దేవదాసు కాకా ఒక మూలకుపోయి కూర్చున్నారు.

చితి సరిగా పేర్చకపోవటంవల్ల మళ్ళీ మళ్ళీ కట్టెలు వెయ్యవలసి వచ్చింది. అహర్నిశలు నామీద వాత్సల్యం చూపిస్తూ వచ్చిన బామ్మ దేహాన్ని ఈవిధంగా కట్టెలతో కాల్చి బూడిద చెయ్యటం నాకు భయంకరంగా కనిపించింది. దీన్నిగురించి ఎన్నోవిధాల తర్కవితర్కాలు నా మనస్సులో బయలుదేరినవి.

సరిగా 4 గం. 40 నిమిషాలకు బా శరీరం భస్మమయింది. అప్పుడందరు లేచి దిగజారిపోయిన ముఖాలతో లోపలికి వచ్చారు. బయటినుంచి వచ్చిన స్నేహితులు, బంధువులు, అందరూ బాపూజీకి నమస్కారంచేసి సెలవు తీసికొంటున్న దృశ్యంచూచి నా మనస్సు నీరయిపోయింది.

మా నాయనగారు దణ్ణంపెట్టి సెలవు తీసుకొనేటప్పుడు ఆయనతో బాపూజీ - "నిన్న రాత్రినుంచి మనూకు నేనే తల్లినైనాను; దాన్నిగురించి నువ్వు విచారపడవద్దు, ఆమె సేవ చేయటానికి వచ్చింది. ఆ పనిచేస్తూ తీరికసమయంలో చదువుకుంటూ ఉండేది. ఇప్పుడు ప్రభుత్వం అనుమతించే టట్లైతే నా దగ్గరే ఉంచుకొని చదువు చెప్పించదలచుకున్నా" అన్నారు.

మా నాయనగారికి, నన్ను బాపూజీకి ఒప్పగించటంలో ఉన్న నిశ్చింత ఇతరత్రా ఎక్కడుంటుంది? అందుకని ఆయన 'సరే' నన్నారు. నేనేమీ మాట్లాడలేదు. నమస్కారంచేసి వచ్చేశాను.

## ౩౦
## శూన్యత

అందరు వెళ్ళిపోయిన తరువాత బాపూజీ స్నానానికి వెళ్ళారు. మేమందరంకూడ స్నానాలు చేశాం. ఎటుచూచినా నిశ్శబ్దం. అందరం నిమ్మకాయ షర్బత్తు పుచ్చుకున్నాము. ఇరవైనాలుగు గంటలు గడచినతరువాత మంచినీళ్లు త్రాగాం. బాపూజీకూడ బాగా అలసిపోయినారు.

సాయంకాలం, బాపూజీ ఉడికించిన కూర, పాలూ పుచ్చుకుంటూ ఉండగా కర్నల్ భండారీ వచ్చారు. ప్రభావతిని గురించి, నన్ను గురించి మాట్లాడుకున్నారు.

ప్రభావతి, మనూ ఇద్దరూ ఇక్కడుండటమే నాకిష్టం. ఇంతకుముందే నేను మనూ తండ్రితో మాట్లాడాను. ఆపిల్లను ఇక్కడుంచటానికి ఆయనకేమీ అభ్యంతరంలేదు. ప్రభావతి ఇక్కడుండటం ప్రభుత్వానికిష్టంలేకపోతే, ఆమె భాగల్పూరు నుంచి వచ్చింది కనుక తిరిగి అక్కడికే వెళ్ళిపోవటం ఆమె అభీష్టం. మనూను సి. పి. ప్రభుత్వం వదిలివేసింది కదా! ప్రభుత్వం ఆమె నిక్కడ వుంచకపోతే, ఆమె తన తండ్రిగారి దగ్గరకు వెళ్ళిపోతుంది. కనూభాయీ బయటినుంచి వచ్చాడు

గనుక అతన్ని గురించిన ప్రశ్న లేదు" అని బాపూజీ స్పష్టం చేశారు.

భండారీ వెళ్ళిన వెంటనే రామదాసు కాకా చేరుకున్నారు. బాపూజీకి "నమస్కరించి గద్గద కంఠంతో-'బతికి ఉండగా బాను చూదామన్న కోర్కె మనసులోనిది మనసులోనే ఉండిపోయింది" అన్నారు.

"బా జీవించివుండగా నువ్వు వచ్చినప్పటికి ఆమె పడ్డ కష్టమే నువ్వు చూడగలిగేవాడివి" అని సమాధానం చెప్పారు బాపూజీ.

భోజనాల తరువాత అందరం బామ్మను దహనంచేసిన చోటుకువెళ్ళి పూలుంచివచ్చాం. చితి నిప్పింకా ఆరిపోలేదు, మండుతూనే వున్నది. తిరిగివచ్చిన తరువాత ప్రార్థన మొదలైన కార్యక్రమం నడిచింది.

ఇవ్వేళ భజనపాట పాడే వంతు నాది కనుక బాపూజీ నన్ను పాడమన్నారు

"భగవంతుడు నా బామ్మను నాకు లేకుండా తీసుకుపోయినాడు ఇప్పుడు నేను ప్రార్థనలోకే రాను, రామనామమూ ఉచ్చరించను" అన్నాను నేను.

బాపూజీ నవ్వుతూ "ఇంత మూర్ఖత్వ మయితే ఎలా?" అన్నారు. "ఈరోజుకు దేవదాసుకాకా పాడతారులెండి" అని నేను తప్పించుకున్నాను.

బాొమ్మ ఉపయోగిస్తూ వచ్చిన గాజులు, మెడలో వేసుకొనే మాల, పాంకోళ్ళు, కుంకుమ మొదలైన వస్తువులను నాకు ఒప్పగించారు.*

ప్రార్థన అయిన తరువాత, బాపూజీకి కాళ్ళొత్తి తొమ్మిదిన్నర గంటలకే నిద్రపోయాను. గంగానదిలో నిమజ్జనం చేసే నిమిత్తం అస్థిసంచయనం పూర్తిచేసుకోటానికి రామదాసు కాకాకు, దేవదాసుకాకాకు మూడు రోజులుండటానికి అనుమతి నిచ్చింది ప్రభుత్వం. మనుష్యుల సంఖ్య పెరిగినప్పటికీ, ఒక్క బాొమ్మ లేని కారణంచేత శూన్యంగా తోచింది నాకు! ఈ మహల్‌లో నేను ఒంటరిగా ఉన్నట్టు, నాకింక పనేమీ లేనట్టూ అనిపించింది.

ఆగాఖాన్ మహల్, పూనా,
**24-2-'44**

రాత్రి ఒళ్ళు తెలియక రెండుసార్లు లేచి కూర్చున్నాను. నా 'డ్యూటీ' చెయ్యటానికి బాొమ్మ మంచం ఉండే గదిలోకి నడిచి వెళ్ళాను. అప్పుడు సుమారు 12 గంటలైంది. సుశీలక్క రాసుకుంటూ కూర్చున్నది. నన్నుచూచి సంగతి గ్రహించింది. మే మిద్దరం ఒకరినొకరు పట్టుకొని కొంచెంసేపు ఏడ్చాము. నన్నామె తనదగ్గరే పడుకోపెట్టుకున్నది. రెండు గంటలప్పుడు మళ్ళీ ఇలాగే అయింది. అప్పుడు బాపూజీ మేలొ్కని ఉన్నారు. రామనామ స్మరణచేస్తూ పడుకోమన్నారు నన్ను.

---

* ఈ వివరాలన్నీ నవజీవన్ ట్రస్టు ప్రకటించిన "బాపూ నా తల్లి" అనే పుస్తకంలో (పే. 6-7) చూచి తెలుసుకోవచ్చు.

ఉదయం నాలుగు గంటలకు ప్రార్థన జరిగింది. తరువాత బాపూజీ కూడ పడుకోలేదు. చాలా రోజుల తరువాత నేను ఒక గంటసేపు నూలు వడికాను.

రామదాసు కాకా, దేవదాసు కాకా, బాపూజీ ముగ్గురూ మాట్లాడుకుంటున్నారు. ఆ మాటల్లో బామ్మ చికిత్స విషయంలో ప్రభుత్వం చూపిన వైఖరి, దేశ రాజకీయ పరిస్థితి మొదలైన సంగతులు వచ్చాయి. ఉదయాన్నే నేను స్నానాదులు తీర్చుకున్నాను. అందరంనడకకు వెళ్ళాము. ఇవ్వేళ ఎవరికోసమూ ఆగవలసిన అవసరం లేదుకదా!

నడక సమయంలో బాపూజీ ఇలా అన్నారు : "బా తోడ్పాటే లేకపోయినట్లయితే నేనింతవరకు పైకివచ్చేవాణ్ణి కాదు. ఆమె నాకన్నముందే నాచేతుల్లోనే పోవాలని నాకు ప్రబలమైన వాంఛ ఉండేది. అలాగే జరిగింది. దీనివల్ల ఒక విధంగా నా బరువు తగ్గిపోయిందని చెప్పాలి. కాని ఆమెలేని లోటు ఏవిధంగానూ తీరదు. తెలిసో తెలియకనో ఆమె నన్ను అనుసరించిపోవటమే తన ధర్మమని నమ్మింది." ఈ విధంగా బామ్మను స్మరించుకొన్నారు.

కొంచెంసేపు నడక సాగించిన తరువాత బామ్మ అస్థికలు పోగుచేయటం మొదలుపెట్టాము. అక్కడ ఒక ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది. బామ్మ శవంమీద పెట్టిన ఐదు గాజుల్లో అస్థికలు ఏరేటప్పుడు - ఉన్నవి ఉన్నట్టుగా ప్రభావతికి రెండు గాజులు, సుశీలక్కకు ఒకటి, బాపూజీకి ఒకటి, నాకొకటి దొరికినవి. నేను వెనుక రాసినట్టు చితి సరిగాపేర్చక

పోవటంవల్ల పెద్దపెద్ద దుంగలు దూరాన్నుంచి వేయవలసి వచ్చింది. దూరాన్నుంచి వేసినప్పటికీ నలువైపులా వ్యాపించిన మంటల వలన కనూభాయీ కనురెప్పల వెంట్రుకలు కొంచెం కాలిపోయినవి శాంతికుమార్ భాయీ ఆ దుంగలను ఎత్తటానికి చాలా శ్రమపడ్డారు. ఆయనకు కూడా కొంచెం సెగ తగిలింది. ఈ సంఘటనకు పురోహితుడు "నేను నా జీవితంలో ఇప్పటికి దహనక్రియ లెన్నో చేయించాను. కాని ఇటువంటి చిత్రం నేనెక్కడా చూడలేదు. శరీరం బూడిద అయినా దానిమీద పెట్టిన గాజులు మాత్రం చెక్కు చెదరకుండా ఉన్నవి" అన్నాడు. బాపూజీ 'ఇందులో ఆశ్చర్యమేమీలేదని బా ఇటువంటి మహిమ కలదే'నని తన అభిప్రాయం చెప్పారు.

భారతదేశంలో పతివ్రతల పాతివ్రత్య పరీక్షకు సంబంధించిన నిదర్శనాలెన్నో ఉన్నవి. వాటిలో ఇదొకటని చెప్పవచ్చు. బామ్మ జీవితమంతా సీతాదేవికివలె అగ్నిపరీక్షలతోనే గడిచింది. సౌభాగ్య చిహ్నాలైన ఆమె గాజులు అగ్నిదేవుడు ముట్టుకోకుండా భద్రంగా తిరిగి యిచ్చివేశాడు.

అస్థికలు, చితాభస్మం తీసుకొని మేము మేడమీదికి వెళ్ళాము. బా శవంమీద ఉంచటానికి తెప్పించిన గాజులలో, మిగిలినవాటిలోనుంచి ఒక గాజు తీసి మండుతున్న కుంపట్లో వేసి చూచాను. వెంటనే అది ముక్కలు ముక్కలై కాలిపోయింది.

మధ్యాహ్నం బామ్మ ఉపయోగించిన వస్తువులపట్టీ తయారుచేసి దేవదాస్ కాకాకిచ్చాను. ఆమె ఏ సమయంలో

యే వస్తువు నుపయోగిస్తుండేదో, దేన్ని బొత్తిగా ఉపయోగించలేదో-ఆ వివరాలన్నీ రాత్రి 12 గంటలవరకూ కూర్చొని రాసి, దేవదాస్ కాకాకిచ్చాను. నాకు దొరికిన గాజు నాకు, ప్రభావతికి దొరికినవి ప్రభావతికి, సుశీలక్కకు దొరికినదానిని సుశీలక్కకు బాపూజీ యిచ్చి వేశారు. బంగారపురేకు అతికిన పాతగాజులు బాపూజీ 'బామ్మ స్మృతి చిహ్నాలు'గా నాకు ప్రసాదించారు. బామ్మ మెడలో వేసుకునే మాల, ఆమె రుమాలు, పావుకోళ్ళు, కుంకుమ బరిణె. ఈ గాజులు... ఈ పవిత్ర వస్తువులను నాకు ప్రసాదించినందుకు భగవంతుడికి నా కృతజ్ఞత తెలుపుకున్నాను.

ఈరోజు పెందలకడనే పడుకోమని చెప్పేవాళ్ళెవరూ లేరు. అందుకని రాత్రి 12 గంటలవరకూ కూర్చొని ఈ డైరీ పూర్తిగా రాశాను.

ఆగాఖాన్ మహల్, పూనా,
25-2-'44

సంతాపం తెలియజేసే టెలిగ్రాములు, ఉత్తరాలు కుప్పలు తెప్పలుగా వస్తున్నవి. పండిత మదనమోహన మాలవ్యాగారు బా అస్థికలు ప్రయాగకు తీసుకురావలసిందని టెలిగ్రాం పంపించారు.

ఉదయం పురోహితుడు విధిపూర్వకంగా సంచయనం చేయించాడు. ఆస్థికలపాత్ర తీసికొని వెళ్ళుతూ దేవదాస్ కాకా, రామదాస్ కాకా బాపూజీ దగ్గర సెలవు తీసికొన్నారు. ఆయన ఆ సోదరులిద్దరినీ జైలుగేటు వరకు పంపించివచ్చారు.

# ౩౧

# ప్రభుత్వంవారి అబద్ధాలు

ఆగాఖాన్ మహల్, పూనా,

**26-2-'44**

నాకు నిన్నటినుంచి జ్వరం వస్తున్నది. ప్రభుత్వం నన్నూ, ప్రభావతిని ఇకమీాదట ఇక్కడుండనీయదని తోస్తున్నది. నా విషయంలో ఇవ్వేళ చాలా చర్చజరిగింది. పూజ్యులైన బాపూజీనికూడ విడిచిపోవలసివస్తుందేమో నాకు! బాపూజీ నన్ను చూడటానికి వచ్చారు. తరువాత షికారుకు వెళ్ళారు. సాయంత్రం ఆరుగంటలకు నేనీ విషయాలు (డైరీలో) రాస్తున్నాను.

బాపూజీ "నీకు బామీాద ఉన్నంత శ్రద్ధ నామీాద ఉన్నదా, లేదా - అని ఆలోచిస్తున్నాను. నన్ను బాకన్న ఏమాత్రం తక్కువగా చూచినా ప్రభుత్వం నిన్ను వదిలేస్తుంది. కాని నువ్వు జబ్బుపడటంవల్ల నేను నీమీాద బా చూపినంత ప్రీతిని చూపటం లేదని రుజువౌతున్నది. అలా కాకపోతే నీకు జబ్బెందుకుచేస్తుంది?" అని అడిగారు. ఈ మాటలను ఆయన తమాషాగా అన్నప్పటికీ నేను జబ్బుపడటం తనలోపంవల్లనేనని బాపూజీ భావిస్తున్నారని తెలుసుకున్నాను. లేదా తాను నాకేదో లోపం చేస్తున్నారని ఆయన భావిస్తున్నటు తోస్తున్నది. ఆయన మనస్సులోని తీవ్రవేదన స్పష్టంగా గోచరించింది.

సాయంకాలానికి బాపూజీ మౌనం ఆరంభమైంది. బామ్మ చనిపోయిన తర్వాత ఇదే మొదటి మౌనదినం.

ఆగాఖాన్ మహల్, పూనా,
**27-2-'44**

నాకు నిన్నంతా జ్వరం ఉన్నది. ఇప్పటివరకు- అనగా ఉదయం 7-30 గంటలవరకూ తగ్గలేదు. 100 డిగ్రీలున్నది. బాపూజీ షికారుకు వెడుతూ నాకొక ముఖ్యమైన ఉత్తర మిచ్చి వెళ్ళారు. నిన్న బాపూజీ తమాషాగా అన్న మాటల్లో గొప్ప భావం గూఢంగా ఉన్నది. నా విషయంలో ఆయన ఎంత చింత పడుతున్నదీ ఈ ఉత్తరంవల్ల స్పష్టమైంది. బాపూజీ నిన్న నా మంచం దగ్గరికివచ్చి 5 నిమిషాలు నా తల మీద చేయివేసి చూచారు. నా జ్వరంచూచి ఆయనకు తీవ్రమైన వేదన కలిగింది.

బాపూజీ ఉత్తరాన్ని పవిత్ర స్మారక చిహ్నంగా నా దగ్గరుంచుకున్నాను. అది నా పేర బాపూజీ తన స్వహస్తంలో రాసిన మహత్తరమైన ఉత్తరం. ఆ ఉత్తరం ఈవిధంగా ఉన్నది:

"చిరంజీవి మనూ,

నువ్వు బాగా నిద్రపోయినావనుకుంటాను. నిన్నూ, ప్రభావతినీ ఇక్కడుంచే విషయంలో నిన్ననొక పెద్ద ఉత్తరం రాసి పంపించాను కాని దాన్ని గురించి ఆలోచిస్తూ రాత్రంతా నిద్రపోలేదు. చివరకు జ్ఞానోదయ మయింది. ప్రభుత్వాన్ని అటువంటి కోరిక కోరివుండకూడదు. అన్ని

ఉంటే ఇది జైలెలా అవుతుంది? మనం విడిపోక తప్పదు. నువ్వూ, నేనూ ఈ యెడబాటు సహించవలసిందే. నీకు అర్థం చేసుకొనే తెలివితేటలున్నవి. దుఃఖం మరచిపో. ముందు ముందు నువ్వింకా గొప్ప పనులు చేయవలసివున్నది. ఏడ్పు మాను, సంతోషంగా ఉండు. బయటికివెళ్ళి నేర్చుకోటానికి వీలున్నదంతా నేర్చుకో. నువ్వు మాకుచేసిన సేవకుఫలితంగా నీకు మేలే కలుగుతుంది. నిన్ను గురించిన చింత నాకుండనే ఉంటుంది. నీవు విలక్షణమైన పిల్లవు. అమాయకురాలివి. కల్లా కపట మెరుగవు. పరోపకారివి. నీవు సేవా ధర్మాన్ని అవలంబించావు. కాని నువ్వింకా చదువు రానిదానవనే చెప్పాలి. కొంచెం మూర్ఖత్వంకూడా ఉన్నది. చదువుకోక పోతే తరువాత నువ్వు పశ్చాత్తాప పడతావు. జీవించివుంటే నాకుకూడ పశ్చాత్తాపం కలుగుతుంది. నువ్వు లేకపోవటం నాకుకూడ బాగుండదు. అయినప్పటికీ నిన్ను నా దగ్గర ఉంచుకోటం నాకిష్టంలేదు. ఎందుకంటే, అది దోషమవుతుంది. మోహం అనిపించుకొంటుంది. నువ్విప్పుడు రాజకోట్‌కు వెళ్ళాలి. అదే నా నిశ్చితాభిప్రాయం. అక్కడ నారాయణ దాసు దగ్గర ఉంటే మేలుకలుగుతుంది. అక్కడ నువ్వు సంగీతంతోపాటు ఉపయోగకరమైన ఇతర కళలు కూడ నేర్చుకోగలుగుతావు. ఏది వీలయితే దానినేనేర్చుకో. కనీసం ఒక్క ఏడాది అక్కడున్నావంటే నువ్వెంతో తెలివిగల దానవౌతావు. తరువాత కావాలంటే కరాచీ వెళ్ళవచ్చు. లేదా ఇంకా ఎక్కడికైనా వెళ్ళవచ్చు. కరాచీలో గురుదయాల్ మల్లిక్ ఉంటారు. కాని ఆయనిప్పుడు

అక్కడ లేకపోవచ్చు. అక్కడ నీచదువు కొనసాగే అవకాశ మున్నది. అదికూడ ఉపయోగకరమైనదే.

"పలువురు ఆడపిల్లలతో కలిసి ఉండటంకూడ మంచిదే. కాని రాజకోట్‌లో కలిగే మేలు వేరే ఎక్కడా కలుగదు. నా మౌనం అయిపోయిన తరువాత యింకా చాలా సంగతులు చెబుతాను. నీకు తల్లిని నేనేకదా! నువ్విమాత్రం తెలుసుకొంటే చాలు. ఈ ఉత్తరాన్ని నువ్వు భద్రంగా దాచిపెట్టుకో.

బాపూజీ ఆశీర్వాదాలు"

సుమారు తొమ్మిది గంటలకు కర్నల్ భండారీ వచ్చారు. కర్నల్ షాహ్‌కూడ ఆయనతో ఉన్నారు బామ్మ లేకపోతే వాళ్ళకుకూడ అంతా బోసిగా వున్నట్టనిపించింది.

దేశ దేశాలవాళ్లు బామ్మ మృతికి సంతాపం చెందుతున్నట్టు పత్రికల్లో వార్తలు వస్తున్నవి. ఎన్నోచోట్ల ప్రార్థనలు జరుగుతున్నవి జైలులో చనిపోవటంవల్ల ఆమె అమరత్వం ఇనుమడించింది.

ఆగాఖాన మహాల, పూనా,
29-2-'44

బామ్మ గతించి నేటికి వారం నిండింది. అందువల్ల సాయంకాలం 7-35 గంటలకు ఇరవైనాలుగు గంటలు రాట్నం వడికే సూత్రయజ్ఞం ఆరంభమయింది. బాపూజీ దీన్ని మొదలుపెట్టారు.

మామూలుగా చనిపోయిన 12 లేక 13వ రోజున శ్రాద్ధం జరిపించినట్టుగా, బామ్మకు ప్రీతికరములైన గీతా

పఠనం, సూత్రయజ్ఞం, ఖైదీలకు విందుచెయ్యటం - మొదలైన కార్యక్రమాలతో బామ్మ శ్రాద్ధాన్ని జరిపించటానికి నిశ్చయించుకున్నాము. బాపూజీ నా చదువుకు మళ్ళీ వ్యవస్థ ఏర్పాటుచేశారు. నేనేమీ పనిలేదని అనుకోకుండా ఉండేందుకు రోజంతా పనివుండే విధంగా నా దినచర్యను బాపూజీ తయారుచేశారు.

ఆగాఖాన్ మహల్, పూనా,
**1-3-'44**

అహోరాత్రాలు జరిపిన సూత్రయజ్ఞానికి ఈ సాయంకాలం 7-35 గంటలకు బాపూజీ పూర్ణాహుతి చేశారు.

ఆగాఖాన్ మహల్, పూనా,
**2-3-'44**

గీతా పఠనం, ప్రార్థన మొదలైనవి నిత్యం జరుగుతున్నవే. బాపూజీ ఆనందంగా ఉన్నట్టు పైకి కనిపించినా ఆయన మనస్సులో కొద్దిపాటి వ్యథ ఉంటూనే వున్నదని నా అనుమానం. అప్పుడప్పుడు ఆయన దీర్ఘాలోచనలో మునిగి ఉన్నట్టు కనిపిస్తారు. బాను దహనం చేసినచోట మట్టితో ఒక సమాధి కట్టారు. దానిమీద - బామ్మ అహర్నిశలు స్మరించిన 'హే రామ్' అనే అక్షరాలు లిఖించారు. మేమిద్దరం పొద్దునా, సాయంకాలం ఆ సమాధిదగ్గరకు వెళ్ళివస్తున్నాము. బాపూజీ స్వయంగా పుష్పాలతో 'క్రాసు' అలంకరిస్తారు, మేమందరం గీత 12వ అధ్యాయాన్ని పారాయణం చేస్తాము.

ఆగాఖాన్ మహల్, పూనా,
5-3-'44

నాకు వచ్చిన జ్వరం సాయంకాలానికి ఎక్కువైంది. ఈ సమయానికి - సాయంకాలం 6 గంటలకు - బాపూజీ నడకకు వెళ్ళారు. నేను ఒంటరిగా కూర్చొని ఈ డైరీ రాస్తున్నాను. ఆగాఖాన్ మహల్‌లో తన కోసం ఖర్చు చాలా ఎక్కువౌతున్నదనీ, వీలైనంతవరకు దాన్ని తగ్గించాలనీ ఆయన అభిప్రాయపడుతున్నారు. ప్రభుత్వం ఇకమీాద నన్నిక్కడ ఎందుకుంచవలెననే విషయంకూడ చర్చకువస్తున్నది. ప్రభావతి ఇంకా ఖైదీగానే ఉన్నందున ఆమెను వేరే చెరసాలలో ఉంచినా లేక ఇక్కడుంచినా ఒకటే. కాని నా విషయం అలాకాదు. వాస్తవానికి, ఇది నా భక్తిని పరీక్షించటమే. బాపూజీమీాద నా భక్తి హృదయపూర్వకమైనదైతే ఆయన విడుదలయ్యేటప్పుడే నేనుకూడ విడుదల కావాలి - ఇదే నేను భగవంతుణ్ణి ప్రార్థించేది

ఆగాఖాన్ మహల్, పూనా,
6-3-'44

బ్రిటిష్ పార్లమెంటులో, మార్చి 2 వ తేదీన బామ్మ చికిత్సా, సేవా పరిచర్యల విషయంలో ప్రభుత్వం తీసికున్న చర్యను గురించి ప్రశ్నలూ, వాటిమీాద చర్చలూ జరిగినవి. అప్పుడు బట్లరుగారు పూర్తిగా కల్పనచేసి అబద్ధాలు పలికారు. అదిగాక, బామ్మ దహన సంస్కారంకూడ బాపూజీ కోర్కెపైనే ఆగాఖాన్ మహల్లో ఏర్పాటు చేయబడిందని వార్తాపత్రికలు ప్రచురించినవి.

"నా ఇష్టప్రకారమే నడచినట్లయితే బా దహనక్రియ మామూలు స్మశానంలోనే జరిగిఉండేది" అన్నారు బాపూజీ. కాని ఈ అసత్య ప్రచారమంతా బామ్మ పేరుమీద జరగటం బాపూజీ అశాంతికి కారణమయింది. ఆమె చికిత్సకు కావలసిన సదుపాయాలను కల్పించటంలో చాల ఆలస్యం జరిగింది. చికిత్స విషయంలో పూర్తి సౌకర్యాలివ్వని పక్షంలో తనను బా దగ్గరనుంచి వేరుచేసి ఇతరత్రా ఎక్కడికైనా పంపించవలసినదని కోరినమీదటనే ప్రభుత్వం కొద్దిపాటి సౌకర్యాలైనా యివ్వటం జరిగింది. ఈ సంగతులు బాపూజీ మొన్న ప్రభుత్వానికి రాసిన ఉత్తరంలో స్పష్టం చేశారు. డాక్టరు దిన్షాగారి వైద్యాన్ని ఏర్పాటుచేసే విషయంలోకూడ ఆలస్యమే జరిగింది దానికోసం జనవరిలో రాసుకుంటే ఫిబ్రవరిలో అంగీకారం వచ్చింది. డాక్టర్ విధాన్‌రాయిగారి వైద్యం కావాలని తెలిపిన కోరికనుగురించి అసలు ఆలోచనే జరగలేదు.

ఇంతేగాక, బాను పెరోల్ మీద విడిచిపెట్టవలసిందని ఎవరూ అడగనట్టూ, ఆమెను విడిచిపెట్టకపోవటంలో ప్రభుత్వం వివేకంతోనే ప్రవర్తించినట్టూ బట్లరుగారు వక్కాణించారు.

దీనికి బాపూజీ తన ఉత్తరంలో బదులురాస్తూ "బాను విడిచి పెట్టమని కోరకపోవటం నిజమే, కాని విడిచిపెట్టే ఉద్దేశం తనకున్నట్టు ప్రభుత్వం తెలియజేయనేలేదుకదా! అదీగాక, తనను విడిచిపెట్టమని అడగటం 'సత్యాగ్రహి'కి అగౌరవమైన విషయం" అని రాశారు.

బా అంత్యక్రియలనుగురించిన ప్రభుత్వ ప్రకటనను ఖండిస్తూ తన ఉత్తరంలో బాపూజీ, 22వ తేదీ సాయంకాలం తాను కర్నల్ భండారీకి తెలియపరచిన మూడు మతులను ఉదహరించారు దీనికి ప్రభుత్వందగ్గరే సాక్ష్యం ఉన్నదనీ, తాను రాజకీయప్రయోజనాలను సాధించే నిమిత్తం ఈ వివాదం లేవదీయటం లేదనీకూడ తెలియజేశారు.

ఆయన ఉత్తరంలో ఇంకా యిలా ఉన్నది:

"నా సహధర్మచారిణి అయిన కస్తూర్ బా జీవనజ్యోతి ఇప్పుడు ఆరిపోయింది. ఆమె విషయంలో ప్రభుత్వం తప్పు చేసింది. అమెరికాలోని భారత ప్రతినిధికూడ ఆమెనుగురించి ఆశ్చర్యకరమైన ప్రకటన ఒకటి చేశాడు. నేను చెప్పేది నిజమనితోస్తే, ప్రభుత్వం తన తప్పును సరిదిద్దుకోవలసి ఉంటుంది. అసత్యప్రకటనలో సరియైన సవరణచేసి బా పవిత్ర స్మృతిని కాపాడవలసి ఉంటుంది. సత్య రక్షణకోసం చేసే ఈ సవరణ వలన నా మనస్సుకు శాంతీ, సంతోషమూ కలుగుతాయి. ప్రభుత్వం తప్పక ఈ చర్య తీసికొంటుందని నేనాశిస్తున్నాను. ఒకవేళ బట్లరుగారు చేసిన ప్రసంగానికి వార్తాపత్రికలు ప్రచురించిన రిపోర్టు భిన్నంగా ఉన్నట్లైతే, ప్రభుత్వం ఆయన ప్రసంగానికి సరియైన రిపోర్టును ప్రకటించవలసి ఉంటుంది."

బా విషయంలోనే అసత్య ప్రచారం జరిగినప్పుడు మామూలు ఖైదీల పరిస్థితి ఎంత అధ్వాన్నంగా ఉంటుందో ఊహించుకొని బాపూజీకి దుఃఖం కలిగింది.

ప్యారేలాల్జీ మధ్యాహ్నమంతా బాపూజీ ఉత్తరాన్ని నాచేత చదివించి అర్థం చెప్పటానికి వినియోగించారు.

"నిన్ను శతవిధాల ప్రభుత్వం విడిచిపెట్టవచ్చు. బాపూజీ ఈ మధ్య ప్రభుత్వానికి రాస్తున్న విషయాలన్నీ నువ్వు జ్ఞాపకం పెట్టుకోవాలి ఎందుకంటే బయటనున్న వాళ్ళకు ఈ సంగతులెంతో ఉపయోగ పడతాయి. వీటిని డైరీలో రాసిపెట్టుకోటం అవసరమే, కాని ప్రభుత్వం ఈ డైరీలను బయటికి పోనిస్తుందన్న నమ్మకంలేదు. అందువల్ల విషయాలన్నీ మనస్సులోనే జ్ఞాపకముంచుకోవాలి" అని నాకు బోధించారు.

ఈ బోధన విచిత్రంగా ఉంది. ఇంగ్లీషు, చరిత్ర, భూగోళం, గణితం మొదలైన విషయాలు మరచిపోకుండా జ్ఞాపకం ఉండటానికిగాను ఉపాధ్యాయుడు పిల్లలచేత నాలుగైదుసార్లు రాయిస్తాడు. అదేవిధంగా ఈ రాజకీయ పాఠాలు కూడ చాలసార్లు రాయించి నేర్పేపద్ధతి ప్యారేలాల్జీ కొత్తగా మొదలుపెట్టారు. ఇటువంటి ఉత్తరాలు జ్ఞాపకం ఉంచుకోటం నాకు కష్టం, కనుక ఆ భారం నామీదపెట్టటం బాపూజీ కిష్టంలేదు. అదీగాక పాఠశాలలో నాకుపయోగించే పాఠ్యవిషయాలే బోధించాలని ఆయన అభిప్రాయం. కాని ప్యారేలాల్జీ బాపూజీదగ్గర మంత్రిగా ఉన్నారుకదా, అందువల్ల ఈ ఇంగ్లీషు ఉత్తరాలను గుజరాతీలోకి అనువదించి నా చేత కంఠస్థం చేయించారు. ఏ ఉత్తరంలోని ఏ సంగతి అడిగినా బదులుచెప్పగలిగి ఉండాలి నేను!

ఇవ్వేళ మధ్యాహ్నం ఈ ఉత్తరాన్ని ఐమసాఫ్లు రాశాను. దానితో నాకు విసుగుపుట్టింది. ఐనా తప్పులేకుండా ఒప్పగించటం వచ్చిన తరవాతనే ఆయన నన్ను విడిచి పెట్టారు.

'ఈ కొత్త పాఠాలు ఎందుకొచ్చినవా'అని నాకు విచారం కలిగింది. వీటిమీద పుట్టినంత అయిష్టత ఇంకేపాఠం మీదా పుట్టలేదు. ఐనా ఒక్కొక్కప్పుడు ఇష్టంలేని వస్తువే ఎంతో ఉపయోగ పడుతుంది. కంఠోపాఠంగా నేర్చుకున్న ఈ ఉత్తరాలు అద్వితీయమైన సాహితీరూపంలో నా డైరీ లోకికూడ ఎక్కినవి.

## 32
## వేవెల్ గారికి ఉత్తరం

ఆగాఖాన్ మహల్, పూనా,
10-3-'44

లార్డు వేవెల్‌గారి దగ్గరినుండి సంతాపం తెలియజేస్తూ ఉత్తరం వచ్చింది బాపూజీ దానికి నిన్న బదులు రాశారు. దానిలో బాను గురించిన సంగతులు తెలుసుకోదగినవి ఉన్నవి. అందువల్ల ప్యారేలాల్జీ నాతో "బాను గురించిన తన స్మృతులను బాపూజీ ఏనాటికైనా రాస్తే రాయవచ్చు. రాయక పోవచ్చు. కాని ఈ ఉత్తరంమాత్రం ఆ దృష్టితో ఆలోచిస్తే చాలా ముఖ్యమైంది. ఆయన తన భావాలను దీనిలో సంక్షేపంగా వర్ణించారు. అవి హృదయాన్ని స్పందింప చేస్తున్నవి" అన్నారు. ఈ ఉత్తరంలో బాపూజీ మొదట

లార్డ్ వేవెల్ గారికీ, ఆయన సతీమణికీ కృతజ్ఞత తెలియజేశారు. తరువాత బా విషయం ముచ్చటించారు.

"కస్తూర్బా లేని లోటు నన్నెక్కువగా బాధిస్తుందని అనుకున్నాను. కాని రోగం వలన ఆమె పడే దారుణబాధ చూచినప్పుడు ఈమె త్వరగా శరీరాన్ని విడిచిపెడితేనే బాగుంటుందనిపించేది. మా దాంపత్యం అందరికన్నా కొంచెం విలక్షణమైంది. 1906 లో మేమిద్దరం పరస్పరాంగీకారంతో ఆత్మ నిగ్రహ నియమాన్ని పాటించవలెనని నిశ్చయించు కున్నాము. దానితో మేమిద్దరం ఒకరి కొకరం అత్యంత సన్ని హితులమైనాము.

"ఆమె మిక్కిలి స్వేచ్ఛా ప్రియురాలైకూడా నాలో సంపూర్ణంగా ఐక్యతచెందటమే ఆదర్శంగా పెట్టుకున్నది. 1906 లో మొదటిసారి ఆమెను నేను రాజకీయాల్లోకి దింపి నప్పుడు దక్షిణాఫ్రికాలో జైలుకు పోయే భారతీయుల పట్టికలో మొదటిస్థానం ఆమెదే. శారీరకంగా ఆమె నాకన్న ఎక్కువ కష్టమనుభవించింది. చాలాసార్లు జైలుకు పోయిన అనుభవం ఆమెకు ఉన్నప్పటికీ, ఎన్నో సౌకర్యాలున్న ఈ మహాల్‌లో ఖైదీగా వుండటం ఆమెకు కష్టంగా తోచింది. ఇతర నాయకులనూ, నన్నూ, చివరికి తననూ అరెస్టుచేయటం ఆమె దుఃఖానికి కారణమయింది ఎందుకంటే, ప్రభుత్వం నన్నీసారి బంధించనే బంధించదని ఆమెకు నేను హామీ యిచ్చాను. అందుచేత ఈసారి జరిగిన అరెస్టులవల్ల ఆమె మనస్సుకు పెద్దదెబ్బ తగిలింది. వెంటనే విరేచనాలు ఆరంభ మయినవి. అదృష్టవశాత్తు డాక్టర్ సుశీలానయ్యార్ దగ్గిరుండి

వెంటనే మందులిచ్చి రక్షించింది. ఆమె లేకపోతే నన్ను కలుసుకోటానికి ముందే ఆమె స్వర్గస్థురాలయ్యుండేది. నన్ను చూచిన తరువాత ఏవిధమైన మందూ లేకుండానే ఆమె విరేచనాలు నిలిచిపోయినవి ఐనప్పటికీ ఆమెకు కలిగిన మానసిక సంతాపం, హృదయ దౌర్బల్యం, నిరుత్సాహం ఆమెనువిడిచి పోనేలేదు. క్రమంగా బాధను అనుభవిస్తూ, అనుభవిస్తూనే ప్రాణాలు విడిచింది

"ఇటువంటి కస్తూర్‌బాను గురించి ప్రభుత్వం వారి తరఫున పత్రికల్లో వెలువడే అసత్యాలు నాకెంత సంతాపం కలిగిస్తున్నవో మీరు సులభంగా ఊహించుకోగలరు. ఆమె నాకు లభించిన అమూల్య రత్నంలాంటిది. ఆమెను గురించి వ్రాసే అసత్యాలకంటే దుఃఖకరమైన విషయం నాకింకొకటుండదు. దీన్ని గురించి హోమ్ డిపార్టుమెంటుకు నేనొక ఫిర్యాదు రాసి పంపించాను. దాన్ని మీరు తప్పక చదవవలెనని నా కోరిక."

బాను గురించి రాసిందీ భాగం మాత్రమే. తరువాత లార్డు వేవెక్‌గారి ఉపన్యాసాన్ని గురించి, మీరాబహెన్‌ను జైలులోంచి విడిచిపెట్టే విషయాన్ని గురించీ రాశారు. బాపూజీ భక్తురాలు కావటమే మీరాబహన్‌ను జైల్లో ఉంచటానికి కారణం. 'ఇప్పుడామెను వదిలినప్పటికీ ఆమె బీదలకు సేవ చేస్తూనే ఉంటుంది' అని బాపూజీ తెలియజేశారు. తరువాత లార్డు వేవెల్‌ను ఇక్కడికి రమ్మని ఆహ్వానిస్తూ ఇలా రాశాను.

"మీరు విమానంలో బెంగాలుకు వెళ్ళి అక్కడి ప్రజల దుఃఖాలను చూస్తున్నారు. ఒకసారి ఇక్కడికీ - అహ్మద్

నగర్ కూ, ఆగాఖాన్ మహల్‌కు కూడా రండి. మీ ఖైదీల మనస్సులోని భావాలను మీరు పరీక్షించ గలుగుతారు. మేము మిమల్ని విమర్శిస్తున్నప్పటికీ మీకు స్నేహితులమనే సంగతి నమ్మండి."

ఉత్తరంలో బాను గురించిన సంగతులు ఇంగ్లీషు లోనుంచి యథాతథంగా అనువదించినవి.

బాపూజీ ఆమధ్య సుశీలక్కచేత సంస్కృతరామాయణానికి అనువాదం చేయిస్తున్నారు ప్రభావతికి భగవద్గీతా, గుజరాతీ భాషా నేర్పుతున్నారు. అప్పుడప్పుడూ నాకు రేఖా గణితంలో పాఠాలు చెపుతున్నారు సాయంకాలం మీరా బహెన్ బాపూజీ దగ్గర కూర్చొని అరగంటసేపు వార్తాపత్రికలు, బైబిల్ చదివి వినిపిస్తున్నది. ఇప్పటివరకు పోస్టులో ఉత్తరాలు బాపూజీపేర ఎక్కువగానే వస్తున్నవి. నేను ఒక్కతెనే జవాబులు రాసేపని చూస్తున్నాను. బామ్మ ఎవ రెవరికి ఉత్తరాలు రాస్తుండేదో వాళ్ళందరికీ ఇప్పుడు నేనే రాస్తున్నా

కర్నల్ భండారీ, కర్నల్ షాహ్ ఇంచుమించుగా నిత్యం వస్తూనేవున్నారు. మామీద నెలకు 550 రూపాయలు ఖర్చు అవుతున్నదని పత్రికలో వచ్చిన వార్తచదివి బాపూజీ చాల నొచ్చుకున్నారు. ఈ మొత్తం మా అయిదారుగురు మనుష్యుల కొరకే ఖర్చు కావటంలేదు. అయినప్పటికి ప్రభుత్వం ఇంత అందమైన మహల్ ప్రత్యేకించి తన నిమిత్తమే ఉపయోగిస్తున్నదని బాపూజీ భావన. ఇక్కడ ప్రభుత్వపు

నౌకర్లుకూడ ఉంటున్నారుగదా అంటే, 'ప్రభుత్వం వాళ్ళ కిచ్చే జీతాలడబ్బు బీదలమీాద పన్నువేసి వసూలుచేస్తున్నది గదా' అంటారు! బాపూజీని మామూలు జైల్లో వుంచితే ఇంత ఖర్చుకాదు. ఈసంగతి నాకు చెబుతూ బాపూజీ: "ఇద్దరు అన్నదమ్ములు కలిసుంటే తక్కువ ఖర్చు అవుతుంది. విడి విడిగా ఉండి, ఒకేమాదిరి ఆహారం తింటూ, ఒకే స్థాయిలో ఉన్నప్పటికీ వాళ్ళకు రెట్టింపు ఖర్చు అవుతుంది. నేనిటువంటి ప్రయోగాలు ఎన్నో చేసిచూచాను. నా జీవితమే ఒక ప్రయోగం" అన్నారు.

ఆగాఖాన్ మహల్, పూనా,
15-3-'44

పైన చెప్పిన ఖర్చునుగురించి మార్చి 4వ తేదీన బాపూజీ ప్రభుత్వానికి ఒక ఉత్తరం రాశారు. అనువాదం చేయవలసిన ఉత్తరాలెన్నో ఉండటంవల్ల ఆ చిన్ని ఉత్తరం వాటిలో కలిసిపోయి ఈరోజే కనిపించింది. ప్రభుత్వం కాంగ్రెసుమీాద చేసిన ఆరోపణలకు జవాబులు 1943 లోనే బాపు జబ్బులో ఉన్న రోజుల్లో, తయారుచేసి పంపించారు. వాటిని కొంచెంకొంచెంగా ఇప్పుడు అనువాదం చేస్తున్నాను. కాని, అవి నాకు బాగా అర్థం కావటంలేదు. అందుకని బాపూజీ: "ఇది నీకు చాలా కష్టమైనపని, దీనికింతకాలాన్ని వినియోగించటం వ్యర్థం. ఇప్పటి ఉత్తరాలు నీకు బాగా అర్థమవుతవి, వీటిని అనువాదం చేస్తే చాలు" అన్నారు. అందుకని ఆ ఉత్తరాలు వదిలి మార్చి 4వ తేదీన ఖర్చును

గురించి రాసిన ఆ చిన్న ఉత్తరం తీశాను. దానిలో బాపూజీ ఇలా రాశారు :

"శాసన సభలో అడిగిన ఒక ప్రశ్నకు హోం డిపార్టు మెంటువారు బదులు చెబుతూ మా నిమిత్తం నెలకు 550 రూపాయలు ఖర్చు అవుతున్నట్లు వెల్లడించారు.

"నన్నింత పెద్ద రాజభవనంలో వుంచటాన్నిబట్టి నేను భారతదేశపు దరిద్ర ప్రజల ధనాన్ని దుర్వినియోగం చేస్తున్నట్లు భావిస్తున్నాను. ఈ సంగతి 1943 అక్టోబరు నెల లోనే ప్రభుత్వానికి తెలియపరచాను ఏమామూలు జైల్లో వుంచినప్పటికీ నేను ఆనందంగా కాలంగడిపేవాడిని. ప్రభుత్వం అలా చేయలేదు నేను నామాటమీద దృఢంగా నిలబడి ప్రభుత్వంచేత ఒప్పించివుండవలసిందని శాసనసభలో ఇచ్చిన ప్రత్యుత్తరం నాకుజ్ఞాపకంచేస్తున్నది. అయినా మనం 'మేల్కొన్నప్పుడే తెల్లవారటే'మని భావించి చేసిన పొర పాటును ఇప్పుడైనా సవరించుకోటానికి వీలున్నది. అందువల్ల ఇప్పుడు నేనే ఈ ప్రశ్నను చర్చకు తీసికువస్తున్నాను. నాకూ నాతోకూడా ఉన్నవారికీ అయ్యే నెలసరి ఖర్చు 550 రూపా యలు మాత్రమేకాదు. ఈ రాజభవనంలో కొద్దివాటి భాగం మాకు ఉండటానికి వినియోగించి, ఎక్కువ భాగం ఎప్పుడూ మూసే ఉంచుతున్నారు. ఐనప్పటికీ దీనికివ్వవలసిన బాడుగా, కావలివారికి, జైలు సూపరింటెండెంటుకు, జమాదారుకు, మిగిలిన సిపాయీలకు యిచ్చే జీతాలుకూడా ఖర్చులో చేర్చ వలసివుంటుంది ఇక్కడున్న తోటను కాపాడటానికి కొంత ఖర్చవుతుంది. బంగళా పరిశుభ్రత కోసం ఏర్పాడా జైలు

నుంచి ఖైదీలను రోజూ తీసికొని వస్తున్నారు. ఈ ఖర్చంతా అనవసరంగా జరుగుతున్నదని నా ఉద్దేశం. అందులోనూ ఇప్పుడు దేశంలో క్షామం వ్యాపించివున్నది. ఈ పరిస్థితిలో ఇంత ఖర్చు పెట్టిస్తున్న మనిషి దేశానికి అపరాధం చేసిన వాడుగా భావించబడతాడు. కనుక నన్నూ, నాతోకూడా ఉన్నవాళ్ళనూ ఇకనుంచి సాధారణమైన జైలుకు మార్చమని ప్రభుత్వాన్ని అడుగుతున్నాను. చివరకు నేను చెప్పేదేమంటే ఈ ఖర్చుకు కావలసిన ద్రవ్యం దేశంలోని కోట్లకొలది నోరు లేని బీదజనుల దగ్గరనుండి వసూలుచేస్తున్నారన్న విషయం నా మనస్సును కలతపెట్టి సర్వదా బాధిస్తునే వుంటుంది.”

ఈ ఉత్తరం చేరిన తరువాత నన్ను తప్పకుండా వదలి వేస్తారనీ, ప్రభావతిని ఆమె వచ్చినచోటుకే పంపించివేస్తారనీ నాకనిపించింది. ఎందువల్లనంటే తనను గురించి ఇంతఖర్చు చేయవద్దని బాపూజీ పట్టుపట్టి మామూలుజైలుకు పోతా మన్నారు. హఠం చేయటంలో ఆయన ఎవరికీ తీసిపోరు.

## 33
## ఇంకా పెద్ద అబద్ధం

ఆగాఖాన్ మహల్, పూనా,
22-3-'44

నేటికి బామ్మ పరమపదించి నెలయింది. అంతా కల లాగ కనిపించింది. కలలో చూచినవి అదృశ్యమైనట్టు బామ్మ కూడ శాశ్వతంగా అదృశ్యమైంది. ఆమె లేనందువల్ల గోచ రించిన శూన్యత రోజురోజుకు ప్రబలమౌతున్నట్టు తోస్తు

న్నది మాలో ప్రతిఒక్కరికి ఏదోపని కల్పించి క్షణంకూడ తీరికలేకుండ, కార్యక్రమ మేర్పాటుచేశారు బాపూజీ. ఐనా ఎవరికీ మనశ్శాంతి కలుగలేదు.

'ఇవ్వాళ ప్రత్యేకంగా ఏమిచేయాలి?' అని అడిగి నప్పుడు బాపూజీ: "బా లేకుండ ఒక నెల గడిచింది. ఆమె మనస్సుకు ప్రియమైన పనులు - ఖైదీలకు భోజనం పెట్టటం, నూలు వడకటం, గీతా పఠనం. కనుక మనమివ్వాళ ఆ పనులే చేద్దాము." అన్నారు.

మేము ఉపవాసముండి ఖైదీలకు మా భోజనం పెట్టాము. కాని ఈరోజు మా కింతకుముందున్న ఆనందంగానీ, భోజనంచేసే ఖైదీల ముఖాలమీద స్వాభావికమైన నవ్వు గానీ కనిపించలేదు. ఖైదీల కెప్పుడు భోజనంపెట్టినా బామ్మ మధ్యలో కుర్చీ వేసుకొని కూర్చొని, అందరినీ వాత్సల్యంతో పలుకరిస్తుండేది. పదార్థాలు సరిగా అందుతున్నదీ, లేనిదీ అడుగుతూండేది ఇవ్వాళ భోజన సమయంలో ఆ కుర్చీ లేదు! వ్యాధితో ఉన్నప్పుడు కూర్చున్న చక్రాలకుర్చీకూడా కని పించలేదు.

సాయంకాలం 5-30 గంటలకు బాపూజీ ఖైదీలకు పులగం, పులుసు, కూర వడ్డించారు మేముకూడా ఒకరి తరు వాత ఒకరం వడ్డనలో పాల్గొన్నాం. ఖైదీలు సంతృప్త హృద యాలతో భోజనంచేశారు. జబ్బుతో ఉన్నప్పుడు బామ్మకు సేవచేసిన ఖైదీలలో యిద్దరు ముగ్గురు ఈరోజామె మాసికం కనక ఉపవాసంచేశారు.

గడిచిన నెల ఇదే రోజు సాయంకాలం 7-30 గంటలకు బాపు మానవదేహాన్ని విడిచింది. ఈ దినం సరిగా అదే సమయానికి ఆమెకు ప్రియమైన ప్రార్థన, భజన, గీతా పఠనం ఆరంభం చేశాము. బాపు నవ్వు ముఖం మా కనులముందు కనిపిస్తున్నది. నామ సంకీర్తనలతో గది మారుమ్రోగుతున్నప్పుడు బాపు మామధ్యలో వచ్చి కూర్చున్నట్లనిపించింది. అజ్ఞానం మూలంగా మేము ఈ చర్మచక్షువులతో ఆమెను చూడలేకపోయినామేమో! ఇవ్వాళ ప్రార్థన విలక్షణమైన వాతావరణంలో జరిగింది.

బాను గురించి ప్రభుత్వంచేసిన అబద్ధాల ప్రకటన విషయంలో ఉత్తరప్రత్యుత్తరాలు యింకా జరుగుతూనేవున్నవి. "వినాశకాలే విపరీత బుద్ధిః" అన్నట్టు ప్రభుత్వం నీచత్వానికి పాల్పడి పార్లమెంటులో ప్రశ్నలకు జవాబు పూర్తిగా అసత్యాలు చెప్పింది. బాధ్యతకలిగిన ప్రభుత్వ మింత అసత్యాన్ని ఎలా చెప్పగలిగిందో! ఏవ్యక్తినిగురించి అసత్యం చెబుతున్నదీ బ్రిటిష్ ప్రభుత్వం ఆలోచించనేలేదు బాపు మహాసాధ్వి. కల్లా కపట మెరుగని మనిషి. ఉన్నదున్నట్టు ముఖంమీదే అనే మనిషి. పాపచింతలేని పరిశుద్ధహృదయ మామెది. ఇటువంటి ప్రేమమూర్తిని గురించి ప్రభుత్వం దుష్ప్రచారం చేస్తున్నది. కానీ, అధికారబలంతో సత్యాన్ని అణచిపెట్టటం సాధ్యంకానిపని. నిజం బయటబడినప్పుడు ప్రభుత్వమెంత నీచానికి ఒడిగట్టిందో లోకానికి వెల్లడికాక తప్పదు. ఈ వుత్తరాలను అనువాదం చేయటంకూడా నాకు అసహ్యమనిపించింది.

అబద్ధాలతో నిండిన ప్రత్తరాలను ఎవరు జ్ఞాపకం పెట్టు కుంటారు ?

ఈ విషయంలో బాపూజీ నాకిలా చెప్పారు. "అసత్య ప్రచారంవల్ల నా మనస్సుకు లేశమైనా క్లేశం కలగటంలేదు. నాకు దీనిలో అయిష్టమైన దేదీలేదు. దీనివలన బా మీద గౌరవం తగ్గటానికి బదులు పెచ్చుతుంది. మనను ఎవరైనా తిట్టినప్పుడు వాళ్ళు మన పాపాలను కడిగివేస్తున్నారని అను కోవాలి. అందువల్ల ప్రభుత్వంమీద నీకు వచ్చినట్లు నాకు కోపం రావటంలేదు. జాలివేస్తున్నది. ఎవరికైనా దెబ్బ తగిలి నప్పుడు 'అయ్యో! పాపం దెబ్బ తగిలిందే!' అని జాలి కలుగుతుంది. అదేవిధంగా 'పాపం, ప్రభుత్వానికి అబద్ధం చెప్పవలసిన గతిపట్టింది గదా' అని సానుభూతి కలుగుతున్నది. తప్పుచేసినందువల్ల మనుష్యులు తేలికైపోతారు. అటువంటి మనుష్యులు నా దృష్టిలో కోపానికికాక దయకు పాత్రు లౌతారు. ఈ తత్త్వం సులభంగా బోధపడేదికాదు. ఎవరి విషయంలోనైనా మనస్సులో ఏమాత్రం క్రోధం కలిగినా నా దృష్టిలో అది హింసకిందికే లెక్కకువస్తుంది. ఉత్తేజం కలిగించే ఈ భావన మనిషిలో లేకుండాపోయినప్పుడు అతడు నిజమైన అహింసావాది ఔతాడు."

ఆగాఖాన్ మహల్, పూనా,
**31-3-'44**

శామ్మకు సంబంధించిన వ్యవహారంలో ప్రభుత్వం కర్నల్ భండారీని, డాక్టర్ గిల్డర్‌నుకూడా చేర్చింది.

కస్తూర్బాకు చికిత్సచేసే విషయంలో డాక్టర్ దిన్షామెహతా ఏవిధంగానూ సహాయపడలేదని గిల్డర్‌గారు అభిప్రాయపడి నట్టు కర్నల్ భండారీ ప్రభుత్వానికి తెలియజేశారు. కాని ఈ సంగతి శుద్ధ అబద్ధం ఈ విషయాన్ని స్పష్టంచేస్తూ డాక్టర్ గిల్డర్ ఒక ఉత్తరంలో ఇలా రాశారు:

"కర్నల్ భండారీ సెలవుమీద వెళ్ళినప్పుడు ఆయన స్థానే పనిచేస్తున్న కర్నల్ అద్వానీ 1943 డిసెంబరునెలలో నన్ను చూడటానికి వచ్చారు.

"డాక్టర్ దిన్షామెహతావల్ల ఏమైనా ప్రయోజన ముంటుందా?"- అని ఆయన నన్నడిగారు. అప్పటికింకా గాంధీజీతో గానీ, డాక్టర్ సుశీలానయ్యర్‌తోగానీ నేను మాట్లాడలేదు. అందువల్ల వెంటనే నిశ్చితాభిప్రాయాన్ని చెప్పలేకపోయినాను. కాని రెండవరోజే డాక్టర్ మెహతా చాలా ఉపయోగపడతారని నేనాయనతో చెప్పాను.

ఐనప్పటికీ మెహతాగారిని చికిత్సకేర్పాటు చేయవల సిందని పంపిన దరఖాస్తుమీద 1944- జనవరి 31 వరకు ఏమీ చర్య జరగలేదు. అప్పుడు మేము రెండవసారి లిఖిత పూర్వకంగా జ్ఞాపకంచేశాము. ఇంతేగాక డాక్టర్ విధాన్ చంద్రరాయ్‌గారిని గురించికూడా రాయటం, చాలాసార్లు చెప్పటం జరిగింది. దానికేవిధమైన బదులూ రాలేదు. ట్రైనింగ్ పొందిన నర్సును యిచ్చామని ప్రభుత్వం చెప్పటం కూడా అబద్ధమే. అటువంటి నర్సు ఇక్కడికి రానేలేదు.

పిచ్చివాళ్ళ ఆస్పత్రిలో పనిచేసిన ఒక నర్సు మా దగ్గరికి వచ్చింది. ఆమె 8 దినాలుండి, 'నన్ను విడిచిపెట్టవలసిం'దని కటేలీగారిని కోరి వెళ్ళిపోయింది."

ఈ ప్రకారంగా రాసిన ఉత్తరం గిల్డర్ గారు అధికారులకు మధ్యాహ్నం అందజేశారు. ఇది జరిగిన ఒక గంటకల్లా పత్రికలో ఒక వార్త వచ్చింది. ఢిల్లీ శాసన సభలో - కస్తూర్బాకు చికిత్సచేసే అనుమతిని వైద్యరాజ శివశర్మగారికి ప్రభుత్వం ఎప్పుడిచ్చిందని ప్రశ్నించారు. ఫిబ్రవరి 9 వ తేదీన అనుమతి కోరటం జరిగిందనీ, ఫిబ్రవరి 10 వ తేదీనే అనుమతినిచ్చామనీ, ఒకటి రెండు రోజుల్లోనే ఆయన చికిత్స ఆరంభం చేశారనీ హోము సెక్రటరీ కాన్‌రాన్ స్మిత్ గారు ఆ ప్రశ్నకు బదులు చెప్పారు.

కాని నిజమేమిటంటే: 1944 జనవరి 31 వ తేదీ సాయంకాలమే బాపూజీ ఉత్తరంరాసి కటేలీగారికి అందజేశారు. అప్పుడు నేనక్కడే ఉన్నాను. బాపూజీ నాకు 'మార్గోపదేశిక' పాఠం చెబుతున్నారు.

'బొంబాయి సమాచార్'లో వచ్చిన పైన చెప్పిన రిపోర్టు నేను కత్తిరించి దాచాను. ఇంగ్లీషు పత్రికల్లో వచ్చే ఇటువంటి వార్తలను బాపూజీ స్వయంగా కత్తిరించిగాని, లేదా మాచేత కత్తిరింపించిగాని ఫైలులో పెట్టుకొనేవారు. గుజరాతీ పత్రికల్లో వచ్చేవాటిని కత్తిరించి భద్రపరిచే పని నేను చేస్తుండేదాన్ని. గుజరాతీ పత్రికనిదివరకు బా చదువుతుండేది. ఇప్పుడు నేను చదువుతున్నాను.

## ౩౪
# ప్రభావతి జైలు మార్పు

ఆగాఖాన్ మహల్, పూనా,
9-4-'44

ఇవ్వేళ మధ్యాహ్నం కటేలీగారు, ప్రభావతిని భాగల్‌పూర్ జైలుకు తిరిగి పంపించివేసే ఉత్తరువు తీసికొని వచ్చారు. ఆమె నిక్కడినుంచి పంపివేస్తారని ఎవరికీ అనుమానంకూడ కలగలేదు నన్ను వదలివేసే ఉత్తరువు ఏరోజు వస్తుందోనని ఆదుర్దాగా ఎదురుచూస్తున్నాము. రాత్రి అయ్యేటప్పటికి 'ఈ రోజు గండం గడిచిందిగదా,' అని తృప్తిపడుతూ ఉండేవాళ్ళం. అందువల్ల ప్రభావతిని గురించి వచ్చిన ఉత్తరువు అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది ఉత్తవును రెండేసిసార్లు చదివి చూచాము. 'మనూ' అని రాయటానికి బదులుగా పొరపాటున 'ప్రభావతి' అని రాశారేమోనని అనుమానం కలిగింది.

ఈ ఉత్తరువు నాకు కొంచెం ఆవేశాన్ని కలిగించింది. "నా పాలిట భగవంతుడున్నాడు; మనమిద్దరం ఒకేసారి విడుదలౌతాము" అని నేను బాపూజీతో అన్నాను.

అందుకు బాపూజీ: "నీ భగవంతుడు సత్యవంతుడే కాని స్వార్థమున్నచోట భగవంతుడుండడని నీకు తెలియదు" అన్నారు.

"భగవంతునికే నాకంటే ఎక్కువ స్వార్థమున్నట్లు కనిపిస్తున్నది. భగవంతుని దృష్టిలో మనమందరం పిల్లలతో

సమానమని మీరే చాలాసార్లు చెప్పారు. తల్లిదండ్రులకు తమ పిల్లలు చదువు సంధ్యలు నేర్చుకొని బాగుపడవలెననే కోరిక ఉన్నట్టుగానే భగవంతునికికూడ ఉంటుందనుకుంటాను. నా తల్లి దండ్రులు నన్ను హృదయపూర్వకంగా భగవంతుని చేతికి ఒప్పగించారు. అందువల్ల మీ దగ్గర ఉండటమే నాకు ఎక్కువ శ్రేయస్కరమని భగవంతునికి తెలిసి ఉండవచ్చు" అని నేను నా అభిప్రాయాన్ని వెల్లడించాను.

నా మాటకు బాపూజీ నవ్వటం మొదలుపెట్టారు. నా మనస్సు కెంత సంతోషం కలిగిందో ప్రభావతికి అంత దుఃఖం కలిగింది. కాని ఆమె తన మనస్సులోని ఉద్వేగాన్ని ఎవరికీ తెలియనివ్వలేదు. ఆమె నవ్వుముఖంతో సామాను సర్దుకుంటున్నది. బాపూజీ దగ్గరుండి, ఆయన ఆధ్యాత్మిక జీవనంలోని మాధుర్యాన్ని ఆమె కొన్నేండ్లుగా అనుభవిస్తూ వచ్చింది. అటువంటి అనుభవం ఇంకెందరికో లభించి ఉండ వచ్చును. కాని ప్రభావతిమాత్రం దాన్ని తన జీవితంలో జీర్ణంచేసుకున్నది. అందుచేత ఆమెకు బాపూజీతోటి వియోగం కఠినంగా తోచినా, సంతోషంతో ఎదుర్కొన టానికి సిద్ధపడింది. ఆమె స్థానంలో నేనే ఉన్నట్టయితే ఆ ఉత్తరువు రావటంతోటే ఏడుపు మొదలుపెట్టే దాన్ని.

సాయంకాలపు నడక సమయంలో బాపూజీ ఇలా అన్నారు: "ప్రభావతి వెళ్ళిపోవటానికి ఎంత ధైర్యంగా సిద్ధ పడుతున్నదో చూడు. నువ్వుకూడ వెళ్ళవలసివస్తే అలాగే కొంచెంకూడ చింతపడకూడదు. ప్రభావతి తిరిగి జైలుకే

పోవాలి. కాని నువ్వు నీ బంధువుల దగ్గరికి పోవచ్చు. ఈ రెంటికీ ఎంత భేధమున్నదో చూడు! ప్రభావతి నీకన్నా పెద్దది కావటంచేత అనేకంచూచి, అనుభవించింది. ఐనా ఆమె మొదట నా దగ్గరకు వచ్చినప్పుడు పన్నెండు, పదమూడేళ్ళ బాలిక. ఇప్పటికీ అలాగే ఉన్నది. ఆమెకు బదులుగా నిన్ను విడిచిపెట్టమని ఉత్తరువు వస్తే ఏమయ్యేది?" నేను బదులు చెప్పటానికి ముందే వెంటవచ్చే వాళ్ళల్లో ఎవరో "వేడి నీళ్ళ కొళాయి తెరిచినట్లయ్యేది." అన్నారు.

"మీరేమన్నా సరే, దేవుడే నాకు తోడు. నేను విడుదలయ్యేప్పుడు బాపూజీనికూడ వెంటతీసికొని పోతానో లేదో చూడండి" అని ఆవేశంలో అనేశాను. పైకి ఇలా అంటున్నప్పటికీ మనస్సులో 'విడుదలకు ఉత్తరువు వచ్చినప్పుడు తేలుతుంది సంగతి' అని అనుమానిస్తునే ఉన్నాను.

ఆగాఖాన్ మహల్, పూనా,
12-4-'44

ఇవ్వాళ ప్రభావతి వెళ్ళేరోజు. 12 గంటలకి అందరం భోజనాలుచేసి కూర్చున్నాం. ఇంతలోకే పోలీసు ట్రక్కు ఒకటి వచ్చింది. దానికి నాలుగువైపులా జాలీ వున్నది. ఒక యూరోపియను సార్జెంటు, నలుగురైదుగురు పోలీసు జవాన్లు, ఒక మేట్రన్ కూడా వచ్చారు. పోలీసువాళ్ళు తుపాకులు పట్టుకొనివున్నారు. "ఈ బక్కచిక్కిన ప్రభావతి ఎక్కడికి పారిపోతుందని - యింతమంది పోలీసులు తీసికొని పోవటానికి వచ్చారు!" అని నేనన్నాను.

బాపూజీ నవ్వుతూ "ఈమె పారిపోయేదికాదు, కాని ఈమె భర్త (జయప్రకాశ్) పారిపోతాడుగదా!" అన్నారు. బాపూజీతోపాటు మేమందరం ప్రభావతిని సాగనంపటానికి బస్సువరకు వెళ్ళాము. బాను కోల్పోయి, విధిలేక బాపూజీని విడిచి ఆమె వెడుతున్న దృశ్యం కరుణోత్పాదకంగా ఉన్నది. అందరికీ కళ్ళవెంట నీళ్ళువచ్చినవి.

బాపూజీ ఆరోగ్యం కొంచెం చెడింది. రాత్రికి జ్వరం వచ్చినట్టుండటంవల్ల ఆయన భోజనం మానివేశారు.

## 38
## బాపూజీ జబ్బు

ఆగాఖాన్ మహల్, పూనా,
17-4-'44

బాపూజీకి మలేరియా జ్వరం పట్టుకున్నది. జ్వరం చాలా తీవ్రంగా వస్తున్నది. వంతుల ప్రకారం పగలు, రాత్రి ఆయన దగ్గర విడవకుండా వుండేట్యూటీ అందరం ఏర్పరచుకున్నాం. ఆయన క్వినైన్ మందు పుచ్చుకోనన్నారు ఈ సమయంలో బామ్మ లేనికొరత అనుభవానికి వచ్చింది. బాపూజీకి త్వరగా ఆరోగ్యం ప్రసాదించుమని నేను దైవ ప్రార్థన చేశాను.

సాయంకాలం మేము బా సమాధి దగ్గరికి వెడుతున్నాము తానుకూడా వస్తానన్నారు బాపూజీ. కానీ డాక్టరు గిల్డరుగారు వారించినమీదట మానివేశారు. రాత్రి

సుమారు 104°ల జ్వరం వచ్చింది. రాత్రంతా అలాగేఉంటే రేపు క్వినైన్ యివ్వక తప్పదని డాక్టరుగారన్నారు. ఇవ్వేళ మాలిష్, స్నానం మానివేశాము.

25-4-'44

డాక్టరు విధాన్‌చంద్రరాయ్‌ని పిలిపించమని కోరటం జరిగింది. ఆయనా, డాక్టర్ గజ్జర్ - యిద్దరూ వచ్చారు. బాపూజీ రక్తం పరీక్షించటానికి ఉదయాన నెత్తురు తీసికొన్నారు. ప్రభుత్వమీజబ్బును గురించి అశ్రద్ధ చేయలేదు. డాక్టర్ విధాన్‌చంద్రరాయ్‌కి అనుమతి దొరుకుతుందని మేము అనుకోలేదు. అవసరమైతే తనను పిలవవలసిందని వైద్యరాజ్ కూడా కబురు పంపారు. క్వినైన్ ఇవ్వటం మూడు గ్రెయిన్లతో ప్రారంభించారు. దానితో చెవులుమూసుకొని పోతున్నవి. బాపూజీ పాలు తీసుకోకుండా పండ్లరసం మాత్రం తీసుకుంటున్నారు బంధువులు కూడావచ్చి చూడటానికి అనుమతికోరారని తెలిసింది దేశం యావత్తు చింతాగ్రస్తమయింది.

30-4-'44

జమ్నాదాస్ కాకాకు అనుమతి లభించింది. ఆయన రేపు వస్తున్నారని తెలిసింది. అనుమతి ఇచ్చినట్లయితే సేవ చేయటానికి తానుకూడా వస్తానని కనూభాయీ ప్రభుత్వానికి తెలియజేశారు. బాపూజీ ఆరోగ్యం క్రమంగా మెరుగౌతున్నప్పటికీ బలహీనత, రక్తహీనత ఎక్కువైనవి.

2-5-'44

జమ్నాదాస్ కాకా చూడటానికి వచ్చారు. బయటి సమాచారాలు చాల తీసుకువచ్చారు. కాని బాపూజీకిది నచ్చలేదు. జమ్నాదాస్ "గాంధీ" కుటుంబానికి చెందినవాడవటంవల్ల ఆయనకు అనుమతి లభించటం, బంధువులకన్నా మిక్కిలి సన్నిహితులైన ఆశ్రమవాసులకు అనుమతిదొరకక్కపోవటం సహించలేక బాపూజీ ప్రభుత్వానికొక ఉత్తరం రాశారు.

"ఎవరికీ నిరాశ కలుగకుండా వుండాలనే ఉద్దేశంతో నేనీసారికి జమ్నాదాస్‌ను కలుసుకొని మాట్లాడాను. కాని నామటుకు నేను వేరే నిబంధన నేర్పరచుకున్నాను. ఆశ్రమ వాసులు నా బంధువులేనని చెప్పినప్పటికీ గాంధీ కుటుంబానికి చెందినవారు కారన్న కారణంచేత వారినిక్కడికి రానివ్వక పోయినప్పుడు, గాంధీకుటుంబీకులను కలుసుకోకుండావుండటం నా ధర్మం. వాళ్ళు నాకు ఇష్టులైనప్పటికీ ఈ నియమాన్ని పాటించదలచాను. నా వెనుకటి ఉపవాససమయంలో అందరినీ కలుసుకోటానికి నాకు అనుమతి నిచ్చినందువల్ల విపరీత సరిణామమేమీ కలగలేదు. ఆ కారణంచేత ఇప్పుడుకూడా నా జబ్బు నయమయ్యే వరకూ అందరినీ కలుసుకునే సదుపాయాన్ని ప్రభుత్వం నాకు కలుగజేస్తుందనుకుంటాను."

4 5-'44

ఇవ్వాళిక్కడికి రావటానికి కనూభాయీకి అనుమతి దొరికింది. సహాయం చేయటానికి ఆయనిక్కడికి వచ్చేశారు.

## ౩౮
# విడుదల

ఆగాఖాన్ మహల్, పూనా,
5-4-'44

ఈరోజు సాయంకాలం ఆరున్నరగంటలకు మేము భోజనాలు ముగించుకొని కూర్చున్నప్పుడు కర్నల్ భండారీ, డాక్టరు షాహ్ వచ్చారు "బాపూజీని, అనుచరులతో సహా వదిలివేయమని ఉత్తరువు వచ్చింది. కాని దానిలో నీపేరెక్కడా లేదు. కనుక నిన్ను వదలివేయకూడదుగదా!" అని నాతో అన్నారు. ఈ మాటలు మేము వట్టి అబద్ధమని భావించాము. తరువాత బాపూజీదగ్గరకు వెళ్ళారు ఖైదీనందర్నీ ఇవ్వేళ పెందలకడనే యర్వాడాజైలుకు పిలుచుకుపోయినారు. ఇంతత్వరగా తీసికొని వెళ్ళినందుకు మాకు ఆశ్చర్యం కలిగింది. ఈ సంగతి విని బాపూజీకి విచారం కలుగుతున్నదని నా మనస్సుకు తోచింది. అనారోగ్య కారణంచేత విడుదల కావటం, అందులోనూ ఇతర నాయకులెంతమందో ఇంకా నిర్బంధంలో వుండగా, తానుమాత్రం విడుదల కావడం ఆయనకు బొత్తిగా యిష్టంవుండదు. కాని, ఇద్దరువ్యక్తులు బలియైన తరువాత మూడవ దానికి ప్రభుత్వం ఇష్టపడక సంతోషంగా విడుదల చేస్తుండవచ్చు!

బాపూజీతో పాటే విడుదల కావాలని నేను ఎన్నడో నిశ్చయించుకొన్నాను దీన్నిగురించి భగవంతుణ్ణి ప్రార్థించాను. నా ప్రార్థన అద్భుతంగా ఫలించినందుకు నాకు కలిగిన ఆనం

దానికి మేర లేదు. నేను ఎగురుతూ గంతులు పెడుతూ గిల్డరు గారి దగ్గిరకీ, కటేలీగారి దగ్గిరకీ, ప్యారేలాల్జీ దగ్గిరకీ వెళ్ళి చిన్న పిల్లలాగ వాళ్ళందరికి చేతి బొటనవ్రేలు చూపిస్తూ - "చూశారా? బాపూజీని వెంటతీసుకొనే నేను విడుదలౌతున్నాను. భగవంతుడు నావాడా, మీవాడా? ఇప్పుడు చెప్పండి" అని హేళనగా మాట్లాడాను.

సాయంకాలం కొంచెం ఇటూ అటూ తిరగటానికి బాపూజీ వరండాలోకి వచ్చారు. అన్నీ జాగ్రత్తగా మూటలు కట్టవలసిందని చెప్పి ఇలా అన్నాను: "ఎందుకో తెలియదు గాని, విడుదలకావటం నాకు వుత్సాహకరంగాలేదు. పైగా హృదయంలో చీకట్లు క్రమ్మినట్లున్నది. బయటికివెళ్ళి ఏమి చేయగలనో తెలియటంలేదు. కాని ప్రభుత్వం నన్నెక్కువ రోజులు బయట వుండనివ్వదని తోస్తున్నది. మనస్సుమీద ఎంతో బరువు పడ్డట్టున్నది."

ప్రార్థన అయిన తరువాత బాపూజీకి కాళ్ళొత్తి, నేనందరితో కలిసి సామాన్లు సర్దుకోటం మొదలుపెట్టాను.

పుస్తకాలు, స్టేషనరీ, ఇంకా యితర వస్తువులు-ఎంతో సామాను మూటలు కట్టవలసివచ్చింది. మీరాబహెన్ తప్ప మిగిలిన వాళ్ళెవరూ రాత్రంతా కన్నుమూయలేదు. ఈ విడుదల వుత్తరువు అనుకోకుండా అకస్మాత్తుగా వచ్చింది. మేమీ మహాలే ఇల్లనుకొని కావలసిన ఏర్పాట్లన్నీ యథా విధిగా చేసివుంచుకున్నాం. సుశీలక్క, ప్యారేలాల్జీలకు కాగితాలు సర్దుకోటంతో సరిపోయింది. తలెత్తి చూడనుకూడ

చూడలేదు. డాక్టరు గిల్డరుగారు రాత్రి రెండున్నర గంటలకు తమ 'ప్యాకింగు' పూర్తిచేసుకున్నారు.

**6-5-'44**

ఉదయం 4 గంటలకు నేను సర్దటం ముగించుకొని స్నానానికి వెళ్ళాను. నాలుగున్నరకు ప్రార్థన జరిగింది. బాపూజీకి వేడినీళ్ళు, తేనె యిచ్చాను. కటేలీగారు భార హృదయంతో 75 రూపాయలమూట బాపూజీకి అర్పించారు. ఆయనకు బాపూజీమీద ప్రేమా, భక్తి.

7 గంటలకు సమాధి దగ్గిరకు వెళ్ళాము. చిరసమాధిలో లీనమైవున్న ఇద్దరు మహావ్యక్తుల దగ్గిర ఈరోజు సెలవు తీసికోవలసి వున్నది. ఇంతవరకు పూలు అర్పించే నెపంతో నిత్యం దర్శనం లభిస్తూండేది. ఇకమీద బాపూజీ మళ్ళీ ఎప్పుడిక్కడికి వస్తారో చెప్పలేము. ధూప దీపాలతో గొప్పగా అలంకారం చేశాము. పూర్తిప్రార్థనచేసి, గీత 12వ అధ్యాయం పారాయణ చేసేటప్పటికి అందరికి డగ్గుత్తికపడ్డది. గడచిన 21 నెలల్లో అత్యంత ప్రీతిపాత్రులైన వ్యక్తులిద్దరు శాశ్వతంగా ఎడబాసిపోయినారు. ఇది రాతిగుండెను కూడ కరగించే సంఘటన! ఆగాఖాన్ మహల్ విడిచిపోయేటప్పుడు బాపూజీ ఒకఉత్తరం రాయించారు. అందులో ఇలావున్నది:

"మహాదేవ్ భాయీకి, బాకూ - ఇద్దరికీ యిక్కడే అంత్యక్రియలు జరిగినవి. అందువల్ల నిర్బంధంలో వున్నవారు, వీరిద్దరి సమాధులమీద ప్రతిదినం రెండుపూటలా పుష్పాంజలు లర్పిస్తూవచ్చారు. అగ్ని సంస్కారం జరిగిన స్థలాన్ని

దర్శించగోరే బంధువులకు, వారికెప్పుడు అభిలాష కలిగితే అప్పుడు, ఇక్కడికి రావటానికి వీలు కల్పించే నిమిత్తం ఈ కొంచెం స్థలం గౌరవనీయులైన ఆగాఖాన్‌గారి వద్దనుంచి ప్రభుత్వం సంపాదిస్తుందని నేను ఆశిస్తున్నాను. నేను ఈ పవిత్ర స్థలంలో నిత్యం రెండువేళలా ప్రార్థన జరిగే ఏర్పాటు చేయ దలచాను. నేను కోరినప్రకారం ప్రభుత్వం తగిన చర్యతీసి కొంటుందని భావిస్తున్నాను."

సరిగా ఎనిమిది గంటలకు భండారీ వచ్చారు. కావలి వాళ్ళనందరినీ ఇరవై యొక్క నెలల తరువాత ఇవ్వేళ పంపించివేశారు. ఎనిమిది గంటలకు బాపూజీ మోటారులో కూర్చున్నారు. ఇంకా కొంత సామాను మిగిలిపోయినందువల్ల నేను రెండో మోటారులో ఎక్కాను. మొదటిదానిలో బాపూజీ, సుశీలక్క, కర్నల్ భండారీ, డా. షాహ్ కూర్చు న్నారు, రెండవదానిలో డాక్టరు గిల్డర్, మీరాబహెన్, నేనూ; మూడవ దానిలో కనూభాయీ, పారేలాల్జీలు కూర్చున్నారు.

మేము నేరుగా పర్ణకుటీ చేరుకున్నాము. అక్కడివారికి దీపావళి, యుగాది పండుగలు వచ్చినంతటి ఆనందాతిరేకం కలిగింది. బాపూజీ దర్శనానికి ప్రజలు గుంపులు గుంపులుగా చేరారు. అక్కడికిచేరుకోగానే మొదట సుశీలక్క బాపూజీ ఆరోగ్యాన్ని గురించిన వివరాలతో ప్రకటన జారీ చేసింది. నేనాయనకు కావలసిన ఆహారం సిద్ధంచేస్తున్నా. బాపూ జీని కలుసుకునేవారు అంతులేకుండా వున్నారు. 8 మొదలు

12 గంటల వరకు ఆయనకు ఒక్క నిమిషమైనా విశ్రాంతి చిక్కలేదు. 12 గంటలప్పుడు ప్రేమలీలా సోదరి దీన్ని గురించిన ఏర్పాటు చేసేభారం తాను వహించింది. అప్పుడాయనకు శాంతి కలిగింది.

బాపూజీ విశ్రమించినప్పుడు నేనాయన కాళ్ళకు నెయ్యి రాచి, మాలిష్ చేశాను. సాయంకాలం అయిదు గంటలకు ప్రార్థన సమయంలో ఆయన్ను దర్శించవచ్చిన జనంతో పర్ణకుటీలోని ఉద్యానవనం క్రిక్కిరిసిపోయింది. కూర్చొని ప్రార్థనచేసేచోటు లేనందున జనులు చెట్లపైకి ఎక్కారు. ప్రార్థనానంతరం బాపూజీ కొద్దిపాటి నడక సాగించారు. అలసిపోయినందున కొంచెంసేపు విశ్రాంతి తీసుకొని తరువాత పాలు పుచ్చుకున్నారు. డాక్టర్లువచ్చి పరీక్షచేశారు.

రాత్రికి నేను బాపూజీ తలకు నూనెరాస్తున్నప్పుడు ఆయన నాతో "చూచావుగదా, మనుష్యులకు వారివారి శ్రద్ధకు తగిన ఫలితం చేకూరుతుంది., నిస్వార్థ భావంతో హృదయపూర్వకంగా చేసిన ప్రార్థన ఎన్నటికీ నిష్ఫలంకాదు. దీని అనుభవం నీకు ప్రత్యక్షంగానే కలిగింది. మేమందరం నిన్నింతకుముందు ఎగతాళిచేశాము. కాని ఈ సంగతిమాత్రం నేను తమాషాగా చెప్పటంలేదు. నువ్వీ విషయం జ్ఞానపూర్వకంగా తెలుసుకుంటేచాలు. జ్ఞానంతో శ్రద్ధ మిళితమైనప్పుడే గొప్ప ఫలితాన్నిస్తుంది. ఈ సంగతి నువ్వు బాగా జ్ఞాపకముంచుకో" అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

# ౩౭
# పర్ణకుటిలో

పర్ణకుటీ, పూనా,
7-5-'44

పూజ్యురాలైన బా మ్మ భౌతికశరీరం కనిపించకపోయి నప్పటికీ ఆమె సమాధిని దర్శించినప్పుడల్లా ఆమె మాతోనే ఉన్నటు స్ఫురించేది. కాని ఈ దినం పర్ణకుటిలో బా చల్లని నీడ కోల్పోయిన సంగతి అందరికీ అనుభవానికి వచ్చింది. నిన్న ఉదయం 8 గంటలనుండి ఇవ్వేళ ఉదయం 8 గంటల లోపల మా కార్యక్రమం పూర్తిగా మారిపోయింది.

8-15 గంటలకు బాపూజీ మాలిష్ చేయించుకో టానికి ముందు నాతో ఇలా అన్నారు: "ఇవ్వేళ నేను నడుస్తున్నప్పుడు సమాధి దగ్గిరకు వెళ్ళి శ్లోకాలు చదివి పైకి పోదామనే ఆలోచన నా మనస్సులో ఉన్నట్టుండి పుట్టింది. కాని మరుక్షణంలోనే 'మనం బాసూ, మహాదేవునీ విడిచి వచ్చేశాముగదా' అని జ్ఞాపకం వచ్చింది. నిన్ననే మనం వారి సమాధులు దర్శించి బయలుదేరాము. నువ్వుగాని, మీలో ఎవరుగాని పోదలచుకుంటే సమయం దొరికినప్పుడు వెళ్ళిరండి. సుశీల పనిలో మునిగి ఉన్నది. ఆమెకు బొత్తుగా వీలుచిక్కదు. ఐనా అక్కడికి వెళ్ళటం ఆమెకిష్టం. అందుకని అడిగి తెలుసుకో నువ్వు. అక్కడికి వెళ్ళివచ్చినతరువాత నాకు భోజనం పెట్ట వచ్చు."

పర్ణకుటినుండి సమాధుల దర్శనానికి వెళ్ళేవాళ్ళం చాలామందిమి తయారైనాం. అందరం దర్శనంచేసుకొని తిరిగి వచ్చాము.

11-30 గంటలకు బాపూజీకి భోజనం పెట్టాను. జబ్బు పడి లేచిన తర్వాత ఇదే ఆయనకు మొదటి భోజనం. కర కరలాడే రొట్టె, కొంచెం వెన్న, 6 ఔన్సుల పాలు, ఉడక పెట్టిన ఆకుకూర - ఇదీ ఆయన భోజనం. ఒంట్లో బలహీన మింకాపోలేదు. కలుసుకోటానికి వచ్చేవాళ్ళకు అంతులేదు. దీనివల్ల బాపూజీకి బాగా అలసట కలుగుతున్నది. సాయం కాలపు ప్రార్థనలో చోటు చాలకపోవటంవల్ల మనుష్యులు చెట్లమీాదికి ఎక్కుతూనే వున్నారు. సాయంకాలం కర్నల్ భండారీ వచ్చారు. కటేలీగారింకా ఆగాఖాన్ మహల్‌లోనే ఉన్నారు. అన్నీ ఒప్పగించి రావటానికి ఆయనకింకా రెండు మూడు రోజులు పడుతుందని చెప్పారు.

పర్ణకుటీ, పూనా,
10-5-'44

ఎక్కడుంటే బాపూజీకి విశ్రాంతి దొరుకుతుందో డాక్టర్లు, మిగిలినవారూకలిసి ఆలోచిస్తున్నారు. బాపూజీ కైతే సేవాగ్రామం వెళ్ళాలని ఉన్నది. కాని అక్కడ ఎండ లెక్కువగా ఉంటాయి. కనుక అందరూ వద్దన్నారు. ప్రత్యే కించి విశ్రాంతికోసం ఎక్కడికైనా వెళ్ళి ఉండటం బాపూజీ కిష్టంలేదు. కాని విశ్రాంతితోపాటు ముఖ్యమైన పని చేయ టానికికూడా వీలున్నచోటుకు వెళ్ళాలని ఆయన సంకల్పం.

అటువంటి స్థలం బొంబాయేకనక చివరకు 'జుహూ'కు వెళ్ళాలని నిర్ణయంజరిగింది. ఎంతో వినయపూర్వకంగా ప్రతిమిలాడిన తర్వాతనే బాపూజీ శాంతికుమార్ భాయీ ఇంట్లో అతిథిగా ఉండటానికి అంగీకరించారు. తగిన ఏర్పాట్లు చేయటానికాయన ముందుగానే బొంబాయి వెళ్ళారు. మా ప్రయాణం రేపటికి నిశ్చయమయింది.

సాయంకాలం మేమందరం బాపూజీతో సహా సమాధి దగ్గరకు వెళ్ళాము. ఆపూట ఆయన పాలు తేవద్దని రెండు కమలాపండ్లు, వేడినీళ్ళు, తేనె పుచ్చుకున్నారు. ఇంతవరకూ ఆయన అవసరమైనంత ఆహారం తినటం ఆరంభించలేదు. ముఖం పాలిపోయినట్టు కనిపిస్తున్నది.

రాత్రి ఆయన "చెవ్రుల దిబ్బడి ఇంకా పోలేదు. రామ నామం మీద శ్రద్ధ తగ్గిపోవటమే దీనికి కారణం అనుకుంటాను. నామస్మరణ దృఢసంకల్పంతో చేసినట్టయితే ఈ చెడు ఎప్పుడోపోయి ఉండేది" అన్నారు.

## 3౦
## బొంబాయిలో

జుహూ,
11-5-'44

ఉదయాన బయలుదేరే రైల్లో మేము బొంబాయి వెళ్ళవలసి వున్నది. అందుకని ప్రార్థన సమయానికి అర్ధగంట ముందే లేచాం. సగం సామాను మోటారు లారీలో నేరుగా

బొంబాయి వెళ్ళింది. మిగిలినదాన్ని పెట్టెల్లో సర్దుబాటుచేసి కనూ భాయీకి, నారాయణ భాయీకి ఒప్పగించవలసి వున్నది. ప్రార్థన అయిన తరువాత బాపూజీ అరగంటసేపు నిద్రపోయినారు ప్రేమలీలా సోదరి పర్ణకుటి ఒక సత్రంగా మారి పోయింది. పాపం, ఆమెకుకూడా ఒక్క క్షణమైనా విశ్రాంతి దొరకలేదు.

తెల్లవారటంతోటే పూనా స్టేషన్‌లో జనులు గుమిగూడటం ఆరంభించారు. ఇంకా బొంబాయి చేరుకున్న తరువాత ఆ నగరంలో పరిస్థితి ఎలా వుంటుందో! సుమారు గం. 10-15 ని.లకు మేమొక చిన్న స్టేషన్ దగ్గర దిగాము. పెద్ద స్టేషన్‌లో గుంపులు ఎక్కువగా ఉంటవి కనుక మధ్యనున్న ఒక చిన్న స్టేషన్‌లో దిగటానికి రైలు ఆపించాము. బాపూజీ, సుశీలక్క, నేను - ముగ్గురం దిగాము. కాని బాపూజీ జుహూలో బసచేస్తారని బొంబాయి వాసులకు తెలిసి పోయింది. అందువల్ల బాపూజీ దిగబోయే ఇంటివైపు గుంపులు గుంపులుగా పోతున్నారు. మేము మోటారులో వస్తున్నప్పుడు జనులకు తెలియనీయకుండా డ్రైవర్ సాను ర్థ్యంతో బండిని వేగంగా నడిపిస్తున్నాడు. కాని చాలాచోట్ల ప్రజలముందు డ్రైవర్ సామర్థ్యం పనిచేయలేకపోయింది. ప్రజలు మోటర్ దగ్గరికి వచ్చి 'గాంధీజీ జిందాబాద్ !' అని కేకలు వేయటం మొదలుపెట్టారు.

మోటారులో ఒకవైపు నేను, ఇంకోవైపు సుశీలక్క కూర్చొని మధ్యలో బాపూజీని కూర్చొపెట్టాము. జుహూ

చేరటానికి ఎలాగూ ఒకగంట పడుతుంది. కనుక బాపూజీ నిద్రపోవచ్చు ననుకున్నారు. కాని నిద్రపోలేకపోయారు.

11 గంటలకు ఇల్లు చేరుకున్నాము. శాంతికుమార్ భాయీ భార్య సుమతి, బాపూజీ నుదుట కుంకుమ బొట్టుపెట్టి మాలవేసింది. సరోజినీదేవి అక్కడే ఉన్నది. ఆమె బాపూజీని కౌగిలించుకొన్నది.

నేనామెకు నమస్కారం చేశాను. వెంటనే ఆమె నోటినుండి ఈ మాటలు వెలువడినవి - "ఏం అమ్మాయీ! బామ్మ మనల్నందర్నీ విడిచిపోయింది కదూ? బా లేకుండ బాపూజీని ఒంటరిగ చూచి ఇవ్వేళ నా గుండెలు పగులుతున్నవి. ఆమె చనిపోయి, మూడు నెలల్లో బాపూజీకోసం జైలు తలుపులు తెరిపించింది. నాకు బామ్మ చివరి మాటలు వినాలని ఉన్నది. నువ్వు చాల అదృష్టవంతురాలివి చివరి వరకు ఆమె దగ్గరే ఉన్నావు. ఆమె కడసారి మాటలు విని ధన్యురాలి నౌదామనుకుంటున్నాను."

సరోజినీ అమ్మమీాద నాకు మొదటినుంచి పూజ్యభావం ఉండనే వున్నది. ఆమె స్నేహ స్వభావము, ప్రేమ వాక్కులు నన్ను మరింత ముగ్ధురాలిని చేసినవి.

బామ్మకూ, సరోజిని అమ్మకూ మధ్యనఉన్న ఆత్మీయత వివరించటం ఇక్కడ అప్రస్తుత మౌతుంది. ఇంక నేను సామాన్లుకూడ సరిగా సర్ది పెట్టలేదు. కాని ఆమె అన్న మాటలు మరచిపోతానేమోనని వెంటనే డైరీలో రాసిపెట్టుకున్నా.

బాపూజీ అరగంటలో అందర్నీ కలుసుకొని మాట్లాడి మాలిష్ చేయించుకోటానికి వెళ్ళారు. నేనాయనకు భోజనం ఏర్పాటుచేసే పని చూడడానికి వెళ్ళాను.

సుమారు 11-30 గంటలకు బాపూజీ పనులన్నీ ముగించుకొని విశ్రాంతిగా పడుకున్నారు. నేను కాళ్ళకు నేయి రుద్దుతున్నాను. అప్పుడు నాతో ఈ విధంగా నన్ను గురించి తన భావం వెలిబుచ్చారు :

"ఇవ్వేళ నిన్ను గురించి వాస్తవంగా చింత కలుగు తున్నది. నన్ను ప్రభుత్వం ఎన్నాళ్ళు బయట ఉండనిస్తుందో తెలియదు. ఈసారి నన్ను నిర్బంధంలో పెడితే నిన్నుగాని, సుశీలనుగాని ప్రభుత్వం నాతో ఉండనివ్వదు. కానీ సుశీల డాక్టరు గనుక ఒకవేళ ఉండనిస్తే ఆమెను ఉండనివ్వవచ్చు నేమో! కంసాలివాని దగ్గర మంచిబంగారం వున్నప్పటికీ దానికి ఏ ఆకారం కల్పించాలా, అనేదాన్ని గురించి ఆలోచిస్తూ వుంటాడు. అదేవిధంగా నిన్ను గురించి ఇప్పుడు నేను చింత పడుతున్నాను. నీ చదువు సరిగా సాగాలి. ఇప్పుడు నేను జైలులోంచి బయటపడ్డప్పటికీ అనుకున్నట్లు నీకు చదువు చెప్పటం నాకు సాధ్యం కాదు. జైల్లోఅయితే వేరే పనేమీ వుండేదికాదు. ఇప్పు డలా కాదు. ఎంతోపని, లెక్కలేనన్ని ఉత్తరాలు, ఎడతెగకుండా వచ్చి మాట్లాడి పోయేవాళ్ళు. ఒక్క నిమిషం కూడా నేను తీరిక చేసుకోలేను. ఈ పరిస్థితి చూచి నువ్వు భయపడకూడదు. నీ మనస్సును నానుంచి మళ్ళించుకొని వేరుచేసుకోవాలి. దానికి నువ్వు సిద్ధపడగలవనే ఉద్దేశంతో ఈ సంగతులు నీకు చెబుతున్నాను. దీనికి అర్థం

ఇవ్వేళే నిన్ను పంపించివేస్తానని కాదు. నీకు నేను తల్లినై నాను కనుక, ఇతర విషయాల పరిష్కారంకోసం నేను ఆలోచించి ప్రయాసపడుతున్నట్లుగానే నీ విషయం కూడ పరిష్కరించ టానికి నేను ఆలోచిస్తూంటాను. నెయ్యి రుద్దిన తరువాత ఇప్పుడు నేను చెప్పిన మాటలన్నీ నువ్వు రాసి నాకు చూపించు. తరువాత జయ సుఖలాల్‌కు కరాచీకి ఉత్తరం రాయి. అతనుకూడ ఈ విషయంలో నాకేదైనా ఉపాయం సూచించగలుగుతాడు."

ఈ మాటలు చెప్పిన తరువాత బాపూజీ పది నిమి షాలు నిద్రపోయినారు. నేను మా నాయనగారికి ఉత్తరం రాసి దానిలో బాపూజీ చెప్పిన పై మాటలన్నీ వివరించాను. కాని, ఆ మాటలు యథాతథంగా పూర్తిగా ఉదహరించ లేకపోయాను. ఎందుకంటే బాపూజీ త్వరగా నిద్రలేచారు లేచిన వెంటనే వేడినీళ్ళు, తేనె త్రాగే అలవాటున్నందున అవి తీసుకురావటానికి నేనా ఉత్తరం ఆదరాబాదరా ముగిం చాను. కాని లేచి వెళ్ళేటప్పుడు బాపూజీ నన్ను కూర్చోపెట్టి ముందు ఆ ఉత్తరాన్ని పూర్తిచేసి తరువాతనే నీళ్ళూ తేనె తెమ్మనిచెప్పారు. అలాగే ఉత్తరం పూర్తిచేసి బాపూజీ చేతి కందించాను. తరువాత వేడినీళ్ళూ, తేనె తెచ్చిచ్చాను.

నా విద్యాభ్యాసాన్ని గురించీ, శీలనిర్మాణాన్ని గురించీ బాపూజీ ఎంత శ్రద్ధవహిస్తున్నదీ ఈ రోజున నేను తెలుసుకో గలిగాను. వేడినీళ్ళు, తేనె పుచ్చుకోటానికి ఆయన పది నిమి

చాల ఆలస్యం సహించినప్పుడు నన్ను గురించిన చింత ఆయ నకు ఎంతెక్కువగా వున్నదీ నాకు స్పష్టపడింది.

దర్శనంకోసం వచ్చినవాళ్ళ గుంపు పగలంతా గేటు దగ్గిర కాచుకొనివున్నది. కాని ప్రార్థన సమయంలోనే అందర్నీ లోపలికి రానివ్వాలని నిర్ణయించటం జరిగింది.

సాయంకాలం సూర్యు డస్తమిస్తున్న సమయంలో జుహూ తీరాన ఒకవైపు పశ్చిమసాగరమూ, రెండవవైపు భక్తజన సాగరమూ ఉప్పొంగుతుండగా బాపూజీ దైవ ప్రార్థన జరిపారు. 21 నెలల తరువాత ప్రజలకు బాపూజీ దర్శనం లభించింది. పార్థన అయిన తరువాత ఆయనకు సమ ర్పించిన పండ్లను పిల్లలకు పంచిపెట్టారు. హరిజననిధి వసూలు చేశారు. ఇంటికి తిరిగివచ్చి కొంచెంసేపు నడిచారు. తొమ్మిది గంటలకు పాలు తాగి, కుటుంబీకులతో మాట్లాడి నిద్రపోయి నారు.

ఈ విధంగా బొంబాయిలో మొదటి రోజు గడిచి పోయింది.

జుహూ,
15-5-'44

బాపూజీకి కావలసినంతగా విశ్రాంతి చిక్కటంలేదు. ప్రజలు బారులుతీరి వస్తూనేవుంటారు. ఆయన వారినిచూచి మాట్లాడకుండా ఉండలేరు. అందువల్ల చూడవచ్చిన వారిని అదుపులో ఉంచటానికీ, మితిమీరి పోయేటప్పుడు బాపూ జీనికూడ మందలించి హద్దులో పెట్టటానికి సామర్థ్యంకల చౌకీ

దారు ఎవరైనా ఉండటం అవసరమని డాక్టర్లు సూచన చేశారు. బాపూజీకి కలిగే కోపాన్నీ, ప్రజల నిందలనూ సహించగలగటం కొంచెం రాతిగుండె కలవారికితప్ప ఇతరులకు చేతగానిపని. అందరి దృష్టి సరోజినీ అమ్మపైకి ప్రసరించింది. ఈ భారాన్ని ఆమె సంతోషంతో స్వీకరించింది.

సాయంకాలం నేను బాపూజీకి కొన్ని ఉత్తరాలు చదివి వినిపిస్తున్నాను. అదే సమయంలో సరోజినీ అమ్మ వచ్చింది. ఆమె తనకు సహజమైన నవ్వు ముఖంతో - "ఇప్పుడీ పిల్లకు నేను అమ్మను మాత్రమేకాదు. మీకు కావలిదాన్నికూడా అయినాను, జాగ్రత్త! ఎవరైనా కూడని పనిచేస్తే చూడండి ఏంచేస్తానో!" అని గంభీరంగా అన్నది. ఆ మాటకు బాపూజీకూడ పకపక నవ్వారు.

ఆమె అందర్నీ తన వశంలో ఉంచుకున్నది, తన కర్తవ్యాన్ని దక్షతతో నిర్వహించింది. విజయలక్ష్మీ పండిట్, పద్మావతి సోదరి వంటివాళ్ళకు కూడ అమ్మ అనుమతి లేకుండా బాపూజీ దగ్గిరకు వెళ్ళటానికి వీలులేకపోయింది. ఆమె స్వయంగాకూడ పనిలేనిదే వచ్చేదికాదు. అమ్మ ఎవరికి చీటీ రాసిస్తే వాళ్ళు మాత్రమే లోపలికి వెళ్ళవచ్చు. ఇతరులెవరూ వెళ్ళటానికి వీలులేదు.

పగలంతా బాపూజీ ఏమేమి పనులుచేసిందీ, ఏయే ఆహారం పుచ్చుకున్నదీ అంతా డైరీలో రాసివ్వటానికి రాత్రిపూట నేనామె దగ్గిరకు వెళ్ళేదాన్ని. అప్పుడామె నాకేదో ఒకటి తినటానికి పెట్టకుండా తిరిగిరానిచ్చేదికాదు.

ఇంకొకరికి పెట్టటమంటే ఆమెకు ఎంతో సరదా. అలాగే వాత్సల్యంకూడ చూపించేది. ఇవ్వేళ రాత్రి ఆమెదగ్గిరకు వెళ్ళినప్పుడు "రోజూ నేనిక్కడ ఏదో ఒకటి తిని వెళు న్నాను, దీనికి బాపూజీ నన్నెప్పుడో చీవాట్లు పెట్టక మానరు" అన్నాను.

అందుకు సరోజినీ అమ్మ ఇలా అన్నది. "ఆ ముసలా యన నిన్ను చీవాట్లు పెట్టేటట్లయితే ఆయనతో 'చీవాట్లు పెట్టటానికి మీాకు శ్రమ కలుగుతుంది, కొత్తగా శ్రమ పడాలంటే సరోజినీ అమ్మ లిఖితపూర్వకమైన అనుమతి ఇవ్వటం అవసరం. ఎందుకంటే, మీారు ఆమెకు తెలియ కుండా శ్రమపడనని మాటయిచ్చారు. అందుకని నన్ను చీవాట్లు పెట్టదలచుకుంటే మొదట అమ్మ దగ్గర అనుమతి తెచ్చుకోండి' అని స్పష్టంగా చెప్పు."

ఈ విధంగా బాపూజీ సేవచేసే అవకాశంతోపాటు నాకు సరోజినీ అమ్మ ప్రేమజల్లుల ననుభవించే అదృష్టంకూడ లభించింది. దీనివల్ల నాకెంతో ఆనందం కలిగింది.

పూర్తి విశ్రాంతి పొందే ఉద్దేశంతో బాపూజీ నేటి నుండి 15 రోజుల మౌనవ్రతం అవలంబించారు.

జుహూ,
17-5-'44

మనస్సుకు ఆనందం కల్పించేందుకు రోజూ 4 నుండి 6 గంటల లోపల మంచి గాయకుని సంగీతం ముఖతః వినటానికి బాపూజీ అంగీకరించారు. అందువల్ల ఈ రోజు

శ్రీ ఝవేర్‌చంద్ మేఘాణీగారు సంగీతం పాడటానికి వచ్చారు. ఆయన రచించిన పాటలే ఆయన పాడి వినిపించారు. బాపూజీ సంతోషించారు. ఆయన తలపాగా చూచి, బాపూజీ - 'నాకు నా తలపాగా జ్ఞాపకం వస్తున్న'దన్నారు. మేఘాణీగారు చాలా శ్రద్ధా భక్తులతో గానం చేశారు.

బొంబాయిలో స్టీమరు బద్దలైనప్పుడు దాన్ని చూడటానికి బాపూజీ, మేము కలిసి వెళ్ళాము. అది చాలా భయంకరమైన సంఘటన.

## ౩౯
## అహింసకు చిహ్నం చర్ఖా

జుహూ

**20-5-'44**

జైలులో ఉన్నంతవరకు బాపూజీ తన గాంధీ కుటుంబానికి చెందిన బంధువులకు తప్ప ఇతరుల కెవ్వరికీ ఉత్తరాలు రాయకూడదని ప్రభుత్వం నిబంధన విధించింది. అందువల్ల, ఆయనెవరికీ ఉత్తరాలే రాయనని ఒట్టుపెట్టుకొని 21 నెలల వరకు నిభాయించారు. ఇప్పుడు ఆ వ్రతానికి పూర్ణాహుతి చేసి, నారాయణదాసు కాకాకు నన్నుగురించి ఒక ఉత్తరం రాశారు. దానికి నకలు నా దగ్గిర ఉంచుకోమన్నారు. ఆ ఉత్తరం మొదట చదివినప్పుడు దాని ప్రాముఖ్యం నాకంతగా తెలియలేదు. కాని ఇప్పుడు, ఇంగితజ్ఞానం తెలిసిన తరువాత అది స్పష్టంగా బోధపడుతోంది. వివేకవంతురాలైన ప్రతితల్లీ 14 మొదలు 16 సంవత్సరాల వయస్సుగల తన కుమార్తెకు

సౌశీల్యాన్ని అలవరచటం తన కర్తవ్యంగా భావిస్తుంది. ఎందుకంటే, ఈ మూడేండ్లలో కన్యలకు లభించే సంస్కార సంపత్తే వారికి జీవితమంతా సహాయకారిగా ఉంటుంది. బాపూజీ నాకు తల్లిగావుండే భారం తనపైన వేసుకున్నప్పటి నుండి జైలులో ఉన్నంతవరకు నా శిక్షణనుగురించి ఆయనకు చింతపడవలసిన అవసరం కలగలేదు. కాని ఈశ్వరుడు పరిస్థితిని మార్పుచేశాడు! దీనివల్ల ఈ దేశానికీ, లోకానికీ సంబంధించిన బాధ్యత బాపూజీ నెత్తిమీద పడింది. దానితో పాటు నా బాధ్యతనుకూడ ఆయన ఏవిధంగా నిర్వహిస్తున్నారో ఈ క్రింది ఉత్తరంవల్ల స్పష్టమాతున్నది.

జూహూ

20-5-'44

చి॥ నారాయణదాస్,

పడుకొనివుండే నీ కోసం వ్యాసం రాశాను. తప్పులు పడతావేమోనని భయపడ్డాను. కాని తప్పులు రాలేదు. దాన్ని మళ్ళీ సిరాతో రాసే ఓపిక లేకపోయింది. నా వ్యాసంలో అవసరమైతే మార్పులుచేసి తిరిగి పంపు. నీసవరణలు చూచి మరలరాసి పంపుతాను. ఇప్పుడు తీరికే గదా!

ఇంకొక సంగతి జయసుఖలాల్ కూతురు మనూబాను నువ్వెరుగుదువు. ఆ పిల్ల నాకు బాగా నచ్చింది. దానివలె స్వాభావికంగా సేవా పరాయణురాలైన పిల్లను మన కుటుంబంలో నేనెవర్నీ చూడలేదు. ఆమె శ్రద్ధాభక్తులతో బాకు సేవచేసి నా మనస్సును వశపరచుకున్నది. ఇప్పుడామె నా

దగ్గిరుండవచ్చును, కాని నాకిష్టంలేదు. ఇప్పుడు నాస్థితి పగిలి పోయిన పాత్రలావున్నది. ఆమెకు నేనేమీ ఇవ్వలేను. మిగిలిన వాళ్ళు తమతమ పనుల్లో మునిగివున్నారు. వాళ్ళేమీ చేయలేరు. ఆమె చదువు సక్రమంగా జరుగుతుండాలి. ఇది నీ దగ్గిరే సాధ్యమౌతుంది. మనూ నిన్ను బాధపెట్టే పిల్లకాదు. చాలా అమాయకురాలు. చక్కగా చదువుకుంటుంది. కంఠం కూడా బాగుంటుంది. శరీరం ఆరోగ్యవంతమైనదనే చెప్పాలి. కాని చదువుమీద మనసుంచినప్పుడు శరీరాన్ని గమనించదు. సేవ చేసేటప్పుడు సర్వమూ మరచిపోతుంది. ఈమెకు సంస్కృత, గుజరాతీ భాషల్లో మంచి యోగ్యత కలగాలని నా కోరిక. భగవద్గీత నేనే చెప్పాను. ఉచ్చారణ బాగున్నది. పురుషోత్తం గానీ, నువ్వుగానీ ఇంకా బాగా నేర్పవచ్చు. ఆమెకయే ఖర్చు కావాలంటే జయసుఖలాల్ పంపిస్తాడు. ఆమెను మీ సంస్థలో చేర్చుకొనేదీ, లేనిదీ టెలిగ్రాం ద్వారా తెలియజెయ్యి. ఎవరినైనా తోడిచ్చి వెంటనే పంపిస్తాను. ఆమెను తీసుకోటం వీలుపడకపోతే నిస్సంకోచంగా వెంటనే తెలియపరచు.

బాపూ ఆశీర్వచనాలు.

పై ఉత్తరంలో మొదట ప్రస్తావించిన వ్యాసం చర్ఖా జయంతిని గురించి బాపూజీ రాసింది. ఆ వ్యాసంలో కొంత భాగాన్ని ఇక్కడ ఉదహరిస్తున్నా :

"మీ వార్షిక రిపోర్టును పరిశీలనగా చదివాను. ఇంకా ఉత్తరాలు రాయటం ఆరంభించలేదు. రోగంతో వున్న

వాళ్ళకుమాత్రం మూడు ఉత్తరాలు రాశాను. దరిద్రుని పోలిన రోగిష్టి మరొకడుండడు. నువ్వు దరిద్రనారాయణులకు అనన్య భక్తుడవు గదా? నువ్వు నా జయంతికి చర్ఖా ద్వాదశి నడిపించి నీ సేవాపరాయణతను రోజురోజుకు వృద్ధి చేసుకుంటున్నావు. ఈయేటి కఠినపరీక్షలో భగవంతుడు నీకు విజయం చేకూర్చుగాక! మహల్ జైల్లో ఉండగా నాకీసారి మార్క్సు, ఏంగెల్సు రష్యాలో చేసిన ప్రయోగాలను గురించిన పుస్తకాలు దొరికినవి. వాటిని చదివాను కాని, ఆ ప్రయోగాలెక్కడ? మన చర్ఖా ఎక్కడ? అక్కడకూడ మన దేశంలోవలె ప్రజల నందర్నీ యజ్ఞంలో పాల్గొనవలసిందని కోరటం జరిగింది. కాని ఇక్కడికీ అక్కడికీ ఉత్తర దక్షిణాల కున్నంత భేదమున్నది. మన చర్ఖాకూ-ఆవిరితోను, విద్యుచ్ఛక్తితోనూ నడిచే వారి యంత్రాలకూ పోలికేలేదు. అయినప్పటికీ, తాబేటి నడకగల మనరాట్నమే నాకు ప్రియమైనది. రాట్నం అహింసకు చిహ్నం. చివరకు అహింసకే విజయం కలుగుతుంది. కాని రాట్నానికి పూజార్హమైన మనం మందకొడిగా ఉన్నామంటే అది మనకూ, మన అహింసకూ సిగ్గుచేటు. పరిశ్రమ ఉత్తమమైంది. దానిలో మనం కొత్తదనం తీసుకురావాలి. యంత్రాలకు శాస్త్రమున్నట్టే రాట్నానికి కూడా శాస్త్రమున్నది. దాని 'టెక్నిక్' ఇంతవరకు మనం సాధించలేదు. దానికి పరిశోధన అవసరం. శ్రద్ధలేని జ్ఞానం వ్యర్థమైనట్టుగా జ్ఞానంలేని శ్రద్ధ గుడ్డిది."

వేరే ఉత్తరంలో బాపూజి ఇలా రాశారు

"నా వ్యవహారమంతా ఇప్పుడు గందరగోళంగాఉన్నది. మహాత్ములకు మదం ఉండనివ్వడు భగవంతుడు. ఈవిషయాన్ని అందరూ బాగా తెలుసుకోవాలి. నేను ఉత్తరాలు రాయటం మొదలుపెడితే మాకంటే మాకని అందరూ అడుగుతారు. అందరికీ రాసేలోపల నా ఆరోగ్యం బాగుపడితే నేనే స్వయంగా సేవాగ్రాం చేరుకోగలుగుతాను. అభిలాష ఉన్న వారెవరైనా అక్కడి వివరాలు నాకు తెలియజేయవచ్చు.

బాపూ ఆశీర్వచనాలు.

పండిత మదనమోహన మాళవ్యాగారు బాపూజీని గంగాతీరానికి వచ్చి ఆరోగ్యలాభం పొందవలసిందని విజ్ఞప్తి చేశారు. ఆయన ఉత్తరానికి బాపూజీ హిందీలో యిలా బదులు రాశారు :

పూజ్యులైన అన్నగారికి,

ఈ ఉత్తరం రాయటానికి డాక్టర్లు అనుమతించారు. మీ ప్రేమకు తగిన పాత్రత నాకు లేదనుకుంటాను. మీ కోర్కెను తీర్చలేకపోతున్నానని నేనెరుగుదును.

దూర ప్రయాణానికి డాక్టర్లు సమ్మతించరు. నేను జైలు నిర్బంధంలో లేనని నాకే నమ్మకం కలగటంలేదు. ఈ జబ్బు వలన విడుదలపొందికూడా లాభంలేకుండా ఉన్నది. నయమైన తరువాత ఈశ్వరుడు నా క్షేమార్గము చూపిస్తాడో చూడాలి.

—మీ తమ్ముడు"

జుహూ,
22-5-'44

బాపూజీ ఉదయంపూట షికారుకు వెళ్ళినప్పుడు సముద్రపుటొడ్డున కుర్చీ వేసుకొని, కళ్ళు మూసుకొని 10, 15 నిమిషాలు కూర్చుంటున్నారు. ఈ సమయంలో ఆయనను చూడటానికి దూరదూరాలనుంచి జనులు వస్తున్నారు. కాని వారాయనకు శ్రమ కలిగించటంలేదు. ఇవ్వేళ బామ్మకు త్రైమాసిక తిథి. ప్రార్థనానంతరం గీతాపారాయణచేశాము. మీరాబహెన్ రామధున్‌తోపాటు "Wondrous Cross" అనే క్రైస్తవ భజనకూడా చేసింది. గత రెండు మాసికాల సమయంలో మేముచేసిన ప్రార్థన బాను ఉద్దేశించి చేసినట్లు మాకనుభవం కాలేదు. ఎందుకంటే ఆగాఖాన్ మహల్లో బామ్మ సదేహంగా లేకపోయినా అక్కడివాతావరణమంతా ఆమె పవిత్ర స్మృతితో నిండివుండేది. ఇక్కడ ఈ రోజుచేసిన ప్రార్థనలో బా, మహాదేవుల సమాధుల ఎదుట తలవంచి ప్రణామం చేయలేని నిస్సహాయస్థితి మాకందరికీ అనుభవగోచరమైనది. తిరిగి బా సమాధిని దర్శించే అదృష్టమెప్పుడు కలుగుతుందో, ఎవరికీ తెలియదు!

## ౪౦
## గజ్జెలు నేర్పిన పాఠం

జుహూ,
8-6-'44

ఎన్నో పనులున్నప్పటికీ బాపూజీకి నా చదువును గురించి చింత కలుగుతూనే వుండేది. కరాచీలోని శ్రీ శారదా

మందిరం కార్యదర్శిగారు నాపేర ఉత్తరం రాశారు. ఆయన నన్ను కరాచీకి రమ్మని ఆశగోల్పారు. అందువల్ల నేను చివ రకు రాజకోట్‌కు బదులుగా కరాచీ వెళ్ళటానికి బాపూజీ అనుమతించారు.

బొంబాయినుంచి కరాచీకి ఓడమీద వెళ్ళాలి. జైల్లో ఉన్నప్పుడు నేనూ, సుశీలక్క, ప్యారేలాల్జీ, డాక్టర్ గిల్డర్, మీరాబహెన్ అందరం కలిసిమెలిసి ఒకే కుటుంబంగా ఉండేవాళ్ళం. సుశీలక్క, ప్యారేలాల్జీగార్ల రెండవ సోదరునికి మొదటిసారి కూతురు పుట్టింది. ఈ సంగతి నా బంధువులకు కూడ తెలుసు. ఆ పిల్లకేదైనా బహుమానం పంపించవలె నని మేమనుకున్నాం. బొంబాయిలోని భూలేశ్వరంలో ఆ పసిపిల్లకు తగిన వస్తువు కొనటానికి బయలుదేరాము మేము. ఆ బజారులో మంచిమంచివాళ్ళే మోసపోతారు. మాకూ అలాగే అయింది. నేనొక వెండి గిన్నె, వెండి గజ్జెలు కొని ప్యాకింగుచేసి, నాకు వ్యవధిలేనందున ఒకరిచేతికిచ్చి సుశీ లక్క దగ్గరకు పంపించాను.

సుశీలక్క ఆ వస్తువులను బాపూజీకి చూపించింది. ఆయనకు చాలా కోపంవచ్చింది. వెంటనే శాంతికుమార్ భాయీ చేతికి ఆ వస్తువులూ, ఒక ఉత్తరమూ యిచ్చి ఓడ ఎక్కబోతున్న నాకు వాపసు చేయమని మోటార్లో పంపిం చారు. ఓడ బయలుదేరే కూతకూడ కూసింది. సరిగ్గా ఆ సమయంలో శాంతికుమార్ భాయీ వచ్చి "బాపూజీ ఈ పాకెట్ పంపించారు" అని చెప్పి నాకిచ్చి వెళ్ళారు. బాపూ జీని విడిచి వెళ్ళుతున్నందుకు నాకెంత దుఃఖం కలిగిందో

ఆయనకు తెలుసు. అందుచేత నన్ను సంతోష పరచే వస్తు వేదో పంపారని నేననుకున్నాను. వేరేవిధమైన ఊహ నాకు కలగటానికి అవకాశమే లేదు. కాని నేను ఊహించిన దానికి సరిగా విరుద్ధం జరిగింది. పరిణామం-జీవితానికొక కొత్తపాఠం!

కావలసిన వాళ్ళలో ఎవరికైన శిశువు జన్మించినప్పుడు దానికి దుస్తులుగాని, వేరేదైన వస్తువుగాని బహూకరించటం మా ఆచారం. ఈ అలవాటు - బహుమాన మిచ్చినవారికీ, తీసుకొన్న శిశువుకూకూడ మంచిదికాదని బాపూజీ రాసిన ఉత్తరంవల్ల నేను మొదటిసారి తెలుసుకో గలిగాను. ఆ ఉత్తరం అక్షరశః క్రింద ఇస్తున్నాను.

8-6-'44

"చి॥ మనూ,

నిన్నిప్పుడు మనూ అని పిలవటానికి బదులుగా మృదులా బహన్ అని పిలవవలసి ఉంటుంది. నువ్వు సరిగా బొంబాయిని కూడా విడిచిపోకముందే ఆజ్ఞాభంగం చేశావు. ఇలాయితే నేనిచ్చిన హితోపదేశాలను నువ్వేమి మన్నించగలవు? నువ్వు స్వయంగా ఒక్క దమ్మిడీ కూడ సంపాదించలేదు. నీకు ఉదార హృదయంగల తండ్రి దొరికాడు. అందువల్ల ఆయన రూపాయలను నువ్వు కళ్ళుమూసుకొని ఖర్చుపెడుతున్నావు. ఈ బహుమానం పంపించి నువ్వు పిల్లనుకూడా చెడగొట్ట దలచుకొన్నావా? కాని నేను చూస్తున్నంతవరకూ నువ్వా పని చెయ్యలేవు. వెండి గజ్జెలు, వెండి గిన్నె నీకు గొప్పగా తోస్తే, వాటిని నీదగ్గరే ఉండనియ్యి. లేదా నీ కక్కరలేక

పోతే నీవంటివారి కెవరికయినా యిచ్చెయ్యి. ఈ వస్తువులు నువ్వు నీ మూర్ఖత్వానికి చిహ్నంగా నీ దగ్గరే భద్రంచేసి ఉంచుకోవాలని నా కోరిక. వెండిగిన్నె, వెండి గజ్జెలు నీకు వాపసు పంపుతున్నాను.

దుఃఖంతో బాపూజీ చెప్పే "రామ్‌రామ్"

బహూకరించటానికి నాదగ్గరసిద్ధంగా ఏవస్తువూ లేకపోవటంవల్లనూ, ఆ శిశువుదగ్గర జ్ఞాపకార్థం ఏదైనావస్తువు ఉండాలని పెద్దలు చెప్పటంవల్లనూ నేను ఉత్సాహంతో ఈ గిన్నె, గజ్జెలు కొన్నాను. దీనివల్ల కలిగిన భయంకర పరిణామానికి నేను మనస్సులో ఎంతోకుమిలిపోయాను. కాని చేసినతప్పుకు ప్రాయశ్చిత్తంగా కరాచీ చేరేవరకూ నేను ఉపవాసం చేశాను. దీనిలో దుఃఖించవలసిన అవసరమేమీ లేదనీ, జీవితాని కిదొక పాఠమనీ నాకునేను సమాధానం చెప్పుకున్నాను.

కరాచీ ఓడరేవు చేరుకున్న వెంటనే నేను బాపూజీ రాసిన ఉత్తరం నాయనగారి చేతిలో పెట్టాను. ఆయన నవ్వారు. ఉత్తరంలో "దుఃఖంతో బాపూ చెప్పే రామ్ రామ్" అనీ, పైన "చి॥ మనుదీ"కి బదులుగా "మనూ" అని ఉండటంవల్ల నాయనాగారు నన్ను నిందిస్తారేమోనని అనుకున్నాను. కాని ఇక్కడకూడ అనుకోనిదే జరిగింది. మా నాయనగారు: "నువ్వు ఖర్చుపెట్టటం నాకు బాగానేఉన్నది. బాపూజీకి కోపం రావటం కూడా బాగానే ఉన్నది. ఎందుకంటే నువ్వెప్పుడూ ఇటువంటి పనిచెయ్యవు" అన్నారు.

కాని బాపూజీ "రామ్‌రామ్" అని రాయటం వల్ల ఈ ఉత్తరం చరిత్రాత్మకమైంది. ఇంటికి వెళ్ళిన వెంటనే బాపూజీకి ఉత్తరం రాస్తూ నా తప్పుకు క్షమాపణకోరాను. భవిష్యత్తులో ఇటువంటి తప్పుచేయనని మాటిచ్చాను. నా ఉత్తరంలో కిందివైపున నాయనగారు రెండు పంక్తులు రాశారు. "ఇటువంటి తప్పు చేయకుండా ఉండటానికి మనూ కింకా అంత వివేకం కలగలేదు. అదిచేసిన తప్పుకు నాకు సంతోషమైంది. ఎందుకంటే దానివల్ల జీవితం సుఖమయం కావటానికి వీలుచిక్కింది."

నా తెలివితక్కువతనానికి చిహ్నంగా పైనచెప్పిన రెండు వస్తువులు ఇప్పటికీ నాదగ్గరే ఉన్నాయి. ఆడుకోటం కూడారాని పసిబిడ్డకు వెండి ఖరీదైన లోహమని ఎలా తెలుస్తుంది? ఆ స్థితిలో మనం పాత అలవాటు చొప్పున అనవసరమైన ఖర్చుచేసి అందంగా కనిపించే వస్తువులను బహూకరిస్తాం. మనది బీదదేశం. పెద్దదయిన తరువాత ఆ శిశువు బీదది అవుతుందో లేక ధనవంతురాలౌతుందో ఎవరూ చెప్పలేరు. కాని మనం చిన్నప్పటినుంచే పిల్లల కిటువంటి వస్తువులు యిచ్చి గారాబంచేసి వాళ్ళను పనికిరాని వాళ్ళనుగా చేస్తున్నాం.

నేను శ్రమపడి తయారుచేసిన వస్తువును దేన్నైనా బహుమానంగా ఇచ్చినట్లయితే బాపూజీకి అభ్యంతరముండేది కాదు. పిల్ల పెద్దదై బుద్ధితెలిసిన తరువాత దాన్ని చూచి, అదికూడ అదేవిధంగా ఆచరిస్తుంది. కాని అలా చేయక

దగ్గరున్న డబ్బుతో ఇంపైన వస్తువును కొన్నాను. ఇది ఒక విధంగా నా సోమరితనం!

బాపూజీ ఆ వస్తువులను వాపసుపంపి ఊరుకోలేదు. మా నాయనగారిపేరకూడ ఉత్తరం రాశారు. మా నాయనగారు పెద్దవారై సంపాదన మొదలుపెట్టినప్పటినుండి, బాపూజీ ఆయన్ను ప్రతి దమ్మిడీకి లెక్క చెప్పమని అడిగే వారు. మా నాయనగారు మొదటినుంచి చివరివరకు లెక్క రాసి పంపించేవారు.

15-6-'44 వ తేదీన కరాచీలో మా నాయనగారికి బాపూజీ ఉత్తరమందింది. అందులో నన్నేవిధంగా జాగ్రత్తతో చూడాలో వివరిస్తూ హెచ్చరికచేశారు. ఆ ఉత్తరాన్ని యథాతథంగా యిక్కడ ఉదహరిస్తున్నాను.

12-6-'44

చి॥ జయసుఖలాల్,

నీకీ ఉత్తరం మనూ వెళ్ళిన వెంటనే రాయవలసింది, కాని రాయలేకపోయినాను. మనూ ఇక్కడినుంచి వెళ్ళే టప్పుడే నాకు చాలా నిరాశకలిగించింది. ఆమె తెలుసుకోవల సినదంతా తెలుసుకున్నదనీ, మాటప్రకారం నడచుకొంటుం దనీ నేననుకున్నాను. కాని నేను పొరపాటు పడ్డాను. ఆమె వెడుతూ వెడుతూ ప్యారేలాల్ తమ్ముని బిడ్డకు వెండిగిన్నె, గజ్జెలు కొని పంపింది. నాకు చాలా విచారం కలిగింది. ఆమెకు రాసిన ఉత్తరంలో నేను నా దుఃఖాన్నంతా ఒలకబోశాను. ఆ వస్తువులు వాపసు పంపించాను. ఇదంతా నువ్వు తెలిసి

కొనే ఉంటావు. నువ్వు జాగ్రత్తగా ఉండాలి. ఆమెలోని దోషాలు తొలగిపోయి, గొప్పగుణాలు బాగా వికసించాలని ఆశించి, నేనామెను ఒక సంవత్సరం రాజకోట్‌లో ఉండమని సలహాయిచ్చా. కాని మనూ అక్కడికి వెళ్ళటానికి ఉత్సాహం చూపించలేదు. కరాచీ ఉపాధ్యాయుని దగ్గరనుంచి ప్రోత్సాహకరమైన ఉత్తరం రావటంతోటే ఆమెకు పిచ్చెక్కినట్టయింది. అందువల్ల కరాచీకే పంపించాను.

నిన్నుగురించి నాకు తోచిన అభిప్రాయాన్ని నీతో చెబుతున్నా. నువ్వు మనూను కోటీశ్వరుల పిల్లలాగ డబ్బు వెదజల్లే దాన్నిగా తయారు చేశావు. నీ కంతడబ్బు ఎక్కడి నుంచి వచ్చింది? కూతుళ్ళమీద నీకున్న ప్రేమానురాగాలు నా దృష్టిలో గౌరవించదగినవే, కాని నీకింత ధనం ఎక్కడి నుంచి వచ్చింది, అనేదే ప్రశ్న! ఖాదీ పనిలో ఆదాయం ఉండదుకదా? ఇక నువ్వు చేసే ఉద్యోగంలో ఇంతడబ్బు మిగుల్చుకోటానికి వీలున్నదా? నీకు వచ్చే ఆదాయానికి, ఖర్చుకు లెక్కరాసి ఉంచావనుకుంటాను, నాకు దాన్ని చూడాలని ఉన్నది. నా మనస్సులో కలిగిన అనుమానం నీతో చెప్పకుండా దాచిఉంచలేను. నాకు కోపంవచ్చి శాంతి కుమారును దీన్ని గురించి అడిగాను.

"సింధియావాళ్ళవల్ల ఇంత ఆదాయం ఉండదు. జయసుఖలాల్‌ను అనుమానించటానికి అసలేవీలులేదు" అని అతడన్నాడు.

నువ్వు వెంటనే నాకు జవాబు రాయి. 'యుక్తి'*ని గురించి సుశీల ఉత్తరం రాసే ఉంటుంది. ఆమె సంగతి విచారిస్తూండు. మనూ కళ్ళు ఏమీ బాగాలేవు. జాగ్రత్తపడితేనే అవి బాగుపడతవి, లేకపోతే కొద్దికాలంలోనే రాయటానికి, చదవటానికికూడ కనిపించకుండా పోతాయి.

బాపూ ఆశీర్వాదాలు.

మానాయసగారు జమాఖర్చు లెక్కలు ఎప్పుడో పంపించేశారు. ఆయన దగ్గరున్న డబ్బులోంచి 10, 12 రూపాయలు ఖర్చుపెట్టటం ఏమంత కష్టంకాదని తెలుసుకున్న తరువాతనే బాపూజీ ఈ విషయాన్ని వదిలేసి ఊరుకున్నారు.

ఈ హంగామావల్ల నా మనస్సు చాలా నొచ్చుకున్నది. కరాచీ చేరిన వెంటనే నేను జబ్బునపడ్డాను. చిన్నతనంవల్ల నేనిలా ప్రవర్తించానని బాపూజీ తెలుసుకొని శాంతించారు. నేను క్షమాపణ కోరుతూ రాసిన ఉత్తరానికి వెంటనే బదులు రాశారు.

23-6-'44

చి॥ మనుడీ,

నువ్వు కరాచీ చేరిన వెంటనే జబ్బుపడటం నన్ను చలింపజేసింది. నేను చెప్పిన సంగతులను తు.చ. తప్పకుండా పాటించినట్టయితే నీకెన్నడూ జబ్బుచేయదు. చదువును గురించిన నీ నిర్ణయం బాగానే ఉన్నది. కాని పరీక్షతో నెగ్గాలనే ఉద్దేశంతోనే చదవటం పనికిరాదు. కళ్ళను కాపాడు

* నా పెద్దక్కగారు

కుంటూ వీలయినంతే చదువు. నీకు ధైర్యం తక్కువ. సాధారణంగా పిల్లలుఅలాగే వుంటారు ఐనా నువ్వు ధైర్యం తెచ్చుకుంటావనే ఆశిస్తున్నా. నీలో నాకు కనిపించిన మంచి గుణాలు అందరిలోనూ కనిపించవు. ఇన్ని మంచి గుణాలున్నప్పటికీ రవ్వంత దోషం కనిపించినాసరే, అది నాకు కొండంతగా కనిపిస్తుంది. దాన్ని నేను సహించలేను.

బాపూ ఆశీర్వాదాలు.

అప్పుడే మా నాయనగారికి కూడ ఉత్తరం వచ్చింది. అందులో ఇలా ఉన్నది :

**23-6-'44**

చి॥ జయ్‌సుఖలాల్,

నువ్వు రాసిన రెండుత్తరాలు అందినవి. కావలసిన వివరాలన్నీ రాశావు. మంచిది. దీన్ని గురించి తరువాత ఎప్పుడైనా నీకు రాస్తాను. మనూను రాజకోట్ పంపించ వలసిన అవసరంలేదు. కరాచీకికూడ నా అనుమతితోనే వచ్చింది. జబ్బు నయమైన వెంటనే చదువు ఆరంభం చేయమను. పరీక్షలో నెగ్గటానికి తొందరపడవొద్దను. ఇంటి పనులుచేయటం కూడ వచ్చును గనుక, రోజూ కొంతపని తాను చేయాలి. ఉద్యోగంవల్ల ఎక్కువ డబ్బురానప్పుడు ఇంట్లోవాళ్ళందరూ పనిపాటలు చేసుకోవలసి వుంటుంది. అక్కడకూడ ఎప్పుడూ రోగంతోనే ఉన్నట్లయితే సేవాగ్రాం పంపించివేస్తాను. కాని నేను చెప్పినట్టు నడుచుకున్నట్లయితే జబ్బునపడట మనేదే ఉండదు. అక్కడి వైద్యుడిచ్చే మందులవల్ల 'యుక్తి' కిలాభం

కనిపిస్తున్నట్టయితే మనూకు కూడ ఆయన దగ్గరే మందు వాడవచ్చు. మనూ శరీరం ఆరోగ్యమైనదే. అజాగ్రత్తవల్ల చెడగొట్టుకోకూడదు. కండ్లను కాపాడుకుంటూ చదువు సాగించుకోవాలి.

బాపూ ఆశీర్వాదాలు

## ౪౧

## తిరిగి సేవాగ్రాం

బాపూజీ ఆరోగ్యంకోసం పంచగని వెళ్ళారు. నేను కరాచీ వచ్చాను. నాకూ, తల్లివలె నన్ను కాపాడుతున్న బాపూజీకీ మధ్య కొన్ని వందలమైళ్ళ దూరం ఉన్నది. తల్లి బిడ్డను విడచి దూరాన ఉన్నప్పుడు ఆమెకు బిడ్డను గురించిన చింత దగ్గరున్నప్పటికంటె ఎక్కువగానూ, గాఢంగానూ ఉంటుంది. ఆ కారణంచేత దూరాన వున్నప్పటికీ ఆయన అక్కడినుంచే నా చదువు సంధ్యలు సూక్ష్మంగా గమనిస్తు న్నారు. తన ఆరోగ్యం విషయంలోనూ, దేశ వ్యవహారాల విషయంలోనూ ఇంత శ్రద్ధ చూపడం లేదు. నాకు రాసిన ఉత్తరంతోపాటు నాకు చదువు చెప్పే మాస్టరుగారికి కూడ బాపూజీ స్వయంగా ఒక ఉత్తరం రాశారు. అందులో ఆయన ఇంగ్లీషు ఉచ్చారణ, స్పెల్లింగ్, సంస్కృత వ్యాక రణం, సంధులు, గుజరాతీ భాష, గణితం, బీజగణితం, రేఖా గణితం, విజ్ఞానశాస్త్రం - ఈ విషయాలన్నీ చిలుకమాదిరి

కంఠస్థంచేయకుండా అర్థజ్ఞానంతో నేర్చుకోవలసి ఉంటుందని నొక్కి చెప్పారు. అంతేగాక ఈ నెలలో ఇంతవరకూ నేను చదివిన చదువులో ఎంత అభివృద్ధి సంపాదించానో ఆ వివరాలు రాసి పంపమన్నారు. నన్ను బాపూజీ తల్లితో సమానంగా ఎంత అక్కరగా లాలించేవారో స్పష్టంచేయగల ఉత్తరాలు కొన్ని నా దగ్గరున్నవి. వాటిలోనుంచి కొన్నిటిని యథాతథంగా - ఇక్కడ ఉదహరిస్తున్నాను.

పంచగనీ,
6-7-'44

చి॥ మనుదీ,

నీ ఉత్తరం బాగున్నది. నువ్వు మొదలుపెట్టినపని ఉత్తమమైనదే, కాని దానివల్ల నీ చదువుకు ఆటంకం కలుగుతుంది. ఆటంకం కలగటంకూడ మంచిదే! ఎందుకంటే దానివల్ల నీ కండ్లు బాగుపడతవి. కండ్లకు హానికలగకుండా ఎంత సాధ్యమైతే అంతే చదువుకో. సేవాసక్తి నీకు ఈశ్వరుడే ప్రసాదించాడు. అందువల్ల ఆ పని నీకు సులభసాధ్యమే. అనవసరమైన ఖర్చులుమానెయ్యి. బీదలు ప్రతి వస్తువును భద్రంగా కాపాడుకుంటారు. నువ్వుకూడ అలాగే చెయ్యాలి.

బాపూ ఆశీర్వచనాలు

నాకూ, మా అక్కకూ, మందిస్తున్న వైద్యుడికీకూడ బాపూజీ ఉత్తరాలు రాశారు. వైద్యుడికిరాసిన ఉత్తరంలో- ఆయన మందువల్ల మాకు ఒంట్లో బలం వచ్చిందో, లేదో; మేము సరిగా మందు తింటున్నామో, లేదో; ఆయుర్వేద ఔషధం మా రోగంమీద పనిచేస్తున్నదో, లేదో; దానివల్ల

ఎంతవరకులాభం కలిగిందో వివరంగా తనకు రాయమన్నారు. ఆయన ఉత్తరం మూలాన, పాపం, ఆ వైద్యుడు మమ్మల్ని గురించి చాలా చింతపడుతుండేవాడు. కాని నాకు పాలు ఇష్టం లేక తాగకపోవటంవల్ల ఆయనకు దిగులెక్కువైంది. ఆ సంగతి ఆయన నాకు తెలియకుండా బాపూజీకి రాశారు. అందువల్ల బాపూజీ నాకీ ఉత్తరం రాశారు.

పంచగనీ,
17-7-1944

చి॥ మనుడీ,

పాలంటే నీకున్న అయిష్టతను నువ్వు పోగొట్టుకోవాలి. వైద్యుడెన్ని పాలు తాగమంటే అన్నీ రుచిగా తాగాలి. నా దగ్గరున్న తరువాత రుచి, అరుచి అనేవి ఉండకూడదు. తినవలసిన వస్తువు రుచిగానూ, తినకూడని వస్తువు అరుచిగాను ఉన్నట్టు భావించాలి. 'యుక్తి'కి జబ్బు పూర్తిగా నయమై ఆరోగ్యం కుదిరితే ఆయుర్వేద వైద్యులమీద నాకు నమ్మకం దృఢమౌతుంది. నీ కండ్లు నయమై, మలేరియా రూపుమాసి నట్టయితే ఆ మందు వైద్యుణ్ణి అడిగి నాకుకూడ పంపించు.

నీ అక్షరాలు అందంగానే ఉన్నవని చెప్పవచ్చు, కాని ఇంకా బాగా కుదురుగా వుండాలి. సుశీల ఢిల్లీ వెళ్లింది. అందుకనే ఆమె దగ్గరినుండి నీకు ఉత్తరం ఆలస్యంగా వస్తుంది.

దేవదాస్ అక్కడికి రావటం మంచిదే.

బాపూ ఆశీర్వచనాలు.

నా చదువుమూలాన పూర్తిగా విశ్రాంతి తీసికోటానికి వీలుపడటంలేదు. నాతోకూడ చదువుతున్న పిల్ల మెట్రిక్‌లో ఉన్నది. నేను దానికన్న వెనకపడితే బాగుండదు. అందువల్ల విశ్రాంతి మానేసి చదువుమీదనే నా దృష్టిని నిలిపాను. అందువల్ల బలవటానికి బదులుగా శరీరంలో బలహీనత యెక్కువైంది. నన్నుచూచి వైద్యుడు చాల భయపడి నా అశ్రద్ధనుగురించి బాపూజీకి రాశాడు. బాపూజీ నన్ను చివాట్లుపెడుతూ ఉత్తరం రాశారు.

పంచగనీ,
27-7-'44

చి॥ మనుదీ,

నీ బరువు 87 పౌన్లకు తగ్గిపోవటం సిగ్గుపడవలసిన విషయం. (ఆగాఖాన్ మహల్లో 106 పౌన్లు ఉండేది) రాత్రి 2 గంటలవరకూ చదవటమంటే పాపంచేసినట్టే! పరీక్షలో నెగ్గాలని నువ్వు దీక్షపూనినట్టయితే అటువంటి చదువు నీకొద్దు. నేను పెట్టిన నియమాలను నీవు పాటించలేకపోతే వెంటనే నా దగ్గరికి రావలసి ఉంటుంది. నువ్వీ విధంగా చదవటంకంటే చదువులేకుండా ఉండటమే నాకిష్టం. మందుకూడ నియమంగా తినటంలేదట, ఎందువల్ల? దీన్నిబట్టి నేనేమని అర్థంచేసుకోవాలి?

బాపూ ఆశీర్వచనాలు

చివరకు ఆగస్టు రెండోవారంలో మా పెద్దక్క ఆరోగ్యం బొత్తిగా చెడిపోవటంవల్ల ఉన్నట్టుండి నేను బొంబాయి పోవలసివచ్చింది. బాపూజీకూడ అదే సమ

యంలో బొంబాయికి రాబోతున్నారని తెలిసింది. ఆయన కోసం అక్కడ నేనొక రోజంతా కాచుకొని ఉన్నాను. నన్ను చూడటంతోటే ఆయన: "ఇప్పుడు కరాచీ వెళ్ళనక్కర లేదు. నాతోకూడ సేవాగ్రాం రావాలి" అన్నారు

ఈ విధంగా నేను బాపూజీతో కలిసి తిరిగి సేవాగ్రాం వెళ్ళాను.

సేవాగ్రాం వెళ్ళిన తరువాత బాపూజీ, సుశీలక్కల పర్యవేక్షణలో నా ఆరోగ్యం మళ్ళీ చక్కబడ్డది. ఇక నేను కరాచీ పోనన్నాను. సుశీలక్క సేవాగ్రాంలో ఒక నర్సింగ్ క్లాసు నడుపుతుంటే దానిలో చేరాను. సేవాగ్రాంలో ఒక వైద్యశాలకూడ పనిచేస్తున్నది. ఇరుగు పొరుగు గ్రామాల వారికి అది చాల ఉపకరిస్తున్నది. ఆరు వారాల ప్రాథమిక చికిత్స(First Aid Course)శిక్షణక్రమం బాపూజీ స్వయంగా తయారుచేశారు. మొత్తం మూడు సంవత్సరాల శిక్షణ ఇవ్వటానికి నిర్ణయం జరిగింది. బాపూజీ తయారుచేసిన శిక్షణ క్రమం ఉన్నదున్నట్లు ఈ కింద వివరిస్తున్నాను :

ఆరు వారాల ప్రాథమిక చికిత్సా శిక్షణ క్రమం.

1. శరీర భాగాల వర్ణన: దీనిలో పొట్టలోని భాగాలు-ముఖ్యమైన ఎముకలు, నరములు ఉంటాయి.

2. సాధారణమైన గాయాలు : యుద్ధభూమిలో తగిలే గాయాలు - వాటి వర్ణన - వాటికి సంబంధించిన పట్టీలు - తలమీద, పొట్టమీద, వ్రేళ్ళ మీద, కాళ్ళమీద మొదలైనవి.

3. రక్తస్రావపు చికిత్స : ట్రయినింగు - ఇతర సాధారణ ఉపాయాలు (ఉదా, ఇసుక ద్వారా)

4. హాస్పిటలు పరికరాలు లేనప్పుడు ఉపయోగపడే ఇతర సాధనాలు - ఉదా : వేడినీళ్ళకు బదులు వెలిబూడిద, కాల్చిన కాగితం కాల్చిన దూది, ఫ్లానెల్‌కు బదులు న్యూస్ పేపర్, కాగితాలు మొదలైనవి.

5. నీటమునిగిన మనిషి, తేలు-పాము కాటుకు, డాక్టరు లేనప్పుడు చేసే నాటు వైద్యం, వేరే ఉపాయాలు.

6. గాయపడిన వారిని, రోగులను తీసికుపోవటానికి స్ట్రెచర్ డ్రిల్, స్ట్రెచర్ దొరకనప్పుడు ఇతర సాధనాలు.

7. వేల సంఖ్యలో నడిచే మనుష్యుల మార్చింగు నియమాలు, పద్ధతులు.

8. యుద్ధభూమిలో ఆకస్మికంగా డేరాలు వేయటం, నీటిసదుపాయాలు చేయటం, మలమూత్ర విసర్జనకు ఏర్పాట్లు; వంటశాల బందోబస్తు.

పై వివరణంలో అన్నీ లేకపోవచ్చు, కెల్లీ గారి పుస్తకంలో వున్నవి చాలవరకు దీనిలో వున్నవి; 'సెంట్ జాన్స్ ఆంబులెన్స్' నుండికూడ చాలా విషయాలు గ్రహింపబడినవి.

ఈ ప్రకారం మొదటి ఒకటిన్నర నెలలో ఇవ్వవలసిన శిక్షణ క్రమమూ, శిక్షణ యిచ్చిన తరువాత నియమానుసారం పరీక్ష నడిపే పద్ధతీ నిర్ధారణ చేశారు బాపూజీ.

మానదినం కావటంవల్ల ఆయన పై విషయాలను లిఖిత పూర్వకంగా తెలియజేశారు. ప్రౌఢ శిక్షణకు పాఠ్యక్రమం సుశీలక్క నిర్ణయించింది.

## ౪౧
## బాపూజీ పాటించిన అహింస

నేను ప్రతిదినం పొద్దున 9-11 గంటల వరకు వైద్య శాలలో పనిచేస్తుండేదాన్ని. రోగుల ఉపచారంకోసం అప్పు డప్పుడు అక్కడుండవలసి వచ్చేది. మధ్యాహ్నం మూడున్నర గంటలకు బాపూజీకి పంఖావిసరటానికి వెడతాను. ఆ సమ యంలోనే ఆయన్ను కలుసుకునేవాళ్ళు వచ్చేవాళ్ళు. అందు వల్ల నాకెన్నో సంగతులు తెలుస్తూండేవి.

ఇవ్వాళ బీహార్ మంత్రి డాక్టరు సైయద్ మహమూద్ గారు వచ్చారు. ఆయన జబ్బుతో వున్నందున బాపూజీ ఆయన్ను ఆశ్రమంలో వుండమన్నారు. ఆరోగ్యం కోసం డాక్టర్లు ఆయన్ను 'చికెన్ సూప్'(కోడిమాంసపు పులుసు) మొదలైనవి తినమని ప్రత్యేకంగా సలహా యిచ్చారు. ఆశ్ర మంలో అలా తినటం సాధ్యంకాదు కనుక మహమూద్‌గారు వినయపూర్వకంగా ఆ మాంసాహారం తనకు వద్దన్నారు. కాని బాపూజీ ఆయన మాటకు ఒప్పుకోలేదు.

డాక్టర్ మహమూద్‌తో బాపూజీ ఇలా అన్నారు : "మీకు చికెన్ సూప్ చక్కగా తయారుచేయించి ఇప్పి స్తాను. దాన్ని తయారుచేయటం ఆశ్రమవాసులకు తెలియాలి.

(నావైపుచూచి) ఈ అమ్మాయికి సూప్ తయారుచేయటం తెలియదు. వేరే ఒక బెంగాలీ పిల్లవున్నది. సూప్ బాగా కాచి యివ్వమని ఆ పిల్లతో చెప్తాను. మీరు వలదన్నా నేను వినను. (పరిహాసంగా) నేను ఆజ్ఞాపిస్తున్నాను. నేను కూడా మంచి డాక్టర్‌నే! మీరు నా రక్షణలోవుండాలి. నేను చెప్పినట్టు వింటే మీ ఆరోగ్యం ఎంతబాగుపడుతుందో చూడండి."

ఈ విధంగా డాక్టరుగారిని ఇక్కడే వుంచి ఆయనకు అవసరమైన ఆహారం సమకూర్చే ఏర్పాటుచేశారు.

నా కెంతో ఆశ్చర్యం కలిగింది. కాయగూరలు వుడికించి సాత్వికాహారం తినే ఆశ్రమంలో 'చికెన్ సూప్' తయారుచేయటమా? దీన్నిగురించి నేను బాపూజీని ప్రశ్నించాను. అందుకాయన నవ్వుతూ "ఆశ్రమంలో నువ్వు నేర్చుకోవలసిందిదే" అన్నారు.

బీహార్‌లో జరిగిన మతకలహాల సమయంలో బాపూజీ పాట్నా వెళ్ళినప్పుడు డాక్టర్ మహమూద్ గారికి అతిథిగా ఉన్నారు. ఆయన నన్ను తన కుమార్తెగా భావించి నాకేమి కావలెనో విచారించేవారు. కొంతకాల మయిన తరువాత ఆయన నాకు రాసిన ఒక వుత్తరంలో తాను సేవాగ్రాంలో వున్నప్పటి సంగతి జ్ఞాపకంచేశారు. ఆ వుత్తరంలోని సంగతులు ప్రస్తుత సందర్భానికి సంబంధించి నంతవరకు కింద వుదహరిస్తున్నాను :

"బాపూజీకి సంబంధించిన ప్రతివిషయం నాకు ఎంత ప్రియమైనదో నేను నీకు ప్రత్యేకంగా రాయనక్కరలేదు.

అటువంటప్పుడు ఆయన పిల్లలుకూడా నాకు అత్యంత ప్రియమైనవారని వేరే చెప్పవలెనా? బాపూజీ నన్ను ఎంతగా ప్రేమించేవారో నీవెరుగుదువు కదా? ఆయన నాకు ప్రాణ మిత్రులేకాదు తండ్రివంటివారు. ఆయన పరమపదించిన తరువాత నేనీలోకంలో ఒంటరిగా మిగిలిపోయినట్లు అనిపిస్తున్నది.

"నేను జబ్బుతో ఆశ్రమంలో వున్నప్పుడు డాక్టర్లు నన్ను 'చికెన్ సూప్' తినమని సలహా చెప్పటం, బాపూజీ నాకు ఆ సూప్ తయారుచేయించి ఇప్పించటం, బహుశః నీకు జ్ఞాపకముండివుంటుంది. సేవాగ్రాం ఆశ్రమానికి అది నూతనమైన విషయం. అందువల్ల ఆశ్రమంలో సహజంగా కొంత అలజడి ఏర్పడింది. నేను బాపూజీ మాటకు ఒప్పుకోలేదు. 'చికెన్ సూప్' తిననంటే తిననన్నాను. కాని ఆయన ససేమిరా అన్నారు. 'డాక్టరు చెప్పినప్పుడు తినితీరవలసిందే' అన్నారు. "ఆశ్రమవాసులు స్వయంగా మాంసం తినకపోవచ్చు, కాని తప్పనిసరి అయినప్పుడు ఇతరులకు ఎలా వండిపెట్టవలెనో వాళ్ళకు తెలియాలి" అన్నారు బాపూజీ. దీన్ని నేను మహాభాగ్యంగా భావించుకున్నాను. ఈవిధంగా ఆయన నా హృదయాన్ని చూరగొన్నారు ... "

* * *

సుమారు 4 .గంటలప్పుడు కథియవాడ్ సంస్థానంనుండి కొందరు కార్యకర్తలు వచ్చి భావనగర్ పరిస్థితి వర్ణించారు అక్కడ నేతి వ్యాపారంమీద సర్వాధికారం (Monopoly) జరుగుతున్నట్లు వాళ్ళు చెప్పారు. "మహారాజుగారు మంచి

వారే. మేము చెప్పినదంతా వింటారు. కాని ఆయనమాటేమీ చెల్లటంలేదు. ఇప్పుడు మేమేమి చేయాలి ?" అని ఒక కార్యకర్త అడిగాడు.

బాపూజీ :- మీరు చెప్పేదంతా నిజమైనట్టయితే సత్యాగ్రహం అవలంబించి తిరుగుబాటు చేయండి.

కార్యకర్త :- నేను వంటరిగా తిరుగుబాటు చేసేదా ?

బాపూజీ:-సంస్థానంలో అధికారులు ప్రజలనుపీడించుకొని తింటున్నారని ఒక్క మనిషి భావించినప్పటికీ, అతని కొక్కడికే ఆవేశం కలిగినప్పటికీకూడా సత్యాగ్రహం చేయవలసిందే. ఈ విషయంలో నాకు చాలా పట్టుదల వున్నది. మీరు స్వార్థమేమీ లేకుండా లోకోపకారం కోసమే చెపుతున్నట్లయితే భావనగర్‌లోని జనులంతా మీతో తప్పక సహకరిస్తారు. అక్కడి ప్రజలు చదువుకున్నవాళ్ళు. పట్టణీగారు ఈ విషయం అర్థం చేసుకోగలరు. ఆయన నాతో దీన్ని గురించి చాల సంగతులు చెప్పారు. నా మాట కొంతవరకైనా ఆయన వింటారని నా నమ్మకం. దీన్నిగురించిన వివరాలన్నీ నాకు రాసి పంపినట్టయితే నేనాయనకు తెలియజేస్తాను."

* * *

భణ్‌సాలీ కాకాగారు చిమూర్ గ్రామంనుండి కొందరు బాలికలను ఆశ్రమానికి తీసికొనివచ్చారు. వాళ్ళు వచ్చి రెండు మూడు రోజులైంది. వాళ్ళ నాదరించేపని ఆశ్రమంలోని ఒక వయస్కురాలైన మహిళకు ఒప్ప

గించారు. కాని ఆ పిల్లలు మా వైద్యశాలలోనే వున్నారు. భణ్సాలీ కాకా, ప్రభాకర్ జీ వాళ్ళను చూస్తున్నారు.

బాపూజీ చిమూర్ నుంచి వచ్చిన పిల్ల లెక్కడుంటు న్నారనీ, వాళ్ళ నెవరు గమనిస్తున్నారనీ నన్నడిగారు. కాని నాకు వాళ్ళను గురించి ఎక్కువగా తెలియకపోవటంవల్ల సహజ భావంతో తెలిసినంతవరకు చెప్పాను.

వెంటనే భాయీతోనూ, మరికొందరు మహిళల తోనూ బాపూజీ ఇలా అన్నారు : "రామ్‌దాస్ పిల్లలుగాని, దేవదాస్ పిల్లలుగానీ వచ్చి వున్నట్లయితే వాళ్ళ నీవిధంగా ఒంటరిగా వుంచేవాళ్ళా? పాపం! ఈ పిల్లలిక్కడి కొచ్చి రెండు రోజు లైంది. కొత్తగావచ్చిన పిల్లలు, ఇక్కడి సంగ తులు వాళ్ళకేమీ తెలియవు. మీలో ఎవరైనా వాళ్ళ సంగతి పట్టించుకోవలసింది. కాని ఎవరికీ వాళ్ళ సంగతే పట్టి నట్టులేదు. చాలా ఆశ్చర్యంగా వున్నది. ఇవ్వేళ ఆ పిల్లలు అకస్మాత్తుగా నాదగ్గరికి వచ్చారు. నేను ప్రేమతో మాట్లాడి వాళ్ళ సంగతంతా అడిగి తెలుసుకొన్నాను. మీరు మనూను ఈ విధంగా ఒంటరిగా వుండనిచ్చేవాళ్ళేనా? ఈ విషయం ఆశ్రమంలోని అందరి స్త్రీలనూ పిలిచి అడగండి."

ఆ వచ్చిన పిల్లలు పది, పన్నెండేళ్ళ వాళ్ళు.

* * * *

సేవాగ్రాం ఆశ్రమం, వర్ధా
**25-12-44**

ఇవ్వాళ క్రైస్తవుల పండుగ కనుక బాపూజీ ఒక ముచ్చటైన సందేశాన్ని హిందీలో రాశారు. ఆయనకు

దగ్గరగా ఉన్నందువల్ల ఈ సందేశాన్ని ఇంకొకరు చదివి వినిపించారు.

"ఇవ్వాళ రెండు మాటలు చెబుదామని ఆశించాను. కాని ఈశ్వరేచ్ఛ వేరే విధంగా ఉన్నది. నేడు క్రిస్‌మస్ దినం. అన్ని మతాలు సమానమేనని మన విశ్వాసం. కనుక ఇటువంటి పండుగలు వచ్చినప్పుడు వాటిని గురించి మనం చక్కగా మననంచేసి తెలుసుకోవాలి. ఇది ఆత్మ పరీక్షకు తగిన సమయం. మన మనస్సులోని కల్మషాన్నంతా తొలగించుకోవాలి. అప్పుడు ఈశ్వరు డొక్కడేనని మనం గుర్తించ గలుగుతాం. ఆయన ఆజ్ఞ అన్ని మతాల్లోనూ ఒకే తీరుగా ఉన్నది. మనం విశ్వసించిన సత్యంకోసం, ధర్మం కోసం ఇతనులను చంపకూడదు. స్వయంగా చావడానికి సిద్ధపడాలి. సమయం వచ్చినప్పుడు ప్రాణాలర్పించి మనం నమ్మిన సత్యం మీద రక్తంతో ముద్రవేయాలి. నా దృష్టిలో ఇదే అన్ని మతాలకూ, ధర్మాలకూ సారాంశం క్రీస్తు తాను నమ్మిన సత్యంకోసం సిలువ నెక్కాడని మనం జ్ఞాపకం పెట్టుకోవాలి."

* * * * * *

బాపూజీ ప్రతి దినం తనమనోభావాలను సంక్షేపంగా రాసి వుంచేవారు. శ్రీకృష్ణ భగవానుడు గీతలో చెప్పిన శ్లోకాలను నిత్యం మననం చేయదగి వున్నట్టే, బాపూజీ భావాలు కూడా మననం చేయదగినసూక్తులు. (ఈసూక్తులు "నిత్యమనన్" అనే పేరుతో 'నవజీవన్ ప్రకాశన్ మందిర్' తరఫున గుజరాతీభాషలో పుస్తకాకారంలో ప్రచురింప బడింది.)

## ៛3

# బాపూజీ వ్రాసిన కొన్ని ఉత్తరాలు

ఒక యువకుడు తడపర వ్యాధితో బాధపడుతుండగా ఆతని తల్లికి బాపూజీ ఈ ఉత్తరం రాశారు :

సేవాగ్రామ్,
29-1-'45

చి॥ ... ,

వసంత్ ఇక్కడినుండి వెళ్ళిపోవటానికి కారణమేమీ లేదు. తడపర భయంకరమైన వ్యాధేమీకాదు. తగిన పరిచర్యచేస్తే రోగం నయమౌతుంది. నువ్వు ధైర్యంగా ఉండి వసంతకుకూడా ధైర్యంచెప్పు.

బాపూ ఆశీర్వచనాలు.

ఈ ఉత్తరం చేతికి అందకముందే రోగిచనిపోయినాడు. అందువల్ల బాపూజీ అతని తల్లికి రెండో ఉత్తరం రాశారు. జనన మరణాలను గురించి బాపూజీ భావాలెటువంటివో ఈ ఉత్తరం తెలియజేస్తుంది.

సేవాగ్రామ్,
1-2-'45

చి॥ ... ,

నీ టెలిగ్రామ్ అందింది. వసంత్ చనిపోవటం స్వప్నమే కదా! దానివల్ల నా మనస్సు చలించలేదు. నేను ఎన్నో

చావులు, ఎన్నో పుట్టుకలు చూచాను. ఇవి రూపాయకి రెండువైపులా రెండు రూపాలున్నట్టు జీవుడికి ఒకవైపు జన్మ, ఇంకొకవైపు మరణం. రెంటికీ ఒకే విలువ. ఈవిధంగా చూస్తే జన్మకు రెండోవైపు మృత్యువు, మృత్యువుకు రెండో వైపు జన్మ కనిపిస్తుంది. వీటి విషయంలో హర్షం, శోకం ఎందుకు? జనన మరణాలు అందరికీ ఉన్నవే. ఈ రెంటికీ నడుమ-మనం వివాహం చేసుకుంటాం, ఎగిరి గంతులువేస్తాం. ఇదంతా ఒక ఆట. నువ్వు మళ్ళీ ఈ ఆట ఆడుతావు. వివాహం నిలిచిపోతుందా ? నాకు అధికారమున్నంటే నిలిచిపోనివ్వను. ధర్మవిధి జరుగవలసిందే. శృంగారం వదిలివేయగలను. ఈ సంగతంతా నీకు బాగా తెలుసు. కనుక ధైర్యంగా ఉండు.

బాపూ ఆశీర్వాదాలు.

*   *   *   *   *

సేవాగ్రామ్,
15-2-'45

చి॥ ... ,

మీ ఉత్తరం అందింది. మనం భగవంతుని స్మరించ దలచుకుంటే మంచి చెడ్డలు, సుఖ దుఃఖాలు అన్నీ మరచి పోవలసివుంటుంది. ఈ రాజమార్గాన ఎప్పుడో ఒకప్పుడు మన మందరం నడవవలసిన వాళ్ళమే. 'ఎక్కువ కాలం మనం అక్కడే గడుపుతా'మని ఒక ఇంగ్లీషు సామెత ఉన్నది. ఇక్కడ మనం పడేది మూడునాళ్ళ ముచ్చట. చివరకు అందరూ మట్టిలో కలిసిపోవలసిందే.

బాపూ ఆశీర్వాదాలు.

*   *   *

ఒక సోదరి వేరొకకులం యువకుణ్ణి వివాహమాడింది. ఆమె బాపూజీకి ఉత్తరం రాసి ఆశీర్వదించమని కోరింది. ఆయన అలాగే రాసి పంపించారు. కాని ఆమె వివాహం చేసుకున్న పురుషుడికి ఇంకొక భార్యవున్నట్టు తరువాత తెలిసింది. బాల్యంలోనే వివాహ మయినందువల్లనో, ఆధునిక నాగరికతలేని కారణం చేతనో, ఇంకేదో కారణం చేతనో భర్త ఆ మొదటి పిల్లను వదిలి ఈ వివాహం చేసుకున్నాడు. ఈ సంగతి ఆశీర్వచనం కోరిన సోదరి ఏకారణంచేతనో దాచిపెట్టి తెలియనీయలేదు. (స్త్రీ) ప్రపంచంలో ఇదొకచిత్రం. లోకంలో జరిగే ఈ అనర్థాలవల్ల బాపూజీ మనస్సులో ఏ విధమైన పరిణామం కలిగిందో కింది ఉత్తరాలవల్ల తెలుసుకోవచ్చు.

చి॥ ... ,

నీ ఉత్తరం అందింది. ఆయన ఉత్తరంకూడా వచ్చింది. ఆయనకు విడిగా రాయటంలేదు. ఆయన జబ్బుపడకూడదు. నువ్వు చెప్పిన మాట నా కర్థమైంది. మీరిద్దరూ వివాహం చేసుకోండి. నా ఆశీర్వాదం వుండనే వున్నది. కాని ఒక షరతు. వివాహమైన తరువాత ఒక సంవత్సరం వరకూ మీరు పూర్తిగా విడిపోయి వుండండి. నువ్వు నీ చదువూ, ఆయన తన చదువూ పూర్తిచేసుకోండి. మీ కిద్దరికీ భగవంతుడు సేవాసక్తి నిచ్చుగాక. బాపూ ఆశీర్వాదాలు.

మహాబలేశ్వర్
26-4-'45

చి॥ ...... ,

నీ ఉత్తరం అందింది. చి॥ ... కి నీపని నచ్చింది కనుక నువ్వు ఆలోచించవలసిన అవసరంలేదు. నువ్వు దగ్గరి చుట్టా

నివి. అందువల్ల నీ పని నేను పరీక్షించలేదు. నువ్వు చదువు కొన్న స్త్రీవి. ఈ దృష్టితోనే నువ్వు చేసిన పనిని చూచాను. నీ మనస్సులో పాపచింతన ఏమీలేదు. ఐనప్పటికీ నువ్వు బాల్య వివాహం సంగతి దాచిపెట్టావు. అది నా దృష్టిలో మహా దోషం. ఇంకొక కులంలో నువ్వు పెళ్ళి చేసుకోవటం నా కిష్టమే. కాని బాల్య వివాహాన్ని నువ్వుగానీ, అతనుగానీ వివాహంకింద లెక్కకట్టకపోవటం సబబుగాలేదు. ఎప్పుడు జరిగినా వివాహం వివాహమే. నీ భర్త మంచివాడిలా ఉన్నాడు. కాని అతడు తన భార్యకేమీ సేవ చేయలేదు. నువ్వు అసలే చేయలేదు. నువ్వే ఆమె స్థితిలోవుంటే నీ కెలా అనిపించేది? హిందూ సమాజంలో ఇటువంటి కథలెన్నో జరుగుతున్నవి. అందరూ అతనివలెనే వ్యవహరించేట్లయితే పెండ్లి అయిన పిల్లలగతేమి కావాలి? ఆ బాలికను దగ్గరుంచు కొని ఆమెకు చదువు చెప్పటం అతని కర్తవ్యంగా ఉండేది. పరోపకార మనే పేరుతో నువ్విలా వ్యవహరించి నీ మోహాన్నే పెంచుకున్నావు ఇది సరియైన కారణంగా భావించటం నీకుతగదు. మీరిద్దరూ ధర్మమని తోచినదాన్ని ఆచరించినామని అంటున్నారు. అది చాలుమీకు. మనుష్యుడు స్వయంగా దేన్ని ప్రమాణం అని నమ్ముతాడో అదే అత నికి ధర్మమౌతుంది. అతనిపేర నేను వేరే ఉత్తరం రాయటం లేదు. ఇద్దరికీ కలిపి ఇదే ఉత్తరం.

బాపూ ఆశీర్వాదాలు.

* * * *

పైన చెప్పిన జాత్యంతర వివాహం చేసుకున్న సోదరి తల్లికి బాపూజీ రాసిన ఉత్తరం :

చి॥ ...... ,

ఇంకొక కులంవానితో వివాహం జరిగినందుకు నువ్వు దుఃఖపడకూడదు. నేను ఖండించినందుకుకూడా నీకు దుఃఖం కలగకూడదు. నా ఖండన వ్యర్థమని తెలుసుకో. ఒకవేళ ముందుగా నా అభిప్రాయం అడిగివుండినప్పటికి కూడ నేనీ వివాహాన్ని అడ్డగించిఉండను. ఇద్దరూ వయస్సువచ్చినవాళ్లు, తమ ఇష్టంప్రకారం నడచుకొనే అధికారం వాళ్ళకున్నది. నేనువ్యతిరేకించటం కేవలం సిద్ధాంతదృష్టితోనే. నాసిద్ధాంతం స్థిరమైనదే. కాని, వాళ్ళకు సుఖం కలుగుగాక అని కోరుతున్నాను. ఇటువంటి భావావేశంలో కొట్టుకొనిపోయే దంపతులు చాలా మంది ఉన్నారు. నువ్వేమీ చింతపడవద్దు.

బాపూ ఆశీర్వాదాలు.

*　　　*　　　*　　　*

సేవాగ్రామంలో నేను నర్సింగుకోర్సు చదువుతున్నా. కాని అక్కడి ఎండలు భరించరానివి. దానితో నా ఆరోగ్యం చెడిపోయింది. ముక్కులోంచి రక్తం పడటం ఆరంభమైంది. రక్తం ధారగా కారటం చూచేవాళ్ళకు కూడ కష్టంగా తోచింది. పగలు ప్రతి అరగంటకు ఇలా జరుగుతుండేది దానివల్ల నాకు బలహీనత హెచ్చింది. ఒక్కరోజు చదువు ఆగిపోయినా నాకు దుఃఖం కలిగేది. నాతోపాటు చదివే పిల్లలు నన్ను మించిపోతారేమోనని భయం వేసేది.

నేను భోజనం చాలా త్వరగా చేసేదాన్ని. చిన్న పిల్లల్లాగ కాళ్ళు చేతులు ముడుచుకొని పడుకోటం నా కలవాటు. దానివల్ల శ్వాస సరిగా ఆడేదికాదు. నేను సుశీలక్క

తల్లిగారికి సేవచేస్తుండటంవల్ల, బొమ్మరూటూవచ్చిన గదిలో ఆమె దగ్గిరే పడుకొని నిద్రపోయేదాన్ని. కాని ఆరోగ్యం చెడిపోయినందున, తినటం, తాగటం, ఉండటం, నిద్రపోవటం అన్నీ తనదగ్గిరేనని బాపూజీ ఆజ్ఞాపించారు.

డాక్టర్ల బలవంతం మీాద తమ ఆరోగ్యం కోసం బాపూజీ మహాబలేశ్వర్ వెళ్ళటానికి నిశ్చయించుకున్నారు. అదే సమయంలో నాకు జబ్బుచేయటంవల్ల నన్ను కూడ వెంటతీసికొని వెళ్ళారు. పని ఎక్కువగా ఉండటంవల్ల కొంత కాలంగా బాపూజీ మా నాయనగారికి ఉత్తరం రాయలేదు. మహాబలేశ్వర్ చేరినవెంటనే నన్నుగురించి ఉత్తరంరాశారు.

మహాబలేశ్వర్,
21-4-'45

చి॥ జయసుఖ్‌లాల్,

ఇక్కడికి వచ్చిన తరువాతనే ఇప్పుడు నీకు ఉత్తరం రాయటానికి తీరికచిక్కింది. చి॥ మనుకు చాలా సుస్తీచేసింది. పగలు ముక్కులోంచి రక్తం కారుతుండేది, దానితోపాటు జ్వరంకూడా! కాని ఇప్పుడు ఆ రెండూ నిలిచిపోయినవి. మళ్ళీ రావని తోస్తుంది. మనూను నావెంట ఇక్కడికి తీసుకొని వచ్చాను. మందిచ్చి పరిచర్యచేసే శ్రమ సుశీల పడ్డది. మధ్య మధ్య నేను కొంచెం ప్రకృతి చికిత్స చేశాను. రెండురోజులు హోమియో డాక్టరు వచ్చి మందిచ్చాడు. దిగులుపడవలసిన అవసరంలేదు. ఇక్కడి చల్లదనానికి ఆమె ఆరోగ్యంలో అనుకూలమైన మార్పు రావచ్చు.

ఇక్కడ రెండు నెల లుందామనుకుంటున్నాను.

బాపూ ఆశీర్వాదాలు.

మహాబలేశ్వర్,
21-4-'45

మహాబలేశ్వర్ వచ్చిన తరువాత కొన్నిరోజులు నా ఆరోగ్యం బాగానే ఉన్నది. కాని ఇప్పుడు మళ్ళీ తిరగ బెట్టింది. మా అక్క బాపూజీకి ఉత్తరం రాస్తూ దానిలో 'నా దగ్గిరకువచ్చి ఉంటే మనూ ఆరోగ్యం బాగుపడవచ్చు'- అని సూచించింది. నేనుకూడ బొంబాయి వెళ్ళటానికే ఇష్ట పడ్డాను; ఎందుకంటే, నేను బాపూజీ దగ్గిర ఉన్నంతసేపూ ఆయన నా ఆరోగ్యాన్ని గురించే ఆలోచించటం, ఏదైనా ఉపాయం చేస్తుండటం, అందుకాయన శ్రమపడటం జరుగు తున్నది. అందువల్ల నేను దూరంగాఉంటే బాపూజీకి ఆ శ్రమ తప్పి విశ్రాంతి, స్వస్థచిత్తత కలగవచ్చు. ఈ విధంగా నేనాలోచించి చివరకు బొంబాయి వెళ్ళటానికే నిశ్చయించు కున్నా. అక్కడికి వెళ్ళిన తరువాత అందరి సలహామీద నేను తిరిగీ కరాచీ చేరుకున్నా. నేను కరాచీ చేరిననాడే నాపేరా, మా నాయనగారిపేరా బాపూజీ రాసిన ఉత్తరాలువచ్చినవి.

మహాబలేశ్వర్,
22-5-'45

చి॥ జయసుఖ్‌లాల్

మనుదీ చివరకు జబ్బునయం చేసుకొనీ, ఆరోగ్యం పొందీ అక్కడికి రాలేదు. శారీరకంగా ఏమీ చేయలేకా, మానసికంగా విసుగుచెందీ వచ్చింది. మనశ్శరీరాల ప్రభావం ఒక దానిమీద ఒకటిపడ్డవి. రెంటికీ తానే కారణం. వాతా వరణం కూడా కొంతవరకు పనిచేసి ఉండవచ్చు. కాని, చుట్టూ ఉన్న పరిస్థితిని వశంలో పెట్టుకో గలగడంలోనే

మనుష్యుని మనుష్యత్వమున్నది. మనూ కీ సంగతి సంపూర్ణంగా చెప్పలేకపోయినాను. తన భయమే తనను ఆవహించింది. భయం కలగటానికి వేరెవరూ కారణం కాదు. తన వల్లనే తనకు భయం. ఇతరుల మాటలు విని కోపం తెచ్చుకోటం, చికాకు పడటం, ఏడవటం-ఇదేపని రోజంతా! ఇవన్నీ లేనప్పుడు ఏ కొంచెం సేపో చదువుకొనేది. సేవాభావం నేర్చుకోవలెననే అభిలాష ఎక్కువగానే ఉన్నది. ఇతరులను ప్రేమతో లాలించే స్వభావంకూడా ఉన్నది. కాని, మనూకు 'ఎమీాబా', 'హుక్ వరం' వ్యాధులున్నవి. నాకు కూడా ఇదే జబ్బు. కాని నేను వీటిని వశంలో ఉంచుకుంటాను. మనూ ఉంచుకోలేదు. అదే భేదం. నీకేమైనా ఉపాయం తోస్తే చెయ్యి. ఆమె నాదగ్గిరే ఉన్నదనుకో. నేను వదిలిపెట్టను. ఈసారి మనూయే తప్పించుకుపోయింది. నీవు క్షేమంగా వున్నావు కదా? చి॥ మనుదీకి రాసిన ఉత్తరం దీనితోకూడా ఉన్నది. బాపూ ఆశీర్వాదాలు

మహాబలేశ్వర్,
22-5-'45

చి॥ మనుదీ,

నువ్వు కరాచీకి వెళ్ళటం మంచిదైంది. 'ఎమీాబా', 'హుక్ వరం' పూర్తిగా లేకుండా చేసుకోవాలి. కాని నువ్వు 4వ తారీఖున తిరిగి వచ్చేట్టయితే ఈ చికిత్స అక్కడజరగదు కదా? వెనుకటి వైద్యుని దగ్గిర మందు తీసికోవద్దు. రోగం నివారణ చేయించుకునే దృఢ నిశ్చయంతోనే నువ్వక్కడ ఉండదలచుకుంటే ఉండు. పరీక్షయిచ్చే ఆశ వదిలిపెట్టు. అనా

ధ్యాసంగా చదువగలిగితే చదువు. ఇరుగు పొరుగు పరిస్థితి చూచి నువ్వు భయపడుతున్నట్లు నీ ఉత్తరాల వల్ల తెలుస్తున్నది. భయపడేవాళ్ళను లోకమింకా ఎక్కువగా భయపెడుతుంది. భయమనేదాన్ని నువ్వు సముద్రంలో విసిరిపారవేస్తే మంచిది. రామనామ స్మరణే భయాన్ని పోగొట్టే రామబాణం. రామునికి భయపడేవాళ్ళు ఇంక దేనికీ భయపడరు. నువ్విక్కడికి ఎప్పుడు రాదలచుకొంటే అప్పుడే రావచ్చు. ఈ విషయంలో నీకు అభయమిస్తున్నాను.

బాపూ ఆశీర్వాదాలు.

*   *   *   *

నాకు జూన్ మాసాంతంలో పై 'నర్సింగ్ కోర్సు' చదవటానికి నాగపూర్ వెళ్ళాలని తీవ్రమైన కోరిక కలిగింది. అందువల్ల ఒంట్లో బలహీనంగా ఉన్నప్పటికికూడ హఠంచేసి బొంబాయి చేరుకున్నా. ఆరోగ్యం కోసం సంవత్సరమంతా వ్యర్థం చేసుకోటం నాకు బొత్తుగా ఇష్టంలేదు. కోర్సులోచేరి చదువు సాగిస్తుంటే ఆరోగ్యం దానంతటదే బాగుపడుతుందనుకున్నాను. నాగపూర్‌లో చేరటానికి అడ్మిషన్ ఫారం కూడ నింపి పంపించాను. దానికి అంగీకారంకూడ వచ్చింది. సుశీలక్క, బాపూజీల అనుమతిలేకుండా అక్కడికి వెళ్ళటం అసంభవం. అందువల్ల నేను బాపూజీ అభిప్రాయం తెలుసుకోటానికి ప్రయత్నించాను, కాని అనుమతి రాలేదు. కాని సుశీలక్క రాసిన ఉత్తరంలో ఇలా ఉన్నది :

భయంలేకుండా ధైర్యంతో డాక్టరు గిల్డరుగారి దగ్గిరికి వెళ్ళు. ఆయన్ను నువ్వు బాగా ఎరుగుదువు. ఆయన అను

మతిచ్చే పక్షంలో నాగపూర్ వెళ్ళు, లేకపోతే వెళ్ళవద్దు. ఇక్కడికెప్పుడైనా రావచ్చు. వర్ధా వెళ్ళమని నేను సలహా యిచ్చాను.

బాపూ ఆశీర్వాదాలు.

* * *

డాక్టరు గిల్డరు అనుమతించరని నాకు బాగా నమ్మకం. బాపూజీ ఆయనకుకూడ నా ఆరోగ్యాన్ని గురించి ఉత్తరం రాశారు. అందువల్ల ఆయనతో పరీక్ష చేయించుకోటానికి వెళ్ళాను. ఆయనకు నామీద తండ్రివంటి వాత్సల్యమున్నది. ఎంతో లాలించి నన్నాయన పరీక్షించారు.

"నేను చెప్పినట్టు నడుచుకుంటే, ఈ సంవత్సరం వ్యర్థమయినప్పటికీకూడ, నేను నిన్ను ఇతర పిల్లలతోపాటు పైతరగతిలో చేర్చుకోనేటట్టు చేస్తా" నని వాగ్దానం చేశారు. సుశీలక్కకూడ మాటిచ్చింది. కాని, నేను నాగపూర్ వెళ్ళే ఆలోచన బుద్ధిపూర్వకంగా వదలివేయవలెనని ఆమె ఒక షరతు పెట్టింది. నా ఇష్టప్రకారం జరగకపోతే నేను సహించలేననీ, లోలోపల దుఃఖిస్తూ ఉంటాననీ ఆమెకు బాగా తెలుసు. ఎవరితోనూ చెప్పక మనస్సులోనే దాచివుంచుకోవటంవల్లఆరోగ్యానికి దెబ్బతగులుతుంటుంది. వెంటనే జ్వరం కూడావస్తుంది. అందువల్ల కొండప్రాంతపు వాతావరణంలో ఉండవలసిందని ఆమె తన అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పి

వేసింది. ఈ సంగతి బాపూజీకి తెలిసిన తర్వాత ఆయన నాకు ఉత్తరం రాశారు.

మహాబలేశ్వర్,
3-6-'45

చి॥ మనుదీ,

నువ్వు మళ్ళీ జబ్బున పడ్డావా? ఇక నైనా మేలుకో. కొంచెం ధైర్యంచేసి ఓపికపట్టుకొని ఉంటే గొప్ప నర్సువు కాగలవు. జ్వరం తగ్గగానే వెళ్ళిపోవద్దు. నువ్వు దిన్‌షాగారి ఆరోగ్య మందిరంలో ఉండవలెనని సుశీల చెబుతున్నది. నీకు మాటి మాటికి జ్వరం రావటం నాకు రవంతైనా బాగా లేదు. ఆరోగ్యం కాపాడుకోటం నేర్చుకొని ఉక్కు మాదిరిగా శరీరాన్ని బలిష్ఠం చేసుకోగలిగినప్పుడు నీ కోరికలన్నీ నెర వేరుతవి. తొందరపడితే ఏమీ లాభంలేదు. ఇక్కడికి రావలెనని ఉంటే వచ్చేసెయ్యి. నాగపూరు వెళ్ళాలనే వ్యామోహాన్ని వదలివెయ్యి.

బాపూ ఆశీర్వాదాలు

నానాటికి నా ఆరోగ్యం మరింత దిగజారిపోసాగింది. బాపూజీకి ఈ సంగతి తెలియగానే ఆయన టెలిగ్రాము ఆజ్ఞాపత్రంలాగ వచ్చిచేరింది.

మహాబలేశ్వర్,
4-6-'45

చి॥ మనుదీ,

నీవంటి మూర్ఖపు పిల్లను నేనెక్కడా చూడలేదు. ఈ ఉత్తరంచూచిన తక్షణం నువ్విక్కడికి వచ్చేసెయ్యాలి. బాబ్లా

(మహాదేవభాయీ కుమారుడు)ను తప్పకుండా తోడు తెచ్చుకో. అందువల్ల మార్గంలో నీ కిబ్బంది లేకుండా ఉంటుంది.

బాపూ ఆశీర్వాదాలు.

*　　*　　*　　*

నేను అక్కడికి బయల్దేరేముందు రేడియో ద్వారా వార్త విన్నాం. కాంగ్రెసు కార్యవర్గ సభ్యులనందర్నీ జైళ్ళలోంచి విడుదల చేసినందున, బాపూజీతో సహా సభ్యులందరు బొంబాయికి వచ్చారు. బాపూజీ బిర్లా భవనం చేరుకున్న వెంటనే నాకోసం మోటారు వచ్చింది. బాపూజీ బసకు అక్కా, నేనూ వెళ్ళాము. అక్కడికి చేరిన వెంటనే నా అలసట చూచి, నాతో ఏమీ మాట్లాడకుండానే, పడక వేసి నన్ను పడుకో బెట్టారు.

రెండోరోజు నేనింటికి వెళ్ళాను. 12-6-'45వ తేదీన బాపూజీ సిమ్లాకు ప్రయాణమయినారు. నన్ను పూనాలోని ఆరోగ్యమందిరంలో ఉండమని డాక్టరు దిన్‌షాగారికి ఒప్పగించారు. నేనుకూడా రోగంతో చాలా విసిగిపోయాను. అందువల్ల ఈ కొత్త ఏర్పాటుకు మారు మాట్లాడకుండా ఒప్పుకున్నాను.

నేను పూనా చేరుకునేటప్పటికి యింకొక కొత్త సంఘటన జరిగింది. మా నాయనగారు కొంత ధనం వేరుపరచి నా పేర నిధి (ట్రస్టు) ఏర్పాటుచేయ నిశ్చయించారు. ఈ సంగతి నాకు చాలాకాలం తరువాత తెలిసింది. ఈ విషయాన్ని గురించి బాపూజీ మా నాయనగార్లమధ్య ఉత్తర ప్రత్యు

త్తరాలు జరిగినవి. బాపూజీ నాకు ట్రస్టీగా ఉంటారని ఊహించుకోటం కూడ నాకు సాధ్యంకానిపని. తల్లిగా, తండ్రిగా, తాతగా నామీద అధికారం ఉండటంతోపాటు, ఇతరత్ర కోట్ల రూపాయలకు ట్రస్టీగా వున్న బాపూజీ, నావంటి పిల్లకు ఏర్పాటు చేసిన స్వల్ప ధనానికి ట్రస్టీగా వుండటానికి ఒప్పుకున్నారని విన్నప్పుడు నాకు ఆశ్చర్యం కలిగింది. కాని అపారమైన ప్రేమ వున్నచోటను, పూర్వజన్మ సుకృతం వున్నచోటను అన్నీ సాధ్యమే! ఈ కింది వుత్తరాలు ఈ సత్యానికి నిదర్శనాలు :

మనోర్ విలా, సిమ్లా
25-6-'45

చి॥ జయసుఖ్‌లాల్,

ట్రస్టునుగురించి నేను తయారుచేసిన దస్తావేజు పంపిస్తున్నాను. అక్కడ గుజరాతీలో వ్యవహారం జరుగుతుంది కనుక ఆ భాషలోనే రాశాను. గుజరాతీ దస్తావేజు రిజిస్టర్ కాకపోయేటట్లైతే దీన్ని సింధీలోకిగాని, హిందుస్థానీలోకి, గాని మార్పించుకోవచ్చు. ఇంగ్లీషు అవసరంలేదు. షరతుల్లో అవసరమైన మార్పులు చేసుకోవచ్చు. నీ అభిప్రాయాలను నేను అర్థంచేసుకున్నంతవరకు ఇందులో పొందుపరచాను.

మనూ వ్యాధి కుదరనంతవరకు నాకు చింతగానే ఉంటుంది. ఇప్పుడామె దిన్‌షాగారి ఆరోగ్యభవనంలో చేరిన దనుకుంటాను. అక్కడ నయమవుతుందని ఆశిస్తున్నాను

ఇక్కడ నే నెక్కువరోజులు ఉండదలచుకోలేదు. ఎప్పటివరకు ఉండవలసి ఉంటుందో బహుశః ఇవ్వేళ తేలి పోతుంది.

బాపూ ఆశీర్వాదాలు

పూజ్యులైన బాపూజీ తనచేతితో రాసి తయారుచేసిన దస్తావేజు చిత్తుకాపీని ఈ క్రింద వివరిస్తున్నాను.

1. జయసుఖలాల్ అమృతలాల్ గాంధీ అనే పేరు, మూల నివాసస్థానం పోర్ బందర్, ప్రస్తుత నివాసం కరాచీ బందర్ గా గలనేను, ఈ క్రింది షరతులతో దస్తావేజు రాస్తున్నాను:

2. ఈ దస్తావేజు రాసిన తేదీకి నే నెవరికీ ఏవిధమైన ద్రవ్యం బాకీలేను.

3. నా నాలుగో కుమార్తె మనూ (ఇకమీద మనూ బహన్ అని పిలువబడునది) కొన్నేండ్లుగా నాకు పెద్దలైన మోహన్ దాస్ కరంచంద్ గాంధీగారి (ఇకమీద మహాత్మా గాంధీ పేరుతో పిలువబడువారి) సంరక్షణక్రింద సేవాగ్రామం ఆశ్రమంలో శక్త్యనుసారం సేవాధర్మాన్ని పాటిస్తూ అందుకు కావలసిన జ్ఞానము, శిక్షణ పొందుతూ ఉన్నది. ఆమె సేవా వృత్తినిగురించి నేను గొప్ప ఆశలు పెట్టుకొన్నాను. మనూ బహన్ వల్ల ఎవరిమీదా ఏ విధమైన భారం పడకుండా ఉండే ఉద్దేశంతో పదివేల రూపాయలు ఆమెపేరున ఉండేటట్లు ప్రత్యేకమైన ఏర్పాటు చేస్తున్నాను. ఈ దస్తావేజుద్వారా

ఆ ధనం నేను...దగ్గర సంవత్సరానికి... వడ్డీమీద డిపాజిట్ ఉంచుతున్నాను. ఈ ధనం ముట్టినట్లు రసీదు ఈ దస్తావేజుతో జతపరచి ఉన్నాను. ఈ ధనంమీద అధికారం మనూ బహన్‌కు సంరక్షకుడుగా ఉన్నందున మహాత్మాగాంధీగారికి ఇవ్వబడుతున్నది. ఆయన తనకు ఇష్టంవచ్చిన విధంగా మనూబహన్‌కోసం ఈ ధనాన్ని వినియోగించవచ్చును. ఎప్పుడైనా దీనిపైన వచ్చే వడ్డీద్వారా లభించే డబ్బు చాలక పోయినప్పుడు మూలధనాన్ని వ్యయపరచకుండా, నా దగ్గర నుండి అవసరమైనంత డబ్బు వసూలు చేసుకోనగలరు. ఆ విధంగా అవసరమైన డబ్బును నేను ఈయలేని పరిస్థితి వచ్చి నప్పుడు మూలధనంనుంచి తీసి ఖర్చుచేసే అధికారం మహాత్మాగాంధీగారికిగాని, ఆయనద్వారా నియోగింపబడిన వేరే మరొక వ్యక్తికిగాని సంక్రమిస్తుంది.

**4.** నా జీవితకాలంలోనే గాంధీజీ చనిపోయినా లేక ఏ కారణంచేతనైనా ఆయన సంరక్షకుడుగా ఉండలేక పోయినా ఆయనకు బదులుగా నేనే సంరక్షకుడుగా ఉండ గలను. ఈ దస్తావేజును అనుసరించి గాంధీజీ కివ్వబడిన అధి కారాలు అప్పుడు నాకే సంక్రమించగలవు.

**5.** నా మరణానంతరంగాని, నేను లేవలేని అశక్త స్థితిలో నున్నప్పుడుగాని నా అధికారాలు సేవాగ్రామం ఆశ్రమ అధ్యక్షుడు ఎన్నికచేసిన వ్యక్తికి సంక్రమించగలవు.

**6.** మనూబహన్ చదువుకొని, తన సేవాధర్మాన్ని నిర్వ హించ మొదలుపెట్టినప్పుడు, ఆమెకు 35 సం॥ల వయస్సు

చల్లని నీడలో

నిండి, ఉన్నత శిక్షణకు ఖర్చుపెట్టవలసిన అవసరం లేనప్పుడు నేనుగాని, గాంధీగారుగాని జీవించి ఉండని పక్షంలో మనూ బహన్ స్వయంగా ఈ ధనాన్ని తన ఇష్టానుసారం ఉపయోగించుకోనవచ్చును. సేవాగ్రామం ఆశ్రమ సంరక్షకుడు నియమించిన ట్రస్టీ మనూబెహన్ కోరినప్పుడు మూలధనాన్ని వడ్డీతో సహా ఆమెకు ఒప్పగించటానికి బాధ్యుడై ఉంటాడు. ఒకవేళ మనూబహన్ వివాహం చేసుకునే పక్షంలో అప్పటికి మిగిలిన ధనం నా నలుగురు కుమార్తెలూ సమానంగా పంచుకోనగలరు.

చి॥ జయసుఖ్‌లాల్,

నీవు దీనిలో ఏదైనా మార్పుచేయదలచుకున్నా, ఇక్కడ పేర్కొన్న పేర్లలో ఎవరినైనా నీకు బదులుగా నియమించదలచినా ఆ విధంగా చేయవచ్చును. ఈ పేర్లు - నాపేరూ, నీపేరూ రాసిన తరువాత వరుసక్రమంలో పేర్కొనటం బాగుంటుందని నా సలహా.

బాపూ ఆశీర్వాదాలు

*　　　*　　　*　　　*

బాపూజీ నన్ను దిన్‌షాగారి ఆరోగ్యభవనంలో ఉంచారు. కాని ఇక్కడ నాకు ద్రవపదార్థాలు మాత్రమే ఆహారంగా ఇస్తున్నారు. ప్రకృతి చికిత్సా విధానంలో ఈ విధమైన ఆహారం ముఖ్యమైనదిగా భావింపబడుతున్నది. దీని వలన శరీరంలో ప్రతిక్రియ ఏర్పడి చివరకు వ్యాధి సమూలంగా నశించిపోతుంది. ఈ ప్రతిక్రియ నాలోనూ కనిపించింది. కాని ఉబ్బసరోగం కొత్తగా ఆరంభమైంది. నాకు భయం

వేసింది. డాక్టర్లు వారంవారం నా చికిత్సను గురించిన రిపో ర్టులు బాపూజీ దగ్గరికి పంపిస్తూనే ఉన్నారు. ఆ రిపోర్టులను పురస్కరించుకొని బాపూజీ నాకిలా రాశారు.

సేవాగ్రామం
20-7-'45

చి॥ మనుదీ,

నిన్నక్కడ ఒరపిడిపెట్టి పరీక్షచేస్తున్నారు. డాక్టర్ దిన్‌షాగారిమీద నాకు చాలా నమ్మకమున్నది. అందువల్ల నిన్నుగురించి నేను చింతపెట్టుకోలేదు. ఉత్తమమైన స్థలంలోనే నీకు చికిత్స జరుగుతున్నది. నువ్వు, మీ అక్కా ఆరోగ్యాన్ని గురించి ఎన్నో సంగతులు తెలుసుకుంటారని తోస్తున్నది. రాగివంటి దృఢమైన శరీరంతో మీరు తిరిగిరండి. నిశ్చింతగా ఉండి డాక్టర్ చెప్పినట్టు చేస్తూ ఉండండి. ఏ సంగతైనా నాకు తెలియజేయటానికి సంకోచించవద్దు. సంకోచిస్తే నాకు చింత ఎక్కువౌతుంది.

బాపూ ఆశీర్వాదాలు

*　　*　　*　　*

ఒకటి రెండు నెలల తరువాత ఉన్నట్టుండి నేను బొంబాయి వెళ్ళవలసి వచ్చింది. ఇంతలో మా నాయనగారిని కరాచీనుండి మహువాకు మార్చటం జరిగింది. అందువల్ల నేనాయన వెంట బొంబాయినుండి కరాచీ వెళ్ళి, అక్కడి నుండి మహువా వచ్చాను. ఇక్కడికి వచ్చినతరువాత, బాపూజీ మహువానుగురించిన కొంత పరిచయం నాయన గారికి రాశారు.

"మహువా గాలి ఆరోగ్యానికి మంచిదని చెబుతారు, అందువల్ల ఆచోటు నీకనుకూలంగానే ఉండవచ్చు.

మహువాలో చదువుకోటానికి పాఠశాలల సౌకర్యమున్నదని అనుకుంటాను. అక్కడ ఒకప్పుడు హరిజనుల పాఠశాల నడుస్తూ ఉండేది. విద్యార్థులసంఖ్యకూడా ఎక్కువగానే ఉండేది. ఇప్పుడది నడుస్తున్నదో లేదో విచారించి నాకు రాయి.

మీరు వెళ్ళినచోట లోకసేవచేసే అవకాశాలు చాలా ఉన్నవి. అక్కడి మనుష్యులు మతంలో అంధవిశ్వాసంగల వాళ్ళు. ఖద్దరు నెవరూ కట్టుకోరు, ఎక్కడైనా ఒకళ్ళిద్దరు ఖద్దరుధారులు కనిపిస్తారేమో! అటువైపు అభ్యుదయ కార్యక్రమ మేదీ జరగలేదు. అది సంస్థానంలో ఉన్న పెద్దరేవు గనుక సంస్థానం వారి ప్రభావ మెక్కువగా ఉండవచ్చు. నీకు చేతనైనంత సేవాకార్యక్రమం నడిపించు. నాకు రాస్తూఉండు.

రాయచంద్ భాయీ కుమారుడుకూడ అక్కడే ఉన్నాడని నా ఊహ. అతడు తండ్రిచేసినపనిని నిర్వహించడంలేదు. అప్పుడప్పుడూ నాకు ఉత్తరాలు రాస్తుండేవాడు. అతని భావాలు మంచివి. అతన్ని వెదకి కనుగొనే శ్రమ పడవద్దు. ఎక్కడైనా తటస్థపడితే వేరే సంగతి.

సర్దార్ అయిదురోజు లుండటానికి బొంబాయి వెళ్ళారు. ఆయన కలుపుగోలుతనం, వినోదస్వభావం కలవాడు కనుక, ఆయన విడిచి వెళ్ళినచోటు శూన్యంగా కనిపిస్తుంది.

బాపూ ఆశీర్వాదాలు

ప్రతి పట్టణంలోనూ ఆడపిల్లలను కవ్వించి, అవమానపరచే దురాచారం మన సంఘంలో ఉన్నది. ఇక్కడ మహువాలో కూడా ఆ పరిస్థితే కనిపించింది. 1946 లో మే మిక్కడికి వచ్చిన తర్వాత కార్యదర్శి కోరినందున ఒక స్త్రీల సంస్థలో నేను ఉచితంగా పనిచేయటం మొదలుపెట్టాను. ఆ సంస్థలో స్త్రీలు పాల్గొనే మంచి వాతావరణ మేర్పడ్డది. దానిపేరు కమలా బహన్ ఉద్యోగశాల. మా ఇంట్లో 15సం॥ల వయస్సుగల కోలీజాతిపిల్ల పనికత్తెగావుండేది. దానికి నూలు వడకటం, పనులు చేయటం, అక్షరజ్ఞానం నేర్పించే ఉద్దేశంతో ఆ పిల్లను నేను రోజూ నాతో కూడా ఉద్యోగశాలకు తీసికొని పోతుండేదాన్ని. 'కేబిన్ చౌక్'లో నుంచి వెళ్ళేటప్పుడు అక్కడి హోటల్లో కూర్చునే కుఱ్ఱవాళ్ళు ఆ పిల్లను కవ్విస్తూ ఉంటారని నాతో ఎన్నోసార్లు మొర పెట్టుకొన్నది. కపోల్ జాతి పిల్లలుకూడా ఇలాగే మొరపెట్టుకున్నారు కాని ఆ పిల్లల తల్లిదండ్రులు వాళ్ళ మొరవిని తమ బిడ్డలనే కోప్పడేవాళ్ళు. ఊరివాళ్లు కూడా ఈ పిల్లల్నే వింతగా చూస్తుండేవాళ్ళు.

"మేముగాని, మా ఆడపిల్లలుగాని ఆ కుఱ్ఱవాళ్లను ఏమన్నా అంటే గోల జరిగి మా పిల్లలకు వివాహాలు జరగటం కష్టమౌతుంది." అని కొందరు తల్లిదండ్రులు నాతో చెప్పారు. ఈ కారణంచేత ఊరి మధ్యలో ఉన్న ఆ పోకిరీల గుంపును ఎవ్వరూ ఏమీ అనేవాళ్ళు కారు. నాకీ సంగతి తెలిసిన తరువాత, ఒకరోజున మా పనిమనిషిని వెంటతీసికొని బజారులో వెడుతున్నాను. అప్పుడొక కుఱ్ఱవాడు ఎప్పటి

వలెనే పోకిరీ చేష్టలు మొదలెట్టాడు. నాకు కోపం వచ్చింది. నేను కాలిచెప్పు ఊడదీసి వాడికి రెండు అంటించాను. అది చూచి నా వెంటనున్న పని పిల్లకుకూడ ధైర్యం వచ్చింది. అదికూడ ఆ కుఱ్ఱవాణ్ణి నాలుగు దంచింది.

ఈ తమాషా చూడటానికి గుంపుకూడింది. కొందరు వర్తకులు మమ్మల్ని మెచ్చుకున్నారు. "అమ్మా, నువ్వు తగినపని చేశావు. మా పిల్లల్నికూడ ఈ పోకిరీలు ఎప్పటి నుంచో ఏడిపిస్తున్నారు" అన్నారు కొందరు.

ఈ మాటతో నాకా వర్తకులమీద కూడ కోపం వచ్చింది. ఆ కుఱ్ఱవాణ్ణి పోలీసులకు ఒప్పగించేపని మా నాయనగారికి వదిలి, నేను నా పనిమీద వెళ్ళిపోయినాను. మహిళామండలికి పోయి నేనీ సంగతి చెప్పేటప్పటికి ఇంకో సోదరికూడా నాకీ సంగతే మొరపెట్టుకుంది. అందుకని ఆరోజే మండలికి సంబంధించిన ఇద్దరు మహిళలను తోడు తీసికొని మేము తిరిగి బజారుకు వచ్చాము.

మమ్మల్ని చూడటంతోటే ఆ సోదరిని నిత్యం ఏడి పించే కుర్రవాడు ఆమెను మళ్ళీ సతాయించటం మొదలు పెట్టాడు. మేము వాళ్ళల్లో ఒకణ్ణి పట్టుకొని తుక్కురేగ కొట్టాం. వాణ్ణికూడా పోలీసుకు ఒప్పగించాం. చివరకు వాళ్ళందరూ క్షమాపణ రాసిచ్చారు. ఆరోజునుండి ఇప్పటి వరకూ మమ్మల్ని బజారులో కవ్వించటాని కెవరూ సాహ సించలేదు.

కాని ఇద్దరు ముగ్గురు కుఱ్ఱవాళ్ళను - ఒకడి తరువాత ఒకణ్ణి కొట్టిన ఆరోజు రాత్రి నా మనస్సులో హింసాత్మమైన పనిచేశానన్న విచారం కలిగింది. బాపూజీకి తెలిస్తే ఆయన మనస్సుకు కష్టం కలుగుతుందని అనుకున్నాను. అయినా జరిగిందంతా నే నాయనకు రాశాను. బాపూజీ నేననుకున్న దానికి విరుద్ధంగా ఇలా బదులు రాశాను.

మసూరీ,
6-6-'46

చి॥ మనుదీ,

నువ్వు నీ పరాక్రమాన్ని వర్ణిస్తూ రాసినదాన్నిబట్టి నువ్వు నీ సమయాన్ని సద్వినియోగం చేస్తున్నావని అనుకో వలసి వుంటుంది. నీకు తెలిసిన ఆ పోకిరీ కుఱ్ఱవాళ్ళనే నువ్వు గుండా లంటున్నావు. నువ్వు వ్యవహరించిన పద్ధతి కొంత వరకు ద్రౌపది అవలంబించిన విధాన మనిపించుకుంటుంది కాని సీతపద్ధతి అనుసరించటానికి యోగ్యమైనది. ఇద్దరినీ సతీస్త్రీలలో లెక్కించవలసిందే. ద్రౌపదికి అయిదుగురు భర్తలున్నప్పటికీ ఆమె పతివ్రత ఎలాఅయిందో, లోకమెలా గుర్తించిందో ఆలోచించి తెలుసుకోవలసిన సంగతి. కాని ఈ సంగతి అలా వుండనియ్యి నువ్వు ఆ గుండాలకు చెప్పిన జవాబులో ప్రతిక్రియమాత్రం చేసి ఊరుకొని, మనస్సులో క్రోధంపెట్టుకొనివుంటే నువ్వుకూడ పోకిరితనంగానే బదులు చెప్పినట్టు భావించబడుతుంది. కాని చెప్పుతీసి గుండామీాద విసిరివేస్తే లేక చేతబట్టుకొని రెండు మూడు దెబ్బలు కొడితే

ఆ గుండా లొంగిపోతాడని నువ్వు అనుకోవచ్చు. కాని అది నువ్వు తెలిసి చేసినపని అవుతుందా? నడివీధిలో, అందరు చూస్తుండగా నువ్వు చూపిన దేహబలప్రదర్శనవల్ల ఇతరులకుకూడా బలం కలుగవచ్చు. గుండాల స్వభావంలో సహజంగా పిరికితనం వుంటుంది. ఆ కారణంచేత వాళ్ళు లొంగిపోయి పారిపోతారు. కాని చెప్పుతీయటం నీమనస్సులోని కరుణ భావానికి గుర్తులయినట్లయితే, ఆ చెప్పుతీసేపని లేక చెప్పుతో కొట్టేపని నేను అహింసకు చిహ్నమే నంటాను. అహింసకు మూలం హృదయంలో వుంటుంది.

విరోధి, దెబ్బలకు తలవంచకుండా నిలబడి, ఆ దెబ్బల మూలంలో వ్యక్తమాతున్న కరుణభావంచూచి ప్రభావితుడై, చకితుడై ఆత్మశక్తి ఎదుట తలవంచవలసి వుంటుంది. ఇటువంటి పరిణామం కలిగించేదే నిజమైన అహింస. నాకు సంబంధించిన ఇటువంటి ఉదాహరణ ఒకటి నీకు చూపిస్తున్నా: మిస్ స్లేషిన్ ఒకసారి నా కండ్లఎదుటికి వచ్చి నాకు చూపిస్తూ, మూర్ఖంగా బీడీతాగింది. నేను ఒక చెంపదెబ్బ వేశాను. వెంటనే బీడీ పారవేసి ఆమె ఏడవటం మొదలు పెట్టింది. తరువాత ఆమె నాకు క్షమాపణ కోరుతూ ఉత్తరం రాసింది: "ఇకమీదట ఎప్పుడూ నేనిలా చెయ్యను. మీ ప్రేమ నేను తెలుసుకున్నాను" - అని ఆ ఉత్తరంలో వున్నది.

ఇటువంటి ఉదాహరణాలు నా జీవితంలో ఎన్నో వున్నవి. ఇతరుల జీవితాల్లోకూడ వుండవచ్చు. కాని మన మెరుగం. నీ హృదయంలోకూడ ప్రేమవున్నట్టు ఆ పోకిరికుఱ్ఱవాళ్ళు తెలుసుకున్నారా? చుట్టూవున్న మనుష్యులు

'వహ్వా' అని నిన్ను మెచ్చుకున్నారని మోసపోవద్దు: నీ హృదయాన్ని నువ్వు పరీక్షించి చూచుకో. నీవు చేసిన పనిలో హింస వున్నదా లేక అహింస వున్నదా, అని ఆలోచించుకో. సాధారణంగాచూస్తే కాలి చెప్పుతీయటం సభ్యతకు అనగా అహింసకు గుర్తుకాదు. అజ్ఞానానికీ, అసభ్యతకూ చిహ్నం. కాని ఆపని నీవిషయంలో అహింసకు చిహ్నం కావచ్చు. దీనికి ప్రమాణం స్వయంగా నువ్వుగాని, భగవంతుడు కాని అవుతారు. నువ్వు చేసిన పనిని విడదీసి, విశ్లేషణ చేసి చూపిస్తూ ఆ పనికి నిన్ను అభినందిస్తున్నాను. ఎందుకంటే నువ్వుచేసిన పనిలో హింస వున్నాకూడ పరవాలేదు. నువ్వు లొంగిపోలేదు, నాకు అంతేచాలు. అహింసవైపు నీ దృష్టి మళ్ళిందని నేనొప్పుకుంటున్నాను. అందువల్ల ఈపనిలో హింస వున్నదనుకున్నప్పటికీ, దీనిద్వారా నువ్వు అహింసను నేర్చుకుంటావు. నీ వుత్తరాన్ని సానుభూతితో చదవమని నేనందరికీ చూపించాను. అఖా భక్తుడన్నాడు: "నువ్వెటువంటి మామూలు జీవితం గడిపినాసరే, హరి (భగవంతు)నిమాత్రం పొందగలిగేట్టు నడచుకో"* కనుక అక్కడ వుండికూడా నువ్వు శుద్ధమైన సత్యాన్ని, అహింసను తెలుసుకొని ఆచరించ గలిగితే నా దగ్గరకన్న అధికంగానే నేర్చుకున్నావని నేనంగీకరిస్తాను.

మీ ఇద్దరికీ బాపూ ఆశీర్వాదాలు

నేను ఆ కుఱ్ఱవాణ్ణి కొట్టిన రాత్రే 11-30 గంటలకు వాడు మా యింటికి వచ్చి "నేను చాలా తప్పుపని చేశాను"

---

* "సుతర్ ఆవే తేమ్ తుం రహే, జేమ్ తేమ్ కరీనే హరినే లహే."

అని చెప్పి నాకాళ్ళమీద పడ్డాడు. ఇకమీద ఎన్నడు ఇటువంటి పోకిరి పనులు చేయనని మాట యిచ్చాడు. ఆ తరు వాత బాపూజీ దగ్గిరనుంచి పైన చెప్పిన ఉత్తరం వచ్చింది. అది చూచుకున్న తరువాతకూడా నాకు కొన్ని సందేహా లున్నందున స్పష్టీకరణంకోసం నేను మళ్ళీ రాశాను. దానికి బాపూజీ ఈ క్రింది సమాధానం రాశారు:

ఢిల్లీ,
26-6-'46

చి॥ మనుదీ,

నువ్వు 15 వ తారీఖున రాసిన ఉత్తరం మూడు నాళ్ళకు ముందే అందింది. కాని బదులు రాయటానికి ఇవ్వాళే తీరిక చిక్కింది. నువ్వుచేసిన సాహసకృత్యం వివరించి - 'అది హింస అనిపించుకుంటుందా లేక అహింసా?' అని నువ్వు, ప్రశ్నించావు. కాని నువ్వు ఈ చర్చలోకి దిగకపోవటమే మంచిది.

అహింసను మననంచేస్తూ వుంటే, సమయం వచ్చి నప్పుడు మనం అహింసాత్మకమైన పనులే చేస్తాము. ఇతరులు వాటిని అలా అర్థం చేసుకున్నాసరే చేసుకోక పోయినాసరే, దాన్ని గురించి మనం చింతపడకూడదు. మన పనివల్ల కలిగే ప్రభావ పరిణామాలు, ఇతరులు అనుకునే దానిమీదకాక, మన మనస్సు మీదనే ఆధారపడివుంటాయి. మనస్సును మనం కూడ సరిగా గుర్తించలేము. అయినా గుర్తించగలుగుతా మనుకో; అప్పుడు, ఎవరైనా తిట్టటంగాని, చెంపదెబ్బ కొట్ట టంగాని అహింసాత్మకమైన పని అని మన మనస్సు చెబు

తునట్లయితే ఆపని మనకు అహింసాత్మకమైనదే అనుతుంది. అది వాస్తవంగా అహింసాత్మకమైనదా కాదా అనే సంగతి భగవంతునికే ఎరుక. ఎదుటివానిమీద ఎటువంటి ప్రభావ పరిణామాలు కనిపించినవో వాటినిబట్టి వాడు స్వయంగాగాని, ప్రేక్షకులుగాని నిర్ణయించుకోవచ్చు. కాని, ఈ చిక్కుల్లోకి నిన్ను ఇరికించట మెందుకు? నువ్వు పట్టుదలతో ప్రయత్నిస్తూ వుంటే చాలు, అహింసలో నువ్వు శిక్షణ పొందుతున్నట్టే నేను భావిస్తాను. మీ ఇద్దరికి బాపూ ఆశీర్వాదాలు

మహువాలో వున్న మురికి అందరు ఎరిగిందే. ఆరంభంలో నేనిక్కడి వాతావరణాన్ని సోదరీమణులను అడిగి పూర్తిగా తెలుసుకున్నాను. ఇంతవరకూ నేను పెరిగింది పోర్‌బందర్, బొంబాయి, కరాచీ మొదలైన పట్టణాల్లో, అందువల్ల ఇక్కడున్న మురికి సందుల్ని చూచి నాకు ఆశ్చర్యమైంది. అక్కడక్కడ పెంటకుప్పలు పోసైవున్నవి. కథియవాడ్‌లో ఈ స్థితి సాధారణంగా అంతటా వుంటుందని తరువాత నాకు తెలిసింది. పొద్దునా సాయంకాలం స్త్రీలు ముసుగులువేసుకొని ఎక్కడంటే అక్కడే, శౌచానికి (దొడ్డికి) కూర్చుంటారు ఈ అలవాటును మొదటిసారిగా నేనిక్కడే చూచాను. మహువా గ్రామవాసులకు, ముఖ్యంగా స్త్రీలకు ఇది చాలా లజ్జాకరమైన విషయం. బాపూజీ ప్రయత్నిస్తే, మునిసిపాలిటీ ద్వారా పరిస్థితి కొంత బాగుపడవచ్చునని నాకు తోచింది. పట్టపగలు, నడివీధుల్లో స్త్రీలను కవ్వించి ఏడిపించటం జరిగేచోట ఇండ్ల పాకీదొడ్లు లేని సోదరీమణులు రాత్రనక పగలనక ఊరిబయటికి ఎలావెళ్ళగలరు? ఈ

సమస్య మున్సిపాలిటీయే పరిష్కరించ గలుగుతుంది. అందు వల్ల నేను బాపూజీకి రాశాను. ఆయన బదులు రాస్తూ "నేను మహువా చూచాను, కాని నువ్వు చేసిన వర్ణనను బట్టి ఆ ఊరు నేను చూచినదానికంటే ఎక్కువ అధ్వాన్నంగా వున్నట్టు తెలుస్తున్నది. నేనక్కడ ఒకేరోజు వున్నట్లు జ్ఞాపకం" అని తెలియజేశారు. నావుత్తరాన్ని ఆయన దీవాన్ గారి దగ్గిరికి పంపించారు. తరువాత సెప్టెంబరులో నేను బాపూజీ దగ్గిరికి ఢిల్లీ వెళ్ళాను. అప్పుడూ తరువాతనూ కూడా, ఆయన దీవాన్ గారిని కలుసుకొన్నప్పుడు ఈ సమస్యను గురించి వారితో ముచ్చటించేవారు. "మహువాలో ఉన్న మీ కుమార్తె మాటవిని అయినా మీరు ఈ సమస్యను పరిష్కరించవలసి ఉంటుంది"- అని బాపూజీ దీవాను గారిని హెచ్చరించారు. మహువా మునిసిపాలిటీ అక్కడి పౌరుల చేతుల్లో ఉన్నందున, సత్తాకూడ వాళ్ళ చేతుల్లోనే వున్నదని దీవానుగారు బదులు చెప్పినప్పటికీ, దీవానుగారు స్వయంగా దీన్ని పరిష్కరించటం అవసరమని బాపూజీ భావించారు. కాని రాజకీయ పరిస్థితి అత్యంత తీవ్రగతితో మారిపోయినందువల్ల ఆయన చేసిన ప్రయత్నం పూర్తి కాలేదు. మహువా నేటివరకు అలాగే మురికితో నిండి వున్నది. ఈ రోజుల్లో ఈ చిన్న పట్టణంలో రాజకీయపక్షాల కేకలు బలంగా వినిపిస్తున్నవేకాని తమ వాదోపవాదాలను కట్టిపెట్టి పౌరులు నగర పారిశుద్ధ్య సమస్యను పరిష్కరిస్తారా లేదా అన్నది ఒక పెద్ద ప్రశ్నగా ఏర్పడ్డది.

